ఓమ్ హరిః

శ్రీమచ్ఛంకరభగవత్పూజ్యపాదవిరచిత(ము)

# ప్రబోధసుధాకరము

టీకాతాత్పర్యవివరణసహితము

ACC. No. 20906

ఆంధ్రటీకాతాత్పర్య రచయితలు :

శ్రీశృంగేరి 33వ జగద్గురు శ్రీసచ్చిదానంద శివాభినవ
నృసింహభారతీస్వామివారి ప్రశిష్యులును,
శ్రీకుర్తాళసిద్ధేశ్వరీపీఠ ప్రథమాధిపతి జగద్గురు
శ్రీవిమలానందభారతీస్వామివారి శిష్యులునగు

1. ప. ప. శ్రీ రామానందభారతీస్వామి, బి. ఏ; బి. ఇడి.

2. శ్రీ మారెళ్ల సుబ్బారావు, ఎమ్. ఏ; బి. ఇడి.

ప్రకాశకులు :

శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్ట్
24-141, ఆనంద్‌బాగ్, మల్కాజ్‌గిరి
హైదరాబాద్-500 047

1989

966

పంచమ ప్రచురణ కుసుమము

# ప్రబోధ సుధాకరము

శ్రీ సీతారామ దివ్యపాదపద్మములకు

## అంకితము





తొలి ముద్రణ 1989 ప్రతులు : 1000

వెల : రు. 35-00

ప్రాప్తిస్థానము - ప్రకాశకులు : శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్ట్

H. No. 24-141, ఆనంద్‌బాగ్, మల్కాజ్‌గిరి,

హైదరాబాద్ - 500047

ముద్రాపకులు :

బృందావన్ ప్రింటర్స్, భాస్కరపురం

మచిలీపట్టణము-521 001 (కృష్ణాజిల్లా)

ఓం శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

శ్రీ గోవిందభగవత్పూజ్యపాదశిష్యులు చతురామ్నాయ పీఠస్థాపకులు



శ్రీ జగద్గురు శ్రీ ఆదిశంకరభగవత్పూజ్యపాదులు

శృంగేరి 33 వ జగద్గురు శ్రీసచ్చిదానందశివాభినవనృసింహభారతీస్వామివారి
శిష్యులు శ్రీ కుర్తాళ సిద్ధేశ్వరీపీఠప్రథమాధిపతులు



జగద్గురు శ్రీవిమలానందభారతీస్వామివారు

శ్రీ గురుభ్యో నమః

శ్రీ జగద్గురు శ్రీవిమలానందభారతీస్వామివారి శిష్యులు

(టీకాతాత్పర్యాది రచయితలు, సతీర్థ్యులు)



**1. శ్రీ ప. ప. రామానందభారతీస్వామి,**

బి. ఏ., బి. ఇడి.



**2. శ్రీ మారెళ్ల సుబ్బారావు**

ఎమ్. ఎ., బి. ఇడి.,



ఓం హరిః ఓమ్ శ్రీః

# దీవనలు

[ది. 1-11-1985 శుక్రవారమునాడు హైదరాబాదు మల్కాజిగిరి, ఆనంద బాగ్ నెం. 24-141 గృహాంగణమున శ్రీవారిపాదపూజాపూర్వకమైన శ్రీసీతారామ ఆదిశంకరట్రస్టు ప్రారంభోత్సవ సందర్భమున శ్రీశృంగేరీ శ్రీశ్రీ జగద్గురు శంకరాచార్య మహాసంస్థాన దక్షిణామ్నాయ శ్రీశారదాపీఠాధిపతులు భగవత్పూజ్యపాదులు, శ్రీ జగద్గురు శ్రీ శ్రీ శ్రీ భారతీతీర్థ మహాస్వాములవారి ప్రవచనామృతము]

"అనుగ్రహభాషణసారసంగ్రహము"
(శ్రీవారి యనుజ్ఞతో)

శ్లో॥ శంకారూపేణ మచ్చిత్తం పంకీకృత మభూ ద్వయా,
కింకరీ యస్య సా మాయా శంకరాచార్య మాశ్రయే॥

శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారు సనాతనవైదిక ధర్మమును ఔపనిషదమగు అద్వైతాత్మతత్త్వమును భారతదేశమం దెల్లెడలను ప్రచారము చేసిన మహానుభావధౌరేయులు. తమ ముప్పదిరెండుసంవత్సరముల జీవితావధిలో వారు చేసిన అనన్యసామాన్యములగుపనులు ఏయితరవ్యక్తియు ప్రపంచచరిత్రలోనే చేసియుండలేదు. వారు రచించిన ప్రస్థానత్రయభాష్యములు, అద్వైతసిద్ధాంతమునకు ప్రమాణమూర్ధన్యములుగా విరాజిల్లుచున్నవి. ఇంతియేగాక వారు రచించిన లఘుప్రకరణములు, స్తోత్రములు పరమాద్భుతములుగా నున్నవి. మంత్రశాస్త్రము నందు వారు రచించిన "ప్రపంచసారతంత్రము" అనన్యసామాన్యముగా నున్నది. జగదుద్ధారమునకై అవతరించిన కైలాసవాసియగు సాక్షాత్ పరమశివుండే వారు కావున ఈపనులు వారికి సాధ్యమైనవి.

వారు రచించిన గ్రంథము లన్నింటిని మాపరమేష్ఠిగురువులగు జగద్గురు శ్రీశ్రీశ్రీ సచ్చిదానందశివాభినవనరసింహభారతీ

మహాస్వామివారి యాజ్ఞతో శ్రీరంగం వాస్తవ్యులగు శ్రీ టి. కే. బాలసుబ్రహ్మణ్యంఅయ్యర్ గారు సుమారు ఎనుబదిసంవత్సరములకుపూర్వము అచ్చొత్తించి ఆస్తికలోకమునకు మహోపకారమొనర్చినారు. తర్వాత ఇటీవల "సమతా పబ్లిషర్స్" వారు అవే గ్రంథములను మాగురువులవారియాజ్ఞతో మరల వెలుగునకు దీసికొనివచ్చినారు.

ప్రస్తుతము హైదరాబాదులో శ్రీ మారెళ్ళ కనకరాజు గారు 'శ్రీసీతారామఆదిశంకరట్రస్టు' పేరున ఒకసంస్థ స్థాపించి తన్మూలకముగా భగవత్పాదులవారి వాఙ్మయము నంతను తెలుగులోని కనువదించి ప్రచారముచేయ తలపెట్టుట ముదావహముగా నున్నది. ఈసందర్భమునందు ఒక్కవిషయమును జ్ఞాపకములో నుంచుకొనవలయును. ఈగ్రంథములను అనువదించుట సామాన్యుడైనవానికి సాధ్యముకాదు. కేవలము కావ్యములను జదివి శబ్దార్థ పరిజ్ఞానము ఉన్నంతమాత్రముతో వీనిని అనువదించుదు రనుకొనుట పాడిగాదు. అందుకు సాంప్రదాయపరిజ్ఞానము పూర్ణముగా నుండవలయును. శాస్త్రముయొక్క మర్మము తెలిసి యుండవలయును. సంప్రదాయపరిజ్ఞానములేనివాడు ఎన్ని శాస్త్రములను జదివినను ఉపేక్షణీయుడేఅని భగవత్పాదులవారు భగవద్గీతాభాష్యములో "అసంప్రదాయవిత్ సర్వశాస్త్రవిదపి మూర్ఖవ దుపేక్షణీయః" అని సెలవిచ్చినవిషయమును ఎప్పుడు జ్ఞప్తియందుంచుకొనవలయును. అందువలన సంప్రదాయమును చక్కగా దెలిసికొనినవిద్వాంసులచేత ఈఅనువాదకత్వము చేయింపవలసినదిగా నేను సూచించుచున్నాను.

ఈట్రస్టునిర్వహణలో కనకరాజుగారికి తోడుగా నలుగురు ధర్మకర్త లుండుట సంతోషముగా నున్నది. వారందఱును ఈ సంస్థయొక్క సర్వతోముఖాభివృద్ధికి పాటుపడగల రని మేము ఆశించుచున్నాము. ఈసంస్థ దీర్ఘకాలము వర్ధిల్లుగాక యనియు, తనయుద్దేశ్యమును సఫలమొనర్చుగాక యనియు మేము ఆశీర్వదించుచున్నాము."

శ్రీహరిః ఓమ్ శ్రీగురుభ్యోనమః

# శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్ట్ (రిజిష్టర్డ్)

[ఇంటి నెం. 24-141, ఆనంద్‌బాగ్, మాల్కాజ్‌గిరి, హైదరాబాద్-500047]

## ఉద్దేశ్యములు - లక్ష్యములు

1. శ్రీభగవత్పూజ్యపాదులును జగద్గురువులైన ఆదిశంకరాచార్యులవారిచేఁ ప్రణీతగ్రంథములు — ఆధ్యాత్మిక, తాత్త్విక, వేదాంత భాష్యములును, భక్తిప్రబోధకములు, ఉపదేశ, స్తోత్ర, ప్రకరణాది సాహిత్యరచనల నెల్ల సేకరించి భద్రపరచుట.

2. పై పేర్కొన్న శ్రీశంకరాచార్య కృత సంస్కృత రచనలకు, వాని ప్రసిద్ధవ్యాఖ్యలకును ఆంధ్రానువాదమును సమర్థులచే జేయించి ప్రచురించుట.

3. ఇంతమాత్రమేగాక, ఇంతకుఁ బూర్వమే శ్రీభగవత్పాదుల వారి రచనలు తెలుగులోని కనువదింపఁబడి ప్రస్తుతము లభ్యము కానివానిని సైతము సేకరించి ప్రచురించుట.

4. అద్వైత సిద్ధాంతపరమైన వేదాంతమును ప్రచారము సేయుట :- అనుభవజ్ఞులైన యభిజ్ఞులచేఁ ప్రస్థానత్రయ ప్రసిద్ధ ధర్మాద్వైత సిద్ధాంతప్రచారమును, అధ్యయన-అధ్యాపకాది రూపమునను, ఉపన్యాసములు, గోష్ఠులు, పండిత సదస్సులు మున్నగునవి ఏర్పాటుచేయుట మూలమునను సల్పి, జ్ఞానవిజ్ఞానాభిరుచి గల వాతావరణమును సమాజములో నెలకొల్పుట.

5. ఈ కార్యసిద్ధికై అవసరమైన యితర విధ కార్యకలాపములను ఆయా సందర్భముల కనుగుణముగా ఎన్నుకొని ముఖ్యోద్దేశ్యము నెరవేర్చుటకై పాటుపడుట.

ఈ సీతారామ ఆదిశంకర ట్రస్టు ది. 1-1-85 హైదరాబాద్‌లో శ్రీశృంగేరీ శారదాపీఠాధిపతులు, ప॥ ప॥ జగద్గురు శ్రీభారతీతీర్థమహాస్వాములవారిచే ఆశీఃపూర్వకముగాఁ ప్రారంభింపఁబడినది.

# విజ్ఞప్తి

శ్రీకుర్తాళసిద్ధేశ్వరీప్రథమపీఠాధిపతులగు శ్రీజగద్గురు శ్రీవిమలానందభారతీస్వామి వారియత్యంత ప్రియశిష్యులగు (1) శ్రీప.హ.శ్రీ రామానందభారతీస్వామివారును, (2) శ్రీమారెళ్ల సుబ్బారావుగారును జ్ఞానవయోవృద్ధులు, బ్రహ్మనిష్ఠులు. వీరుమా ప్రార్థనను మన్నించి శ్రీశంకరభగవత్పాదవిరచిత ప్రబోధసుధాకరమను ప్రకరణగ్రంథ రాజము (మా పంచమప్రచురణము) నకు నిస్సంగతతో, దక్షతతో ఆంధ్రటీకాతాత్పర్యవివరణములను వ్రాసి యిచ్చి, యనుగ్రహించిరి. మచిలీపట్టణము బృందావన్ ప్రింటర్స్ వారు యథానుకూలముగా నీగ్రంథము నిట్లు ముచ్చటగా ముద్రించిరి. ఈపూజ్యసతీర్థ్యరచయితలకు మాకృతజ్ఞతాపూర్వకనమోవాకములు. ముద్రాపకులకును అభినందనశ్రీలు. కావ్యార్థసిద్ధి కల్గుత మనుశుభకాంక్షలు, పాఠకమహాశయులకు.

మా ప్రకటిత జ్ఞానసేవా కార్యక్రమము నిర్విఘ్నముగా కొనసాగించుటకు, శ్రీ జగద్గురువులను, శ్రీపరమహంసపరివ్రాజకాచార్యవర్యులను శ్రీమదద్వైతసిద్ధాంత ప్రచారకాభిమానులను, సహృదయులైన ఆస్తికమహాజనుల నెల్లరను, దమతమ సహాయ సహకారములను అందింపవలసినదిగా వినయపూర్వకముగాఁ ప్రార్థించుచున్నాము.

అయిదువందల రూపాయలుగాని అంతకుమించిగాని విరాళము లిచ్చు దాతల పేర్లు మున్ముందు ప్రచురింపఁబడు గ్రంథములలోను, ముద్రింపఁబడును. అట్టి దాతలకు ఈ ట్రస్ట్ ప్రచురణలన్నియు ఒక్కొక్కటి ఉచితముగా నొసంగఁబడును.

ఇట్లు,

శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్ట్

## శ్రీసీతారామ ఆదిశంకర ట్రస్టునకు శాశ్వతనిధిగా రూ॥ 500/- అంతకుమించి విరాళములనిచ్చిన దాతల పేర్లు

శ్రీ వెంపటి శ్రీనివాసమూర్తిగారు, అడ్వకేటు, విజయవాడ.
శ్రీ కె. ఎ. వి. శివరామశర్మగారు, వనస్థలిపురము, హైదరాబాదు.
శ్రీ ఐ, బి. రామకృష్ణారావుగారు, వనస్థలిపురము, హైదరాబాదు
శ్రీ పురమ్‌సెట్టి సత్తయ్యగారు, మల్కాజిగిరి, హైదరాబాదు
శ్రీ వి. లచ్చారావుగారు, అశోక్‌నగర్, హైదరాబాదు.
శ్రీ జి. శ్రీరామమూర్తిగారు, హెడ్‌మాస్టరు, రైల్వేబాలుర ఉన్నత పాఠశాల, గుంతకల్.
శ్రీ జె, ఎమ్. రామచంద్రన్‌గారు, మింపక్‌స్ట్రీటు, కర్నూలు.
శ్రీ శంకరభగవత్పాదులవారి ఒక అభిమాని, చెంబూర్, బొంబాయి.
శ్రీ కె. క్రిష్ణయ్యగారు, మలక్‌పేటకాలని, హైదరాబాదు.
శ్రీ యాబలూరి లోకనాథశర్మగారు, అడ్వకేటు, విజయవాడ.
శ్రీ తాడేపల్లి నరసింహదాసుగారు, విజయవాడ.
శ్రీ కార్యదర్శి- శ్రీరామకృష్ణాశ్రమము, అశోక్‌నగర్, హైదరాబాదు.
శ్రీ మండలీక శ్రీరామమూర్తిగారు, S. C. RLY. ఆఫీసు, బెల్లంపల్లి.
శ్రీ పి. లక్ష్మణరావుగారు, మల్కాజిగిరి, హైదరాబాదు.
శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, వనస్థలిపురము, హైదరాబాద్.
శ్రీ శితలమ్ రాముగారు, దత్తాత్రేయకాలని, ఆసిఫ్‌నగర్ హైదరాబాద్.
శ్రీ కందర్ప శివరామకృష్ణగారు, మచిలీపట్నము.
శ్రీ కె. వి. పి. యల్. నరసింహారావు, రైల్వేబాలుర ఉన్నత పాఠశాల, రాగాగూడ.
శ్రీ కందర్ప వెంకటేశ్వర్లుగారు, భిలాయ్,
శ్రీ చదలవాడ సుబ్రహ్మణ్యముగారు, సికిందరాబాద్.
శ్రీ చుండూరు పార్థసారథిగారు, అడ్వకేటు హైదరాబాద్.
శ్రీ తంగిరాల శ్రీరామశర్మగారు, సికిందరాబాద్,

ఇట్లు
శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్టు

# శ్రీ శ్రీ జగద్గురు శంకరాచార్య సంస్థానం, దక్షిణామ్నాయ శ్రీ శారదాపీఠం, శృంగేరి



శ్రీ అభినవవిద్యాతీర్థమహాస్వామి

## ఆశీస్సులు

(35వ పీఠాధిపతులు)

[శ్రీ మారెళ్ళ సుబ్బారావుగారికి, నమస్కారములు. మీరు పంపిన కానుక, మఱియు ఉత్తరము అందినవి. మీ అభిప్రాయ ప్రకారము పూజలు జరిపించినాము. ప్రసాదములు దీనితో పంపుచున్నాము.]

శ్రీశంకరభగవత్పాదాచార్యుల "ప్రబోధసుధాకర" మను గ్రంథమును తెలుగుభాషలో ప్రతిపదార్థతాత్పర్యములతో ప్రకాశించుచున్నారని తెలిసి శ్రీ శ్రీ జగద్గురువులు మిక్కిలి ఆనందించినారు. పైకార్యక్రమము నిర్విఘ్నముగా జరుగుగాక యనియు, ఆ కార్యక్రమములో పాల్గొను ఆస్తికజనులందరకు సకల శ్రేయోభివృద్ధులు కలుగుగాక యని శ్రీ శ్రీ వారు ఆశీర్వదించి అనుగ్రహించిన ఆశీర్మంత్రాక్షతలు, మరియు శ్రీశారదా చంద్రమౌళీశ్వరుల మహాప్రసాదము పంపుచున్నాము.

En . Puja Prasadam
Camp . Sringeri
Ref : Dı/831
Date : 20-4-89

ఇట్లు
(Sd) జి. వి. గిరిధరశాస్త్రి
Private Secretary to his
Holiness Sri Jagadguru
Shankaracharya

హరిః ఓమ్

# పీఠిక

శ్రీ విమలానంద భారతీ భగవత్పాదదివ్యపాదారవిందాభ్యాం నమః

శ్లో॥ అద్వైతార్ణవపూర్ణచంద్ర మభిధాపద్మాటవీభాస్కరం
విద్వత్కోటిసమర్చితాంఘ్రియుగళం ప్రద్వేషికక్షానలమ్।
హృద్యాభేద్యసమస్తవిద్యవిలసత్రోద్యద్వివేకాలయం
స్వీద్య ద్వాగమృతం పరాత్పరగురుం శ్రీశంకరం తం భజే॥

శ్రీకృష్ణేశ్వరజీవజగల్లీలామయ మహిమా! ఈసర్వము. ఇ దొకసత్యాన్వేషణవ్యవహారఫలముగా సిద్ధించిన విజ్ఞానవిశేషము. విషయజ్ఞాన మెప్పుడును జ్ఞేయ (విషయ) వస్తుతంత్రమే. అనఁగా ఆవస్తుస్వరూపస్వభావములపై ఆధారపడినదే గాని, దానిని శోధించి తెలియుపురుషునియొక్క (కర్తయొక్క) చిత్తతంత్రము కాదనుట మౌలికనగ్నసత్యము. కాగా, పౌరుషేయములైన భౌతిక మానసిక వైదికావైదికమతశాస్త్రము లన్నియు, గ్రాహ్యగ్రాహక భేదము, వివిధక్రియాకారకఫలభేదములు గల్గిన ద్వైతనానాత్వ బుద్ధివిలసితములు మాత్రము. ఇవి బోధించునవి వేదాంతములు గావు. అపౌరుషేయములగు వేదాంతములే ఉపనిషత్తులు. ఇవి తాత్పర్యముగా బోధించు ముఖ్యవిషయము, ఆత్మాభిన్నపరబ్రహ్మము. ఇది వ్యావహారికసత్యాతీతమై, పరమార్థసత్యమై, పై చెప్పినయసంఖ్యాకద్వైత (నానాత్వ) శాస్త్రార్థములకంటె విలక్షణమై, అసంగమై, ఏకమై, అద్వితీయమై, ప్రత్యగాత్మయే యైన నిత్యజ్ఞానానందస్వరూపము.

ఒకానొకప్పుడు, మాపరమగురువరేణ్యులగు శ్రీ శృంగేరీ 33వజగద్గురువర్యులు శ్రీసచ్చిదానందశివాభినవనృసింహభారతీభగవత్పాదులను జేరి, నమస్కరించి, కొందఱు బుద్ధిమంతులు "శ్రీశంకరభగవత్పాదులవారు పునరుద్ధరించుచు, ప్రబోధించి ప్రచారముచే

సిన అద్వైతసిద్ధాంతము, ప్రపంచములోనియితరమతములకంటె నెట్లు విశిష్టమైనది. "ఇది లేకున్న లోటేమి ఓ స్వామి" యని జిజ్ఞాసతో నడిగిరి. అప్పుడాభగవద్రూపులగు ఆస్వామివారు ఆభక్త శ్రద్ధాళువులకు జెప్పినమాటలు చిరస్మరణీయములు.

"బ్రహ్మాత్మైక్యమును జగద్బ్రహ్మైక్యమును బోధించు అద్వైతబ్రహ్మజ్ఞానము నిత్యపరమార్థసత్యాన్వేషణమహావృక్షపక్వఫలము. దీనికి వ్యక్తితోడను, ఎవరివ్యాఖ్యాభేదములతోడను, ఎవరిసంప్రదాయములతోడను, ఎవరిమతములతోడను, విరోధము లేదు. ఈసర్వభేదములకు విలక్షణమై, ఈసర్వమున కాధారభూతమైనది బ్రహ్మము (ప్రత్యగాత్మ). ఈయద్వైతవేదాంతము, శ్రుతిస్మృతిన్యాయానుభవములతో ఈసర్వమునున సమన్వయించును. అనాదిసంసారదుఃఖమును సమూలముగా నాశనమొనర్చునది. అనంతబ్రహ్మానందప్రాప్తికి హేతువు. జిజ్ఞాసువులు ముముక్షువులైనవారికి ఏకైకసునిశ్చితమార్గము. దీనిని శ్రీపరమశివావతారమగు శ్రీశంకరభగవత్పాదులు అనన్యసామాన్యముగా లోకసంగ్రహార్థము పునరుద్ధరించి తమభాష్యప్రకరణస్తోత్రాదిగ్రంథములద్వారమున మృదుమధురప్రసన్నగంభీరమనోహరహృద్యముగా ప్రసరింపజేసిరి. దీని నిప్పుడు మీరెట్లు శంకరమతమనుచున్నారుగాని, నిజమున కిది అన్యమతములవంటి మతము (అభిప్రాయము), నమ్మకము కాదుసుమా! ఇది సనాతనధర్మరూపనిత్యసత్యము. కావున నిది, చిత్తశుద్ధితో దీనిని అనుసరించువారలకు "సనాతనబ్రహ్మము వారియథార్థస్వరూపమే" యని అనుభవమునకుం దెచ్చు నేకైకమార్గము. ఉపనిషత్సమ్మతము, ఉపనిషత్సమ్మితమును. ఇంతను గావలసినవారు శ్రీశంకరాచార్యులవారిపరమగురువులగు శ్రీగౌడపాదభగవత్పాదులు రచించిన మాండు [3-17, 2-1, 4-2], కారికలను శంకరభాష్యార్థవిధమున

మననము సేయుండు" అని వారి నుత్తేజపఱచిరంట. ఆశ్రోతలును శ్రీశంకరప్రబోధశైశిష్య సందేహవిముక్తులై పరమానందమంది రని వేఱ చెప్పనేల? అమూండు సభాష్యకారిక లివిగో !

శ్లో॥ స్వసిద్ధాంతవ్యవస్థాసు ద్వైతినో నిశ్చితా దృఢమ్।
పరస్పరం విరుధ్యన్తే తై రయం న విరుధ్యతే॥

మాం. కా. 3-17

శాం. భా॥ శాస్త్రోపపత్తిభ్యా మవధారితత్వాత్ అద్వయాత్మదర్శనం సమ్యగ్దర్శనం, తద్బాహ్యత్వా న్మిథ్యాదర్శన మన్యత్. ఇతశ్చ మిథ్యాదర్శనం ద్వైతినాం రాగద్వేషాదిదోషాస్పదత్వాత్. కథమ్? స్వసిద్ధాంతవ్యవస్థాసు స్వసిద్ధాంతరచనానియమేషు, కపిలకాణాదబుద్ధార్హతాదిదృష్ట్యనుసారిణో, ద్వైతినో నిశ్చితాః. ఏవమే వైష పరమార్థో నాన్యథేతి తత్ర తత్రానురక్తాః ప్రతిపక్షం చాత్మనః పశ్యన్త స్తం ద్విషన్త ఇత్యేవం రాగద్వేషోపేతాః స్వసిద్ధాంతదర్శన నిమిత్తమేవ పరస్పర మన్యోన్యం విరుధ్యన్తే. తై రన్యోన్యవిరోధిభిః అస్మదీయో ఽయం వైదికః సర్వానన్యత్వాదాత్మైకదర్శనపక్షో న విరుధ్యతే, యథా స్వహస్తపాదాదిభిః. ఏవం రాగద్వేషాదిదోషానాస్పదత్వాత్ ఆత్మైకత్వబుద్ధి రేవ సమ్యగ్దర్శన మిత్యభిప్రాయః॥

తా॥ [మాం. కా. 3-17] ఉపనిషత్తులచేతను అందలియుక్తిరూపములగు (తర్క-) న్యాయముల చేతను (బ్రహ్మసూత్రాదుల చేతను) నిర్ధారింపంబడిన దగుటవలన అద్వయాత్మజ్ఞానమే యథార్థజ్ఞానము (సమ్యగ్దర్శనము). శాస్త్రోపపత్తులకు బాహ్యమగుట వలన, సమ్యగ్దర్శనమున కితర మైనది మిథ్యాజ్ఞానము (మిథ్యాదర్శనము). ద్వైతులు రాగద్వేషాదిదోషవంతులగుటచేత గూడ వారి సిద్ధాంతము మిథ్యాదర్శనమె యగుచున్నది. అ దెట్లనంగా (ద్వైతులుగా నిశ్చయింపంబడినవారు:-) శ్రీకపిలమతమును (ప్రకృతి-పురుషపరిణామవాదము), కాణాదమతము (అణువులు-ఆరంభవాదము, ఆత్మబహుళత్వవాదము) బుద్ధమతమును (శూన్యవాదము, క్షణికత్వవాదము), అర్హతమతమును (సప్తభంగివాదము-అర్ధశూన్యవాదము), మఱియు వీరశైవ, వీరవైష్ణవ, శాక్తేయ, రసేశ్వరాది

వాదులమతములను అనుసరించువా రెల్లజనులు ద్వైతులుగా నిశ్చయింపఁబడినారు. ఇట్టిద్వైతశాస్త్రకర్తలు ప్రవర్తకు లందఱు ఆ యాశాస్త్రములం దత్యంతానురక్తులై "ఇదియే పరమార్థము; ఇట్లుకాని వేఱొండువిధము గాదు" అందురు. మఱియు వీరందఱు, తమవాదముకంటె భిన్నమైన (ఇతర) ప్రతిపక్షవాదమును జూచుచున్నవారలై ఆప్రతిపక్షమును ద్వేషించుచున్నారు. ఈవిధముగా తమతమసిద్ధాంతదర్శననిమిత్తముగనే ఈద్వైతులు ఒకరితో నొకరు కలహించుకొనుచున్నారు. కాని శుద్ధవైదికమైన ఆత్మైకత్వ దర్శనపక్షమునకు, సర్వము ఆత్మకంటె వేఱుకానిదే, అనఁగా ఆత్మయే యైనకారణమువలన, మానవునకు, దనహస్తపాదాదులతోడ కలహము లేనట్లు, ఆపైపేర్కొన్న అన్యోన్యవిరోధులగు ద్వైతులతోడ అద్వైతవాదులకు ఎట్టికలహమును లేదు. అద్వైతులదృష్టిలో ద్వైతులును ఏకాత్మస్వరూపులేగదా! ఈవిధముగా రాగద్వేషాదిదోషముల కాశ్రయముకానికారణమువలన, ఆత్మైకత్వబుద్ధియే సమ్యగ్దర్శన మని యభిప్రాయము.

శ్లో॥ వైతథ్యం సర్వభావానాం స్వప్న ఆహు ర్మనీషిణః।
అంతస్థానాత్తు భావానాం సంవృతత్వేన హేతునా॥

మాం. కా. 2-1

శాం. భా॥ వితథస్య భావో వైతథ్యం। అసత్యత్వ మిత్యర్థః కథమ్? సర్వేషాం బాహ్యాధ్యాత్మికానాం భావానాం పదార్థానాం స్వప్నే ఉపలభ్యమానానామ్। ఆహుః కథయన్తి మనీషిణః ప్రమాణకుశలాః। వైతథ్యే హేతు మాహ- అంతఃస్థానాత్। అంతః శరీరస్య మధ్యే స్థానం యేషాం। తత్ర హి భావా ఉపలభ్యన్తే పర్వతహస్త్యాదయో, న బహిః శరీరాత్। తస్మాత్తే వితథా భవితు మర్హన్తి। నను అపవరకాద్యంత రుపలభ్యమానై ఘటాదిభి రనైకాంతికో హేతు రిత్యాశంక్యాహ- సంవృతత్వేనేతి। అంతఃసంవృతస్థానా దిత్యర్థః। న హ్యంతః సంవృతే దేహాంతర్నాడీషు పర్వతహస్త్యాదీనాం సంభవో ఽస్తి। న హి దేహే పర్వతో ఽస్తి॥

తా॥ [మాం. కా. 2-1] వైతథ్య మనఁగా అసత్యత్వము. ప్రమాణకుశలులైన బుద్ధిమంతులు, కలలందు అనుభవింపఁబడుచున్న బాహ్యాధ్యాత్మికములైన సర్వపదార్థములకును, అసత్యత్వమును జెప్పుచున్నారు. శరీరమునకంటె వెలుపలగాక, శరీరముయొక్క మధ్యమందే (అంతఃకరణమునందే) పర్వతములు, ఏనుగులు, మొదలైన సర్వపదార్థములు (కలలో) కనఁబడుచుండుట వలన అవి అంతఃస్థానము లైనవి. ఇట్లు శరీరములోపలిపర్వతాదులు, అసత్యపదార్థము లగుటకు యోగ్యము లగుచున్నవి. కావుననే ఈ బాహ్యాధ్యాత్మికపదార్థముల కెల్లఁ గల్గు అసత్యత్వమందు, వీనియంతఃస్థానత్వమే హేతువు. "అంతఃస్థానత్వము, అసత్యత్వమునకు హేతువు" అన్నన్యాయమునకు పూర్వపక్షి అవ్యాప్తిని జూపుచున్నాఁడు ఎట్లు? కటికచీకటి యావరించినగదిలో కనపడకుండనున్న పెట్టె, బేడ, కుర్చీ, బల్ల మొదలైన పదార్థములకు, వానిగృహాంతఃస్థానత్వమువలన, అవి అసత్యపదార్థము లగుట లేదుకదా! అట్లే స్వప్నానుభూతపదార్థము లసత్యము లనుట చెల్లదని యాక్షేపణ. దీనికి "సంవృతత్వేన(=అంతఃసంవృతస్థానత్వేన) హేతునా" అని సమాధానము. అనఁగా (గేహ అంతఃసంవృతము లగు దేహాంతర్నాడులందు పర్వతహస్త్యాదులసంభవము లేదుగదా! దేహమందు పర్వతము లేదుగదా! కావున ఆక్షేపము సరియైనది గాదు. స్వప్నభావము లసత్యములే యనుట యుక్తియుక్తమే.

శ్లో॥ అస్పర్శయోగో వై నామ సర్వసత్త్వసుఖో హితః।
అవివాదో ఽవిరుద్ధశ్చ దేశిత స్తం నమా మ్యహమ్॥

మాం. కా. 4-2

శాం. భా॥ అధునా అద్వైతదర్శనయోగస్య నమస్కారః తత్స్తుతయే।, స్పర్శనం స్పర్శః సంబంధో న విద్యతే యస్య యోగస్య కేనచిత్ కదాచిదపి

ణో ఽస్పర్శయోగో బ్రహ్మస్వభావ ఏవ, వై నామేతి। బ్రహ్మవిదా మస్పర్శ యోగ ఇత్యేవం ప్రసిద్ధ ఇత్యర్థః। స చ సర్వసత్త్వసుఖో భవతి। కశ్చి ద్ధత్యంతసుఖసాధనవిశిష్టో ఽపి దుఃఖరూపః, యథా తపః। అయం తు న తథా। కిం తర్హి? సర్వసత్త్వానాం సుఖః। తథేహ భవతి కశ్చి ద్విషయోపభోగః సుఖో, న హితః। అయం తు సుఖో హితశ్చ। నిత్య మప్రచలితస్వభావత్వాత్। కిం చావివాదో, విరుద్ధం వచనం వివాదః, పక్షప్రతిపక్షపరిగ్రహేణ యస్మి న్నవిద్యతే సో ఽవివాదః। కస్మాత్? యత్రో ఽవిరుద్ధశ్చ। య ఈదృశో యోగో దేశితః ఉపదిష్టః శాస్త్రేణ, తం నమామ్యహం ప్రణమా మీత్యర్థః॥

తా॥ [మాం. కా. 4-2] ఇప్పుడు అద్వైతదర్శనయోగము శ్రీగౌడపాదాచార్యులవారు స్తుతికొఱకు నమస్కరించుచున్నారు. ఏవిధముగాను, దేనితోడను, ఏకాలమందైనను సంబంధము లేనియోగము అస్పర్శయోగము. ఇది పరబ్రహ్మస్వభావమే. కావున బ్రహ్మజ్ఞానమునకు, అస్పర్శయోగము ఒకనామాంతర మని బ్రహ్మవిదులకు ప్రసిద్ధము. ఈయస్పర్శయోగము, సర్వదేశసర్వకాలములందు సర్వప్రాణులకు సుఖ మైనది. తపస్సువంటి యొకానొకయాచరణము, సుఖసాధనవిశేషమే యైనను, ఆచరణసమయమందు అది దుఃఖరూపము కావచ్చును. కాని యీయస్పర్శయోగము అట్టిదుఃఖరూపము కానేకాదు. ఈయస్పర్శయోగము సర్వప్రాణిజాతమునకు సాధనసాధ్యదశలందు సుఖమే సుమా. ఒకానొకవిషయోపభోగము సుఖ మైనను, ఆభోగము హితముకానిది కావచ్చును. కాని యీయస్పర్శయోగము, నిత్యము చలింపఁబడనిస్వభావము గల దగుటచేత సుఖరూపమును హితరూపముకూడ నై యున్నది. మఱియు విరుద్ధముగాఁ బలుకుట, అనఁగా, పక్షప్రతిపక్షములతో గూడినవాదము వివాదము. ఇట్టివివాదము లేని దగుటచే అస్పర్శయోగము అవివాద మైనదియు నగును. మఱియు అవిరుద్ధ మైన దనియుఁ బ్రసిద్ధము. ఇట్లు

సర్వప్రాణులకు సుఖమై, హితమై, అవివాదమై, అవిరుద్ధము నైన యీయస్పర్శ యోగమును ఉపదేశించిన మాండూక్యోపనిషద్రూప వేదాంతశాస్త్రమునకు నమస్కరించుచున్నాను. "జ్ఞానాదేవ తు కైవల్యమ్" ఒక్క ఆత్మజ్ఞానమాత్రముననే ముక్తిరూపకేవలత్వ సిద్ధి" అని శ్రుతిఘోష.

ఇట్టి సర్వసమన్వయరూపమైన ఆత్మతత్త్వము, ఆత్మసమ్యగ్దర్శనము, బ్రహ్మవిదులయు, ఉపనిషద్బ్రహ్మసూత్రభగవద్గీతా శాస్త్రములయు, ఉపదేశములవలన సంభవమగు శ్రవణము చేతను, తదర్థమనన, నిదిధ్యాసనముల చేతనే అనుభవైకవేద్యము. వేఱొండుసాధనమువలన, (ఉపాయమువలన,) సాధ్యము కాదు.

శ్లో॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।
ఉభయో రపి దృష్టో ఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః॥ గీ 2-16

అని ధర్మబ్రహ్మసమ్మూఢచేతస్కుఁడును, పరమభక్తశిష్యాగ్రేసరుఁడునగు అర్జునునిగూర్చి గీతలందు శ్రీకృష్ణభగవానుఁడు చేసినప్రబోధసారము. 'తద్' అనునది సర్వనామము. సర్వమును బ్రహ్మము. దానిపేరు 'తద్' అగును. తద్భావము తత్త్వము, అనఁగా బ్రహ్మముయొక్క యథార్థ (పరమార్థ) స్వరూపము. ఆతత్త్వమును జూచుటయే (అనుభవించుటయే) శీలముగాఁ గలవారు తత్త్వదర్శులు.

కంటిచే చూడఁబడుచున్న వికారమగు కార్యరూపమైనది ఘటాదిసంస్థానము. ఇది దానియుపాదానకారణమైన మట్టి కంటె (వ్యతిరేకముగా) వేఱుగా లభించుచున్నది కాకపోవుటచే అసత్తు. కారణవ్యతిరేకముగా ఉపలబ్ధిలేని సర్వవికారము అసత్తే యగుట సిద్ధము.

కావున అనాత్మలైయె, కారణసహితమైన శీతోష్ణాదిద్వంద్వ రూపమగు ఈనామరూపాదిజగద్విషయమైన బుద్ధి ఒకానొకవికారమై నిలుకడగా నిలుచుట లేదు. (వ్యభిచరించుచున్నది.) కాన ఈసర్వవ్యావహారికజగత్తు, (1) దానిజన్మమునకుఁ బూర్వమందును, ప్రధ్వంసమునకుఁ బిమ్మటను, ఉపలభ్యమానము కాకుండుట చేతను, (2) శ్రుత్యాదిప్రమాణములచే నిరూప్యమాణమగు వస్తువు కాకుండుట చేతను, ఈసర్వజగత్తు అసత్తు, మిథ్య. ఈఅసత్తునకు అస్తిత్వరూపభావము (ఉనికి) లేదు. కాని ఆత్మాభిన్నబ్రహ్మవిషయబుద్ధి వ్యభిచరింపక (మారక, వికారము నొందక) సర్వప్రాణులకు స్థిరముగా నున్నది. మఱియు, శ్రుత్యాదిప్రమాణములచే నిరూప్యమాణమగు ఏకము, అద్వితీయమగు వస్తువు అగుటచే ఆత్మపదార్థము సత్తైనది. ఈసదాత్మకు అవిద్యమానత్వము, లేదా, నాస్తిత్వరూపాభావము లేదు. ఈవిధముగా సదసత్తులగు ఆత్మానాత్మలనిజస్థితినిగూర్చిన నిర్ణయము, "సత్తు సర్వదా సత్తే" అనియు, అసత్తు అసత్తే అనియు పైచెప్పినతత్త్వదర్శులచే ఉపలబ్ధమైనది. (పొందఁబడినది).

అవ॥ యేషాం జ్ఞానేన నాశిత మాత్మనో ఽజ్ఞానం తే పండితాః కథం తత్త్వం పశ్య న్తీత్యుచ్యతే.

శ్లో॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః॥ గీ 5-18

శాం, భా॥ విద్యావినయసంపన్నే విద్యా చ వినయశ్చ విద్యావినయౌ, విద్యా ఆత్మబోధో వినయ ఉపశమ స్తాభ్యాం విద్యావినయాభ్యాం సంపన్నో విద్యావినయసంపన్నః విద్వాన్ వినీతశ్చ యో బ్రాహ్మణః తస్మిన్ బ్రాహ్మణే, గవి హస్తిని శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినో విద్యావినయసంపన్న ఉత్తమసంస్కారవతి బ్రాహ్మణే సాత్త్వికే, మధ్యమాయాం చ రాజస్యాం గవి సంస్కారహీనాయా, మత్యంతమేవ కేవలతామసే హస్త్యాదౌ చ, సత్త్వాదిగు

దై స్తజ్జైశ్చ సంస్కారై స్తథా రాజసై స్తథా తామసైశ్చ సంస్కారై రత్యం తమే వాస్పృష్టం సమ మేక మవిక్రియం బ్రహ్మ ద్రష్టుం శీలం యేషాం తే పండితాః సమదర్శినః॥

అవ॥ ఆత్మవిషయకమైన యజ్ఞానమును ఆత్మజ్ఞానముచేత నాశన మొనర్చుకొన్నవారు పండితులు. వారు తత్త్వము నెట్లు చూచుచున్నారో వినుము.

తా॥ [గీ 5-18] విద్య యనఁగా ఆత్మబోధ. వినయ మనఁగా ప్రశాంతి. ఇది సుశిక్షితునిచిత్తస్థితి. ఇట్టి విద్యావినయశీల వృత్తసంపద యనెడు ఆధ్యాత్మికసంస్కారాతిశయము గలవాఁడును, సత్త్వగుణప్రధానుఁడునగు బ్రాహ్మణుఁడు ప్రాణిజాతిలో ఉత్తముఁడు. ఆధ్యాత్మికసంస్కారములేక, రజోగుణప్రధానమగు గోవు, మధ్యమప్రాణి. కేవలతమోగుణమే ప్రధానముగాఁ గల ఏనుఁగు, కుక్క, కుక్కను వండి తిను చండాలుఁడు అధమప్రాణులు. ఈభిన్నగుణసంస్కారతారతమ్యములు గలసర్వప్రాణులందును, ఆసత్త్వరజస్తమోగుణములచేతగాని, తద్గుణజన్యములైన సంస్కారములచేతగాని, అత్యంతము అస్పృష్టమే యైనదియు (అనఁగా నిర్గుణమైనదియు), (సమము) ఏక మైనదియు, వికారరహిత మైనదియునగు బ్రహ్మపదార్థమునే చూచుట శీలముగాఁ గలవారు పండితులైన సమదర్శులు.

జగద్గురు శ్రీవ్యాసభగవానులును మొదటినాల్గుబ్రహ్మసూత్రములచేతను సంగ్రహముగా ఏకాద్వితీయబ్రహ్మమునే పరమార్థముగా నిశ్చయించి బోధించెను. 1, అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా. (ఉచితాధికారిచేత బ్రహ్మజ్ఞానేచ్ఛ చేయఁదగినది.) 2. జన్మాద్యస్య యతః. (ఈదృశ్యమానజగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు నిమిత్తోపాదనహేతువు బ్రహ్మమే.) 3. శాస్త్రయో

నిత్వాత్ (ఋగ్వేదాదిశాస్త్రకర్త ఈశ్వరరూపబ్రహ్మము. బ్రహ్మతత్త్వము, వేదవేదాంతములచేతనే తెలియఁదగినది.) 4. తత్తు సమన్వయాత్. (ఉపనిషద్వేద్యాత్మాభిన్నబ్రహ్మమునునందు జగచ్ఛాస్త్రాదిసర్వము అవిరుద్ధముగా సమన్వయ మగును.)

ఈ ప్రస్థానత్రయప్రమాణానుసారముగా శ్రీశంకర భగత్పాదులవారు, జిజ్ఞాసుభక్తలోకోద్ధరణమునకై అపారదయతో సను గ్రహించిన కృతులలో శ్రీవారిభాష్యములు ప్రౌఢవాఙ్మయామృతవర్షధారాపరంపరలు. కాని ఆబాలగోపాలము అధికారము న్నవారందుకొని కడుపారనారగించు అద్వైతాత్మతత్త్వక్షీరసాగర మథనఫలితనవనీతగుళికలు, శ్రీభగత్పాదులప్రకరణగ్రంథములు, స్తోత్రములును. ఏయొక్కదానినైనను సమగ్రముగా, నిస్సందేహముగా గురుముఖమున నధ్యయనము చేసి, తదర్థమును ఒంటబట్టించుకొన్నవాఁడు, కృతకృత్యుఁడు, జీవన్ముక్తుఁడగును.

అట్లు ముక్తిసాధనముగా రచించినదే ప్రకృతమును, ప్రకరణగ్రంథమునగు ప్రబోధసుధాకరము. ప్రబోధ మన (1) మేలుకొలుపు. దేనినుండి? అనాద్యవిద్యానిద్రనుండి. లేదా ప్రబోధ మన (2) ఆత్మసమ్యగ్జ్ఞానము. ఈ ప్రబోధమే సుధ, యనఁగా అమృతము. ప్రబోధము అమృతత్వమును (మరణజననరాహిత్యమును) జేర్చుసాధనము గాన దీని నమృత మనవచ్చు. (కార్యకారణాభేదాన్వయముచే). అట్టి ప్రబోధామృతమునకు నిధి, లేక, విపులాధారమగు సముద్రము, ప్రబోధసుధాకరము. అదే పరిశుద్ధాత్మాభిన్నబ్రహ్మము; లేక సర్వజ్ఞానానందశక్తిమంతుఁడును, తత్ప్రదాతయు నగు ఈశ్వరుఁడు. ఇట్టిదే శ్రీకృష్ణతత్త్వము. కనులవిందు, వీనులవిందు; డెందంపువిందు. విందులకు విందు. సాటిలేని విందు.

శ్రీశంకరులు ఈగ్రంథాదిని శ్రీకృష్ణేశ్వర బ్రహ్మాత్మత్వము నకు నమస్కరించుటచేతను, శ్రీహరితనయ పారకృపారసము భక్తులపై, జిల్కుగాక యని ఉపసంహరించుటచేతను ప్రబోధసుధాకరుండు శ్రీహరియే యని ప్రకటించుచున్నారు. మధ్యమందు 24వ శ్లోకములోను యదునాయకుండే (శ్రీకృష్ణుండే) అనంతుండు, విభుండు, సాంద్రానందసుధార్ణవుం డన్నారు. ఏవ శ్లోకములోను "వైరాగ్య మాత్మబోధో భక్తి శ్చేతి త్రయం ముక్తేః సాధనమ్" "వైరాగ్యాత్మబోధభక్తిత్రయము సాక్షాన్ముక్తిసాధన మని ప్రతిజ్ఞానవచనము చేసి, మొదటియాఱుప్రకరణములను వైరాగ్యప్రధానములుగాను, తర్వాతితొమ్మిదిప్రకరణములను ప్రబోధప్రధానములుగను, చివటినాల్గుప్రకరణములను భక్తిప్రధానములుగను, గ్రంథస్థవిషయవిభాగము నొనర్చి ముక్తిరూపమై అద్వైతాత్మతత్వమును సుస్పష్టముగా, సువిపులముగా, హృద్యముగా, నిపుణముగా విశదీకరించి, ప్రతిజ్ఞను జక్కగా సాధించిరి, శ్రీశంకరభగవత్పాదులు. ఈకావ్యార్థమగు అద్వైతదర్శనమును, అద్వైతప్రకరణముగా, కావ్యమధ్యస్థానమందు, అనఁగా, తొమ్మిదిప్రకరణములు ముందు, తొమ్మిదిప్రకరణములు తర్వాతను గల పదవప్రకరణమందు రచించుట కావ్యవిషయప్రాధాన్యమును, లక్ష్యమును సుస్పష్టముగా స్ఫురింపఁ జేయునేర్పు, తీర్పు, గాక మఱేమి? శ్రీకృష్ణానందలహరి యననొప్పుచు, ఆర్యాచ్ఛందము ప్రధానముగాఁ జూర్లిపొంగిన శ్రీవారివాగమృతభరిత మగు నీగ్రంథరాజమును ఆర్యపాఠకలోకము [ఆగళము] గొంతువఱకు ఆస్వాదించుగాక! కలియుగపవిత్రమజ్ఞానగురూ! అద్వైతానందదాయీ! శ్రీశంకరాచార్యపరబ్రహ్మమా! ఈప్రబోధసుధాకరరూప శ్రీశంకరభారతి! మీకు, సర్వత్ర, సర్వదా, జయము! జయము!!

ఆ శ్రీశంకరభారతీప్రసారకంకణబద్ధులైన హైదరాబాద్ అనాద్ బాగ్‌లోని శ్రీసీతారామఆదిశంకరట్రస్టువారు మమ్ము ఈ ప్రబోధసుధాకరమునకు ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యవిశేషముల ను రచింపఁ సహృదయతతో వేఁడఁగా, మహాభాగ్యముగా భావించి తిమి. [1] శ్రీశంకరభగవత్పాదులకావ్యభారతీకృపావిశేషము చేతను [2] సాంద్రానందసుధార్ణవుఁడును అద్వైతామృతఘనశ్యాముఁడు నగు శ్రీకృష్ణభగవానునిదయవలనను [3] సాక్షాత్తద్రూపుఁడు గా శ్రీకృష్ణాష్టమి నాఁడు జన్మించి, శ్రీ కె. టి. [కానుకొల్లు త్రివిక్రమ] రామారావు అను పేరుతో నాటి శృంగేరీజగద్గురు శ్రీశ్రీ సచ్చిదానందశివాభినవనృసింహభారతీస్వామివారి పాదకమలములు సేవించి, జీవన్ముక్తులై, శ్రీవిమలానందభారతీస్వామివరేణ్యులై మమ్ము శిష్యులనుగా స్వీకరించి, యనుగ్రహించి, మమ్ము విమలానందులంజేసిన మాసద్గురుస్వాములదివ్యజ్ఞానదయారసప్రభావము వలనను [4] శ్రీశృంగేరీ శ్రీశారదాపీఠజగద్గురుల దివ్యాశీఃప్రభావమువలనను, మేము యథామతి, యథాశక్తి యిట్లు ఆంధ్రీకరించితిమి. దేహానారోగ్యముతో నొకరు, నేత్రావరోధముతో నొకరము నుండియు, కార్యమును సాధింపవలసివచ్చినది. ఈగ్రంథమునకుఁ బూర్వవ్యాఖ్యానము ఏదియు మాకుసహాయము లేదు. కావున ప్రమాదవశమున దొర్లిన దోసగు లున్నచో సహృదయతతోఁ దెల్పిన కృతజ్ఞతతో స్వీకరింతుము.

శ్రీకృష్ణసంబంధియో యన్నట్లు మచిలీపట్టణములో బృందావన్ ప్రింటర్సువారు ఇట్లు ముందు వెనుక లైనను, ముచ్చటగా ముద్రించి ప్రశంసనీయులైరి. ఇట్లిది మొదటినుండి చివఱవఱకు శ్రీకృష్ణభగవల్లీలలుగనే సాగినవి. ఈకార్యసిద్ధికిఁ దోడ్పడిన మహానుభావు లందఱకు నమస్కారములు. శ్రీరామనవమీ వ్యాసపూర్ణి

మా శ్రీశంకరనృసింహహానుమజ్జయంతి శుభాకాంక్షలు! రెండు!
కావ్యామృతరసాస్వాదనపరులు కండు!

శ్లో॥ గురవే శంకరాచార్యాయ ప్రతీచే బ్రహ్మణే సదా।
నమో వేదాంతనళినీబాలసూర్యాయ యోగినే॥

ఓం తత్ సత్ పరబ్రహ్మణే నమః

ఆంధ్రటీకాతాత్పర్య రచయితలు (సతీర్థ్యులు) :-

1. శ్రీ ప॥ ప॥ రామానందభారతీస్వామి
2. మారెళ్ల సుబ్బారావు



# విషయసూచిక


| వరుస సంఖ్య | ప్రకరణ విషయము | శ్లోకపరిమితి | పుట |
|---|---|---|---|
| 1. | దేహనిందా ప్రకరణము | 1-28 | 1 |
| 2. | విషయనిందా ప్రకరణము | 29-50 | 41 |
| 3 | మనోనిందా ప్రకరణము | 51-54 | 65 |
| 4. | విషయనిగ్రహ ప్రకరణము | 55-64 | 69 |
| 5. | మనోనిగ్రహ ప్రకరణము | 65-77 | 80 |
| 6. | వైరాగ్య ప్రకరణము | 78-85 | 94 |
| 7. | ఆత్మసిద్ధి ప్రకరణము | 86-94 | 104 |
| 8. | మాయాసిద్ధి ప్రకరణము | 95-109 | 117 |
| 9. | లింగదేహాదినిరూపణ ప్రకరణము | 110-118 | 138 |
| 10. | అద్వైత ప్రకరణము | 119-132 | 148 |
| 11. | కర్తృత్వభోక్తృత్వ ప్రకరణము | 133-138 | 165 |
| 12. | స్వప్రకాశతా ప్రకరణము | 139-143 | 172 |
| 13. | నాదానుసంధాన ప్రకరణము | 144-149 | 178 |
| 14. | మనోలయ ప్రకరణము | 150-157 | 184 |
| 15. | ప్రబోధ ప్రకరణము | 158-165 | 191 |
| 16. | ద్విధాభక్తి ప్రకరణము | 166-183 | 203 |
| 17. | ధ్యాననిధి ప్రకరణము | 184-193 | 218 |
| 18. | సగుణనిర్గుణములయొక్క ప్రకరణము | 194-226 | 226 |
| 19. | అనుగ్రహీక ప్రకరణము | 227-257 | 264 |

ఓం

హరిః ఓమ్ శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

శ్లో॥ నారాయణసమారంభాం శంకరాచార్యమధ్యమామ్।
విమలానందపర్యన్తాం వందే గురుపరంపరామ్ ॥

# ప్రబోధసుధాకరము

## 1. దేహనిందా ప్రకరణము

ఈరక్తమాంసాదినిర్మితదేహనిందకు దేహభిన్నమై, గ్రంథప్రతిపాద్య వస్తువగు సచ్చిన్మాత్రకేవలాత్మయొక్క స్తుతియే ప్రయోజనము (గలదగును). దేహనింద్యలక్షణములను బాగుగాఁ బ్రదర్శించుటకును బ్రయోజనము అట్టి దేహముపై వైరాగ్యమును బుట్టించుటయే.

అవతారిక – ఉపనిషత్తులలోఁ చెప్పఁబడిన బ్రహ్మవిద్యాసంప్రదాయమును చక్కఁగా నెఱిఁగినవారును, ఇతరసర్వసాహిత్యమును పుక్కిలించి యుమిసి, దాని మహాకవుల సంప్రదాయరహస్యముల నెఱిఁగిన విద్వన్మణియు, జగద్గురువులును, జగద్గురుపీఠస్థాపకులును శ్రీపరమహంసపరివ్రాజకవర్యులునైన శ్రీ శంకరాచార్యులవారు లోకుల నుద్ధరించుటకొఱకు, తాము వ్రాయఁబూనిన ప్రబోధ సుధాకరప్రబంధము ప్రతిబంధకములు లేకుండ పరిసమాప్తి యగుటకు ప్రబంధ ప్రారంభమునఁ దల్లక్షణమగు "ఆశీ ర్నమస్క్రియా వస్తు నిర్దేశో వాపి తన్ముఖమ్" అనఁగా గ్రంథారంభమందు మొట్టమొదట ఆశీస్సుగాని, ఇష్టదేవతా నమస్కారముగాని, గ్రంథమునఁ జెప్పఁదలఁచినవస్తు(విషయ) విశేషమునుసంగ్రహముగాఁ బ్రకటించుటగాని చేయవలయు ననుమర్యాదను పాటించి, ఈ మొదటి శ్లోకముననే మహానిపుణముగా, ఇష్టదేవతానమస్కారమును, వస్తునిర్దేశమును వాచ్యముగాను (స్పష్టశబ్దార్థముగను), ఆశీస్సులను, అంతర్గర్భితధ్వనిరూపమునను మేళవించుచున్నారు. ఎట్లన?

నిత్యానందైకరసం సచ్చిన్మాత్రం స్వయంజ్యోతిః ।
పురుషోత్తమ మజ మీశం వందే శ్రీయాదవాధీశమ్ ॥ 1

ప్రతిపదార్థము :- నిత్యానందైకరసమ్ = నిత్యమైన ఆనంద మొక్కటే సారముగా స్వరూపముగాఁ గలవాఁడును, సచ్చిన్మాత్రమ్ = సన్మాత్రమే అనఁగా నిర్విశేషముగా ఉండుటమాత్రమును, చిన్మాత్రమే = జ్ఞానము మాత్రమే స్వరూపముగాఁ గలవాఁడును అనగా, సచ్చిత్స్వరూపుఁడును, స్వయంజ్యోతిః = (స్వయముగా) ఇతరు లగుసూర్యాదులసహాయము లేకుండ తనకుఁ దానే వెలుఁగువాఁడును, అజం = పుట్టుక లేనివాఁడును, ఈశం = ఈశ్వరుఁడును, సర్వులను నియమించువాఁడును, పురుషోత్తమమ్ = భగవద్గీతలోఁ జెప్పఁబడిన పరాపరలను రెంటుప్రకృతులుగాక, అందలి పురుషులలో నుత్తముఁడును, శ్రేష్ఠుఁడును ఐన, శ్రీయాదవాధీశమ్ = సంపదతో లక్ష్మితో గూడినయదువంశజాతులకుఁ బ్రభువైన శ్రీకృష్ణుని, వందే = నమస్కరించుచున్నాను.

తాత్పర్య వివరణములు :- నిత్యానందరసస్వభావుఁడును, ఉండుట తెలియుట మాత్రమే స్వరూపముగాఁ గలవాఁడును, ఇతరసహాయము లేకయే తనంతట తానే ప్రకాశించువాఁడును, పుట్టుక లేనివాఁడును, సర్వమును పాలించుఈశ్వరుఁడును, పురుషశ్రేష్ఠుఁడును, యాదవుల కందఱకును ప్రభువును అగు శ్రీకృష్ణునకు నమస్కరించుచున్నాను.

చంద్రవంశక్షత్రియుఁడగు యయాతికి దేవయానియందుఁ గల్గిన కొడుకులలో జ్యేష్ఠుఁడు యదువు. అతని సంతానము పుత్రపౌత్రాదులు యాదవులు. ఆకులమునందలి మనుష్యుల కందఱకును అధినాథుఁడు, నిజముగా కిరీటధారియై సింహాసనస్థుఁడు కాకున్నను పాలించుటవలన అధికనాథుఁడుగా శ్రీకృష్ణుఁ డవతరించినాఁడు. ఈయన లోకములో సాటిలేని సర్వాంగసుందరుఁడు. పుట్టినదాది అతిమానుషచర్యలతో దుష్టశిక్షణను, సాధురక్షణను చేసి, అర్జున

ముఖమున (శ్రీ) భగవద్గీతాశాస్త్రము నుపదేశించి లోకుల కాచార్యుఁడైనవాఁడు. ఇతడు స్థూలరూపమున సర్వజనమనోహరుఁడు. లోకదృష్టిలో చరిత్రాత్మకకృష్ణుఁ డీయాదవాధీశుఁడు. ఈయన శ్రీహరిపరిపూర్ణావతారము. శ్రీహరి అవ్యక్తమూర్తి యగునీశుఁడు. నియమనశీలుఁడు. సర్వమును, సర్వులను నియమించువాఁడు, నియమన మనఁగనే నియమ్యము (పాలింపఁబడునది) ఉండవలె. గీతయందుఁ జెప్పఁబడిన ఈశ్వరునిపరాపరప్రకృతిద్వయమే ఈ నియమ్యము.

శ్లో॥ భూమి రాపో ఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా॥ గీ 7-4

శ్లో॥ అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥
గీ 7-5

శ్లో॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్।
పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరమ్ ॥ గీ 9-11
"పశ్య మే యోగ మైశ్వరమ్" గీ 9-5

ఈ మొదలుగాఁ గల గీతావచనములవలన తనసంకల్పమాత్రముననే నరశరీరము ధరించిన (శ్రీ)కృష్ణుఁడు, సూక్ష్మరూపమున సర్వవ్యాపియై సర్వజ్ఞుఁడై సర్వశక్తిమంతుఁడైన ఈశ్వరుఁడగు (శ్రీ)హరియే తానని (స్థూలసూక్ష్మకారణములకభిన్నత్వము, లేదా, ఏకత్వము సత్య మని) చాటినాఁడు. అభేదాన్వయవిధము కర్తవ్య మని సూచిత మైనది.

ఒక్కరుఁడగు ఈశ్వరుఁడు అజుఁడు, అనఁగా, పుట్టుకలేనివాఁడు, క్షరాక్షరపురుష వ్యతిరిక్తుఁడగు పురుషోత్తముఁడును. ఈ యీశ్వరతత్త్వము చరిత్రాత్మకముఁ (ఆదిమధ్యాంతములుగలది) గాఁ గాక, శాశ్వతము అనాదిమధ్యలయరూపమై మీమాంసాపద్ధతినే గ్రహింపఁదగినది. ఈస్థూలసూక్ష్మకారణరూప మంతయు సగుణమై వ్యావహారికముగా సత్యమైనది. అనఁగా, మిథ్యారూపమైనది. పుట్టినమనుష్య చరిత్రగల శ్రీకృష్ణుఁడు, దృష్టనష్టస్థూలరూపుఁడు. వీనికి విరుద్ధధర్మములుగల పుట్టని యవ్యక్తరూప పరమేశ్వరుఁడతఁడే ఇద్దఱ కైక్యము శ్రుతి స్మృతిపురాణాది న్యాయసిద్ధము. ఇదే ముందుముందు గ్రంథమున నిరూపింపఁబడుచుండును.

వాస్తవము, ఈస్థూలసూక్ష్మాదివ్యావహారికసత్యాతీతమై, అతీంద్రియమై, ఉపనిషదర్థజ్ఞానగమ్యమై, మనననిదిధ్యాసములచే అనుభవసిద్ధమై, ఈ బహువిధదృశ్యనశ్యశీలమగు సర్వమునకు నధిష్ఠానమై, పరమార్థసత్యమై, కేవల చిద్రూపమై, స్వయంప్రకాశమై, నిత్యానందస్వరూపమై, ఏకమై రెండవది సత్యముగా లేనిదై, వ్యావహారికజగదీశ్వరాదిసర్వము తనయందు కల్పితమై యొప్పునది, నిర్గుణమైన ప్రత్యగాత్మాభిన్నపరబ్రహ్మము. ఇట్లు శ్రీకృష్ణేశ్వరపరబ్రహ్మమగు నిష్టదేవతకు నమస్కారము. ఇది శిష్టాచారము. ఇట్టి స్థూలచరిత్రాత్మక శ్రీకృష్ణతత్త్వమును, సూక్ష్మాది వ్యావహారికవిశ్వరూపపిశ్వేశ్వరత్వమును భాసింపఁజేయు సర్వాధిష్ఠాననిర్గుణనిష్క్రియాద్వైతరూప పరబ్రహ్మైక్యానుభూతి గ్రంథమందు ప్రతిపాదింపఁబడఁబోవుచున్న వస్తువు. ఈగ్రంథపఠనముచేత ప్రబోధము (మేల్కొలుపు) గల్గి గ్రంథార్థశ్రవణ, మననాదులవలన సంస్కృతులైనవారికి ఉత్తమపురుషార్థమగు మోక్షము సద్యఃఫల మని ఉపదేశరూపాశీర్వాదము అంతర్గర్భిత

మగు ధ్వని. ఇట్లు ఆత్మాభిన్న శ్రీకృష్ణదేవతానమస్కార, వస్తునిర్దేశాశీర్వాదములను సూచించిన ప్రబంధముఖమున నీశ్లోకమునఁ గూర్చిన శ్రీ శంకరభగవత్పాదుల ధీనైపుణ్యవైభవ మనన్యసామాన్యము.

"ప్రతిపాద్యమహిమ్నా చ ప్రబంధోఽపి మహత్తరః"

ఇచ్చట ప్రతిపాదింపబడుచున్న శ్రీకృష్ణబ్రహ్మము (వస్తువు) నిరతిశయమహిమము గలదగుటచేతఁ గూడ ఈప్రబోధసుధాకరప్రబంధము మహత్తర మగుచున్నది. అందువలన గాఢాసక్తిభక్తిశ్రద్ధలతో నేకాగ్రతతోఁ జనువరులు విమర్శనపరిశీలనములు చేయఁదగినదనియు సూచింపబడినది.

ఇది ప్రతిజ్ఞావిషయముగా గ్రహించి దీనిని (ఈయద్వైతపరమార్థతను) ఎట్లు ప్రసిద్ధవివర్తవాదవిస్తారముగా, శుద్ధాద్వైతసిద్ధాంత ప్రకారముగా శ్రుత్యాద్యర్థనిరూపకముగాఁ బ్రబోధించి విషయమును కరతలామలకముగాఁ, గొంగుబంగారుగాఁ జేసినది ప్రబంధమందచ్చటచ్చట ముచ్చటింపఁబడును.

మఱియు గ్రంథనామౌచిత్యాదిపరిశీలనసంగ్రహము :-

బోధ మనఁగా జ్ఞానము (తెలివి). ప్రబోధ మనఁగా ప్రజ్ఞానము. ఇది ప్రకృష్టమై యనంతమైన జ్ఞాన మగును. ఈనిరుపాధికమై స్వస్వరూపమును నిష్క్రియమునైన ప్రజ్ఞానము పరబ్రహ్మ మగును. కాని సామాన్యవ్యావహారికజ్ఞానము జాగ్రత్స్వప్నసుషుప్తిమయము. ఇది బుద్ధి యుపాధిగఁ గలది. స్వస్వరూపజ్ఞానానుభవము తురీయము. ఇదే సుధ (అమృతము). అనగా నాశరహితమై నిత్యమైనది. అట్టిదానికి ఆకర మనఁగా నిలయము, లేదా విపులాధారమైనది, ప్రబోధసుధాకరము. ఇది ప్రజ్ఞాన

మనెడు అమృతనిధి, పరబ్రహ్మము (పరమేశ్వరుండు). వేఱొండర్థము. ప్రబోధ మనఁగా మేల్కొనుట.

శ్లో॥ అనాదిమాయయా సుప్తః యదా జీవః ప్రబుధ్యతే।
అజన్మనిద్ర మస్వప్న మద్వైతం బుధ్యతే తదా॥

[(మాండూక్య కారిక (1-16)] జీవుఁడు అనాదియైన యజ్ఞానమను నిద్రలో మునిఁగి జన్మపరంపర లెత్తుచుండును. అందు విసివి విరక్తుఁడై ఈశ్వరానుగ్రహమున ఈశ్వరరూపుఁడగు గురువు నాశ్రయించి, వానిదయవలన వేదాంతశ్రవణమననములు బాగుగా సలిపి నిదిధ్యాసమున (తురీయమున) తనపరమానందరసస్వరూప మాస్వాదించి, లెస్సగా నెఱుంగుటయే మేల్కొనుట యనెడిప్రబోధము. జీవుఁడు ప్రబుద్ధుఁ డగును. అప్పు డతఁడు తాను నిజముగా జన్మములులేని, వ్యావహారికజాగ్రత్స్వప్ననిద్రలులేని, ఏకమైన యద్వితీయబ్రహ్మరూపశుద్ధాత్ముఁడ నని యనుభవపూర్వకముగా దెలిసికొన్నవాఁ డగును. ఈయాత్మప్రబోధము అవిద్యాజీవిత నిద్రనుండి మేల్కొనుటయే. ఇది అమృతత్వరూపమోక్ష (హేతు) రూప మగుటచే అమృతము లేక సుధ యనవచ్చును; ఇట్లు తన నిత్యసచ్చిదానందమగు అమృతత్వస్వరూపమును జేర్చు ఈ ప్రబోధామృతమునకు నిధి, లేదా, విపులాధారరూపసాగరమే ఈ ప్రబోధసుధాకరము. ఆహా! ఎంతటినామౌచిత్యశోభ!!

మఱొక ధ్వనిరూపౌచిత్యమును నెఱుఁగఁదగు. అనాదియగు నజ్ఞానమును దానికార్యమగు నధ్యాసమును (ఒకదానిని, దానినిగా గుర్తింపక, వేఱొకదానినిగా నెఱుంగుట యధ్యాసము) పెనగొన్న స్వభావము గల్గుటచే సంసారస్వప్నానుభవితయగు జీవుఁడు ఈ ప్రబోధమునకు అధికారి. అతఁడు లేనిచో శాస్త్రములు లేవు. బంధమోక్షాదులు మఱేవియును లేవు. ఇట్టివాఁడు తన నిత్యపర

మానందైకరసస్వరూపము నెఱుంగుటయే యీగ్రంథప్రయోజనము. ఇది, శ్రీపరమేశ్వరుని భక్తిప్రపత్తులతో సేవింపఁగా లభించునదియు, శాస్త్రాచార్యులయుపదేశఫలముగాఁ బ్రాపించునదియునగు కేవలాత్మజ్ఞానమువలననే నిశ్శ్రేయసముగా లావిద్యానివృత్తి సుసాధ్యము. ఆత్మాభిన్నాద్వైతబ్రహ్మమే యీ గ్రంథవిషయము. ఈగ్రంథకీలకమధ్యమగు 10 వది అద్వైతప్రకరణమగుట గమనార్హము. ఆయద్వైతమును అరటిపండొలిచి నోటికందించినట్లు, సులభసుందరముగాఁ బ్రతిపాదించి, యీగ్రంథము, పాఠకులను మాయికసంసారమునుండి తరింపఁజేయు ననఁనేల? విషయమునకును గ్రంథమునకును గలసంబంధము, ప్రతిపాద్యప్రతిపాదకరూపము. ఇట్లు నిగూఢముగా అధికారి, విషయ, ఫల, సంబంధములనెడియనుబంధచతుష్టయముకూడ గ్రంథనామప్రథమశ్లోకములచే సూచితము.

ఈజీవవ్యాపారము, ఈశ్వరునిలీల, లోకవిభూతి, యంతయు మాయాపరిధిలోనిది. మిథ్యయే. పరమార్థము కాదు. జీవేశ్వరులు పరస్పరసాపేక్షకులు (Relaiive entities) జగత్సృష్టిస్థితిలయములన్నియు మాయాపరిధిలోనివే. పరమార్థము శ్రీగౌడపాదాచార్యులవారు చెప్పినరీతిగల మాండూక్యకారిక (2-16) యర్థము.

శ్లో॥ న నిరోధో న చోత్పత్తిః న బద్ధో న చ సాధకః।
న ముముక్షు ర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా॥ (2-16)

పరమార్థముగా, ప్రళయము లేదు. సృష్టి లేదు. బద్ధుఁడు లేఁడు. సాధకుఁడు లేఁడు. మోక్షమును గోరువాఁడు లేఁడు. కావున ముక్తి పొందినవాఁడు లేఁడు. ఇదియే పారమార్థిక సత్యము.
ఓం తత్ సత్.

అవ : ఆపరతత్త్వమును గురించియే చెప్పుచున్నారు.

**యం వర్ణయితుం సాక్షా చ్ఛ్రుతి రపి మూకేవ మౌన**
**మాచరతి ।**
**సోఽ స్మాకం మనుజానాం కిం వాచాం గోచరో భవతి॥2**

ప్ర : శ్రుతిఃఅపి = వేదము కూడ, యం = ఏ పరమాత్మ (తత్త్వము) ను, సాక్షాత్వర్ణయితుం=ప్రత్యక్షముగా, వాచ్యముగా వర్ణించుటకు, (అశక్తయయి) మూకాఏవ=మూగదే ["ఏవ"ను "ఇవ"(వలె)అరములో కూడ చెప్పవచ్చును. మూగిదానివలె)] అయి, మౌనం ఆచరతి=మౌనమును భజించుచున్నదో, సః= ఆపరమార్థతత్త్వరూపపరమేశ్వరుఁడు, అస్మాకం మనుజానాం=మా(వంటి) మనుజులయొక్క (కించిజ్ఞులైనమా) వాచాం=వాక్కులకు, గోచరఃభవతి కిం? =విషయమైనవాఁడగునా? కాఁడు.

తా : అపౌరుషేయములైన సాక్షాత్పరమేశ్వరునినిశ్వాసరూపముగా వెడలిన శ్రుతులే "ఆయన (పరమార్థముగా) ఇట్టివాఁడు" అని స్పష్టముగాఁ జెప్పలేక మూగవారివలె మౌనమును బూనినవి. అవాఙ్మనసగోచరుఁడగు ఆయనను సూటిగా వర్ణింపలేకున్నవి. నిషేధరూపముచను (నేతి,నేతి) లక్ష్యార్థముగను చెప్పినవి. అట్టిచో అల్పబుద్ధిగల నరుఁడనైన నేను ఆబ్రహ్మమును స్పష్టముగా, తెలియ వీలగునట్లు చెప్పగలనా? చెప్పలే నని తాత్పర్యము. ఇది ఆచార్యశంకరులసత్యవినయలక్షణము. కవీంద్రుఁడుగా స్వాహంకారపరిత్యాగమును, మార్గదర్శకముగా జేసినాఁడు. ఆత్మరూపబ్రహ్మస్థితిప్రాప్తికిని, అహంకారాదిమిథ్యాదృశ్యపరిత్యాగము కర్తవ్యమను సూచన అంతర్గర్భితము.

"అన్య దేవ త ద్విదితా దథో ఽవిదితాదధి"-కేన ఉ. 3.

ఆపరబ్రహ్మము తెలియఁబడినదానికంటె వేరైనది. అది తెలియఁబడక మిగిలినజ్ఞేయపదార్థములకంటెను గూడ వేరైనది. అనగా నది శ్రవణమనననిదిధ్యాసలచే తప్ప సాధారణమనస్సుచేమాటలచే తెలియఁబడునదికాదు. అని శ్రుతితాత్పర్యము. "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" తై ఇ.౹. మనస్సుతోఁగూడ కలిసి వాక్కు లాయనను తెలిసికొని చెప్పఁగోరి ఆయనను పొందలేక (తెలిసికొనలేక) తిరిగి వచ్చినవి. ఆయన వర్ణనల కందని వాఁడు. ఇట్టివాఁడని స్పష్టముగా మాటలతో చెప్ప వీలులేని వాఁడు. సంపూర్ణముగా ఆయనను చెప్పఁగల్గి, గ్రహింపఁచేయఁగల్గిన, ఆయన జ్ఞేయుఁడు, విషయము అగును. అందువలన తెలిసికొనుజ్ఞాతకన్న, (ఆత్మకన్న) భిన్నుఁడై అనాత్మ, పరిచ్ఛిన్నుఁడు అగును. ఇట్లగుట శ్రుతిస్మృతులు చెప్పినదానికి విరుద్ధము. అందువలన ఆయన ఇదికాదు, ఇదికాదు, (నేతి నేతి) అని నిషేధపూర్వకముగనే తెలియఁబడునే కాని ఇతరవిధముగా ఇది 'ఇట్లు' అని తెలియఁబడఁజాలఁడు. ఏప్రక్రియయందును, కర్త యెప్పుడును కర్మము కాదు.

మనుష్యుఁడు లౌకికసర్వవస్తువులను, వినువారికిఁ దెలియ జేయుటకు, శబ్దములను వాడును. ఆశబ్దములు జాతిగుణక్రియాసంబంధము లనునాల్గులక్షణములలో నేదొకటైన గలవియే. ఉదాహరణమునకు - ఆవు నరుఁడు మొదలైనవి. ఆవు, నరుఁడు (వస్తువు) జాతి విశేషములను తెలియఁజేయును. చెప్పుచున్నాఁడు, వినుచున్నాఁడు మొదలగునవి వాఁడు చేయు పని విధములను తెలియజేయును. తెల్ల(ది), ఎఱ్ఱ(ది) సాత్త్వికుఁడు మొదలగునవి వాని గుణభేదములను దెల్పును. ధనముగలవాఁడు (ధని), తెలివిగలవాఁడు (బుద్ధిమంతుఁడు) అనువానిలో ధనమునకు, తెలివికిని,

హానికాశ్రయమైన నరునకుఁగల సంబంధవిశేషములను దెల్పును. ఈమాటలను ప్రయోగించిన మాత్రమున వినువారికి అర్థమగుచున్నవి. కాని ఈ లక్షణములు లేని వస్తువులను మాటలద్వారమున చెప్ప వీలులేదు బ్రహ్మమునకు ఈనాలురకముల శబ్దప్రవృత్తి హేతువులగుజాతి గుణ క్రియాసంబంధము లేవియును లేవు. పైగా అదిఏకమై సర్వజగద్విలక్షణమై ఆత్మస్వరూప మైనందు వలనను బ్రహ్మము వాక్కునకు మనస్సునకు అందనిదని శ్రుత్యాదులందు చెప్పఁబడినది. ఇది తర్కసహము.

భగవద్గీత లందు 13 వ అధ్యాయములో 12 వ శ్లోకబోధ.

"అనాదిమత్ పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే"

ఈపరబ్రహ్మము, మొదలులేనిది, సత్తుగాదు, అసత్తుగాదు అని చెప్పఁబడుచున్నది అని సాధారణముగా బుద్ధిగ్రాహ్యములగు ఆది, సత్తు, అసత్తు అనెడుభావములు కానిదని నిషేధపూర్వకముగనే శ్రీకృష్ణభగవానుఁడు నిర్ణయించెను.

అవ : అట్లగుచో ఈశాస్త్రము అనర్థములగునా ? యనుసందేహమును బాపుటకై ఆపరమాత్మ సంపూర్ణముగా అగోచరుఁడు కాఁడని చెప్పుచున్నారు.

**యద్యప్యేవం విదితం, తథాఽపి పరిభాషితో భవే దేవ!**
**అధ్యాత్మశాస్త్రసారై ర్హరిచింతనకీర్తనాభ్యాసైః ॥ 3**

ప్ర : ఏవం = ఈవిధముగా, వెవఁడును అయనను (పరమాత్మరూపపరబ్రహ్మము) వర్ణింపలేరని, విదితంయదిఅపి = తెలిసి నప్పటికికూడ, తథాఽపి = అట్లు వాక్యము లున్నను, అధ్యాత్మశాస్త్రసారైః = బ్రహ్మైక్యబోధను శాసించునట్టి యుపనిషద్వాక్యసారపర్యవసానరూపము లైనట్టి వాక్యములచేతను, హరి

చింతనకీర్తనాభ్యాసైః = శ్రీవిష్ణుతత్త్వస్వరూపస్వభావక్రియాకలాపాదుల ధ్యానాభ్యాసములచేతను, [సః = ఆపరమాత్మ] పరిభాషితః ఏవభవేత్ = చక్కగా చెప్పబడినవాఁడే (వర్ణింపఁబడినవాఁడే) కాఁగలఁడు.

తా॥ నిజముగా ఆయన ఇట్టివాఁడని శ్రుత్యాదులే చెప్పలేకపోయినను, అధ్యాత్మశాస్త్రము బాగుగా నెఱిఁగినవారు, నిరంతరము విష్ణువును, పరమాత్మను గుఱించి ఆలోచించుట, ధ్యానించుట, ఆయనను పొగడుట పలుమార్లు చేసినవారు ఆయనను తాము తెలిసికొని ఇతరులకు తెలియునట్లు చెప్పఁగలవారగుచున్నారు. అట్టి సమ్యగ్జ్ఞానసిద్ధికిఁ బైచెప్పిన శ్రీవిష్ణుచింతనాదులుత్తమసాధనములుసుమా. బ్రహ్మాత్మైక్యమును బోధించు అధ్యాత్మశాస్త్రములును ఉత్తమసాధనములును, ఉపనిషత్తులును, భారతము మొదలగు నితిహాసములును, భాగవతాదిపురాణములును అగుచున్నవి. ఆత్మపదార్థమగు పరబ్రహ్మము బొత్తిగా తెలియుటకు వీలులేనిదగుచో ఈగ్రంథముల లాభమేమున్నది? మోక్షమెట్లు వచ్చును? కావున ఆపరమాత్మ పూర్తిగా అగోచరుఁడు కాఁడు.

"జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వ
స్తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః" ॥

ముం. 3-1-8

"శాస్త్రాచార్యులవలన గల్గిన (సరియైన) నిర్మలమైన యాత్మజ్ఞానప్రభావముచేత, రాగాదిదోషము లన్నింటిని బోగొట్టుకొన్న నిర్మలచిత్తముగలవాఁడై ఆపిమ్మట, ఆపరమాత్మను ధ్యానించుచున్నవాఁడై నిరవయవమై ఏకరూపమైన పరబ్రహ్మమును తానే యని సాక్షాత్కరించుకొనుచున్నాఁడు" అని ముండకోపనిషత్తు బోధ. సంస్కృతమై పరిశుద్ధమైన మనస్సుగల అధికారిచేత నిధిధ్యాసనరూపానుభవముతో తానైన యాపరమాత్మ తెలిసికొనఁ

బడఁగలఁడని స్పష్టముగా చెప్పుచున్నది. కావున ఆయనను తెలిసికొనుట పూర్తిగా అసాధ్య మనుకొనరాదు. తెలిసిన వెంటనే ఆత్యంతికదుఃఖనాశనము, అభయము, సంశయములు తొలఁగుట, ఆనందము, సర్వబంధవినిర్ముక్తిని పొందుటయుఁ గలిగిన వని కూడ చూడఁగలఁడు.

కాని ఆయనను తెలిసికొనుటకు అట్టిసమ్యగ్జ్ఞానము సంపాదించి తరించిన విష్ణుచింతనశీలురైన మహాత్ములే ఆశ్రయింపఁదగినవారని ఆచార్యులవారు సూచించుచున్నారు.

కావున ఆశ్రీకృష్ణపరబ్రహ్మప్రబోధముగా సంప్రదాయానుసారముగా, ఆయుపనిషదర్థానుసారముగా ఈమోక్షప్రయోజన ప్రబోధసుధాకరగ్రంథమందు, శ్రీశంకరాచార్యకవీశ్వరుండు తన దివ్యవాగమృతప్రసారమును ముముక్షులోకసంగ్రహార్థము చేయుచున్నాఁడు.

అవ : ముక్తికి ముఖ్యాధికారమును చెప్పుచున్నారు.

**క్లిష్టైర్బహుభి రుపాయై రభ్యాసజ్ఞాన భక్త్యాద్యైః।**
**పుంసో వినా విరాగం ముక్తే రధికారితా న స్యాత్॥ 4**

ప్ర : క్లిష్టైః=కొంతసమర్థముగాఁ జేయబడినవైన, అభ్యాసజ్ఞానభక్త్యాద్యైః= వేదాభ్యాసము దానియర్థజ్ఞానము, పరమేశ్వరునియందు భక్తి పూనుట మొదలగు, బహుభిః ఉపాయైః=అనేకములగు ఉపాయములచేత, ఎంత ప్రయత్నించినను, పుంసాం=పురుషులకు, విరాగంవినా=వైరాగ్యము లేకుండ, ముక్తేః= మోక్షమునకు, అధికారితా=అధికారము, అనఁగా యోగ్యత, న స్యాత్ = కలుగదు.

తా॥ మనుష్యుఁడు ఎన్నిశాస్త్రములు చదివినను, దానియర్థము తెలిసికొన్నను, పరమేశ్వరుని పొగడినను, ఆయనయాజ్ఞలైన కర్మ

ములు చేసినను, యోగము మొదలైనఉపాయము లెన్నియవలంబించినను, ప్రపంచవిషయములందు రాగము (కోర్కె) పోనిచో అతనికి మోక్షమునకు అధికార మను యోగ్యత కల్గదు.

ప్రపంచవిషయ సుఖములకు స్త్రీభోగాదుల యందు విముఖుఁడైనవానికి ఇతర మేది రుచించును? ధనకనకవస్తువాహనపుత్రపుత్రీభార్యాదులవలని సుఖములు శాశ్వతములు కావని, యెప్పటికైన నశించు నవని తెలిసికొనినవాఁడు నిత్యమైన ఆనందమునే పొందవలె నని కోరినవాఁడు మాత్రమే మోక్షమునకు యత్నించును. అప్పుడు వాఁడీ లోకమందును పరలోకమందును బాహ్యవిషయసుఖములను రోసి వానికొఱకు ప్రయత్నములను మాని, నిత్యసుఖముకొఱకు చిత్తశుద్ధితో ప్రయత్నము చేయఁబూనును.

కావున ముక్తిని గోరువాఁడు ఏది నిత్యమో యేది అనిత్యమో గ్రహింపవలెను. అనిత్యసుఖమును, దానికై ప్రయత్నమును వదలి, అనఁగా ఇహలోకభోగములందభిరుచినివదలి, వైరాగ్యము పూని, ముక్తిసాధనములను వెదుకవలెను. ఈలోక సుఖములవలెనే స్వర్గాదిసుఖములుకూడ అనిత్యము లని, వాని యనుభవము పిదప మరల నీలోకములో పుట్టుక తప్పదని యీ సంసారము మానదని గ్రహించి వానియందు కూడ వైరాగ్యము బూనవలెను.

బ్రహ్మవిచారణమున కధికారికి వలసిన నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్రార్థఫలవిరాగము, ముముక్షుత్వము ఇందు సూచింపఁబడిన వనవచ్చును.

అవ : ప్రపంధరచనవిషయవిభాగసూచనరూపమైన ప్రతిజ్ఞను వివరించుచున్నారు. స్థూలముగా మొదటి 6 ప్రకరణములు వైరాగ్యవిషయ విశేషాంశములు ప్రధానములుగను, 7 నుండి 15 వఱకుఁగల 9 ప్రకరణములు ఆత్మబోధవిశేషాంశములు ప్రధానములుగను 16 నుండి 19 వఱకు గల నాల్గుప్రకరణములు భక్తి విశేషాంశబోధకప్రధానములుగను చాతుర్యముతోఁగవిముక్తికిసాక్షాన్మోక్షహేతువు వైరాగ్యాత్మబోధభక్తిసముదాయముయొక్క పరిపూర్ణసమగ్రత యని నిరూపణము చేయుచున్నాఁడు.

వైరాగ్య మాత్మబోధో భక్తి శ్చేతి త్రయం గదితమ్।
ముక్తేః సాధన మాదౌ తత్ర విరాగో వితృష్ణతా
ప్రోక్తా ॥ 5

ప్ర : వైరాగ్యం=[తాను కోరిన మోక్షమునకు ప్రతిబంధకములగు విషయభోగ సాధనము లన్నిఁటియందు కోర్కె, లేదా ప్రీతి, లేకుండుట, ఆత్మబోధః= ఆత్మను అనఁగా తన్ను తెలిసికొనుటకు చెప్పినసాధనము లవలంబించి పరిశుద్ధాత్మను తెలిసికొనుటకు యోగ్యత సంపాదించి, భక్తితో శ్రద్ధతో తనకు తన్ను గుఱించి చెప్పఁగల బ్రహ్మజ్ఞుఁడగు గురువు నాశ్రయించి, వారి యనుగ్రహమునఁ దాను బ్రహ్మమునని నిశ్చయముగా తెలిసికొనుట, భక్తిః=భజించుట, (సేవించుట, లక్ష్యమందే పూర్తిగా మనస్సును నిల్పుట,) సద్గురుభక్తి। ఈశ్వరభక్తివలన తెలిసిన ఆత్మస్వరూపము నందు చిత్తమును నిల్పుట, ముక్తేః= ముక్తికి, త్రయం=వేర్వేఱుగా స్వతంత్రముగాఁగాక, మూడుఉపాయములసముదాయము, సాధనం=కారణముగా, గదితం=చెప్పఁబడినది. తత్ర=[అక్కడ] ఆనిషయములయందు, ఆదౌ=మొదటిదిగా, విరాగః=విషయసుఖములందు రాగము [కోర్కె, ప్రీతి] లేకుండుట యనెడి, వితృష్ణతా = విషయభోగములందు కామము (ఆశ)లేకుండుట, ప్రోక్తా = చెప్పఁబడినది.

తా : మోక్షమునకు సాక్షాత్ సాధనముగా శ్రీశంకరులు, వైరాగ్యమును, ఆత్మను తెలిసికొనుటయును, భక్తియు ననుమూఁడింటి సముదాయమునే ముక్తికి సాధనముగాఁ జెప్పిరి. ముక్తికి మూఁడును వేర్వేఱుగా స్వతంత్రోపాయములుగాఁ జెప్పుటలేదు.

'ఇతి' అనుశబ్దము వెనుకఁ జెప్పఁబడిన వైరాగ్యము ఆత్మ బోధ, భక్తి, అనుమూటిని బరామర్శించుచున్నది. త్రయ మనఁగా మూఁడవయవములు గలది. త్ర్యవయవి. పరస్పర సాపేక్ష ములకే అనఁగా నొకదానిపై మఱొకటి యాధారపడి ఒకదాని నొకట వృద్ధిచేసికొనుస్వభావము గలవానినే సముదాయ మనుట ఆర్యుల పద్ధతి. ఇక్కడ బాహ్యవిషయములగు స్రక్చందనవనితాది విషయములందు (తృష్ణ) ఆశయే రాగము. దానివలన వానికై ప్రయత్నము సాగుచున్నది. విగతమైన (తృష్ణ) అనఁగా విష యములందలి తృష్ణ చిత్తమును విడిచి దూరముగాఁ బోవుటయే వితృష్ణయగు విరాగము. ఇట్టి విరాగముయొక్క భావమే వైరా గ్యము. ఇది బాహ్యవిషయతృష్ణాసేవల నివృత్తి యని పిండి తార్థము. ఈవైరాగ్యస్థితి గలవానికి ఆత్మబోధ సుకర మగును.

"ఇంద్రియార్థేషు వైరాగ్యం, జ్ఞానమ్" భగ. 3 లో 8, 11 దృష్టాదృష్టశబ్దాదిభోగవిషయములందు విరాగభావము (వైరా గ్యము) ఆత్మజ్ఞాన హేతు వని శ్రీకృష్ణునిగీతావచనము.

ఇట్లు వైరాగ్యము ఆత్మబోధకుసహకారి, పోషకమునగును. ఆత్మబోధ యెంతెంత వృద్ధియై గట్టిపడిన కొలఁది యంతంతగా వైరాగ్యమును వృద్ధియై గట్టిపడును. ఇట్లివి పరస్పర హేతుకము లును పోషకములు నగుచున్నవి.

ఇట్లే ఆత్మబోధ పరోక్షరూపమునఁగాని అపరోక్షరూప మునఁగాని యున్నప్పుడు సర్వజ్ఞుఁడు జగద్గురుఁడు, ఆత్మజ్ఞాన ప్రదాతయునగు శ్రీపరమేశ్వరునియందు భక్తియు, ఆత్మనిష్ఠా రూపస్వస్వరూపానుసంధానభక్తియు వృద్ధిఁబొంది పూర్వోక్త వైరాగ్యాత్మబోధభక్తిత్రయము పరిపుష్ట మగును. ఇట్టివైరా

గ్యాత్మబోధభక్తిరూపత్ర్యవయవసముదాయము (ఇవి పరస్పర సాపేక్షములు) ఒకదానికొకటి పరిపోషకము. ఈగుణ పరిపక్వమై, బ్రహ్మాత్మైక్యరూపముక్తికి, అసాధారణరూపసాధన మగు నని తాత్పర్యము. వేఱొండుసాధనమువలనగాని, సాధనములవలనగాని గల్గుముక్తి, భేదరూపమై భ్రాంతిసిద్ధమైనదే యగు నని యుపనిషదర్థవిదులసంప్రదాయరహస్యము. అంతేకాని ఈవైరాగ్యము, ఆత్మబోధయు, భక్తియు వేఱువేఱుగా దేని కది బ్రహ్మసాక్షాత్కారమునకు స్వతంత్రసాధనము లనరాదు. అందులకే త్రయమని సాధనమని మూలశ్లోకములో ఏకవచనప్రయోగము "త్రీణి సాధనాని" అని బహువచనశబ్దములు ప్రయుక్తములు కాలేదు.

శ్రీశంకరులు వివేకచూడామణిలో భక్తిని గుఱించి చెప్పుచు

శ్లో॥ మోక్షకారణసామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ
స్వస్వరూపానుసంధానం భక్తి రి త్యభిధీయతే॥ 32
స్వాత్మ తత్త్వానుసంధానం భక్తి రి త్యపరే జగుః" 33

మోక్షమునకు గలసాధనసమూహములో అసాధారణముఖ్యసాధనము భక్తి యనియు అభక్తి యనఁగా నిష్క్రియాద్వితీయానందపరబ్రహ్మమగు తన స్వరూపమునందు మనస్సుయొక్క నిర్వికల్పకసమాధివృత్తి యన్నారు.

అల్పజ్ఞుఁడు, కర్మాధీనుఁడు, కర్తృభోక్తృరూపసంసారియునగుజీవునకును, మాయాధీశ్వరుఁడు, సర్వేశ్వరుఁడు, సర్వజ్ఞుఁడు, సర్వస్వతంత్రుఁడు, నసంసారియు నగు ఈశ్వరునకును, వాస్తవముగా హస్తిమశకాంతరము గలదు. "తత్త్వమసి" (అది నీవుగా, నీవదిగా నున్నావు) మహావాక్యములో "త్వం" "తత్" పదములకు వాచ్యార్థము లివి. ఇట్టి భిన్నస్వరూపస్వభావలక్షణములుగల

జీవేశ్వరులను అహంగ్రహోపాసనపేరిట ఏకముగా భావించుట భక్తి యని యితరులమతము. ఇది భేదబుద్ధిపురస్సరమైన భ్రాంతి కల్పితగౌణభక్తిమాత్రమే. ఆత్మార్థభావనానిరంతర ప్రవాహరూపమనోవృత్తి, యథార్థభక్తికి ముఖ్యార్థ మని శ్రీశంకరభగవత్పాదులు ఉపనిషత్సమ్మతముగా వివేకచూడామణిలో విశదీకరించిరి.

భగవద్గీతలందు :-

''వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥ గీ 18-52

ఏకాంతమం దుండి లఘువుగా భుజించుచు, త్రికరణములగు మనస్సును వాక్కును శరీరమును నియమించి, నిగ్రహించి జ్ఞాననిష్ఠుండైన యతి ఉపరతసర్వేంద్రియుఁడై, ఆత్మస్వరూప చింతన ధ్యానము అనగా, ఆత్మస్వరూప మందే ఏకాగ్రీకరణరూపయోగమే పరముగా జేయఁదగినది. మంత్రజపాదులగు నితర కర్తవ్యము లతనికి లేవని నిత్యపదార్థముయొక్క సూచన. ఈ ధ్యానయోగపరుఁడు, నిత్యము దృష్టాదృష్ట విషయములందు స్థిరమైన వైరాగ్యము గలవాఁడు. వీనిది పరాభక్తి. జ్ఞాననిష్ఠయందును వైరాగ్యాధిక్యమును నిది నొక్కి చెప్పుచున్నది.

వీనిని గుఱించి పంచదశి చిత్రదీపప్రకరణములో శ్రీవిద్యారణ్యస్వామివారిప్రమాణవాక్యములు.

శ్లో॥ వైరాగ్యబోధోపరమాః సహాయాస్తే పరస్పరమ్ ।
ప్రాయేణసహవర్తన్తే వియుజ్యన్తేక్వచిత్క్వచిత్ ॥6-276

వైరాగ్యము, బోధ (జ్ఞానము), ఉపరమము (కర్మశాంతి రూప 6-276 సన్న్యాసము) ఇవి ఒకదాని కొకటి సహాయకములును

పరిపోషకములును. తఱచుగా నివికలిసి యుండును. కాని చాల అరుదుగాఁ గలియకయు (ఒండొండులోఁపించియు) నుండ వచ్చును.

అవ : పై శ్లోకములో వైరాగ్యము మొదటి దని చెప్పఁబడినది. మనకు దేని యందు రాగ మున్నదో ధానియందు వైరాగ్యము కల్గవలెను. అందువలన మనకు ముందు రాగ మెందున్నదో తెలియవలెను. అది ఇక్కడ తెల్పుచున్నారు.

సా చాహంమమతాభ్యాం ప్రచ్ఛన్నా సర్వదేహేషు ।
తత్రాహన్తా దేహే మమతా భార్యాదివిషయేషు॥ 6

ప్ర : చ= మఱియు, సర్వదేహేషు= సమస్తదేహములందు సా= ఆయ తృష్ణ. విరాగము. అహంమమతాభ్యాం= నేను. నాది యను రెండుభావరూప ములచేత, ప్రచ్ఛన్నా= కప్పఁబడినది, (కనఁబడకుండ, తెలియఁబడకుండ, అస్తి=ఉన్నది) తత్ర= ఆరెంటివిషయమందు, దేహే= శరీరమునందు. అహన్తా= అహంజ్ఞానము, నేనుఅను అభిమాన భావము (ఉన్నది) భార్యా దివిషయేషు= (భార్య మొదలైన బాహ్య విషయములందు.) భార్య పుత్రులు ధనధాన్యములు. గృహము మొదలైన వెలుపలివానియందు మమతా= నాది అను అభిమాన భావము (ఉన్నది)

తా : దహింపఁబడునది దేహము. జీర్ణమగునది శరీరము అని వ్యుత్పత్త్యర్థములు. ఆయతృష్ణారూపమైన దే వైరాగ్యము. నేను, నాది యను రెండు అభిమానరూప భావములచే కప్పఁబడినది. ఇది సర్వ దేహములందు సామాన్యమే. సహజమైన వైరాగ్యము మనకు కనఁబడకుండ అహంమమతలచే ప్రచ్ఛన్నముగా (తెలియఁబడ కుండ దాఁగి) ఉన్నది. సర్వదేహములందు 'నేను, నాది,' అను రెండుభావరూపములు తెలియఁబడుచు అనుభవింపఁబడుచున్నవి నేను, అనుబుద్ధి దేహమునం దున్నది. నాది యనుభావము, దేహ సంబంధముతో వచ్చి, దేహముకన్న వేఱుగా నున్న భార్యాపుత్రా

ములందును ధనధాన్యాదులందు నున్నది. ఇవన్నియు నావి అని యనుకొనుటయే. వీనియందలియనురాగము.

'సర్వదేహములందు'- అన్నమాటకు నేను అనాదినుండి ధరించుచు వచ్చినట్టి సర్వదేహములందు (వివిధజన్మములలో) నన వచ్చును. లేక, సర్వజనులకు వారివారి దేహములందు ననవచ్చును. పైగా, ఈదేహమునందు నేను, అనువ్యవహార మెల్లవేళలకలదు. కొందరుమాత్రము నాదియన్నట్లు నాదేహము అనువ్యవహారము కూడ దానిపూర్తియర్థమును గ్రహింపకుండ వాడుచునే యున్నారు. ధనధాన్యాదులు, సొమ్ములు, భార్య, కొడుకు కూతురు వారినుండి వచ్చినతక్కిన బంధుత్వములు వీనియన్నిటి యందు నాది, నావి (మమత) యనుభావ మున్నది. ఇదియు అనాది సిద్ధము.

అవ : దేహము దారాదుల నాశ్రయించియే యీ అహంతామమత లున్నవి. ఇవి నివర్తించుట యెట్లు?

**దేహః కిమాత్మకో ఽయం కః సంబంధో ఽస్య వా విషయైః।**
**ఏవం విచార్యమాణే ఽహన్తా మమతే నివర్తేతే॥ 7**

ప్ర : అయం దేహః = ఈదేహము, కిమాత్మకః = ఏమిస్వరూపము, స్వభావము కలది? లేక దీని కాత్మ యేది? అస్య = దీనికి, విషయైః = విషయములతో (దారాపుత్రాదులతో), సంబంధః కఃవా = సంబంధ మెటువంటిది? ఏవం = ఈవిధముగా, విచార్యమాణే = విచారణచేయఁబడిన దగుచుండఁగా, అహంతా మమతే = ఈనేను, నాది, యనుటలురెండును నివర్తేతే = మఱలిపోవుచున్నవి. (నివర్తించుచున్నవి)

తా : ఈదేహ మనఁగా నేమిటి? దీనిస్వరూపస్వభావము లేవి- ఆత్మ ఏది? దీనికి దారాపుత్రాదివిషయములతోఁ గలసంబంధ

మేమిటి? అని యిట్లు చక్కగా విచారణ చేయఁగా, ఈ 'నేను. నాది' యను రెండు ఆచ్ఛాదకభావములును దొలఁగిపోవుచున్నవి. అప్పుడు సహజవైరాగ్యము ప్రకాశించి బలము గల దగు నని భావము

అవ : శరీర మెట్లు కల్గుచున్నదో చెప్పుచున్నారు.

స్త్రీపుంసోః సంయోగా త్సంపాతే శుక్రశోణితయోః।
ప్రవిశ జ్జీవః శనకైః స్వకర్మణా దేహ మాదత్తే॥ 8

ప్ర : స్త్రీపుంసోః = స్త్రీపురుషులయొక్క, సంయోగాత్ = కలియుటవలన (కలిగిన) శుక్రశోణితయోః = పురుషవీర్యభాగస్త్రీరక్తభాగములయొక్క సంపాతే= సమ్మేళనమందు, జీవః= కర్తయు భోక్తయునగు జీవుఁడు, ప్రవిశన్ =ప్రవేశించుచున్నవాఁడై, శనకైః = నెమ్మదిగా, స్వకర్మణా = తనపూర్వకర్మము ననుసరించి (పరమేశ్వరునిచే విధింపఁబడిన) దేహం=శరీరమును, ఆదత్తే= తీసికొనును.

తా : స్త్రీపురుషులు కలిసినప్పుడు సంభోగానమందు పురుషవీర్యము స్త్రీయోనియందు పడి అది స్త్రీగర్భకోశమందలి రక్తముతో కలియును. అచట గర్భమేర్పడును. ఇట్లు జీవుఁడు. తన పూర్వకర్మము ననుసరించి అచట పుట్టవలయునని ఈశ్వరునిచే విధింపఁబడినవాఁడై ఆగర్భమందు చేరి ఆశరీరమును పొందును.

అవ : వైరాగ్యము కల్గుటకొఱకు జీవుఁ డచట మాతృగర్భమం దనుభవించు ఏహ్యస్థితిని వర్ణించుచున్నారు.

మాతృగురూదరదర్యాంకఫమూత్రపురీషపూర్ణాయామ్।
జఠరాగ్నిజ్వాలాభి ర్నవమాసం పచ్యతే జన్తుః॥ 9

ప్ర : కఫమూత్రపురీషపూర్ణాయాం= శ్లేష్మము, మూత్రము (ఉచ్చ) మలములతో నిండినదగు మాతృగురూదరదర్యాం= తల్లియొక్క గొప్పదైన

గర్భగుహాయందు, జన్తుః = శరీరమందున్న జీవుఁడు, జఠరాగ్నిజ్వాలాభిః = కడుపులోనిఅగ్నియొక్క మంటలచేత, నవమాసం = తొమ్మిదినెలలవరకు, పచ్యతే (ఉడుకపెట్టబడుచుండును) క్రాగుచుండును. ఎంతబాధ!

తా : ఆదేహములో ప్రవేశించిన జీవుఁడు తొమ్మిదినెలల వఱకు జఠరములోనిఅగ్నిలో కాగిబాధపడుచుండును. గర్భములో వెలువడుమూత్రము, మలము, అచట చేరినశ్లేష్మము (నోటనుండి వెళ్ళఁగ్రక్కఁబడినతెమడ (కల్లె) వంటిది,) ఇట్టి అసహ్యకరము లైన ఈమూత్రమలములమధ్య ఆజీవుఁడుపొరలుచు బాధపడుచు నికృష్టమైన స్థితిని పొందును. ఇట్లు తొమ్మిదినెలలు సాగును. దీనిని శాస్త్రములు గర్భనరక మనియుఁ జెప్పినవి.

గర్భములో జీవునిస్థితి మిక్కిలి అసహ్యించుకొనవలసిన స్థితిలో నుండు ననియు, దానివలన జీవుఁడు జన్మించినప్పు డెల్ల ఇటువంటి కశ్మలమైన జీవితము తొమ్మిదినెలలు గడపవలసి యుండు ననియు నందువలన బుద్ధిమంతుఁడైన మానవుఁడు ఈనరకమునుండి విడి వడి జన్మరాహిత్యమునకై యత్నింపవలె ననియుఁ దాత్పర్యము.

అవ : వైరాగ్యముకొఱకు ప్రసూతిముందు నరకబాధలను వర్ణించి, ఇప్పుడు గర్భమునుండి వెలువడునపుడును అనేక బాధలు, ఆపదలు కల వనిచెప్పు చున్నారు.

**దైవాత్ప్రసూతిసమయే శిశు స్తిరశ్చీనతాం యదా యాతి।**
**శస్త్రై ర్విఖండ్య స తదా బహి రిహనిష్కాస్యతే ఽతి**
**బలాత్ ॥ 10**

ప్ర : శిశుః = శిశువు (పసివాఁడు) దైవాత్ = పూర్వజన్మకర్మఫలప్రాతి కూల్యమువలన, తాను వెనుక చేసినదురదృష్టకర్మములవలన, ప్రసూతిసమయే = (తల్లి) ప్రసవించుకాలమందు, యదా = ఎప్పుడు, తిరశ్చీనతాం = అడ్డముగా తిరుగుటను, యాతి = పొందునో తదా = అప్పుడు సః = ఆశిశువు, అతిబలాత్ =

మిక్కిలిబలవంతముగా (సహజముగా తేలికగా కాన్పు కానప్పుడు) శస్త్రైః శస్త్రములచేత (వైద్యులు మంత్రసానులు నుపయోగించు పదునుగలకత్తులు మొదలగు వానిచేత) విఖండ్య= వికృతముగా ఖండింపఁబడి, ఇహ= ఇక్కడ బహిః= వెలుపలిప్రపంచములోనికి విష్కాస్యతే= తీయఁబడును (వెలువరింపఁబడును.)

తా : తల్లి తొమ్మిదినెలపిదప ప్రసవించు నప్పుడుకూడ బిడ్డకు బాధలు తప్పవు. శిశువు గర్భస్థితిలో తల పైకుండును. సహజప్రసవములో నది యడ్డముగా తిరిగి పిదప తల క్రిందికి వచ్చి బైటికి రావలెను ఇది జన్మించుట. తనపూర్వకర్మమువలన ఒక్కొక్కప్పుడు శిశువు గర్భములో నడ్డము తిరిగి తల క్రిందికి మారు నప్పుడు, వైద్యులు బలవంతముగాఁ గత్తులు, కత్తెరల నుపయోగించి శిశువును పూర్తిగా ఖండించి మృతశిశువునుగాని (తల్లిప్రాణమును రక్షించుటకొఱకు -శిశువుప్రాణముకన్న తల్లిప్రాణము ముఖ్యము గనుక) లేక కొంత ఖండించి వికృతరూపమునఁగాని శిశువును బయటికి లాగవలసి వచ్చును. అప్పు డతఁడు యావజ్జీవము వికృతాకృతితో నంగహీనుఁడుగా జీవింపవలసివచ్చును.

శిశువు ప్రాణముకన్నఁ దల్లిప్రాణ మెందుకు ముఖ్య మనఁగా శిశువు పెరిఁగి పెద్దయగుట కనేకములగు ఆదివ్యాధులఁ దట్టుకొనవలసి యుండును. గండములు గడువవలసి యుండును. అందువలన నది బ్రదికి బట్టగట్టుట సందేహము. తల్లి పెద్దప్రాణము గనుక, అవన్నియుఁ దట్టుకొని, గడచి జీవించినది గనుక జీవించుట కెక్కువ యవకాశ ముండును. పైగా నామె జీవించియున్న యెడల నట్టి శిశువుల నింకను జాలమందిని కనగల్గి యుండవచ్చును. అందువలన నామె ప్రాణమును రక్షించుటకే వైద్యులు ప్రయత్నింతురు. యజమానునికిఁగూడ శిశువుకన్న భార్యయే యెక్కువ ప్రియురాలు.

ఇప్పుడు తల్లి కనుటకు పెక్కుకష్టములు కలిగి, ఆమెను రక్షించుటకు గూడ (సిజేరియో అను) ఆపరేషనులు చేయవలసి వచ్చుచున్నవి. అప్పుడు తల్లితోపాటు శిశువునకుఁగూడ [బ్రతికినను] కొంతబాధ కలుగవచ్చును.

అవ : ప్రసూతిసమయబాధల నింకను చెప్పుచున్నారు.

**అథవా యన్త్రనిష్పీడనాద్వా తు నిఃసార్యతే ప్రబలైః ।**
**ప్రసవసమీరైశ్చ తదా యః క్లేశః సోఽ ప్యనిర్వాచ్యః ॥ 11**

ప్ర : అథవా = కానిచో, (ఒకవేళ) యన్త్రనిష్పీడనాత్ తు = ఆయోనిరంధ్రమునుండియే, ప్రబలైః = బలవంతములైన, ప్రసవసమీరైః చ = ప్రసవించు సమయములో వచ్చు (వివిధములైన) వాతరోగములచేతను (ధనుర్వాతమును, గుర్రపువాతము మొదలైన వప్పుడు సాధారణముగఁ గొందఱను బాధించును) యదా = ఎప్పుడు (ఆశిశువు) నిఃసార్యతే = వెడలింపఁబడి బయటికి వచ్చునో. తదా = అప్పుడు, యఃక్లేశః = ఏబాధను (ఆశిశువు పొందునో) సః అపి = ఆబాధ కూడ అనిర్వాచ్యః = వర్ణించుటకు వీలుకానిది.

తా : పైనఁజెప్పినబాధలు కాక ప్రసవసమయములో స్త్రీలను అనేకవిధములైన వాతరోగములు ధనుర్వాతము, గుర్రపువాతము మొదలైనవి బాధించును. వానివలన వారు బిగిసికొనిపోవుట, వంగుట, యెగురుట, పండ్లు గట్టిగా కఱచుకొని నాలుకను కొఱికివేయుట మొదలైనవి వచ్చి బ్రతుకుటకూడ దుర్లభమగును. అట్టిసమయములో శిశువు బ్రతుకుట, బ్రతికినను అదిపడు బాధ ఇట్టిదని వర్ణించుటకే వీలులేనిదిగా నుండును. జీవించుటే సంశయ మగును.

అనఁగా జీవుఁడు శరీరమును ధరించునప్పుడు సైతము అనేక వికృతములు దుస్సహములు నగు బాధలు పడవలసివచ్చును. కావున ప్రతిజన్మమందును పుట్టుటలో చచ్చుటలోకూడ అనేక బాధలు వచ్చు నని గ్రహించి అతఁ డీజన్మమరణరూపసంసారము నుండి బయటపడుటకు యత్నింపవలెను. అదియే వివేకము.

అవ : పుట్టుకకుపూర్వము పుట్టుకలోను గల్గుబాధలగాధలు చెప్పి యిప్పుడు పుట్టినతరువాత వచ్చుక్లేశములు వర్ణించుచున్నారు.

**ఆధివ్యాధివియోగాత్మీయవిపత్కలహదీర్ఘదారిద్ర్యైః।**
**జన్మానంతర మపి, యః క్లేశః కిం స శక్యతే వక్తుమ్॥12**

ప్ర : జన్మానంతరమ్అపి = పుట్టినతరువాతకూడ, ఆధి - ద్ర్యైః ఆధి = మనస్సునకు కల్గుబాధ, వ్యాధి = శరీరమునకు కల్గురోగము, వియోగ = సన్నిహితులనుండియెడఁబాటు, తల్లిదండ్రులమరణములు మొదలైనవి, ఆత్మీయ విపత్ = తనకు స్వయముగా వచ్చు ఆపదలు, (పడుట, కాలు మొదలైనవి విరుగుట వంటివి,) కలహ = ఇతరులతో పోట్లాటలు, దీర్ఘదారిద్ర్యైః = పెద్ద కాలము ధనములేమి, (పేదఱికము) వీనియన్నిఁటిచేత, యఃక్లేశః = ఏబాధగలదో (ఆజీవుఁడు పొందునట్టివి) సః = అది, వక్తుమ్ = చెప్పుటకు, శక్యతేకిమ్? = సాధ్య మగునా? కాదని భావము.

తా : పుట్టుటకుముందు పుట్టుటలోగల బాధలే కాదు. పుట్టినపిదప అంతకుమించినవి, వర్ణించుటకు చెప్పుటకు వీలులేనివి అనేకవిధములైన కష్టములు వచ్చును. బాధలు కల్గును. పురిటిలో సంధి. శరీరమునకు సంబంధించినబాధలు, కడుపునొప్పి మొదలైనవి, శిశువుగా నున్నప్పుడు చెప్పలేనివి. కొంచెము బుద్ధితెలిసినపిదప మనస్సునకు గల్గు దుఃఖములు– తండ్రి, అన్నదమ్ములు, అక్క–సెల్లెండ్రు, ఇతరబంధువులు, మిత్రులు, ప్రియులు, ప్రియ

రాంత్రము వేఱగుటవలన మరణించుటవలనఁ గలుగుబాధలు. అను కొనకుండ తనకు వచ్చునాపదలు క్రిందపడుట, కాలుతెగుట, ఇతరాంగలోపములు మొదలైనవి. తరువాత నితరులతో వచ్చు పోట్లాటలు. అన్నింటినిమించినబాధ (దారిద్ర్యము) ధనములేమి. ధన ముండినయెడల నందఱు సహాయమునకు వచ్చి యడుగులకు మడుగు లొత్తుదురు. "ధనమూల మిదం జగత్" ధన మన్నిటి కిని మూలము. పరిచారకులు, సహాయులు, మిత్రులు, బంధువులు భోగములు సర్వము ధనమున్నవానికి గల్గును. బాధలు, వ్యాధులు వచ్చినను, చికిత్స చేయుటకు వైద్యులు, ఉపచారములు చేయుటకు దాసదాసీజనము లోపముండదు. బాధలను కొంతవఱకు పోగొట్టు కొనవచ్చును. అదిలేదో మనుష్యుఁడు పడుబాధ, చెప్పనలవి కాదు. దగ్గఱవారే రారు. మాట్లాడరు. కొద్దికాలము దారి ద్ర్యమే భరింపలేము. అది కొందఱకు దీర్ఘకాలము పుట్టినది మొదలు చచ్చువఱకును వదలదు. ఇట్టికష్టములవలన జీవుఁడు చచ్చువఱకుఁగూడ పడుబాధ లిట్టివని యెవ్వరైన వర్ణింపఁగలరా? ఎవ్వరును వర్ణింపలేరు. బుద్ధిమంతుఁడు దుఃఖభూయిష్ఠమైన జన్మ పరంపరపై, వైరాగ్యము కల్గి వానినుండి తప్పించుకొనుమార్గము చూచుకొనవలెను, అని తాత్పర్యబోధ.

అవ : మనుష్యజన్మమేకాదు పశుపక్షిమృగాదిజన్మములలోను బడుబాధ లకు లెక్కలేదు. మనుష్యజన్మము వచ్చుటే దుర్ఘటము.

**నరపశువిహగతిర్యగ్యోనీనాం చతురశీతిలక్షాణామ్।**
**కర్మనిబద్ధో జీవఃపరిభ్రమన్ యాతనా భుఙ్క్తే॥ 13**

ప్ర : కర్మనిబద్ధః = తాను వెనుకఁజేసిన కర్మములచేత (పుణ్యపాప ములచేత వానిఫలములగు సుఖదుఃఖఫలములచే) బంధింపఁబడిన, జీవః =

జీవుఁడు, నరనాం, నర=మానవులు, పశు = పశువులు, విహంగ=పక్షులు. తిర్యక్=అడ్డముగా పెరుఁగు ఆవులు, దున్నపోతులు, మొదలైనజంతువులు, యోనీనాం=వీనికిసంబంధించిన ఆడుజంతువులజననాంగములనుండిపుట్టు, చతుర శీతిలక్షణామ్=ఎనుబదినాలుగులక్షలజాతులకు చెందినజన్మములందు, పరిభ్రమన్ =విపరీతముగా తిరుగుచు,(వచ్చుచుఁ బోవుచు,) యాతానాః=(అనేకవిధములైన) ఘోరబాధలను, భుంక్తే= అనుభవించును.

తా॥ పైన నరజన్మములోని బాధలే వర్ణింపఁబడినవి. జీవుడు పొందున దొక్క మనుష్యజన్మమే కాదు. పశువులు, పక్షులు, క్రిములు, కీటకములు అడ్డదిడ్డముగా పెరుఁగుమృగములు ఎనుఁబది నాలుగులక్షలరకముల జీవరాసుల జన్మములున్నవి. అందులోఁ దాను చేసినకర్మమునుబట్టి జీవుఁడు జన్మించుచు మరణించుచుఁ దిరుగుచుండును. దుర్భరమైన యాతనలు పడును. తన్నుకుట్టు, కఱచు దోమలు మొదలైనవానిని మనుష్యులవలె పక్షులు మొద లైనవి చేతు లెత్తి తోలుకొనలేవు. అందులో నొక్కొక్కటి మఱి యొకదానిని జంపి తినును. అవి పడు బాధ లింకను మహాఘోర ముగా వర్ణింపరానివిగా నుండును.

ఈయెనుఁబదినాలుగులక్షల జన్మములలో మనుష్యుడుగాఁ బుట్టుట అనేకలక్షలకోట్లయవకాశములలో నొక్కయవకాశము. మనుష్యుఁ డొక్కఁడే పూర్వాపరజన్మములఁగూర్చి ఆలోచించు కొనఁగలవాఁడు. ఈవచ్చిననరజన్మమును వృథా చేసికొన్నచో, మరల మనుష్యజన్మము వచ్చుట యెంతదుర్ఘటమో మనుష్యుఁడు గ్రహింపవలెను. అందువలన బుద్ధిమంతుఁడు దీనిని వృథాపుచ్చక సార్థకము చేసికొనవలెను. ముక్తికి యత్నించి సాధింపవలెను.

అవ : బహుకష్టసాధ్యమైననరజన్మమును వృథాచేసికొనఁగూడదని హెచ్చరించు చున్నారు.

చరమ స్తత్ర నృదేహ స్తత్రాగ్రజన్మాన్వయోత్పత్తిః।
స్వకులాచారవిచారః శ్రుతిప్రచారశ్చ తత్రాఽపి ॥ 14

ప్ర : తత్ర=(అక్కడ) పైనఁ జెప్పిన అనేకవిధములైన జన్మములలో నృదేహః=మనుష్యశరీరము(జన్మము,)చరమః=చివరిది, అనఁగా అత్యుత్తమమైనది [ఉన్నత మైనది, గొప్పది] తత్ర=అక్కడ, ఆనరజాతిలో, అగ్రజన్మాన్వయోత్పత్తిః=బ్రాహ్మణవంశములోఁ బుట్టుట (దుర్లభతరమని, గొప్పయని గ్రహింపవలెను.) తత్రఅపి=అందుకూడ, స్వకులాచారవిచారః=తన కులమునకుఁ జెప్పఁబడినఆచారరూపధర్మమునుగుఱించి విమర్శించి తెలిసికొనుటయును, శ్రుతిప్రచారఃచ=ఊఱక ఆచరించుటయే కాదు, దానితోఁ గూడిన ధర్మప్రచారము నుండవలెను. అది గొప్ప. (ఇవి ఒకదానికన్న మఱొకటి దుర్లభతర మైనందువలన నరజన్మ మెత్తినప్పుడు బుద్ధిమంతుఁడు దానిని సద్వినియోగము చేసికొనవలెను.)

**తా॥** నరజన్మము వచ్చుటయే మహాదుర్లభము. అది అన్నిరకములైన జన్మములలోను ఉత్తమ మైనది. నరులలో బ్రాహ్మణుఁడుగాఁ బుట్టుట ఇంకను గొప్ప. ఇది సుదుర్లభ మైనది. అందులో నింకను సద్వంశములో జనించుట దుర్లభతరము. అట్లు పుట్టినను, తనధర్మ మేది? తనకులాచార మేది? యని విచారించుట, శ్రుతి యధ్యయనముచేయుట గొప్పవిషయము. విచారించి తెలిసికొన్న పిదప దాని నాచరణలోఁ బెట్టుట ఇంకను గొప్ప విషయము. దానిసి స్వల్పముగా 'ఏదో మననమును చేసినాములే' యనికాక శ్రద్ధాభక్తులతో ఆధర్మాచారమును సమాజములోఁ బ్రచారము చేసి విస్తరింపఁ జేయుట మఱియును గొప్ప. ఇవన్నియు మహాదుర్లభతమము లైనవి. అమూల్యము లైనవి. లభించి నప్పుడు వానిని సరిగా నుపయోగించుకొనలేనిచో వానినష్ట మింత యని లెక్కకట్టుటకే వీలులేనిది.

అవ॥ దానిపై విషయములను జెప్పుచున్నారు.

ఆత్మానాత్మవివేకో నో దేహస్య చ వినాశితాజ్ఞానమ్।
ఏవం సతి స్వాయ మాయుః ప్రాజ్ఞై రపి నీయతే
మిథ్యా ॥ 15

ప్ర : ) ఏవంసతి = పై జెప్పినదంతయు నిట్లుండఁగా [మనుష్యజన్మము, బ్రాహ్మణాదిజాతిధర్మానుష్ఠానాదులు లభించుట బహుసుదుర్లభమై ఉండఁగా] ఆత్మానాత్మవివేకః = ఆత్మ యనఁగా నేమో, అనాత్మ యనఁగా నేమో ఏని నేర్పఱచి విమర్శించి చూచుబుద్ధికుశలతయు, దేహస్య = దేహముయొక్క, వినాశితాజ్ఞానమ్‌చ = వినాశముపొందు స్వభావముయొక్క జ్ఞానమును, నో (చేత్) = లేనియెడల: ప్రాజ్ఞైః అపి = పండితు లనఁబడెడీ వారిచేతఁ గూడ. ఆయుః = [తమయొక్క ఆయువు] జీవితకాలము, స్వయమ్ = స్వయముగా మిథ్యా, నీయతే = వృథాగాఁ గడపఁబడుచున్నది.

తా॥ పై శ్లోకములో మనుష్యజన్మము ఎత్తి, అందును అగ్రవర్ణమునందు, (మంచి వంశమందు) బుట్టి తనస్వధర్మ మేదో విచారించి తెలిసికొని దానిని ఆచరణలోఁ బెట్టి, వేదాధ్యయనముచేసి ఆవేదార్థమును గ్రహించి పండితుఁ డని పేరుకూడ కొందఱు సంపాదించుచున్నారు. అట్టివారు సైతము ఈశరీరము నశించు స్వభావము గలది యను జ్ఞానములేకయు, తానగు సత్యాత్మ యేదియో, తానుగాని యనాత్మపదార్థ మేదియో (మిథ్యాశరీరాది) వేర్పఱచి నిజముగా తెలిసికొని తరింపవలె ననెడు జ్ఞానము లేకయు, జీవితకాలమును వ్యర్థము చేయుచున్నారు. ఇంతకన్న గొప్ప నష్టము లేదు. ఈదేహనిందాభాషణము ఆత్మలాభస్తుతియే యగునని భావము.

అవ॥ వారి యీనష్టము కొలుచుటకు వీలు లే దనుచున్నారు.

**ఆయుః క్షణలవమాత్రమ్ న లభ్యతే హేమకోటిభిః క్వాపి।**
**తచ్చే ద్గచ్ఛతి సర్వం మృషా తతః కాఽధికా హానిః॥ 16**

ప్ర : క్వఅపి = ఎక్కడకూడ, హేమకోటిభిః = కోటిబంగారునాణెములచేత [కూడ] ఆయుఃక్షణలవమాత్రమ్ = ఒక్కక్షణకాలమందలి చిన్నభాగమంత ఆయువుకూడ, న లభ్యతే = [సంపాదింపవలె, కొనవలె ననుకొన్నను] దొరకదు, తత్ = అటువంటి విలువగల [అమూల్యమైన], సర్వం = మొత్తము ఆయువు, మృషా గచ్ఛతి [చేత్] = వ్యర్థమైపోయినయెడల, తతః అధికా = అంతకన్న [గొప్పదైన] ఎక్కువైన, హానిః కా = అపకారము [నష్టము] ఏమున్నది? లేదని భావము.

తా॥ మనుష్యునియాయువు చాల విలువ కలది. అనేక కోట్ల బంగారునాణెములు పెట్టి కొందమన్నను, ఆయువునందు క్షణకాలములో ఒక అవగింజంత యైనను కొనలేము. దొరకదు అనఁగా ఒక క్షణములో వేయువవంతు నష్టమైనను ఆనష్టమింత అంత యని విలువ కట్టలేము. ఎంత ధన మిచ్చినను ఆక్షణము తిరిగి రాదు. అట్టి సందర్భములో తనయాయువు సర్వమును, తాను జీవించిన దాదాపు వందసంవత్సరములును ధనార్జనకు ధనదాసులై, ఆత్మను గుఱించిన జ్ఞానమును సంపాదించుతలంపు లేకుండ వృథాచేసినయెడల అతఁ డెంత నష్టమును బొందుచున్నాడో ఎవరును చెప్పలేరు. పైగా, ఈ శరీరము అశాశ్వతమని గుర్తించి తనకున్న కొద్దికాలమును, ఆత్మను అనాత్మను వేఱుచేసి చూచి, ఆత్మనుగుఱించి తెలిసికొని మోక్షమును పొందయత్నింపవలెను. అట్లుచేయక అమూల్యమైన తనయాయువును సర్వము దేహపోషణములో వ్యర్థము చేసికొన్నవాఁడు పెద్దయజ్ఞాని యని గ్రహింపవలెను. ఆత్మజ్ఞానార్జనకు సాటి మఱొకటి లేదుసుమా!

అవ : నరజన్మము వృథాగా పోయినచో వచ్చు నష్ట మధిక మని చెప్పు చున్నారు.

నరదేహాతిక్రమణా త్ప్రాప్తౌ పశ్వాదిదేహానామ్ ।
స్వతనో రప్యజ్ఞానే పరమార్థ స్యాత్ర కా వార్తా ॥ 17

ప్ర : నరదేహాతిక్రమణాత్=(ఇక్కడ స్వధర్మపుణ్యకర్మములు చేయవలసిన అవసరము గ్రహింపక పాపకర్మములు చేయఁగా) మనుష్యజన్మము పోవుట వలన, పశ్వాదిదేహానామ్=జంతువులు, క్రిమికీటకములు, మొదలైన శరీరములయొక్క, ప్రాప్తౌ=పొందుట కలిగినప్పుడు, అత్ర=ఈవచ్చినజన్మములలో, స్వతనోఃఅపి=తనశరీరముయొక్కయథార్థస్థితి కూడ, అజ్ఞానే = తెలియనిస్థితి యందు, (తన కొకశరీర మున్న దనెడు జ్ఞానమేలేక, శరీరమే తా ననుకొను జన్మములలో ఆదేహముభావిమేలునే ఆలోచించి చేసికొనలేని పరిసితిలో), పరమార్థస్య వార్తా=అత్యుత్తమమైన మోక్షము సంపాదింపవలె ననుమాట (అభిప్రాయము), కా = ఏమి? (అస్తి=ఉన్నది) (ఆమనుష్యేతరజన్మములందు మోక్షవాసనయే) లేదని భావము.

తా॥ ఈవచ్చిన నరజన్మముయొక్క ప్రాముఖ్యము గుర్తింపక, రాగద్వేషములకు లోనై, పాపములే చేసినయెడల, జంతువులు, క్రిమికీటకములు మొదలైన జన్మములు వచ్చును. వానికి తమకంటె వేరైన యొకశరీర మున్నదని, దానికి రాఁబోవు మేలు సంపాదించుకొనవలె నను(జ్ఞానము) ఆలోచనయే లేదు. ఇంక నాజన్మములలో మోక్షమును గుఱించిన యాలోచన యెట్లు వచ్చును? రానే రాదు. కావున ఈనరజన్మ ముండఁగనే, వివేకియైనవాఁడు మోక్షముకొఱకు యత్నింపవలెను. సాధింపను వలెను.

అవ॥ ఆపశ్వాదిజన్మములలోని యిక్కట్లు కొన్ని వాని యందు వైరాగ్యము కల్గుటకు చెప్పుచున్నారు.

సతతం ప్రవాహ్యమానై ర్వృషభై రశ్వైః ఖరై
ర్గజై ర్మహిషైః ।
హా కష్టం క్షుత్క్షామైః శ్రాన్తై ర్నో శక్యతే వక్తుమ్ ॥ 18

ప్ర : సతతమ్ = ఎల్లప్పుడు నెడతెగకుండ, ప్రవాహ్యమానైః = మనుష్యులను బరువులను మోయునట్లు చేయఁబడుచున్నవియు, క్షుత్ క్షామైః = ఆకలిచేత కృశించిన(టువంటి)వియు, శ్రాన్తైః = మిక్కిలిఅలసిన(టువంటి)వియునైన, వృషభైః = ఎద్దులచేతను, అశ్వైః = గుఱ్ఱములచేతను, ఖరైః = గాడిదల చేతను, గజైః = ఏనుగులచేతను, మహిషైః = దున్నపోతులచేతను (ననుభవింపబడు) కష్టం = బాధను, వక్తుం = (అవిగాని, చూపరులుగాని) చెప్పుటకైనను, న శక్యతే = సాధ్యపడదు. హా! = అయ్యో! పాపము!

తా. మనుష్యులు పాపకృత్యము లాచరించి ఎద్దులు, గుఱ్ఱములు, గాడిదలు, ఏనుఁగులు, దున్నపోతులుగాఁ బుట్టెదరు. అప్పుడు ఇతరమనుష్యులు వానిని స్వాధీనము చేసికొని వానిపై తామెక్కియో లేక బరువులు వేసియో వానికి అలసట కల్గునట్లు పని చేయించెదరు. తగినయాహారము వేయరు. అవి ఆకలిబాధ చేత చిక్కి శల్యము లగును. తమబాధను ఇతరులకు (మాటలతో) చెప్పుకొనుశక్తికూడ పాపము వాని కుండదు. అది యెంతో దయనీయమైన స్థితియో బుద్ధిమంతులు గ్రహించి అట్టి స్థితితమకు రాకుండ చేసికొనవలెను.

అవ॥ శరీరముయొక్క నికృష్టస్థితిని ఇంకను వర్ణించుచున్నారు.

రుధిరాస్థిధాతుమజ్జామేదోమాంసాదిసంహతి ర్దేహః ।
స బహి స్త్వచా పినద్ధ స్మస్మాన్నో భక్ష్యతే కాకైః ॥ 19

ప్ర : దేహః = (ఈ) శరీరము, రుధిరా.... సంహతిః, రుధిర = రక్తము, అస్థి = ఎముకలు, ధాతు = వస, మజ్జా = ఎముకలయందలినూనెవంటిది, మేదస్ =

మెదడుద్రవ్యము, మాంస-ఆది=మాంసము మొదలైన (క్రొవ్వు, నరములు మొదలైన) పదార్థములయొక్క, సంహతిః=కలయికవలన నేర్పడినప్రోగు, సః=అది (ఆసమూహము) బహిః=వెలుపలిదైన, త్వచా = చర్మముచేత, పినద్ధః=(కనఁబడకుండ) కప్పఁబడినది, తస్మాత్= ఆకారణమువలన,కాకైః= కాకులచేత, (ఆ బ్రదికియున్నశరీరము,) న భక్ష్యతే=తినఁబడుటలేదు.

తా : బ్రదికియున్న యీశరీరము (జంతువులది మనుజులది కూడ) రక్తము, మాంసము, ఎముకలు, క్రొవ్వు మొదలైన ధాతు పదార్థములతో నిండి నిర్మింపబడియున్నది. ఇవి బయటకుఁ గనఁ బడకుండ చర్మము కప్పుచున్నది కాన సరిపోయినది.కాని, కప్పె డియీచర్మమే లేనిచో కాకులు నాల్గువైపుల చేరి బ్రతికి యున్న ప్పటికిని పొడిచి పీకి తిని యుండెడివి. అంతటి నీచస్వరూపమైన దేహ మిది. బుద్ధిమంతుఁ డిట్టిదేహముపై గాఢానురాగమును మాని,విరాగమును బెంచుకొని, మరల మరల నిది తనకురాకుండఁ జూచుకొనవలెను. అనఁగా జన్మము రాకుండుమోక్షముకొఱకు యత్నింపవలెను అని హెచ్చరికధ్వని.

అవ : మనశరీర మింకను ఎంత యసహ్యకరమైన ద్రవ్యములతోఁ గూడియున్నదో వైరాగ్యము (రోఁత) గల్గి నిల్చుటకొఱకుఁ జెప్పుచున్నారు.

నాసాగ్రా ద్వదనా ద్వా కఫం మలం పాయుతో విసృజన్।
స్వయ మే వైతి జుగుప్సా మంతః ప్రసృతం చ నో వేత్తి॥
20

ప్ర : (మనుజుఁడు) నాసాగ్రాత్= ముక్కుచివరినుండి, వా= లేక, వదనాత్= నోటినుండి, కఫం=చీమిడి, కళ్లె మొదలైనదానిని, పాయుతః= గుదమునుండి మలమ్= పురీషమును, విసృజన్= విడిచిపెట్టుచున్నవాఁడై

స్వయమ్ ఏవ= తనకుఁ దానే, జుగుప్సాం ఏతి= మలినములయెడ అసహ్య భావమును బొందుచున్నాఁడు ఇఁక, అంతః= శరీరములోపల, ప్రసృతమ్= విస్తరించియున్న అసహ్యములైన మలములనుగుఱించి, న వేత్తి=ఎఱుంగఁడు.

తా : మనుష్యుఁడు శరీరము వెలుపలకు ముక్కుచివరనుండి వచ్చుచీమిడి, నోటినుండి వచ్చుశ్లేష్మము, గుదమునుండివచ్చు మలము వీనిస్వరూపాదులను ఆలోచించుకొన్నను, ఈశరీరము మలములకొంప యని యసహ్యించుకొనకుండ నుండలేఁడు. ఇంక దేహములోపలనుండు మాలిన్యములను గుఱించి ఊహింప లేకున్నాఁడు. లోపలిమలినములు మనపంచేంద్రియములకు తెలియవు గనుక కొంతవరకు సరిపోయినది. దేహమిట్లు మలమయము. కాన రాగాశ్రయము కాఁగూడదు.

అవ : మనభావములను, మనశరీరస్థితిని పోల్చి యెంతవిడ్డూరమో చూపించుచున్నారు.

పథి పతిత మస్థి దృష్ట్వా స్పర్శభయా దన్యమార్గతో యాతి।
నో పశ్యతి నిజదేహం చాస్థిసహస్రావృతం పరితః॥ 21

ప్ర : (నరుఁడు) పథి= మార్గమందు, పతితమ్= పడియున్న, అస్థి= ఎముకను, దృష్ట్వా= చూచి, స్పర్శభయాత్= దానినితాకి మైలపడిపోవుదు ననుభయముచేత, అన్యమార్గతః= ఆత్రోవతప్పించి, మఱొకదారిలో యాతి= వెళ్లుచున్నాఁడు, చ = మఱియు, పరితః = అంతట, అస్థిసహస్రావృతమ్= వేలకొలఁది యెముకలతో ఆవరింపఁబడినటువంటి, నిజదేహమ్= తనసొంతశరీరమును, నోపశ్యతి= అట్లు చూడ లేకున్నాఁడు,

తా ? మనుష్యుఁడు తాను వెళ్లుత్రోవలో నెద్దైన నొక యెముక కనఁబడినయెడల తాను దానిని తాకి మైలఁబడిపోవుదు నను భయముచేత, అసహ్యముచేత ఆదారిని తప్పించి మఱొక

ప్రోనముఁ బోవును. కాని తనశరీరమం దంతట అటువంటియెముకలు వేలకొలఁది ఉన్నవని, కావున తన దేహమెంత నికృష్టమైనదో కొంచెమైనను చూడఁడు. ఈప్రవృత్తి యెంత విడ్డూర మైనదో కదా! ఇట్టినీచములైన శరీరములు రాకుండఁ జూచుకొనవలె నని కొంచెమైనను ఆలోచింపఁడు ఎంతమూఢత్వము! శరీర మెంత రోఁత గొట్టునది !!

అవ : వైరాగ్యజనకకారణముగా ఈశరీర మెంతదుర్గంధపూరితమో ఇంకను వివరించుచున్నారు.

కేశావధి నఖాగ్రా దిద మన్తఃపూతిగంధసంపూర్ణమ్।
బహిరపి చాగరుచన్దనకర్పూరాద్యై ర్విలేపయతి॥ 22

ప్ర : నఖాగ్రాత్ = (కాలిప్రేళ్ల) గోళ్ల చివరలనుండి, కేశావధి = (తల మీఁది) వెండ్రుకలవఱకు, ఇదమ్ = ఇది (శరీరము), అన్తః = లోపల, పూతిగంధసంపూర్ణమ్ = మలములచెడువాసనలతో నిండి యున్నది. అపి, చ = అట్లయ్యును, (నరుఁడు) బహిః = వెలుపల, అగరుచందనకర్పూరాద్యైః = సువాసన లిచ్చు అగరు, గంధము, కర్పూరము మొదలైన మైపూఁతలతో, విలేపయతి = పూసికొనుచున్నాఁడు.

తా : మనుష్యునిశరీరము కాలిప్రేళ్ళనుండి శిరస్సునందలి వెండ్రుకలవఱకు, అనఁగా నఖశిఖపర్యంతము, (నిలువెల్ల) అనేక మలముల చెడువాసనలతో నిండి యున్నది. ఇది గుర్తింపక అజ్ఞానముచేత, మోహముచేత మనుష్యుఁడు వెలుపల అగరు, గంధము, కస్తూరి, అత్తరు మొదలైన సువాసనద్రవ్యములు పూసికొని కులుకుచు తాను సుగంధముతో కూడియున్నానని అనుకొనుచున్నాఁడు. అహా!.

అవ : గుణదోషములను గుర్తింపలేని మనుష్యుని మౌఢ్యమును ఇంకను వర్ణించుచున్నారు.

యత్నా దస్య పిధత్తే స్వాభావికదోషసంఘాతమ్।
ఔపాధికగుణనివహం ప్రకాశయ శ్లాఘతే మూఢః॥ 23

ప్ర : మూఁఢుడైన జనుఁడు యత్నాత్ = ప్రయత్నముతో, అస్య = ఈ దేహముయొక్క, స్వాభావికదోషసంఘాతమ్ = సహజముగా దానికున్న యనేక దోషములసమూహమును, పిధత్తే = కప్పిపుచ్చుచున్నాఁడు, (కనఁబడకుండ చేయుచున్నాఁడు). ఔపాధికగుణనివహమ్ = తెచ్చిపెట్టుకొన్న చందనాద్యుపాధిసంబంధగుణములను తనవిగా, ప్రకాశయన్ = కనఁబడునట్లు చేయుచు, శ్లాఘతే = (వానిని) పొగడుచున్నాఁడు.

తా : ఈ శరీరమునకు సహజముగా నున్నవన్నియు దోషములే. అంగవికారములు. లోపములు, వేషములతో, చికిత్సలతో, సుగంధాదులను తెచ్చిపెట్టుకొని, దుర్గంధాది దోషములను కనఁబడకుండఁ జేసి వాని నన్నిటిని సహజగుణములుగా ప్రదర్శించుచు, మూఢుఁడై తా నేలోపములులేని అందగాఁడ నని పొగడుకొనుచున్నాఁడు. ఇఁక నతనికి దీనియందు విరక్తియెట్లు కల్గును? కలుగదని భావము.

అవ : ఉదాహరణపూర్వకముగా ఈశరీరముయొక్క హేయత్వమును జుగుప్స కల్గునట్లు వర్ణించుచున్నారు.

క్షత ముత్పన్నం దేహే యది న ప్రక్షాల్యతే త్రిదినమ్।
త త్రోత్పతన్తి బహవః క్రిమయో దుర్గన్ధసంకీర్ణాః॥ 24

ప్ర : దేహే = శరీరమునందు, ఉత్పన్నమ్ = పుట్టిన, క్షతమ్ = గాయమును, త్రిదినమ్ = మూఁడుదినములకాలము, న ప్రక్షాల్యతే యది =

నీటితో (శుభ్రముగా) కడుగనియెడల, తత్ర = ఆగాయమునందు, దుర్గన్ధ సంకీర్ణాః = దుర్వాసనతో నిండిన, బహవః = అనేకసంఖ్యగల, క్రిమయః = పురుగులు ఉత్పత్తని = పుట్టుచున్నవి.

**తా :** ఈశరీరసౌరభ్యము చూడవలె నన్న, దీనియం దేర్పడిన ఒకచిన్నగాయమును మూఁడుదినములు, శుభ్రమైన నీటితో కడుగక చికిత్స చేయకుండ నుంచినఁ జాలును. అప్పుడా గాయమునందు అనేకములైన లుకలుకలాడు పురుగులు పుట్టి సహింపరానిదుర్గంధమును అవి వ్యాపింపఁజేయును. ఇట్టి యీశరీరమునందు విరక్తి కాక మోహమును పొందుట అవివేకమే కాగలదుగదా.

అవ : బ్రతికియున్నప్పుడున్న శరీరదోషములను జాటి యిప్పుడు మరణించినపుడు దీనిబండారమును బయటపెట్టుచున్నారు.

యో దేహః సుప్తోఽభూత్సుపుష్పశయ్యోపశోభితే తల్పే।
సమ్ప్రతి స రజ్జుకాష్ఠై ర్నియన్త్రితః క్షిప్యతే
వహ్నౌ 25

ప్ర : యః దేహః = ఏశరీరము, సుపుష్పశయ్యా - ఉపశోభితే = పూలు చల్లిన మెత్తనిపఱుపులతో అలంకరింపఁబడిన, తల్పే = మంచమునందు సుప్తః అభూత్ = నిద్రించినదాయెనో, సః = ఆదేహమే, సంప్రతి = ఇప్పుడు (అనగా మరణించినప్పుడు), రజ్జుకాష్ఠైః = త్రాళ్లచేతను కట్టెలచేతను, నియన్త్రితః = బంధింపఁబడి, వహ్నౌ = అగ్నియందు, క్షిప్యతే= విసరివేయఁబడుచున్నది.

**తా :** ఆరోగ్యవంతుఁడుగా నున్నప్పుడు మనుష్యుఁడు నిద్ర వచ్చినప్పుడు హంసతూలికాతల్పములు మొదలైన వాని

మీఁద, సువాసనలీనుపుష్పములు పఱచినమెత్తనిశయ్యలందు ఈ శరీరము నుంచుచున్నాఁడు. కాని అతఁడు పూర్తిగాచావకముందే దీనిని భూశయనము చేయుట, చచ్చినపిదప, వ్రేళ్లు మొదలైన వానిని త్రాళ్ళతో బంధించుట, పాడెకట్టి దానిమీఁదఁబెట్టి త్రాళ్ళతో గట్టుట, చివరకుఁ దనకు మిక్కిలిప్రేమాస్పదులైన వారే, దీని నేడ్చుచు మోసికొనిపోయి పేర్చినకట్టెలపైఁ జేర్చి నిప్పుతోతగులఁబెట్టుచున్నారు. కొంచెము సేపట్లు చేయనిచో నిది దుర్గంధము చేయుట, క్రిమిదష్ట మగుటవలన భరింపలేని స్థితికి వచ్చుచున్నది. ఈదృశ్య మగుశరీరము నశించుస్వభావము కలదిసుమా! దీనిపై మోజెందుకు?.

అవ : రాజాధిరాజులకైనను ఈగతి తప్ప దనుచున్నారు.

సింహాసనోపవిష్టం దృష్ట్వా యం ముద మవాప లోకోఽయమ్।
తం కాలాకృష్టతనుం విలోక్య నేత్రే నిమీలయతి॥ 26

ప్ర : అయం, లోకః = ఈలోకము, యం, సింహాసనోపవిష్టమ్ = ఏ ప్రసిద్ధదేహము సింహాసనమందు గూర్చున్నదానిని, దృష్ట్వా = చూచి, ముదమ్ = సంతోషమును, అవాప = పొందెనో, కాలాపకృష్టమ్ తమ్ = యమునిచేత కబళింపఁబడిన ఆశరీరమును (అనగా, మరణించినదానిని), విలోక్య = చూచి, నేత్రే = రెండుకండ్లను, (ఆశ్చర్యముతో) నిమీలయతి = మూసికొనుచున్నది.

తా : సింహాసనమందుఁ గూర్చుండిదర్పముతో రాజ్యపాలనము చేయుచున్న రాజాధిరాజును జూచి లోకము హర్షించుచున్నది. కాని అనతికాలములోనే తేజము నోల్పోయి మృతిచెందినయతనిశరీరమును జూచి భయమువిస్మయవిచారములతో అదే

లోకము చూడలేక రెండుకండ్లను మూసికొనుచున్నది. ఇట్టిది. యీ శరీరపాలనము. దీనిమీఁద విరక్తి కల్గకుండుట ఆశ్చర్యము ఔపాధికశోభలు శరీరమునకు మూన్నాళ్ళముచ్చటయేగదా-చివరికి అత్యంతభయంకరపరిణామము గలదిగదా శరీరము.

అవ : ఈతుచ్ఛశరీరము నే ననుట మానవలె ననుచున్నారు.

**ఏవంవిధోఽతిమలినో దేహో యత్సత్తయా చలతి।**
**తం విస్మృత్య పరేశం వహ త్యహన్తా మనిత్యేఽస్మిన్॥ 27**

ప్ర : యత్సత్తయా = (దేని) ఏజీవపరమేశ్వరాధిష్ఠానబ్రహ్మముయొక్క యునికిచేత, ఏవంవిధః = పైనవర్ణించినవిధము గల్గినవగు అతిమలినః = అతిమలినమైనదైన, దేహః = శరీరము చలతి = కదులుచున్నదో, తం పరేశం = ఆపరమాత్మను, పరమేశ్వరుని, విస్మృత్య = మఱచి, నరుఁడు అనిత్యే = అశాశ్వతమైన అస్మిన్ (దేహే) = ఈదేహమునందు, అహన్తాం = నేనుఅనుభావమును, వహతి = వహించుచున్నాఁడు, (పెట్టుచున్నాడు)

తా : అతిమలినమైన ఈశరీర మెంతనికృష్టమో పైన అనేకవిధముల వర్ణింపబడినది. ఆతుచ్ఛశరీరము, తనయందు దేవపరమాత్మ నిల్చియుండుటచేత, కదలి పనిచేయుచున్నదో, ఆపరమాత్మను నేను అని గ్రహింపలేక ఈశరీరమే నేనని అజ్ఞాని భావించుచున్నాఁడు. ఇది మిక్కిలి యవివేకము. కాన దీనిని వదలవలెను.

అవ : కావున వివేకముగలవాఁ డేమి చేయవలెనో చెప్పుచున్నారు.

**క్వాత్మా సచ్చిద్రూపః క్వ మాంసరుధిరాస్థినిర్మితో దేహః।**
**ఇతి యో లజ్జతి ధీమానితరశరీరం స కిం మనుతే॥ 28**

ప్ర : సచ్చిద్రూపః = నిత్యమైన ఉనికియు తెలివియు స్వరూపముగా గల, ఆత్మా = ఆత్మయగుతాను, క్వ = ఎక్కడ? మాంసరుధిరాస్థినిర్మితః = మాంసము, రక్తము, ఎముకలతో నిర్మింపఁబడిన (అతిమలినమైన) ఈః దేహః = శరీరము, క్వ = ఎక్కడ! ఇతి = అని, యఃధీమాన్ = ఏబుద్ధి మంతుఁడు (తనయవివేకమునకు) లజ్జతి = సిగ్గుపడుచున్నాఁడో, సః = ఆవివేకజ్ఞానముకలవాఁడు, ఇతరశరీరమ్ = (తనకన్న భిన్నమైన తనయొక్కయు నితరులయు శరీరమునుగుఱించి, కిం,మనుతే = విపరీతముగా ఏమనుకొనును?.

తా : సత్యముగా ఆత్మగా తానున్నాఁడు (జడముకాక తెలివిగా నున్నాఁడు). కాని ఈశరీరమో అసహ్యములైన మాంసము, రక్తము, ఎముకలు మొదలైనవానిచే చేయఁబడినది. జడము. ఈభేదమును గుర్తింపఁగల్గినబుద్ధిమంతుఁడు తా నీశరీర మనుకొనుటకు సిగ్గుపడును. అతఁడీతుచ్ఛశరీరమును గుఱించి వేఱుగానేమనుకొనును? దీనిని గొప్పగా భావింపలేఁడు. ఈశరీరమే తాననుకొనలేఁడు. అనాత్మయగు శరీరోపాధిపై విరక్తుఁడై, దానియందు మరల మోహ మందఁడు. అట్టివానికి భార్యాపుత్రాదులయితరశరీరములందును దృఢవైరాగ్యము కలవాఁడగును. ఇట్లు ఆత్మబోధ, వైరాగ్యభావమును దృఢపఱచుచున్నది అని అయిదవశ్లోకార్థము కొంత నిర్ణయమైనది. 6వశ్లోకమందు చెప్పిన దేహమందలి భ్రాంతికల్పితాహంత, ఆత్మబోధచే నాశనమైనది. 7వశ్లోకములో జెప్పినట్లు దేహదుఃఖనిమిత్తత్వ స్వరూపస్వభావ విచారముచేత శరీరమందలిఅహంభావమును, జీవున కితరజీవులగు దారాపుత్రాదులందుఁ గల మమతయు ఆత్మస్వరూపస్వభావజ్ఞాన రూపమగు ఆత్మబోధచే తొలఁగుటయు నిరూపింపఁబడినవి.

శ్లో॥ ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ।
"జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్॥"గీ 13-8

ఆత్మబోధ. ఉత్తమోత్తమఫలవంత మైనది. కావున సర్వముముక్షువులకు ఆత్మబోధ సాధ్యతమము.

ఈ ప్రకరణమందు 8వశ్లోకమునుండి 28వరకు వివరించిన దేహదుఃఖనిమిత్తత్వనిరూపణము, దేహమందు వైరాగ్యభావమును స్థిరముచేయుచు ఆత్మజ్ఞానహేతువైనదని శ్రీకృష్ణభగవానునికంఠోక్తి. శ్రీ శంకరభాష్యవివరణములు ఉపబలకములు. ఇట్లే

శ్లో॥ వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥గీ 18-52

ఇచ్చట "నిత్యం" - నిత్యగ్రహణము, మంత్రజపాద్యన్యకర్తవ్యాభావప్రదర్శనము. వైరాగ్యము విరాగభావము. దృష్టాదృష్టవిషయములందు వైతృష్ణ్యము. ఈవైరాగ్యము నిత్యముగా లెస్సగా ఉపాశ్రయింపఁబడినదని శ్రీశంకరులవివరణబోధ. కావున ముక్తికి సాక్షాత్సాధనముగాఁ జెప్పిన వైరాగ్యాత్మబోధభక్తిత్రయమందు వైరాగ్యాంగమగు దేహనిందారూపతద్దోషానులోచనము ఆత్మజ్ఞానహేతువుగా నిపుణముగాఁ బ్రదర్శింపఁబడినది. ఇట్లు ఈయాత్మబోధ ఉత్తమోత్తమ ఫలవంత మైనది గావున సర్వ ముముక్షువులచే సాధ్యతమము.

## 2. విషయనిన్దాప్రకరణమ్ (విషయనిందాప్రకరణము)

వైరాగ్యాత్మబోధభక్తిత్రయ మనుసాక్షాన్ముక్తిసాధనమందు వైరాగ్యాంగముగా అనాత్మయగు శరీరమునందు వైరస్యము కల్గించి యిప్పుడు యింటివంటి శరీరము దానినిమిత్తముగా నేర్పడినపుత్రకళత్రవిత్తాది బాహ్యవిషయములు కూడ హేయము లని ముక్తిప్రతిబంధకములని చూపుచున్నారు.

మూఢః కురుతే విషయజకర్దమసంమార్జనం మిథ్యా ।
దురదృష్టవృష్టివిరసః దేహో గేహం పతత్యేవ ॥ 29

ప్ర : మూఢః = వివేకములేని మనుష్యుఁడు, విషయ—నమ్, విషయజ = స్త్రీస్రక్చందనాదివిషయములవలన పుట్టిన, కర్దమ = బురద మట్టిపూఁతతో (తన దేహరక్షణకొరకు), సంమార్జనమ్ = చక్కఁగా పులుముట, మట్టిపూఁతపూయుట యనుపనిని, మిథ్యా = వృథాగా, కురుతే = చేయుచున్నాఁడు, దురదృష్టవృష్టివిరసః, దురదృష్ట = తనపూర్వకృతదౌర్భాగ్యము అనెడు వృష్టి = వర్షము చేత విరసః = అలికి బిగినిజిగురునుపోగొట్టుకొన్నదైన దేహః = ఈశరీర మనెడి, గేహం = ఇల్లు, పతతిఏవ = పడిపోవునేగాని పైపూఁతచేత నిలువదు.

తా॥ ఈస్థూలశరీరము వట్టిమట్టికొంప, 50 పాళ్ళుపృథ్వీతత్త్వనిర్మితము. దీనికిబలమిచ్చితాను సుఖించుటకు అవివేకియైన మనుష్యుఁడు స్రక్చందనవనితావిత్తాదివిషయములను సంపాదించి యింటను న్నంతమాత్రమున తనకు భయము లేదని యుప్పొంగి పోవుచున్నాఁడు. ఈయనుభవము లన్నియు మట్టితో గట్టినయింటికి మట్టిపూఁతలవంటివే. కొంచెము వర్షము పడిన మట్టియిల్లు అంతయు నాని నాని కరగిపోవును. తుదకు మేననెడి ఈయిల్లు కూలక తప్పదు. అట్లె యీవిషయానుభవమునందు మైమరచి యిదే తా ననుకొను

చున్నప్పటికిని ఏనిపూర్వజన్మములలో చేయఁబడిన దుష్కృతముల ఫలము ఈశరీరమును నాశనము చేసియే తీరును. అతనిశ్రమ యంతయు వ్యర్థమే. అనిత్యములైన యీవిషయములు వానికి నిత్యసౌఖ్య మీయలేవు. అతఁడు చావక తప్పదు.

అవ॥ శరీరమే గృహ మనుట శ్రుతిస్మృతి న్యాయసిద్ధము. అందులో నన్నిటి కన్న అర్ధాంగియనఁబడుముఖ్యవిషయమైన భార్యవలని యనుభవ మెట్టిదో 5 శ్లోకములలో విరాగహేతువుగా వర్ణించుచున్నారు.

**భార్యా రూపవిహీనా మనసః క్షోభాయ జాయతే పుంసాం।**
**అత్యంతరూపాఢ్యా సా పరపురుషై ర్వశీక్రియతే॥ 30**

ప్ర : రూపవిహీనా = అందములేని, భార్యా = ఇల్లాలు, పుంసాం = పురుషుల యొక్క, మనసః = మనస్సునకు, క్షోభాయ = కలవరము, (దుఃఖము) కొఱకు, జాయతే = కల్గుచున్నది. అత్యంతరూపాఢ్యా = మిక్కిలి గొప్ప సౌందర్యముతో నొప్పుచున్న, సా = ఆభార్య, పరపురుషైః = పరపురుషుల చేత, వశీక్రియతే = స్వాధీనము చేసికొనఁబడుచున్నది.

తా॥ పురుషునిసంసారమునందు ముఖ్యముగా బంధించువిషయము (భార్యాసుఖము) భార్యయే. ఆమె యందములేనిది వికృతమైన రూపము గలది యైనచో, నామెను చూచినంతనే మనస్సునకు రోఁత (అసహ్యము) కల్గును. ఆమె కలవరమును, (దుఃఖము) కల్గించును. గాని సుఖమీయదు.

ఈవిధముగాఁ గురూపియైన భార్యవలన నతనికి సుఖము లేదు. పోనిమ్ము. ఉత్తమసౌందర్యవతియైన భార్యవలన సుఖము లేదా? యన్న, నామె సౌందర్యాతిశయము పరపురుషులకు కామము కల్గించును. వారు మాయోపాయములచేత, వానివలన ప్రయోజనము లేకున్న బలవంతముగా నామె నాక్రమించి తమ

వశము చేసికొందురు. దుర్బలుండగు భర్త తాను దగ్గరనుండికూడ తన భార్యను వారిబారినుండి రక్షించుకొనలేకుండును. ఒకప్పుడు తన ప్రాణమునకుకూడ ముప్పు వచ్చును. రావణాదిదుష్టరాక్షసులు గంధర్వాదిదేవతల నోడించి చంపి వారిరూపసంపన్న భార్యల జెర గొన్నారు దేవేంద్రవశీకృతయైనది, అహల్య. ఈకథయును లోకోత్తరసౌందర్యవతి యగు సీతాపహరణగాథయును, రామాయణప్రసిద్ధమేగదా. ఈవిధముగా అతిసుందరియైన భార్యవలన గూడ భర్త, సుఖ మనుభవింపలేడు. (భర్తయే ఆమె నవమానించుట కూడ జరుగును. అప్పు డాతనిమనస్థోభ వర్ణించుటకే వీలులేదు.) ఇట్లు తనకు బరమసుఖ మీయవలసినభార్య తనకు మహాదుఃఖకారణ మగును. 'భార్యా రూపవతీ శత్రుః' సుందరియైన భార్య తనకు శత్రువువంటిది, అను నార్యోక్తికలదు.

ఇట్టిదే "జన్మ దుఃఖం జరా దుఃఖం జాయా దుఃఖమ్।"

జన్మముదుఃఖము; ముసలితనము దుఃఖము; భార్యయు దుఃఖము; అనినానుడి.

అవ॥ ఆసుందరభార్యావిషయమును గురించియే యింకను చెప్పుచున్నారు.

**యః కశ్చిత్ పరపురుషో మిత్రం భృత్యోఽథవా భిక్షుః।**
**పశ్యతి హి సాభిలాషం విలక్షణోదారరూపవతీమ్॥ 31**

ప్ర॥ యః కశ్చిత్ = ఎవఁడోయొకఁడు, పరపురుషః = పరపురుషుఁడో, మిత్రమ్ = మిత్రుఁడో, భృత్యః = (తన) సేవకుఁడో, భిక్షుః = (చివరకు) బిచ్చగాఁడో యైనను, విలక్షణోదారరూపవతీమ్, విలక్షణ = సర్వసాధారణ లక్షణములకు మించిన, ఉదారరూపవతీమ్ = గొప్పఅందకత్తెను, సాభిలాషం = ఆమెను పొందవలె నన్నకోరికతో, పశ్యతి = చూచును, హి = కదా!

తా॥ ఆసౌందర్యవతి గుణాన్వితయు పతివ్రతయే కావచ్చును. కాని మనుష్యులు సహజముగా అందమైన వస్తువులను చూడవలె నని తాము వానిని పొందవలె నని కోర్కె గలిగి యుందురు. అందులో దనభార్య యిట్టిదని లక్షణములతో వర్ణించుటకు వీలుకానంత మిక్కిలి సౌందర్యము కలదైనచో నామెను తన మిత్రులు, సేవకులు, చివరకు బిచ్చగాండ్రుకూడ ఆమెను సాభిలాషముగా, అనగా నామె తమది కావలెను, తా మామెను పొందవలెను, అనుభవింపవలెను అను కోర్కెతో ఱెప్ప లార్పక చూచెదరు. తమ దృష్టుల నామెనుండి మరల్పలేరు. అప్పుడు భర్త పొందెడి క్షోభను వర్ణింపరానిది. తనకు మిక్కిలి తృప్తిని సంతోషము నీయవలసిన భార్యయే మహాదుఃఖ మిచ్చున దగును. అనుమాన మతనిని పెనుభూతమువలె ననేకవిధముల బాధించును. ఇది లోకానుభవసిద్ధమేగదా!

అవ॥ ఇంతవరకు కురూపి లేక రూపసి యగు భార్య ఎట్లు దుఃఖకారణమో వర్ణించి, యిక్కడ ఆ స్త్రీ చంచలస్వభావమువలన కలుగు దుఃఖమును చెప్పుచున్నారు.

**యం కఞ్చి త్పురుషవరం స్వభర్తు రతిసుందరం దృష్ట్వా।**
**మృగయతి కిం న మృగాక్షీ మనసేవ పరస్త్రియం**
**పురుషః ॥ 32**

ప్ర : సాధారణముగా పురుషః = పురుషుడు, పరస్త్రియంఇవ = (అందకత్తెయైన) పరపురుషునిభార్యనైనను, చూచి అభిలషించునట్లు, మృగాక్షీ = లేడికన్నులవంటి కన్నులుగల అందమైన తనభార్య, స్వభర్తుః = తన భర్తకంటె, అతిసుందరం = మిక్కిలియందగాడగు యం కంచిత్ పురుష వరం = ఏయొకపురుషశ్రేష్ఠుడైన పరనరుని, దృష్ట్వా = చూచి, మనసా = తన మనస్సుచేత, కిం న మృగయతి = అతని పొందును వెదుకకుండునా?

తా॥ అందమైన వస్తువు కంటపడినప్పుడు సహజముగా సామాన్యమైనవ్యక్తికి దానిని మరలమరల చూడవలెనని, తనది చేసికొని యనుభవింపవలెనని కోరిక కల్గును. పరుని యందమైన భార్యను జూచినప్పుడు స్వాభావికముగా పురుషున కామెయం దభిలాష కల్గును. అట్లే యాందమైన స్త్రీకిని దనభర్తకన్న మిక్కిలిసుందరుఁడైన పరపురుషు నెవనినైనఁ జూచినప్పు డామె కు మాత్ర మతనియందు సహజముగనే కామము జనింపకుండునా? ఆయందగాఁడు తనభర్తయైన నెంతబాగుండు నని మనస్సు నందైన ననుకొనకుండునా? ఆతలంపు ఆమెమగనికి సుఖమీయఁగలదా? ఆమె యట్లు కోరకుండఁ జేయగలఁడా? ఇట్టియామె ప్రవృత్తి యతనియొక్క అశాంతికి, దుఃఖమునకు, కోపతాపములకును కారణము కాదా?

అవ॥ లోకోత్తరసౌందర్యవతియగు భార్యవలన భర్తకుకోపతాపములే గాని రవ్వంతసుఖములేదని దృష్టాంతముతో నిరూపించుచున్నారు.

ఏవం సురూపనార్యా భర్తా కోపాత్ ప్రతిక్షణం క్షీణః।
నో లభతే సుఖలేశం బలి మివ బలిభు గ్బహు

శ్లోకః ॥ 33

ప్ర: ఏవం = ఈవిధముగా, బహుషు (బలిభుక్షు) = గృహస్థుఁడు వేసిన కొలదిపాటిబలిని మెక్కుటకు అనేక కాకములు పొంచియున్నప్పుడు ఏకః (బలిభుక్) = వానిలోనొకకాకి, బలిమ్ఇవ = బలిగా వేసినపదార్థము నువలె (అన్నపుమెతుకులు మొదలైన వానిని) న లభతే = పొందలేదో (ఎక్కువకాకు లున్నప్పుడు, ఒక్కొక్కదానికి దొరకునది అతిస్వల్ప మగును. ఒక్కొక్కదానికి రవ్వంతయు దొరకకపోవచ్చు), సురూపనార్యా = అనేకపరపురుషులచే నభిలషింపబడుచున్న సుందరియైన తనస్త్రీ కారణముగా,

భర్తా = భర్త కోపాత్ = భార్యపైగల కామతృష్ణ భంగపడి కోపముగా పరిణమించుటవలన, ప్రతిక్షణం = క్షణక్షణము, క్షీణః = క్షీణించినవాఁడై సుఖలేశం = సవ్వంతసుఖమునైనను, నో లభతే = పొందఁడు.

తా॥ గృహస్థుఁడు బలులుగా వేసినకొద్దిమెతుకులకు పెక్కు కాకులు మూగి పెనుగులాడుచుండును. అందులో నొకానొక కాకికి జిక్కినది ఒకమెతుకు రూపమైనబలి గూడ నుండదు. అట్లే అందమైన భార్యవలన కొంచెము సుఖమునైనను ఆమెభర్త పొందఁడు. కారణము పలువు రామెను బొందుటవలనగాని పొందుటకు బ్రయత్నించుటవలనగాని ఆమెపై దనకుఁ బుట్టిపెరుఁగు కోపముచేత బ్రతిక్షణము నతఁడు బాధపడుచుఁ, గృశించుచు నుండును. అట్లు అతనికి ఆమెవలన కొంచెమైనను సుఖము కల్గదు. పైగా అమితదుఃఖ మనుభవించును. ఆహా! "సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే" గీ. 2-62

విషయములందలి ప్రీతివలన కామము (తృష్ణ) (కావలయునను గట్టి కోరిక) పుట్టును, ఏకారణముచేత నైనను ఆకామము నెరవేరక అడ్డుపాటు(భంగము) కల్గునేని ఆకామమునుండి కోపము పుట్టి తననాశనమునకు దారితీయును. "తనకోపమె తన శత్రు"వను ఆర్యోక్తియు స్మరణీయములు.

అవ. భార్యావిషయము విరాగహేతువుగా ముగించుచున్నాఁడు.

వనితా నితాంత మజ్ఞా స్వాజ్ఞా ముల్లంఘ్య వర్తతే
యది సా।
శత్రు ర ప్యధికతరా పరాభిలాషి ణ్యసౌ కిముత॥ 34

ప్ర : అజ్ఞా = ప్రపంచజ్ఞానము లేనిదై, వనితా = తనభార్య నితాంతమ్ = ఎల్లప్పుడు, స్వాజ్ఞాం = తనయాజ్ఞను ఉల్లంఘ్య = మీరి, (అతిక్ర

మించి) వర్తతే, యది = ఆమె ప్రవర్తించునంశినచో, సా = ఆమె, శత్రోః అపి = శత్రువునకన్నను, అధికతరా = మూర్తీభవించినశత్రుత్వముగలదై అధికముగా భయదుఃఖములను కల్గించున దగును. అసౌ = ఈమె, పరాభిలాషిణీ (యది) = పరపురుషులను కలియఁ గోరిన దైనచో, కిముత = ఇకఁ జెప్ప వలసిన దేమున్నది? ఆదుఃఖము వర్ణింప నలవి గానిదని భావము.

తా॥ (జ్ఞానవిహీన) యుక్తాయుక్తములు, ఏది తగినదో, ఏది తగనిదో, తెలిసి ప్రవర్తింపలేనిదై, అందువలననే ఎప్పుడును భర్త మాటను వినక వాని యాజ్ఞల నుల్లంఘించునట్టిభార్య భర్తకు శత్రువునకన్న ఎక్కువ భయక్రోధదుఃఖములను గల్గించుపరమ శత్రువు అగును. ఇఁక నామె పరపురుషసాంగత్యమును గోరున దైనచో, భర్తదుఃఖములను బాధలను వర్ణించుటకే యలవికాదు. తనప్రియుఁడగు పరునితోఁ గలసి భర్తమరణమునకుఁ గూడ కారకురాలు కావచ్చును.

గమనిక : ప్రతికూలురాలు, సౌందర్యవతి, జారిణి యైనభార్య వలనఁ గురూప యైన భార్యవలనను గలుగుదుఃఖము వర్ణింపఁబడి నది. ఒకవేళ తనభార్య యంతరూపసికాక, కురూపగాక, సాధ్వియై, పరమపతివ్రతయై, తనకన్నివిధముల ననుకూలవతియై, ఈలోకమందే స్వర్గసుఖ మీయఁ గల్గినదైనను, మనుష్యశరీరము నకు సహజగుణములైన ఆధివ్యాధులు రాకుండఁబోవు. అప్పుడతఁ డామెకై పడుశ్రమ మనోవ్యథ అత్యధిక మగును. ఆమెతోడి వియోగ మతనికి దుస్సహ మగును. ఆమె మరణించినచో నతని దుఃఖము వర్ణింపరానిది. ఈవిధముగా భార్యయనువిషయము అన్నివిధముల మనుష్యునకు దుఃఖము గల్గించునదే యగును. ఇట్లు భార్యయందు దుఃఖదోషానుదర్శనము ఆమెయెడల వైరా గ్యమునకు చక్కనిమార్గ మని కవి నిపుణముగా సుదీర్ఘముగా

చర్చించినాఁడు. 'అసక్తిః రనభిష్వంగః పుత్రదారగృహాదిషు' అను గీతాస్మృతివచనానుసారముగా నున్నది.

అవ॥ పరమప్రియమైన భార్యవలనదుఃఖాదులను వర్ణించి, యిఁక సంతానమును గూర్చి చెప్పుచున్నారు.

లోకో నాపుత్ర స్యాస్తీతి శ్రుత్యాఽ స్య కః
ప్రభాషితో లోకః।
ముక్తిః సంసరణం వా తదన్యలోకో ఽథవా నాద్యః॥ 35

ప్ర : అపుత్రస్య = పుత్రులు లేనివానికి, లోకః = లోకము, న అస్తి = లేదు, ఇతి = అనెడు, శ్రుత్యా = శ్రుతివాక్యముచేత కొడుకులులేని యీమానవునకు, కః లోకః = ఏలోకము, ప్రభాషితః = చెప్పఁబడినది? ముక్తిఃవా = మోక్షలోకము చెప్పఁబడినదా? (లేక) ఇక్కడ సంసారము చెప్పఁబడినదా? అథవా = లేదా, తదన్యలోకః = ముక్తిహలోకములు రెంటికి భిన్నమైన మఱొకలోకమా? (ఊర్ధ్వలోకములలో మిగిలిన భువ,స్సువో,మహో,జన, తప,స్సత్యలోకము ఽ-అతల,వితల, సుతల, మహాతల, పాతాళాది లోకములు, ఇవికాక జీవుల పుణ్యాతిశయమువలన వచ్చు వేఱులోకములలో నొకటియా?) ఈవిధముగా మూఁడుప్రశ్నలువేసి, యుత్తరములు చర్చించుచున్నారు. ఆద్యః = మొదటిది అనగా మోక్ష(లోక)ము, న = కాదు.

తా॥ "పుత్రులు లేనివారికి లోకము లేదు" అని శ్రుతి చెప్పుచున్నది. ఇక్కడ అది యేలోకము నుద్దేశించి చెప్పుచున్నది? అది మోక్షమా? లేక ఈలోకములోనే ఉత్తమస్థితియా? కాక, శ్రుతులు, పురాణములు వర్ణించు భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకము లనెడు ఊర్ధ్వలోకములలో నొకటియా! లేక, అధోలోకములు-అతల, వితల, సుతల,తలాతల, పాతాళాదిలోకములలో నొకటియా? ఇవికాకజీవుల పుణ్యాతిశయములనుబట్టి చెప్పబడిన భిన్నమైన కైలాస, వైకుంఠ, గోలోకములు మొదలగువానిలో నొకటియా?

ఈరకమైన చర్చ విచారింపఁదగినదది. అందులో మొదటి దైన మోక్షము వచ్చు ననుటకు వీలు లేదు.

అవ॥ ఎందు కనఁగా,

సర్వేఽపి పుత్రభాజ స్తన్ముక్తౌ సంసృతి ర్భవతి ।
శ్రవణాదయోఽ ప్యుపాయా మృషా భవేయుః
స్తృతీయేఽపి ॥ 36

ప్ర : పుత్రభాజః = పుత్రులుకల్గినవారుగా, సర్వే అపి = అందఱు సంభవింపవచ్చును. తన్ముక్తౌ=ఆపుత్రవత్త్వమే వారిముక్తినిమిత్త మనుపక్ష మందు, (ముక్తిహేతువు) సంసృతిః = పుత్రులనుగనుట, యనుసంసారవిశే షమే, భవతి = అగుచున్నది. [అందువలన ముక్తికొఱకు కర్తవ్యములుగా చెప్పఁబడిన] శ్రవణాదయః = బ్రహ్మవిదునిముఖమునుండి ఆత్మతత్త్వమును వినుటయు, విన్నదానిని మననముచేయుట, దానియందు నిదిధ్యాసన మను ఉపాయాఃఅపి = అసాధారణములుగా సంభవించుసాధనములు, మృషా= వ్యర్థ మైనవి, భవేయుః = కావలసివచ్చును. (ఈవిధముగా పుత్రవత్త్వము ముక్తి హేతు వనుట చెల్లదు. మొదటి వికల్పమగు ముక్తిలోకము, పై శ్రుతి వాక్యార్థము కాఁజాలదు. తృతీయేఅపి = మూడవపక్షవిషయమందుఁగూడ (పొసగమియే సుమా)

తా॥ పుత్రులను గనుటవలననే జనులకు మోక్షము వచ్చు ననుట సరిగాదు. ఎందువలన? తఱచుగా జనులందఱకు పుత్రులు కల్గుట సంభవింపవచ్చును. అట్లు పుత్రులను గల్గియుండుటయే కారణముగా వారందఱు నిత్యసుఖరూప మోక్షమును పొందినా రనవలసివచ్చును. అప్పుడు వారికి ఈలోకమునందు సంసారము నకు సంబంధించిన దుఃఖానుభవ ముండకూడదు. అదియునుగాక

కర్మతంత్రుఁడైన జీవుఁడుగా మరల మరల పుట్టుట అనుసంసార విస్తారదుఃఖ ముండకూడదు. కాని కొడుకులు కలవారు మోక్షానందవాసనయే లేక ఈజన్మములో అనేకదుఃఖము లను భవించుట ప్రత్యక్షసిద్ధము. మరణానంతరము వారు మోక్షమును పొందఁగూడదా? అనుశంకయుఁ గుదురదు. (ఎందుకనఁగా కారణమువెంటనే కార్యమగు ఫలము రావలెను. పుత్రుఁడు కల్గుట వలన మోక్షము రావలెనన్నచో కలిగినవెంటనే అది సిద్ధింపవలసి యుండును. అట్టిది మన కనుభవములోఁ గనఁబడుట లేదు. సంసారమనఁగా కర్మఫలమగు జన్మమందు అల్పసుఖము దుఃఖానుభవ మనినయెడల, పురాణములవలన బహుపుత్రకులైన భరతుఁడు, నహుషుఁడు మొదలైనవారు మరణానంతరము జింకగా, మండుఁడుగా (భరతుఁడు) ఇంద్రుఁడు, కొండచిలువ (పాము) వంటిజన్మము లెత్తినట్లు పురాణములు చెప్పుచున్నవి. కావున ఈ పుత్రవంతులకు నిత్యానందముక్తి రాలేదనుట స్పష్టము. మఱొక ముఖ్యకారణము, మోక్షమునకు పుత్రోదయముగాక శ్రుతులు సాక్షాత్సాధనమునుగా వేఱుఉపాయమును చెప్పినవి. అది శ్రవణము, మననము, నిదిధ్యాసన మను బ్రహ్మసమాధిత్రయము. పుత్రునివలననే మోక్ష మన్నయెడల శ్రుతి చెప్పిన ఈముఖ్యకారణము అబద్ధమును వ్యర్థమును కావలసివచ్చును. ఇది సర్వవిధముల అనిష్టము. కావున పుత్రవత్త్వమే మోక్షసిద్ధికి హేతువుగాదు. 35వ శ్లోకములో 'నాద్యః' అన్నది ఋజువైనది.

ఇఁక మూఁడవవికల్పము, లేక, పక్షముకూఁడ మొదటివాని వలెనే అసంబద్ధమైనది, సరికాదని తాత్పర్యార్థము.

అవ॥ మూడవ, రెండవ పక్షములందుఁ గూడ పై శ్రుతి వాచ్యార్థము కుదర దని నిరూపించుచు ఆ శ్రుతినిర్దిష్టార్థమును జెప్పి సమన్వయించు చున్నారు.

తత్రాప్యుపాయసత్త్వా ద్వితీయ పక్షేఽప్యపుత్రస్య।
పుత్రేష్ట్యాదికయాగప్రవృత్తయే వేదవాదోఽయమ్॥ 37

ప్ర : తత్రాప్యుపాయసత్త్వాత్ = ముక్తికిని, ఇహలోకమునకును భిన్నమైన అపరలోకములు వచ్చుటకు వేఱువేఱు ప్రకృష్టోపాయములు శ్రుతియే చెప్పియుండుటవలన, పుత్రవత్త్వము ఈపరలోకలాభమునకు సాధనము కానేరదు. (ముక్తికి కానట్లే) [విష్ణువు నుపాసించువారు వైకుంఠము, మహాదేవు నుపాసించువారు కైలాసము పొందుదు రనుట శ్రుతిసమ్మతము. ఇట్లే తక్కిన ప్రత్యేక లోకప్రాప్తివిషయమునకు, ప్రత్యేకసాధనోక్తి పుత్రవత్త్వభిన్నముఁగా గలదు.] ద్వితీయ పక్షేపి = (రెండవపక్షము) ఈలోకములోనే అభ్యుదయము ఉత్తమ సుఖము వచ్చు ననుటకుఁగూడ అదే సమాధానము, దానికి శ్రుతి, పుత్రవత్త్వముగాక వేఱు ప్రత్యేకోపాయములు చెప్పుటయే. అపుత్రస్య = పుత్రులులేనివానికి పుత్రేష్ట్యాదికయాగప్రవృత్తయే = పుత్రులుకావలసినవారు చేయవలసిన పుత్రకామేష్టి మొదలైన యాగములందు వానికిఁ బ్రవృత్తి గలించుటకొఱకేసుమా! అయంవేదవాదః = (35వ శ్లో) అపుత్రునకు లోకము లేదని సామాన్యముగా వేదము చెప్పుటయొక్క ముఖ్యాభిప్రాయము (అని సమన్వయము.)

తా॥ రెండవమూడవపక్షములుఁగూడ న్యాయశ్రుతివిరుద్ధములని ఒకేసమాధానము చెప్పినారు. పుత్రులు కల్గుట అను కారణముగాక ఆయాలోకములు ఆయాసుఖఫలములు కల్గుటకు వేఱువేఱుక్రియలు, ఉపాసనలు శ్రుతులు పురాణములు, నిర్ణయించి చెప్పినవి. విష్ణూపాసనము విష్ణులోకలాభమునకు, శివు నుపాసించుట కైలాసప్రాప్తికి, గోదానము గోలోకప్రాప్తికి, అసాధారణ కారణములని చెప్పినవి. ఇది తృతీయపక్షవిషయము. ఇఁక

రెండవపక్షమగు ఈలోకమునందు ఉన్నతస్థితులగు ధనవంతుఁడగుట (ఐశ్వర్యవంతుఁడగుట) మంచికుమారులు గలవాఁడగుట, పశు ధాన్యాదిసంపత్తి మొదలైనవాని ప్రాప్తికి వేఱువేఱుక్రియాకలాపములు శ్రుతులు చెప్పినవి. అందువలన అవి పుత్రులు పొందుటవలన వచ్చిన ఫలము లనరాదు. మఱి శ్రుతి అపుత్రులకు (ఏ)లోకము లేదని ఎందుకుఁ జెప్పినది? అన్నచో వేదము ఏదిపొందఁగోరువాని కాఫలము నిచ్చు యజ్ఞయాగాదికర్మభేదములు చెప్పినది. కావున పుత్రులు లేనివారికి పుత్రకామేష్టి మొదలైన యాగములు చేయవలెనని ఆయజ్ఞాదులందు వారిని ప్రవృత్తులను చేయుట ముఖ్యోద్దేశమని శ్రుతితాత్పర్యార్థమునకు శ్రీశంకరభగవత్పాదులవారి చక్కని సమన్వయము.

అందువలన పుత్రులను గన్నంతమాత్రమునఁ బుణ్యలోకములు వచ్చునని కాదు. పుత్రులు లేనివారికి 'పుం' అను పేరు గలనరకము వచ్చుననియు, పుత్రులు కలవారికి ఆనరక ముండదనియు కావున అపుత్రుఁడు, యజ్ఞయాగాదిప్రవృత్తుఁడు కావలయు నని దానియర్థము.

ఇంతకుఁ జెప్పదలచిన ముఖ్యవిషయము మోక్షము కోరువారు దానికిఁ జెప్పిన శ్రవణమనననిదిధ్యాసనరూపముఖ్యసాధనసంపత్తి సాధింపవలెనేగాని భోగైశ్వర్యాదిప్రసక్తుఁడు మాత్రము కాఁగూడదు. మానవజన్మము పరమపురుషార్థమగు మోక్షమును సాధింపక వ్యర్థపుచ్చరాదని ధ్వనిరూపప్రబోధము. "అఘాయు రింద్రియారామో మోఘం పార్థ సజీవతి" గీ 3-16. "ఓ యర్జునా! పాపజీవనుఁడు, విషయములందుఁ దనయింద్రియములతోడ రమించువాఁడై ప్రత్యగాత్మ

యందు రతిలేనివాఁడై వ్యర్థముగా జీవించుచున్నాఁడు" అను గీతాసూక్తి స్మరణీయము.

అవ॥ ఆత్యంతికసుఖము రాదుసరిగదా! పుత్రులవలన పెద్ద ఆందోళన చింత, శ్రమ తప్ప సాధారణసుఖముకూడ లేదనుచున్నారు.

**నానాశరీరకష్టైర్ధనవ్యయైః సాధ్యతే పుత్రైః ।**
**ఉత్పన్నమాత్రపుత్రే జీవితచిన్తా గరీయసీ తస్య ॥ 38**

ప్ర: పుత్రః = కొడుకు, నానాశరీరకష్టైః = శరీరముతో, చేయవలసిన అనేకములైన కష్టములతోఁగూడిన పనులచేతను, ధనవ్యయైః = (ఎక్కువగా) ధనమును వెచ్చించుటలచేతను, సాధ్యతే = పొందఁబడును, ఉత్పన్నమాత్రపుత్రే = కుమారుఁడు పుట్టినంతమాత్రముననే, తస్య = ఆకుమారునియొక్క జీవితచిన్తా = ఇతడు బ్రతికి బట్టకట్టునా అను ఆతురత, గరీయసీ = వాని పుట్టువునకు ముందున్న కష్టములకన్న నెక్కువ దగును.

**తా:** పుత్రులు కలుగవలె నని కోరుతల్లిదండ్రులు పలు పాట్లు పడుదురు. దానికి వ్రతములు, తపస్సులు, ఉపవాసములు యాగములు, తీర్థయాత్రలు మొదలైనవి శరీరమునకు మిక్కిలి కష్టము కల్గించునవి చేయుదురు. వీనికేని దానధర్మములకును ఎక్కువధనముకూడ వెచ్చింపవలసియుండును. కొడుకు పుట్టకముందరివీకష్టములు. ఇఁక వాఁడు పుట్టిన తరువాతవచ్చునవి కష్టతరములనేకములు. వీఁడెట్లు బ్రతికి బట్టఁగట్టునా? అని అతనిజీవించుటను గుఱించిన దుఃఖము మిక్కిలిగొప్పది. కొందరుపిల్లలకు పుట్టుకతోనే అనేకములైన జబ్బులు, రోగములు వచ్చును. వానికి ప్రతిక్రియలాలోచించి చేయింపలసియుండును. ఇట్లు ఈ మహాదుఃఖప్రాప్తిహేతువు సుతుఁడు.

అవ : పుత్రుఁడు జీవించినను దుఃఖకారియే. ఎట్లన్నచో,

జీవన్నపి కిం మూర్ఖః ప్రాజ్ఞః కిం సుశీలభాగ్భవితా।
జారశ్చౌరః పిశునః పతితో ద్యూతప్రియః క్రూరః॥ 39

ప్ర : జీవన్ అపి = (పుత్రుడు) జీవించుచున్నవాఁడు (పెరుఁగుచున్న వాఁడు) అగుచుండఁగా మూర్ఖః కిం = చదువురాని మూర్ఖుఁడగునా? కాక ప్రాజ్ఞః కిం = జదువుకొని పండితుఁడు, వివేకవంతుఁడు అగునా? శీలభాక్ = మంచినడవడి కలవాఁడు భవితావా = కాగలఁడా? కాక, జారః = పరస్త్రీరతుఁ డగునా చౌరః = దొంగలతో సంబంధము కలవాఁడగునా. (అధార్మికుఁడు లేక దుశ్శీలుఁడగునా?) లేక, పిశునః = లోభియగునా? పతితః = పాపములు జేసి అవినీతిపరుఁడగునా? ద్యూతప్రియః = జూదములం(దాసక్తి)దిష్టము కల వాఁడగునా? క్రూరః = క్రూరకర్ముఁడగునా?.

తా : ఒకవేళ తనకుమారుఁడు అదృష్టవశమున జీవింపఁగల్గినను దండ్రికి సుఖము కల్గింపఁడు. కొడుకు భావిజీవితమును గూర్చి తండ్రిమనస్సు అనేకవిధములుగా సంక్షోభము చెందు చుండును. వీఁడుచదువుకొని పండితుఁడగునా? జారుఁడు, చోరుఁడు లోభి, పాపి, పతితుఁడు, జూదరి, అయి క్రూరకర్ముఁడగునా? అని యిట్లు నిత్యము చింతాపరంపరలతో ఆందోళన చెందవలసి వచ్చును.

అవ : ధనాదివ్యామోహముచే దుశ్శీలపుత్రుఁడు తల్లిదండ్రులచావునకు కూడ యత్నించుట ప్రత్యక్షము.

పితృమాతృబంధుఘాతీ మనసః ఖేదాయ జాయతే పుత్రః॥
చిన్తయతి తాతనిధనం పుత్రో ద్రవ్యాద్యధీశతాహేతోః 40

ప్ర : పుత్రః = కుమారుడు, పితృమాతృబంధుఘాతీ (సన్) = తండ్రికి, తల్లికి, బంధువులకు (హింస) దుఃఖముకల్గించు వాఁడగుచు (తండ్రి

యొక్క) మనసః = మనస్సునకు, ఖేదాయ = దుఃఖముకొఱకే, జాయతే = కలిగినవాఁడగును. (మఱియు,) పుత్రః = కుమారుఁడు, ద్రవ్యాద్యధీశతా హేతోః = తండ్రిసంపాదించిన ఆస్తి (ద్రవ్యము) సర్వమునకు తానే యజమానుఁడుకావచ్చు అనుతలంపు కారణముగా, తాతనిధనం = తండ్రిమరణమునుగుఱించి, చిన్తయతి = ఆలోచించువాఁ డగును.

**తా :** పుత్రుఁడు పెరుఁగుకొలఁది తల్లిదండ్రులకు మిగిలిన బంధువులకు బాధకల్గించువాఁ డగును. ఈవిధముగా నతఁడు తండ్రికి సంతోషము, సుఖము కల్గించుటకుబదులు దుఃఖకారియే యగును. ఒక్కొక్కప్పుడు తండ్రిమరణించినఁగాని యీాయన సంపాదించినయాస్తి, ద్రవ్యము పూర్తిగా నిరాటంకముగా తన యధీనము కాదనుతలంపుతో అక్షిప్రిత్రార్జితధనాదులయాజమాన్య సిద్ధికై తండ్రిచావును, కోరువాఁడును, దానికుపాయమాలోచించువాఁడును, చంపువాఁడును అగును. ఇట్లు దుష్టుఁడైన కుమారుని వలన తండ్రికి సుఖమేలేదు.

అవ : పుత్రుఁడు గుణవంతుఁడైనను చింతాదుఃఖకారియే యను దోషమును ప్రకటించుచున్నాఁడు.

సర్వగుణై రుపపన్నః పుత్రః కస్యాపి కుత్రచి ద్భవతి।
సోఽ ల్పాయూ రుగ్ణో వా హ్యనపత్యో వా, తథాఽ పి
ఖేదాయ॥ 41

ప్ర : కస్యాపి = ఒకానొకనికి, కుత్రచిత్ = ఒకానొకవేళ సర్వగుణైః = సకలమైన మంచిగుణములచేత, ఉపపన్నః = కూడుకొన్నటువంటి, పుత్రః = కుమారుఁడు, భవతి = కల్గును, తథాఽపి = అట్లయ్యును, సః = అతఁడు, అల్పాయుః, హి = కొద్దిసంవత్సరములు మాత్రమే జీవించువాఁడు అగుచో వా = లేక, రుగ్ణః = రోగపీడితుఁడు అగుచో లేక, అన

పత్యః = సంతానము లేనివాఁడు అగుచో (ఈకారణములవలన) ఖేదాయ = దుఃఖముకొఱకే, భవతి = కల్గినవాఁడగును.

తా : సాధారణముగా సద్గుణశోభితుఁడైన పుత్రుఁడు పుట్టుట యరుదు. ఒకానొకనికి, ఒకానొకచోట అట్టిసర్వగుణ శోభితుఁడైన పుత్రుఁడు కల్గవచ్చును. కాని అతఁడు చిరకాలము జీవించువాఁడు కాకపోయినను, జీవించినను ఆరోగ్యముకలవాఁడు కాకపోయినను అదికూడ సమకూరినచో అతఁడు సంతానము లేనివాఁడగునేని సద్గుణశోభితుఁడైన కుమారుఁడుకూడ తండ్రికి దుఃఖకారకుఁడే యగును గాని నిత్యసుఖసంతోషము లీయఁడు.

అవ : ఇట్లుపుత్రుఁడనువిషయతత్త్వమును గ్రహింపలేక భ్రాంతులై పుత్రదుఃఖ మాసపడువారు. మూర్ఖులనుచున్నారు

పుత్రాత్సద్గతి రితి చే త్తదపి ప్రాయోఽస్తి యుక్త్యసహమ్।
ఇత్థం శరీరకష్టై ర్దుఃఖం సంప్రార్థ్యతే మూఢైః॥ 42

ప్ర : పుత్రాత్ = కుమారునివలన, సద్గతిః = పుణ్యలోకములు కలుగును ఇతిచేత్ = అనిచెప్పినయెడల, తద్అపి = ఆమాట ప్రాయః = మిక్కిలిగా యుక్త్యసహమ్ = తర్కమునకు నిల్వనిదిన్ని యమే అస్తి = అగుచున్నది. ఇత్థం = ఈవిధముగా, మూఢైః = (మూర్ఖులచేత) వివేకహీనుల చేత, శరీరకష్టైః = అనేకవిధములుగా శరీరమునకు కష్టముకల్గించు (పుత్రార్థుల)వ్రతనియమాదులచేత, దుఃఖం = దుఃఖమే సంప్రార్థ్యతే = మిక్కిలిప్రార్థింపఁబడుచున్నది.

తా : ఈవిధముగా "పుత్రులవలన సుఖము కల్గును పుణ్యలోకములుకల్గును" అనుమాటలు తర్కమునకు ఏమాత్రము నిలువవని నిరూపింపబడినది. ఆసుఖసాధనములు, పుణ్యలోకప్రాప్తి హేతువులు పుత్రులకంటె వేరుగా శ్రుతి నొక్కిచెప్పినది. ఇక

ఇక మనుష్యులు సుఖపుణ్యలోక సాధనములుగా పుత్రులనుగోరి వ్రతనియమాదులచేతశరీరమును గష్టపెట్టుచున్నారన్న; వారుసుఖమునుగాక దుఃఖమునే ప్రార్థించువివేకహీను లనియే చెప్పనగును. కర్మతంత్రుఁడగు జీవుఁడు తన్ను, దానే వైదికమార్గపరత్వముచే సంసారదుఃఖసాగరమునుండి ఉద్ధరించుకొనవలయునని సూచన.

అవ : పిత్రాదిబంధువుల క్షణికసంబంధముగూర్చి చెప్పుచున్నారు.

**పితృమాతృబంధుభగినీపితృవ్యజామాతృముఖ్యామ్।**
**మార్గస్థానా మివ యుతి రనేకయోనిభ్రమాత్ క్షణికా॥ 43**

ప్ర : పితృ-ముఖ్యానామ్- పితృ = తండ్రి, మాతృ = తల్లి, బంధు బంధువు, భగినీ = సోదరి, పితృవ్య = తండ్రిసోదరుఁడు జామాతృ = అల్లుఁడు, ముఖ్యానామ్ = మొదలైనవారియొక్క- యుతిః = కలిసియుండుట అనేకయోనిభ్రమాత్ = జీవులు అనేకజన్మములలో తిరుగుటవలన, మార్గస్థానామ్ = దారిలో ప్రయాణమందు కలిసికొనుబాటసారులయొక్క- (యుతిః) ఇవ = కలయికవలె, క్షణికా = క్షణమాత్రమే స్వల్పకాలమే యుండునది. (శాశ్వతముకాదు).

తా : పెద్దపెద్ద ప్రయాణములు చేయుబాటసారులు మధ్యలో కలిసికొందురు. కొంతకాలము ప్రయాణముచేసి ఎవరిత్రోవను వారు పోవుదురు. వారు కలిసియుండునది అతిస్వల్పకాలము. అట్లే జీవు లనేకజన్మములెత్తుచుందురు. అందులో ప్రతిజన్మములోను వేలువేలు తండ్రులు తల్లులు, సోదరులు, అక్కచెల్లెండ్రు, పినతండ్రి పెదతండ్రులు, అల్లుండ్రు, ఇంకను అనేకులైన ఇతరబంధువులు కొద్దికాలము కలిసియుండి మృత్యువువలన వేరైపోవుదురు. ఈ కొద్దికాలములో స్నేహము మోహము పెంచుకొని వియోగము వచ్చినప్పుడు దుఃఖించుట అవివేకము.

అవ : ఇఁక మిత్రులను, శత్రువులనుగుఱించి చెప్పుచున్నారు.

దైవం యావద్విపులం యావత్ప్రచురః పరోపకారశ్చ।
తావత్సర్వే సుహృదో వ్యత్యయతః శత్రవః సర్వే॥ 44

ప్ర : యావత్ = ఎంతవఱకు, (మనుష్యునియొక్క) దైవమ్ = ప్రారబ్ధధనాదిసంపద విపులః = విస్తృతమో, యావత్ = ఎంతవఱకు, (అతనియొక్క,) పరోపకారః = ఇతరుల కుపకారము చేయుట, ప్రచురః ఎక్కువగా నుండునో, తావత్ = అంతవఱకు, సర్వే = అందరు సుహృదః = అతనికి మిత్రులుగా నుందురు వ్యత్యయతః = ఆభాగ్యపరోపకారములు తారుమారైనచో సర్వే = పైయందఱుమిత్రులు శత్రవః = శత్రువులు అగుదురు.

తా : మనుష్యుఁడు అదృష్టవశమున ధనధాన్యములతో దులతూగుచున్నప్పుడు, అతనికి పరోపకారబుద్ధి ఎక్కువయుండి ఎక్కువమందికి సహాయము చేయుచున్నంతవఱకు అందఱు అతనికి మిత్రులే అగుదురు. పరిస్థితులు మాఱినచో అతనిభాగ్యము పోయి దరిద్రుఁడగుట, అతనిపరోపకారబుద్ధి తగ్గుట జరిగినచో, ఆమిత్రులందఱు అతనికి శత్రువు లగుదురు. ఈపరులశత్రుత్వమిత్రత్వములు కూడ స్థిరమైనవి కావు. అందువలన వానివలన సంతసించుట, దుఃఖించుట వివేకముకాదు. "ఎప్పుడు సంపద గలిగినప్పుడు బంధువులు వత్తురు" అనియు, తమతమనెలవులు తప్పిన తమమిత్రులె శత్రు లౌట తథ్యము సుమతీ" అనియు సుమతీశతకసూక్తులు.

అవ : సాధారణముగా మనుష్యులస్వభావమును వర్ణించుచున్నారు.

అశ్నన్తి చేదనుదినం పన్ది న ఇవ పర్ణయన్తి సన్తృప్తాః।
తచ్చేత్ ద్విత్రిదినాన్తర మఖిని న్దన్తః ప్రకుప్యన్తి॥ 45

ప్ర . జనాః అతిథులులేక ఆశ్రితజనులు ఒకగృహస్థునింట అనుదినమ్ = ప్రతిదినమును, అశ్నన్తి చేత్ = తినుచుండినచో, సన్తృప్తాః = మిక్కిలి సంతుష్టులై, అతనిని, వందినః ఇవ = ముఖస్తుతిచేయువందిమాగధులవలె, (భట్రాజులవలె,) వర్ణయన్తి = వర్ణింతురు, (పొగడుదురు) తత్ = ఆభోజనము, ద్విత్రిదినాంతరం చేత్ = రెండు,మూఁడుదినము లెడము కల్గిన వారే అభినిన్దన్తః = అతనిని బాగుగా నిందించువారై, ప్రకుప్యన్తి = అతని యెడల మిక్కిలికోపింతురు.

తా : తమకుఁ జక్కఁగా బిండివంటలతో షడ్రసోపేతముగా నెవరు ప్రతిదినము సంతృప్తిగా భోజనము పెట్టుదురో వారిని మహాసంతోషముతో వంధిమాగధులవలె, భట్రాజులవలె తిన్న జనులు పొగడుదురు. ఏకారణముననో అట్లు చేయలేక ఆలస్యముగా మధ్య రెండుమూడుదినములు ఎవరు భోజనము పెట్టుట మానివేయుదురో, వారియెడల జనులు కోపించినవారై అన్నదాతలుకానివారిని మిక్కిలి నిందింతురు. కావున ఇట్టిస్వభావము గల జనులను మెప్పింపవలె ననుకొనుట అజ్ఞానము.

అవ : భార్యాపుత్రాదులు, బంధువులు. అతిథ్యభ్యాగతులగు మనుష్య విషయములవలన నెట్లు సుఖములేదో చెప్పి, మనుష్యునకు ముఖ్యమైన మఱొక కోరిక, ధనముమీఁదికోరెలో గల దుఃఖమును వర్ణించుచున్నారు. దారైషణ దోషవర్ణనానంతరము పుత్రైషణ, ధనైషణదోష నిరూపణము, వైరాగ్య పర్యవసానార్థము.

దుర్భరజఠరనిమిత్తం సముపార్జయితుం ప్రవర్తతే చిత్తమ్।
లక్షావధి బహువిత్తం తథాఽప్యలభ్యం కపర్దికామాత్రమ్॥
46

ప్ర : దుర్భరజఠరనిమిత్తమ్ = నింపుటకుపీలుకాని ఆకఁలిబాధ కారణముగా దానినివారణకొరకు లక్షావధి = లక్ష (ల) కొలది, లక్షవరకైనను,

బహువిత్తమ్ = ఎక్కువధనము సముపార్జయితుమ్ = చక్కఁగా సంపాదింటకు చిత్తమ్ = మనస్సు ప్రవర్తతే = పనిలోనికి దిగును. (కాని,) తథా = ఆప్రకారముగా అట్లు, కపర్దికామాత్రం = (చిల్లి) గవ్వయైనను, అలభ్యమ్= దొరుకదు.

తా : ధనమునుసంపాదించుట చాలకష్టము. ధనము సంపాదించుటకు ముఖ్యకారణము మనుష్యుని నిత్యము పీడించు ఆకలిబాధ. అతఁడందుచే లక్షలకొలది ధనమును సంపాదింపవలె నని పూనుకొనును. కాని ఒకచిల్లిగవ్వయైనను తేలికగా దొరుకదు. ఇట్లు ధనమును సంపాదించుట దుర్ఘటము.

అవ : అదిలభించినఁ గల్గుకష్టములు, దుఃఖములు వర్ణించుచున్నారు.

లబ్ధశ్చే దధికోఽర్థః పత్న్యాదీనాం భవే త్స్వార్థమ్॥
నృపచోరతోఽప్యనర్థ స్తస్మాద్ ద్రవ్యోద్యమో వ్యర్థః॥47

ప్ర : అధికః, అర్థః = ఎక్కువధనము, తానాశించునట్లు లక్షలు లబ్ధః చేత్ = లభ్యమైనయెడల, అది, పత్న్యాదీనామ్ = భార్య మొదలైనవారికి అనఁగా కొడుకులు, కూతుండ్రు ఇతర బంధువులు మొదలైనవారికి, స్వార్థమ్ సొంతము, భవతి = అగును. (మఱియు) నృపచోరతః = దానిని పన్నుల రూపముగా నపహరించు రాజులవలన, తెలియకుండ ఎత్తుకొనిపో నెంచుదొంగలవలన, అపి = కూడ అనర్థః = కష్టమును, నష్టమును గల్గించున దగును. తస్మాత్ = అందుచేత, ద్రవ్యోద్యమమ్ = డబ్బుకోసము చేసినచేయుయత్నము, వ్యర్థః = వృథాయగును.

తా : అతికష్టముతో మనుష్యుఁడు ఒకవేళ లక్షలకొలది ధనము సంపాదించినను తాను దాని ననుభవింపలేఁడు. అతని భార్య సొమ్ములకని చీరెలకని ఈధనమును వాడుకొనుచు ఇతర బంధువులు కొడుకులు, కూఁతుండ్రు వారివారికోర్కెలను ఈధన

ముతో దీర్చుకొందురు. అనగా ఈధనము వారిభోగ్యసాధనమై వారివారికి సొంతమగును. ఇదిగాక రాజులుపన్నులు మూలముగా కాఁజేయుదురు. దొంగలు తెలియకుండఁ కాఁజేయుదురు. ఈవిధముగా అతనిధనార్జన ప్రయత్న మంతయు తనకు వ్యర్థ మైనదగును. తుదకు శ్రమయే మిగులును. కాన ధనార్జనమునకై జీవితమంతయు వృథా చేయరాదు. వైరాగ్యము క్రమక్రమముగా నభ్యసింపవలె నని సూచన.

అవ॥ అధనమును గుఱించియే చెప్పుచున్నారు.

అన్యాయ మర్థభాజం పశ్యతి భూపో ఽధ్వగామినంచౌరః।
పిశునో వ్యసనప్రాప్తిం దాయాదానాం గణః
కలహమ్॥ 48

ప్ర : భూపః = రాజు, అర్థభాజమ్ = ధనవంతుని, అన్యాయం = అన్యాయముగా ధనమును సంపాదించినవానినిగా పశ్యతి = చూచును. చౌరః = దొంగ, అధ్వగామినమ్ = అతఁడు ప్రయాణము చేయువాఁ డెప్పు డగునా యని చూచును. పిశునః = కొండెగాఁడు లేక దుర్జనుఁడు (ఖలుఁడు) వ్యసనప్రాప్తిం = ఈధనవంతునకు సప్త వ్యసనలోలుఁ డెప్పుడగునా యని పశ్యతి = చూచును. దాయాదానాం గణః = జ్ఞాతులసమూహము (అతనిధనములోఁ దమకు పాలు రావలె నని యనుకొనువారు జ్ఞాతులు, పుత్రాదులును) కలహమ్ = పోట్లాటను పశ్యతి = జూచును.

తా : ఒకఁ డెక్కువధనము సంపాదించినను అది వానికి దుఃఖమునకే కారణ మగును. ఎట్లు? రాజు అతఁ డదియన్యాయముగా సంపాదించె నని వానిపై దావులు జరుపుట, పన్ను లెక్కువ వేయుట, బంధించుట చెఱఁబెట్టుట మొదలగుబాధలు కల్గించును. దొంగ, ఇంటిలోఁబడి దోచుకొనుటకు ఆధనవంతుఁడు

ఇల్లు వదలి యెప్పుడు ప్రయాణము చేయునా యని చూచుచుం డును. దారిలో దోచుటకును వీలగునా యనియు జూచును. దుర్జ నుఁడు (ఖలుఁడు) ఈవద్బ్బుకలవానిని వ్యసనాసక్తుని జేయఁ జూచును. దాయాదులసమూహము అతఁడు బ్రదికియున్నను మరణించినను తమకందులో భాగము రావలె నని కలహములకు దిగుదురు. ఈవిధముగా ద్రవ్య మతని కనేక జనులనుండి పెక్కు లనర్థములు కల్గించుచుధననాశనభీతివివశుని జేయును. అర్థమనర్థం భావయనిత్యమ్ - "ధనము ప్రమాదకరము దుఃఖ హేతువని ఎల్లప్పుడుతలంపుము" అని ధనాసక్తినివదలి గోవిందభజనాసక్తి కర్తవ్య మనుహెచ్చరిక, భజగోవింద శ్లోకోపదేశము.

అవ॥ ఇంకను ధనమువలనిపాపభోగిత్వతృష్ణను చెప్పుచున్నారు.

పాతకభరై రనేకై రర్థం సముపార్జయన్తి రాజానః ।
అశ్వమతంగజహేతోః ప్రతిక్షణం నాశ్యతే సో ఽర్థః॥ 49

ప్ర. రాజానః = పట్టాభిషిక్తులైన రాజులు పాతకభరైః = పాపములతో నిండిన, అనేకైః = అనేకములైన (కర్మభిః = పనులచేత) అర్థం = ధనమును, సముపార్జయన్తి = చక్కగా సంపాదించుచున్నారు. (కాని) సః అర్థః = ఆద్రవ్యము అశ్వమతంగజహేతోః = గుఱ్ఱములు, ఏనుగులు, కారణముగ, ప్రతిక్షణం = ప్రతిక్షణము, నాశ్యతే = నాశనము చేయఁబడుచున్నది.

తా॥ రాజులు అనేకములైన ఘోర పాపములు చేసి ద్రవ్యమును, ఎక్కువగా సంపాదించు చున్నారు, తనరాజ్యైశ్వర్యరక్షణార్థము. వారికి శత్రుభీతి మెండు. శత్రురాజులబాధ తప్పించుకొనుటకు పెద్దసైన్యమును రథగజతురగపదాతులను ఎప్పుడును పోషింతురు. అందువలన వారు సంపాదించిన ధనమంతయు ప్రతి

ధనము, ఈగుఱ్ఱములు, ఏనుగులు మొదలైనసైన్యముకొఱకే వ్యయమగుచున్నది. సంపాదించిన పాపమార్గశ్రమయే మిగులు చున్నది. భోగముకూడ నామమాత్రమే కావున సర్వాధికారులగు రాజులైనను ధనమువలన దుఃఖమే కాని సుఖములేదు.

అవ॥ ఐశ్వర్యముతోఁ దులఁదూగుచు మహాసౌఖ్య మనుభవించుచున్నా రని సామాన్యజనులు భ్రాంతిపడు రాజులదుఃఖముల నింకను వర్ణించుచున్నారు.

రాజ్యాన్తరాభిగమనా ద్రణభఙ్గా న్మన్త్రిభృత్య
దోషాద్వా ।
విషశస్త్రగుప్తఘాతా న్మగ్నా శ్చిన్తార్ణవే భూపాః॥ 50

ప్ర : భూపాః = భూమినిపరిపాలించురాజులు, రాజ్యాన్తరాభిగమ నాత్ = మఱొకరాజు తమమీఁదికి దండెత్తివచ్చుటవలనఁ గాని, (లేక, తాము వేఱురాజ్యములకు వెళ్ళినప్పుడు తనరాజ్యమున గల్లుముఃప్పువలనఁ గాని), రణ భఙ్గాత్ = యుద్ధములోఁ దామోడిపోవుటవలనఁ గాని, మన్త్రి,భృత్య, దోషాత్,వా = లేక, మంత్రులు, సేవకులు దుర్మార్గులై రాజులకుఁ జేసిన తప్పులవలనఁ గాని, (లేక పరరాజులప్రోత్సాహమువలన, తమస్వారముకొఱకు విషశస్త్రగుప్తఘాతాత్ = మోసబుద్ధితో రహస్యముగా విషమిచ్చి, లేక, చాటుగా కత్తులలోఁ బొడుచుటవలపఁ గాని, (ఎప్పుడును,) చిన్తార్ణవే = దుఃఖసముద్ర మందు, మగ్నాః = మునిగియున్నారు.

తా : రాజులకున్న భయములు సామాన్యుల కుండవు. పరరాజు తమపై దండెత్తి వచ్చునేమో, యుద్ధములోఁ దమకు జయము కల్గదేమో శత్రు (రాజులు) వులు తమమంత్రులను, సేవ కులను, ప్రోత్సహించి, లంచము లిచ్చి, ఆశ కల్గించి వారిచేత

రహస్యముగా తమకుఁ విషము పెట్టించియో రహస్యముగా కత్తుల చేత కటారులచేత పొడిపించి చంపుదురేమో అని యిట్లు పలు విధములైన శంకలతోను, భయములతోడను, ఎప్పుడు మహా దుఃఖసముద్రమునందు రాజ్యము నేలుభూమిపతులు మునిగి యున్నారు. వారు చేయుపాపకృత్యములవలన "రాజ్యాన్తే నరకం ధ్రువ" మ్మను లోకోక్తియు వచ్చినది. రాజులు మరణించిన పిదప తాముచేసిన పాపకృత్యములఫలముగా తప్పక నరకమునకుఁ బోదురు అని దీనియర్థము. ఇట్లు ధనము సామాన్యమానవులకు ధనాధిపతులగు ఈమహారాజులకుకూడ మహాదుఃఖకారణమై యున్నది. ఇట్లు పుత్రదారగృహాదులం దభిష్వంగమువలనను ముఖ్యముగా అర్థకామతృష్ణవలన వచ్చుదుఃఖపరంపరావిచారము వలన తద్దోషానుదర్శనమువలనను వీనియెడ వైరాగ్యము కల్గి, ఈశ్వరశరణ్యభక్తి, ఆత్మజ్ఞానములవైపు చిత్తమును మరల్చుట ముఖ్యలక్ష్యము. ఈలక్ష్యసిద్ధికై ఇంతవఱకుఁ జేసిన గ్రంథ భాగార్థము అతిచతురము. శ్రుతిసమ్మతము, ముముక్షుజనములచే ఆశ్రయింపఁదగినదియును అనుష్ఠింపదగినదియు నై యున్నది.



## 3. మనోనిన్దా ప్రకరణమ్ (మనోనిందా ప్రకరణము)

అవ॥ దేహగేహాదిబాహ్యస్థూలవిషయములవలని దోషములను నిరూపించి యిప్పుడు ఆంతరమును సూక్ష్మమునై సర్వానర్థమూలమునగు మనస్సంబంధదోషములను వర్ణించుచున్నారు. ఆమనస్సుపైఁ గూడ వైరాగ్యమును జనింప జేయుటకే.

హసతి కదాచిద్రౌతి భ్రాన్తం స ద్దశ దిశో భ్రమతి।
హృష్టం కదాఽపి రుష్టంశిష్టం దుష్టంచ నిన్దతి స్తౌతి॥ 51

కిమపి ద్వేష్టి సరోషం హ్యాత్మానం శ్లాఘతే కదాచిదపి।
చిత్తం పిశాచ మభవ ద్రాక్షస్యా తృష్ణయా
వ్యాప్తమ్ ॥ 52

ప్ర : చిత్తం = మనస్సు, తృష్ణయా = ఆశయనెడు, రాక్షస్యా = రాక్షసిచేత వ్యాప్తం = నిండినదై, ఆవేశింపబడినదై, పిశాచం = విరుద్ధాచరణముగల దయ్యము, అభవత్ = ఆయెను హి = (అట్లుచెప్పుట) ఎందుకనఁగా, (అది) కదాచిత్ = ఒకప్పుడు, హసతి = నవ్వును (మఱొకప్పుడు) రౌతి = ఏడ్చును (ఇంకొకప్పుడు) భ్రాన్తంసత్ = కలవరము చెందినదగుచు, దశదిశ = పదిదిక్కులను (ఎనిమిదిదిక్కులు, పైన, క్రింద) భ్రమతి = సంచారము చేయును. కదా = ఇంతలో, హృష్టం = సంతోషించినదై రుష్టంఅపి = మఱింతలోనే కోపించినది (భవతి=అగును) (ఒకసారి) శిష్టం = మంచిది, సదాచారము గలదై, దుష్టం, చ = వెంటనే చెడ్డది కూడ (అగును). ఒకక్షణములో నిన్దతి = నిందించును (మఱుక్షణములో) స్తౌతి = స్తోత్రము చేయును. (ఒకప్పుడు) సరోషం = కోపముగలదియై, కిమపి = దేనినైనను, ద్వేష్టి = ద్వేషించును, కదాచిత్ = ఒకానొకప్పుడు, ఆత్మానం = తన్ను, శ్లాఘతే, అపి = పొగడుకొనును కూడ.

( ప్ర. 9)

తా॥ ఈమనస్సు చపలస్వభావముకలది. సర్వానర్థములకు మూలము. దురాశయనెడి క్రూరమైన రాక్షసి తన్నావేశించఁగా, అది దయ్యమే అగును. అట్లు చెప్పుట ఎందు కనఁగా అది చిత్రవిచిత్రములైన విరుద్ధములైన పనులను జేయును. ఒకప్పు డది సంతోషముతో నవ్వును. మఱొకప్పుడు దుఃఖముతో నేడ్చును. ఒకప్పు డది పదిదిక్కులను వెఱ్ఱిగా కలవరపడి పరుగెత్తును. ఒకప్పుడు మిక్కిలి సంతుష్టి చెంది యుండును. ఒకొక్కప్పుడు కోపము చెందును. ఒకసారి సదాచారము కలదిగా, మంచిదిగా నుండును. మఱొకసారి చెడ్డదిగాకూడ నగును. ఒకప్పు డది ముందు నిందించును. తర్వాత పొగడును. ఒకప్పుడు మహాకోపముతో దేనిపైననో యొకదానిపైన ద్వేషమును ప్రకటించును. ఒకప్పుడు తన్నెక్కువగా పొగడుకొనును కూడ. ఇట్లది ఒక క్రమము లేక పిచ్చిపట్టినట్లు, దయ్యము పట్టినట్లు ప్రవర్తించును. కాన మనస్సు సర్వదా నింద్యము. ఈనిందాప్రకటనము, ఆత్మబోధను స్తుతించుటయే యగును, దానిపైఁ బ్రీతిపుట్టించుకొఱకు

అవ॥ మనస్సుచేష్టలనే ఇంకను వర్ణించుచున్నారు.

దమ్భాభిమానలోభైః కామక్రోధోరుమత్సరై శ్చేతః ।
ఆకృష్యతే సమన్తా చ్ఛ్వభి రివ పతితాస్థివ న్మార్గే ॥ 53

ప్ర. శ్వభిః = కుక్కలచేత త్రోవయందు, పతిత = పడియున్న, అస్థివత్ = ఎముకవలె చేతః = (ఈ) మనస్సు, దమ్భాభిమానలోభైః, దమ్భ = ఆడంబరముచేతను, లోభైః = ఉన్న దితరుల కీయకుండ తనకే యుండుకొనవలెననుగుణముచేతను, కామక్రోధోరుమత్సరైః, కామ = దగ్గఱలేని ప్రాప్తవస్తువులు కావలెనను ఆశ చేతను, క్రోధ = అపస్తుప్రాప్తికి

అడ్డగించినవారిపైన కోపముచేతను, ఉరుమత్సరైః = ఇతరుల మేలుసంపదలను జూచి ఏమాత్రము ఓర్వలేకుండుట యనుగుణములచేతను, సమన్తాత్ = అన్నివైపులకు ఆకృష్యతే = లాగఁబడుచున్న(ట్లున్న)ది. [ఎంతటియస్వాతంత్ర్యమును, దీనస్థితియు గల దీమనస్సు!!]

తా॥ త్రోవలో నొకఎముక పడియున్నయెడల దానికొరకు దారిపోవుచులుకుక్కలు ఆయెముక తనకు కావలెను అని పోట్లాడుకొనుచు దానినన్నివైపులకు లాగుకొనును అట్లే యీమనస్సును స్వాయముగా వశము చేసికొనుట కీదుర్గుణములు చెలరేఁగి తమవైపునకు లాగుచున్నవి. అనఁగా నీగుణములచేత మనస్సుస్థితి కుక్కలు చింపిన విస్తరివలె నగుచున్నది. ఆగుణము లివ్వఁగో! తానట్లు లేకున్నను అందఱు తన్ను గొప్పది అనుకొనవలె నని మనస్సుపూనిన డంబాచారము. తాను గొప్పదాన ననుకొనుట-అభిమానము. తనకున్న దితరులకు దానము చేయుటకాని, వారు దానిని వాడుకొననిచ్చుటకాని చేయకుండ, తానుపయోగింపకుండఁగూడ నుంచుకొనునట్టిది లోభగుణము. తనకు లేనివి క్రొత్తవి సంపాదింపవలె నను పెద్దకోరిక, కామము. అవి తనకు రాకుండ నడ్డుపడినవారిపై మహాకోపము. తనకు లేని వితరులకుండి వారు సుఖించుచున్నారే యని వారిపైన అసహనము (ఓర్వమి) ఈర్ష్య. ఇతరులు మంచిగుణములు గల్గియున్నను వారిపై చెడుగుణములను ఆరోపించుట యసూయ. ఈదుర్గుణములు అంతః శత్రువులై మనస్సును చిందరవందర చేసి, జయించి అన్నివైపులకు బరువెత్తు నట్లు చేసి మనస్సునకు మహాక్షోభము కల్గించును. శాంతి లేకుండ చేయును.

అవ॥ ఈబాధలనుండి తప్పించుకొని సుఖపడు నుపాయమును మనస్సున కుపదేశించుచున్నారు.

**తస్మా చ్ఛుద్ధవిరాగో మనోఽభిలషితం త్యజే దర్థమ్।**
**తదనభిలషితం కుర్యా న్నిర్వ్యాపారం తతో భవతి ॥ 54**

ప్ర : తస్మాత్=అందువలన, మనః = మనస్సు, అభిలషితం = కోరబడిన అర్థం = విషయమును, త్యజేత్ = విడువవలయును, తత్= ఆమనస్సు, (తాను, తన్ను) అనభిలషితం (యథాతథా) = కామరహిత మగు నట్లు కుర్యాత్=చేసికొనవలయును, తతః = ఆపిమ్మట (తత్=ఆమనస్సు) నిర్వ్యాపారం=వ్యవహారరహిత మైనదిగా, భవతి=అగును (ఇదియే) శుద్ధ విరాగః = పరిశుద్ధమై ఫలవంతమైన వితృష్ణత, లేక, వైరాగ్యము (భవతి = అగును.)

తా॥ మన స్సీవిధముగా సవిషయసర్గముచేత బాధింపఁబడు చున్నప్పుడు ఆబాధానివారణోపాయము శుద్ధవైరాగ్య మని ప్రబోధించుచున్నారు. అన్నింటిదుఃఖములకు, మూలకారణము కామగుణము. దీనిస్వరూపము తనకు లేనివి సంపాదింపవలె నను (కోరిక) విషయతృష్ణ. దీని కాశ్రయము జీవసహితమైన మనస్సు. దీనిస్వాభావిక ప్రవృత్తి, బాధాప్రదమగు నిత్యవిషయసేవ. మనస్సు కోరిన బాహ్యభోగ్యవస్తువులయందలి గుణదోషములను శోధింపఁగా పైచెప్పిన దోషబాహుళ్యమే మిగిలినది. కాన అంత ప్రియమైన మనస్సు (అంతఃకరణము నందును చక్కని చిక్కని వైరాగ్యము చేయవలయును. దానిలోపలనున్న కోరికలను పాఱ ద్రోలవలయును. నిష్కామముగా మనస్సును శుద్ధిచేయవలెను. దానివలన ఆవిషయవస్తుసేవనుండి నివృత్తి మనస్సునకుఁ గల్గును. ఈచిత్తశుద్ధివలన క్రమముగా మనస్సు వ్యవహారరహితమై నిర్వ్యాపారమై నిలుకడగా నిలుచును. అనఁగా కారణమైన తృష్ణ ఎంతతగ్గినఁ గార్యరూపమగు తత్ప్రాప్తివిషయకమైన క్రియయు నంతంత తగ్గును. చిట్టచివఱకు మనస్సు ఉపరతము లేక శాంత

మగును. ఇది కలిపహితవైరాగ్యము. ఈస్థితి ఆత్మాలోక ప్రాప్తిని సుకరము చేయును. ఆత్మాలోకమువలన ఈనిష్ఠవైరాగ్యభావ మును స్థిర మగును. (మూఁడవ తన శ్లోకార్థము)

## 4. విషయనిగ్రహ ప్రకరణమ్ (విషయనిగ్రహ ప్రకరణము)

అవ॥ సుఖింపఁదలచిన బుద్ధిమంతులు విషయజగత్తునుండి ఇంద్రియము లను నిరోధయోగమున నియమింప వలయు నని ప్రబోధించుచున్నారు.

**సంసృతిపారావారే హ్యగాధవిషయోదకేన సంపూర్ణే ।**
**నృశరీర ముత్తరణమ్ కర్మసమీరై రితస్తత శ్చలతి ॥ ౫౫**

ప్ర : అగాధవిషయోదకేన = విషయము లను అపరిచ్ఛేద్యమైన లోతుగల జలముచేత, సంపూర్ణే = నిండినటువంటిదైన, సంసృతిపారావారే = సంసారము అనుసముద్రమునందు, నృశరీరమ్ = మానవశరీరమను, ఉత్తరణమ్ = నీటిని దాటుసాధనమగు పడవ, కర్మసమీరైః = పెక్కు తాను చేసిన కర్మ ములు అనుగాలిచేత, ఇతస్తతః = ఇటునటు చలతి = కదలుచున్నది, హి = కదా!

తా॥ అనేకజన్మము లెత్తుటు అనుసంసారమహాసముద్రము మహాభయంకర మైనది. అనేకములైన బాహ్యవిషయములే ఇందలిజలము. దీనిలోతు ఇంత యని కొలుచుటకు వీలుకాదు. [దీనిని దాటి పోవుటకు అనగా జన్మరాహిత్యమును సంపాదించుటకు, జీవుఁడు యత్నించుచున్నాఁడు] మానవశరీరమే ఈ సముద్రమున పయనించునావ. తాను పూర్వజన్మములందుఁ

జేసినకర్మఫలములే ప్రబలవాయువులై ఈనావను దరిఁ జేరనీయకుండ అటునిటు, ముందువెనుకలకు, అగాధసంసారసముద్రమధ్యమునందే ఊఁగులాడఁ జేయుచున్నవి. అతఁడు వీనిప్రభావమువలన దరిఁ జేరలేకుండ నున్నాఁడుగదా!

అవ॥ అతఁడట్లు చేరలేకుండుటకు ఇంద్రియనిగ్రహము లేమి ముఖ్యకారణముగాఁ జెప్పుచున్నారు.

ఛిద్రై ర్నవభి రుపేతం జీవో నౌకాధిపతి ర్మహానలసః ।
ఛిద్రాణా మనిరోధా జ్జల పరిపూర్ణంపత త్యధః
సతతమ్ ॥ 56

ప్ర : ( నావగా నున్న ఈమానవశరీరము ) నవభిః = తొమ్మిది, ఛిద్రైః = ఇంద్రియరంధ్రములచేత, ఉపేతమ్ = కూడికొని యున్నది. నౌకాధిపతి. = నావ కధిపతియైన, జీవః = జీవుఁడు, మహాన్ అలసః = కడుపెద్దసోమరిపోతు, మందబుద్ధి. ఛిద్రాణాం = ఆయింద్రియరంధ్రముల యొక్క అనిరోధాత్ = అడ్డగింతలేకపోవుటవలన సతతమ్ = ఎల్లప్పుడు (ఆనావ) జలపూర్ణమ్ (సత్) = నీటితో నిండినదగుచు, అధః = క్రింధిక్, అడుగునకు, పతతి = మునిగిపోవుచున్నది.

తా॥ మనుష్యశరీర మనునౌకకు తొమ్మిదిరంధ్రములున్నవి. అవేవనగా రెండు కండ్లు, రెండుచెవులు, రెండు ముక్కులు, ఒకనోరు, మలవిసర్జనచేయుగుదము, రతిస్థానమగు ఉపస్థ. నౌకాధిపతియైన జీవునకుఁ దెలివి తక్కువ, ఆఁకలి యెక్కువ. ఇతఁడు సోమరిపోతు. అందువలన నౌకక్షేమమును గుఱించి అనగా తనక్షేమమును గుఱించియే సరియైన శ్రద్ధ తీసికొనలేకున్నాఁడు. దాని కతఁడు చేయవలసినది ఈఇంద్రియరంధ్రములగుండ విషయములనుసముద్రజలమును నావలోపలకు రానీయకుండ రంధ్రములను మూయవలెను. ఇది ఆజీవునకుఁ

జేతకానిపని. కావున ఆసి రెడ్డెగకుండ లోనికి ప్రవహింప నిచ్చుచున్నాఁడు. దానితో బరువెక్కి పై నౌక సముద్రములో మునిఁగి అడుగునకు పోవును. అతఁడీ విషయమై విషయసంసార సముద్రము నుండి బయటపడి గట్టెక్క లేకున్నాఁడు. ఇది వాని హీనస్థితి.

అవ॥ ఇంద్రియనిగ్రహమే తాను దరిఁజేరుటకు మార్గమని చెప్పు చున్నారు.

ఛిద్రాణాం తు నిరోధాత్ సుఖేన పారం పరం యాతి।
తస్మా దిన్ద్రియనిగ్రహ మ్మృతే న కశ్చి త్తర
త్యనృతమ్॥ 57

ప్ర: తు = కాని, ఛిద్రాణాం = పైనఁజెప్పిన తొమ్మిదిరంధ్రముల యొక్క నిరోధాత్ = అడ్డగించుటవలన, (సజీయః = ఆజీవుఁడు) సుఖేన = సుఖముగా, తేలికగా, (సంసారస్య = అనృతమైన, అపారమైన ఈపడతెగని చావుపుట్టుకల సంసార మనుసముద్రముయొక్క) పరంపారం = ఆవలిగట్టును, యాతి = పొందఁగలఁడు, తస్మాత్ = అందువలన ఇన్ద్రియనిగ్రహమ్ ఋతే = ఈతొమ్మిది ఇంద్రియములను వాని విషయములనుండి మరల్చుట అను క్రియ లేకుండ, కశ్చిత్ = ఎవఁడును అనృతమ్ = మిథ్యయైన యీసంసార సముద్రమును, న తరతి = దాటలేఁడు.

తా॥ కాని విషయములవెంటఁబోవు నీయింద్రియముల నట్లు పోకుండ నరికట్టిన యెడల, నతఁడు సుఖముగా నీసంసార సముద్రమును దాటి యొడ్డెక్కఁ గలఁడు. అట్లు చేయకుండ నెవ్వఁడును జననమరణప్రవాహరూపసంసారమునుండి బైట పడ లేఁడు. కావున బుద్ధిమంతుఁడైన జీవుఁడు తనబద్ధకమును వదలి యింద్రియములు విషయములవెంటఁ బరువెత్తుట నాపవలెను. ఈ

సంసారము మిథ్యయైనప్పటికిని, ఈపని చేయక జీవుఁడు సుఖము పొందలేఁడు.

అవ॥ కాని బుద్ధిహీనుఁడైన మనుష్యుఁడు పెడత్రోవఁ బట్టుచున్నాఁడని చెప్పుచున్నారు.

పశ్యతి పరస్య యువతిం సకామమపి తన్మనోరథం కురుతే।
జ్ఞాత్వైవ తదప్రాప్తిం వ్యర్థం మనుజోఽతిపాపభాగ్భవతి॥ 58

ప్ర : మనుజః = మనుష్యుఁడు, పరస్య = ఇతరునియొక్క, యువతిం = యౌవనవతియైన భార్యను, సకామం = ఆమెను పొందవలెనను కోర్కెతో, పశ్యతి = చూచుచున్నాఁడు. తన్మనోరథంఅపి = ఆమెపొందువిషయమునే మనస్సునందు బాగుగా నాటినదిగానే, కురుతే = చేయును. తద్ అప్రాప్తిం = తాను ఆమెను పొందలే ననుసంగతిని, జ్ఞాత్వాఏవ = నిశ్చయముగా ఎఱిఁగియు (అంతటితో దానిని వదలక) వ్యర్థం = వృథాగా అతిపాపభాక్ = మిక్కిలి పాపకృత్యములు చేయు(టకు వెనుదీయని)వాఁడు, భవతి = అగుచున్నాఁడు.

తా॥ ప్రబలమైన పాపము పరస్త్రీవాంఛ. దీనివలననే మహాబలవంతులైన రావణుఁడు, కీచకుఁడు మొదలైనవారు సర్వనాశన మైరి. ఇప్పుడుకూడ దీనివలననే యనేకులు తమ మానప్రాణధనములను గోల్పోవుచున్నారు. దీనికి మొదట ప్రేరకమైనది నేత్రేంద్రియము. కంట్లను రెండురంధ్రములు. వీనితో ముందు యౌవనములో నున్న పరుని భార్యను జూచును, చూచుటతోఁ గామ ముద్భవించును. అది యతనిమనస్సంతయు నాక్రమించును ఇంక నతఁడాహారనిద్రలుకూడ మాని ఆమెపొందు

కొఱకే యత్నించును, అది తనకందని మానిసం దని తెలిసినను (తనకు లభ్యము కాదని సూక్ష్మమైనను) ఆ కామవేగమును నిగ్రహింపలేఁడు. దానితో నతఁ డింకను అనేకమాయోపాయములతో నింకను ఎక్కువ నపాపి యగును. రావణుఁడు సీతాదేవి కొఱకు మారీచుని మాయలేడిగాఁ బంపుట, యతని మరణము నకుఁ గారణమగుట, తాను సన్యాసివేషముతో రామలక్ష్మణులు సమీపమున లేకుండఁ జూచి వచ్చి సీత నపహరించుట, జటాయువును జంపుట తుదకుఁ దాను సపుత్రబంధుమిత్రముగాఁ జచ్చుట కూడ తటస్థించినది. ఇట్లు కామము మానవుని నంతమహాఘోర పాపాత్మునిగా వ్యర్థజీవునిగాఁ జేయును.

“ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః” గీ 2-60

“తాని సర్వాణి సంయమ్య” గీ 2-61

ఇంద్రియములు ప్రమథనశీలములు. ఇవి పురుషుని విషయాభిముఖునిగాఁజేసి వానిని మనస్సును విశేషముగా సంక్షోభింపఁ జేయును. అంతమాత్రమే కాదు. వివేకవిజ్ఞానయుక్తమైన మనస్సును బలాత్కారముగా అపహరించుచున్నవి ఇంద్రియములు. కావున ఆ సర్వేంద్రియములను (జ్ఞానకర్మేంద్రియములు) పదింటిని సంయమింపవలయును అనఁగా పురుషుఁడు తనవశము చేసికొనవలయునే కాని వాని వశమం దుండరాదు” అని గీతాప్రబోధము.

(గీ శ్లో 2-60, 61)

( ప్ర. 10)

అవ॥ చూచుకన్నులు చేసిన మోసమును వర్ణించి యిప్పుడు విను చెవులను రంధ్రములచేఁతలను చేకొన్నసుమన్నారు.

పిశునైః ప్రకామ ముదితాం పరస్య నిన్దాం శృణోతి కర్ణాభ్యామ్ ।
తేన పరః కిం మ్రియతే వ్యర్థం మనుజో ఽతిపాపభాగ్భవతి ॥ 59

ప్ర : మనుజః = మనుష్యుఁడు, పిశునైః = కొండెగాండ్రచేత ప్రకామం = మిక్కిలియిష్టముగా, ఉదితాం = చెప్పఁబడిన, పరస్య = (అనింద్యుఁడగు) ఇతరునిగూర్చిన, నిందావాక్యములను, (దూషణను) కర్ణాభ్యాం = (రెండు) చెవులచేత, ప్రకామం = మిక్కిలి యిష్టముగా, వీనులవిందుగా, శృణోతి = వినును. (దానివలనఁ దనకుఁ గల్గు మహాలాభ మేమున్నది ?) తేన = ఈదూషణశ్రవణముచేత, పరః = ఇతరుఁడు, మ్రియతే కిం ? = చచ్చువాయేమి ? (అతఁడేమియును జావఁడు ఈమనుజుఁడే) వ్యర్థం = వృథాగా, ప్రయోజనములేకుండ వివి అతిపాపభాక్ = మిక్కిలి పాపాత్ముఁడు, భవతి = అగుచున్నాఁడు.

తా॥ మనుష్యుఁడు చెవులను ఇంద్రియములచేతఁగూడ మహాపాపకార్యములఁ జేయును. నలుగురు సామాన్యముగా నొకచోటఁ జేరినచోఁ వారిసంభాషణ మంతయు (తమ్మును బొగడుకొనుట) ఇతరుల నిందించుటతో నిండి యుండును. దాని నితఁడు చెవులార విందుగా వినును. దీనివలన నీ రాడిపోసినయాపరుని కేమి నష్టము కష్టము కల్గును? ఇది యతనిప్రాణముఁ దీయునా? ఈవ్యర్థనిందాలాపము లాతనిరోమమును గూడఁ గదల్పలేవు. కాని యీవినువాఁడు మాత్రము గొప్పపాపము మూటఁగట్టుకొనును. ఇదివ్యర్థముగా సంపాదించికొన్నది.

అవ॥ ఇంకఁ బలుకువాలుక చేయుపాపకార్యముల సూచించుచున్నారు.

ప్ర : విషయేన్ద్రియయోః విషయ + ఇన్ద్రియయోః = విషయము, ఇంద్రియము, ఈరెంటియొక్క, యోగే = కలయికయందు, యత్సుఖం = ఏసుఖము (ఉన్నదో) తత్ = (అది) ఆసుఖము, నిమేషసమయేన = ఒకరెప్పపాటుకాలము మాత్రముగనే భవతి = అగుచున్నది. తత్ = అక్షణికసుఖమే విషయే = అవిషయము, నష్టే = పోయినదగుచుండఁగా, యావజ్జీవం చ = ప్రాణముండునంత కాలముకూడ ఉండునదియగు దుఃఖం = దుఃఖమే భవతి = అగుచున్నది తయోర్మధ్యే = అవిషయము ఇంద్రియము ననురెంటిమధ్యమందు (అని తర్వాత శ్లోకముతో అన్వయము.)

తా॥ మనుష్యుఁడు తనయానందమునకు సాధనములుగా బాహ్యవిషయములను వస్తువులను గోరును. వాని నాయా యింద్రియములు పొంది నప్పుడే అల్పసుఖము ననుభవించును. కను లందమైన వస్తువులను చూడఁ గోరును. కనులు వానిని జేరి చూచి కొంతయానందించును. ఇదిరూపవిషయానందానుభవము. చెవులు మంచి (మాటలను) పాటలను వినఁ గోరును. ఆపాటధ్వని చెవిలో ప్రవేశించినప్పుడే యాశ్రవణసుఖము లభించును. ఇట్లు ప్రతియింద్రియము దానివిషయముతో కలిసినప్పుడే విషయసుఖానుభవము కల్గుచున్నది. కాని యీకలయిక చిరకాలము నిలువదు. అతిస్వల్పకాలమువఱకే యుండును. స్త్రీపురుషులరత్యానందముకూడ నిట్టిదే. ఇట్లు ఇంద్రియవిషయసంయోగమువలన కల్గు విషయానందము అతిస్వల్పకాల ముండునది. కాని యీ విషయము నష్టమైన యెడల ఈకల్గినతొల్లింటిక్షణకాలసుఖమే తన సుఖసాధనము పోయినదే యని దుఃఖముగా బరిణమించి, ఈబాధ మాత్రము తాను జీవించినకాలము బాధించుచునే యుండును.

భార్యాసుఖము క్షణికమే. కాని భార్య నష్టమైనచో కల్గుదుఃఖము జీవించినంతకాలము తప్పదు. అట్లే పుత్రునివలన, ధనధాన్యాదులవలన ఇతరభోగములవలనఁ గలుగు

సుఖములు క్షణికములు, తాత్కాలికములు మాత్రమే. కాని యా వస్తువులు నష్టమైచో ఆకొఱంత పూర్ణరానిది. క్రొత్తవస్తువులు వచ్చినను పూర్వసుఖము రాదు. వాని మధురస్మృతులు తాను జీవించినంతకాలము బాధించుచుండును. ఇది లోకానుభవ సిద్ధము.

అవ॥ కావున బుద్ధిమంతుఁ డేమి చేయవలెనో చెప్పుచున్నారు.

హేయ ముపాదేయం వా ప్రవిచార్య సునిశ్చితం
తస్మాత్ ।
అల్పసుఖస్య త్యాగా దనల్పదుఃఖం జహాతి సుధీః ॥ 62

ప్ర : సుధీః = మంచిబుద్ధికలవాఁడు (తెలివిగలవాఁడు) హేయం = విడువ వలసినదేదియో, వా = లేక, ఉపాదేయం = (ఏది) గ్రహింపవలసినదేదియో సునిశ్చితం = సందేహములు లేకుండు నట్లు ప్రవిచార్య = లెస్సగా విచారించి, తస్మాత్ = ఆ అల్పసుఖస్యత్యాగాత్ = స్వల్పమైన విషయానందమును విడచిపెట్టుట యనుకారణమువలన, అనల్పదుఃఖం = మిక్కిలిగొప్ప దైన యావజ్జీవవిషయ యోగదుఃఖమనుకార్యమును విడుచుచున్నాఁడు.

తా॥ అందువలన బుద్ధిమంతుఁడు తన తెలివి నంతయు నుపయోగించి చక్కగా నిస్సందేహముగా శరీరస్థమైన ఇంద్రియము, బాహ్యవిషయములలో దేనినిగ్రహించి, దేనిని విడువ వలయు నని లెస్సగా విచారించినవాఁడై భార్యాదిబాహ్యవిషయ ములను విడలిపెట్టి, ఇంద్రియములను గ్రహించి వానిని నిగ్ర హించుటయే యేకైకసుఖమార్గము. (చూడు 57 వ శ్లో కార్థము) ఈబుద్ధిమంతుఁడు, ఆవిషయేంద్రియసంయోగమువలన గల్గు ఆ యల్పసుఖమును త్యాగముచేయుట .. తువుగా, ఆవిషయయోగ జనిత యావజ్జీవ దుఃఖానుభవరూపకార్యమును గూడ విడుచు చున్నాఁడు. ఇది వాని వివేకకార్యము.

అవ॥ అవివేకులగు విషయగ్రహణలోలు రెట్లు నశించునది దృష్టాంతములతో రెండుశ్లోకములతో నిరూపించుచున్నారు.

ధీవరదత్తమహామిష మశ్నన్ వైసారిణో మ్రియతే।
తద్వ ద్విషయాన్ భుఞ్జన్ కాలాకృష్టో నరః పతతి॥ 63

ప్ర : వైసారిణః = చేప, ధీవరదత్తమహామిషమ్, ధీవర=చేపలఁబట్టు కొనువాని చేత, దత్త=ఈయఁబడిన ( చేపలను బట్టుకొనుటకు బెస్తవాఁడు గాలముచివర ఎఱనో మాంసపుముక్కనో యుంచును, దానిని సమీపించి తినుటకు చేప ప్రయత్నింపగనే, కనఁబడకుండ నున్నగాలపు ముల్లు నోటిలో దిగబడి చేప చచ్చును) మహా+ఆమిషం=పెద్దమాంసపుముక్కను, అశ్నన్ = తినుచునే ఆచేప, మ్రియతే=చచ్చుచున్నది. (వెంటనే చావనిచో బెస్తవానికి చిక్కి చచ్చును) తద్వత్=ఆచేపవలెనే, నరః= మనుష్యుఁడు, విషయాన్ = తాత్కాలిక, క్షణమాత్రపుసుఖ మిచ్చువిషయములను, భుఞ్జన్ = అనుభవించుచునే కాలాకృష్టః = యమునిచేత లాగఁబడినవాఁడై, పతతి = పడిపోవును. మరణించును.

తా : చేపలఁ బట్టుబెస్తవాఁడు తనగాలముచివర మాంసపుముక్కను బెట్టి దానిని తటాకములో నుంచును. అందలి చేపలు, గాల మందున్న మాంసపుముక్కను దినవలెనని పరుగులిడుచు వచ్చును. కాని యామోసమును గ్రహింపకుండ చేప ఆమాంసమును దిన యత్నింపగనే గాలముముల్లు చేపనోటిలో గ్రుచ్చుకొని చేప చచ్చును. వెంటనే చావనిచో బెస్తవాఁడు దానిని తీసికొని చంపును. క్షణికవిషయభోగసుఖ మాశింపఁగా మరణమే వచ్చినది. అట్లే బుద్ధిహీనులగు మనుజులు బాహ్యవిషయములకుఁ జిక్కి తాత్కాలికవిషయభోగసుఖములలో మునిఁగిపోదురు. యముఁడు వారికిఁ దెలియకుండనే మృత్యువు కల్గించును కావున బుద్ధిమంతులగువారు తాత్కాలికవిషయ సుఖములలో

మునింగిపోక వానియెడల విరాగము గలవారుగా మారవలయు నని హెచ్చరిక. ఈవైరాగ్య మాత్మబోధ కంచున ఏగును అని తాత్పర్యార్థము.

అవ॥ మఱియొక ఘోరమైన యుదాహరణ మిచ్చి జనులను హెచ్చరించు చున్నారు.

**ఉరగగ్రస్తార్ధతను ర్భేకో ఽశ్నాతీహ మక్షికాః శతశః।**
**ఏవం గతాయు రపి సన్విషయాన్ సముపార్జయ త్యన్ధః॥**
**64**

ప్ర : ఉరగగ్రస్తార్ధతనుః = పాముచేత సగము తినఁబడినశరీరముకలదైన భేకః = కప్ప, ఇహ = ఇక్కడ, ఇప్పుడు, మక్షికాః = (దానియాహార మగు) దోమలను, శతశః = వందలకొలది, అశ్నాతి = తినుచున్నది. ఏవం = ఇట్లే, అన్ధః = గ్రుడ్డివాఁడైన మనుష్యుఁడు గతాయుః సన్ అపి = తనఆయుష్య మంతయు క్షీణించినవాఁడు, మృత్యువదనమునం దున్నవాఁడు పైతమును విషయాన్ = విషయములను, అనగా తాత్కాలికక్షణికసుఖ మిచ్చు విషయానుభవమువలనిసుఖములనే సముపార్జయతి = ఎక్కువగా సంపాదించుచున్నాఁడు.

తా : కప్ప పామునోటఁబడి సగము మ్రింగఁబడినది, లేక సగముచచ్చినది. అయినను అప్పుడుకూడ తన సమీపమునకు వచ్చినదోమలను వందలకొలది ఆకప్ప మ్రింగుచునేయున్నది. కప్పకు తనచావులోఁకూడ విషయభోగలాలసత్వమే కాని, తన మరణస్థితిని గ్రహించుట లేదు. అట్లె మూర్ఖుఁడైన మనుజుఁడు తనయాయుస్సు సగముతీరి మృత్యువుముఖమున నున్నతనస్థితిని కూడ గమనింపలేనంతటి గ్రుడ్డివాఁడగుచున్నాఁడు. అప్పుడు కూడ ఇంకను వివిధములైన విషయసుఖాభిలాషలతోడను వాని ప్రాప్తియత్నములతోడనే మరణించుచున్నాఁడు. ఈవిషయనిగ్ర

పొందు చేయ లేకున్నాడు. విషయతృష్ణాపిశాచిగనే సంసారిగనే చచ్చుచున్నాడు. ఆత్మబోధహేతు వగు వైరాగ్యాంగముగా ఈ ప్రకరణమును రచితము. (ముముక్షుహితునగు వైరాగ్యాత్మబోధ భక్తిరూపత్రయము సాధ్యమగు మని; విషయనిగ్రహప్రకరణ సంక్షిప్తార్థము)

## 5. మనోనిగ్రహప్రకరణమ్ (మనో నిగ్రహ ప్రకరణము)

అవ. బాహ్యనూలవిషయములయు, జ్ఞానకర్మేంద్రియములయు నిగ్రహ విషయము వైరాగ్యాంగముగా నిరూపించి యిప్పుడు వైరాగ్యాంశముగానే ఆంతర మాత్మేంద్రియ మగు మనస్సుయొక్క నిగ్రహోపాయమును, దానిఫలమును దృష్టాంతముతో నిరూపించుచున్నారు,

**స్వీయోద్గమతోయవహా సాగర ముపయాతి నీచమార్గేణ ।**
**సా చే దుద్గమ ఏవ స్థిరా సతీ కిం న యాతి వార్ధిత్వమ్॥**
**65**

ప్ర: స్వీయోద్గమతోయవహా: స్వీయ = తనదైన, ఉద్గమ = పుట్టుగోలగు పర్వతాదులయందుండి వంతతవారగా( బైకుబికివచ్చెడు తోయవహా = జలప్రవాహము (లేకచిటిబుగ్గ) నీచమార్గేణ = పల్లమునకు( దీసికొనిపోవు త్రోవగుండ (క్రిందికి ప్రవహించినచో,) సాగరం = సముద్రమును, ఉపయాతి = సమీపించుచున్నది, సా = ఆతోయవహ ఉద్గమే = పుట్టినచోటు దగ్గరనే స్థిరాసతీచేత్ = కదలకుండ నిల్చిన దగుచున్నయెడల వార్ధిత్వమ్ = నీటినివ్వతనమును (సముద్రత్వమును) నయాతి కిమ్ = పొందదా? అవు(గా పొందును.

తా: పర్వతభూమియందలి యొకనీటిబుగ్గ, పైకుబికి వచ్చి పల్లముగా నున్నత్రోవనెంబడి క్రిందికి ప్రవహించి సముద్ర

మును సమీపించును అట్లు పల్లమునకు ప్రవహింపకుండ తనజన్మ స్థానప్రాంతముననే స్థిరముగా నిల్చినయెడల, తానే (సముద్రభావమును) నీటికుప్పతనమును పొందునుగదా!.

అవ॥ ఈయుపమానవిషయమును ఉపమేయముగా మనస్సున కన్వయింపుచున్నారు.

ఏవం మనః స్వహేతుం విచారయ త్స్థిరం భవే దన్తః।
న బహి ర్వోదేతి తదా కిం నాత్మత్వం స్వయం యాతి॥
66

ప్ర : ఏవం = ఇట్లే, మనః = మనస్సు, స్వహేతుం తనయొక్క జన్మకారణమును, విచారయత్ = విచారించుచున్నదై (ఆలోచించుచున్నదై) అంతః = లోపలియాత్మయందే స్థిరం = చక్కగా నిశ్చల మైనదిగా. భవేత్ = ఉండినను వా = లేక, బహిః = వెలుపలకు, న ఉదేతి = లేచిపోవనిచో, తదా = అప్పుడు, స్వయం = తనంతట తానే, ఆత్మత్వం = ఆత్మస్వరూపమును, న యాతి కిమ్ = పొందదా? పొందు నని భావము.

తా : పైనవివరించిన నీటిబుగ్గవలె, మనస్సుకూడ వెలుపల నుండు వస్తువులపైకి, కోర్కెతో నీచమార్గమున వెళ్లునలవాటు కలది. కాని తనకు మూలకారణమైన యాత్మస్వరూపస్వభావమేమి యని విచారించుచున్నదై ప్రత్యగాత్మచెంతనే సుస్థిరముగా నుండి, వెలిప్రసారము లేనిదగుచో తాను ఆత్మస్వరూపమును దాల్చలేదా యేమి? అనగా నాత్మస్వరూపవృత్తి కలదగు నని భావము.

అవ॥ మఱొక యుదాహరణముతో ఫలసహితముగా చెప్పుచున్నారు.

వర్షా స్వంభః ప్రచయాత్ కూపే గురునిర్ఘరే పయః క్షారమ్।
గ్రీష్మేణైవ తు శుష్కే మాధుర్యం భజతి తత్రాంభః॥
67

తద్వద్విషయోద్రిక్తం తమఃప్రధానం మనః కలుషమ్।
తస్మిన్ విరాగశుష్కే శనకైరావిర్భవేత్ సత్త్వమ్॥ 68

ప్ర : వర్షాసు = వర్షాకాలమందు, అంభఃప్రచయాత్ = నీరెక్కువగా లభించుటవలన, కూపే = బావియందు గురునిర్ఘరే = పెద్దసెలయేరునందును తేక, పెక్కుఊటధారలచేత బావియందు, పయః = నీరు, క్షారమ్ = ఉప్పన, (భవతి = అగును). తు = కాని, గ్రీష్మేణఏవ = వేసవిచేత మాత్రమే శుష్కే = (శోషించినది), నీరు తగ్గిపోయినది కాగా, తత్ర = (అక్కడ ఆకూపమందును, సెలయేఱువందును అంభః=నీరు, మాధుర్యం = తీయదన మును, భజతి = పొందును. తద్వత్ = అదేవిధముగా, మనః=మనస్సు తమఃప్రధానం తమోగుణము అజ్ఞానము ముఖ్యమైనదై (ఆవరించినదై), విషయ + ఉద్రిక్తమ్ = విషయములందలిభోగాసక్తిచేత, ఉద్రిక్తం = ఉద్రే కమును చెందినదై, కలుషం = మలినమైనది, దోషయుక్తమైనది. (భవతి = అగును) (ఆమనస్సు) విరాగశుష్కే=వైరాగ్యముచేత శోషించినదై, తప్త మైనదైనచో, తస్మిన్ = ఆమనస్సునందు, శనకైః = నెమ్మదిగా, సత్త్వం= (సత్త్వ) గుణము, జ్ఞానసుఖములను కల్గించు సద్గుణము, ఆవిర్భవేత్ = పుట్ట గలదుసుమా.

తా : వర్షాకాలమునందు వర్షములవలన బావిలోనికి పెక్కుఊటలద్వారమున (సెలయేఱునందును) జల మెక్కువ చేరును. వివిధములైన ఊటజలములు చేరుటవలన బావియందలి నీరు ఉప్పగానుండును. వేసవియందు (గ్రీష్మఋతువునందు,) ఎక్కువగా వచ్చిననీరెండిపోయి, సహజముగా నందున్ననీరు తీయగా నుండును. అదేవిధముగా నజ్ఞానమూలమున విషయములందలి

తీరని యాశలచేత మనస్సు ఉద్రిక్తమై కలుషిత మగును. విషయములందలి దోషదృష్టిచే గలిగిన వైరాగ్యము వలన విషయములందలి యాశలు నశించి నిర్మలమయిన మనస్సునందు సత్త్వగుణము నెమ్మదిగా కల్గి జ్ఞానము, సుఖమును, శాంతియు లభించును.

శ్రీకృష్ణగీతా (14అ. శ్లో17) స్మృతివచనము ప్రమాణము.

శ్లో॥ సత్త్వాత్ సంజాయతే జ్ఞానం రజసో లోభవేవచ।
ప్రమాదమోహౌ తమసో భవతో ఽజ్ఞాన మేవచ॥ గీ 14-17

మనస్సుపొందిన సత్త్వగుణ ప్రాధాన్యమునుండి (ఆత్మ) జ్ఞానము పుట్టుచున్నది. అట్లే రజోగుణ ప్రాధాన్యమువలన లోభమే పుట్టుచున్నది. అట్లే తమోగుణ ప్రాధాన్యమునుండి ప్రమాదమును, మోహమును రెండును బుట్టుచున్నవి. మఱియు తమస్సువలన అజ్ఞానమే (విపరీతజ్ఞానమే) కల్గుచున్నదనుట.

అవ॥ కలుషితమనస్సుయొక్క విచిత్రవిశృంఖలచర్యలను మూడుశ్లోకము లతో వర్ణించుచున్నారు.

యం విషయమపి లషిత్వా ధావతి బాహ్యేంద్రియద్వారా।
తస్యాప్రాప్తౌ ఖిద్యతి తథా యథా స్వం గతం కిఞ్చిత్॥ 69

ప్ర : (మనః మనస్సు) బాహ్యేంద్రియద్వారా- బాహ్య + ఇంద్రియ + ద్వారా = వెలుపలియింద్రియములద్వారమున, యం అపి = ప్రసిద్ధమైన ఎంత చిన్నదైనను విషయం = వస్తువును, లషిత్వా = అభిలషించి, కోరి, ధావతి = దానివెంట పరుగెత్తుచున్నది. తస్య = ఆవస్తువుయొక్క, అప్రాప్తే = లభింపనిదైన దగుచుండగా యథా = ఏవిధముగా, గతం పోగొట్టుకొన్నదైన కిఞ్చిత్ స్వం = కొంతసొమ్ము (ధనము) మగూర్చి ఖిద్యతి = ఏడ్చునో తథా =

ఆదేవిధముగా, తస్య = ఆకోరినవస్తువు, అప్రాప్తౌ = లభింపనిదగుచుండగా (మనః = మనస్సు) ఖిద్యతి = దుఃఖించుచున్నది.

తా : మనస్సు అనేకవిచిత్రమైన వికారమైన పద్ధతులలో ప్రవర్తించును. అది బాహ్యేంద్రియములగు చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు కాలుసేతులు గుదోపస్థద్వారములవలన వెలుపలి వస్తువులను జేరిపొందఁగోరును. అవి సంపాదించుటకై పరుగెత్తును. ఆని ఒక్కొక్కప్పుడు లభింపవు అప్పుడది పరిపరి విధముల ఎక్కువగా దుఃఖించును, ఎట్లు దుఃఖించు ననఁగా దన కెంతకాలమో అనుభవములో నున్నవస్తువు పోయి తనపుట్టి మునిఁగినట్లు ఏడ్చును.

నగనగరదుర్గదుర్గమసరితః పరితః పరిభ్రమ చ్చేతః।
యది నో లభతే విషయం విషయప్రితమివ ఖిన్న
మాయాతి। 70

ప్ర : (కోరినవస్తుప్రాప్తికై) చేతః = మనస్సు నగనగర....సరితః, నగ = పెద్దకొండలను, నగర = గొప్పపట్టణములను, దుర్గ = కోటలను దుర్గమ = నడచివెళ్లుటకు వీలుకాని, సరితః = నదులనుగూర్చి, పరితః = అన్నివైపులకుచుట్టుచుట్టు పరిభ్రమత్ = తిరుగాడుచున్నది, విషయం = తాను కోరినవిషయము యది నో లభతే = పొందవియెడల, విషయప్రితమ్ ఇవ = విషప్రయోగముచే మూర్ఛిల్లినదో యన్నట్లు ఖిన్నమ్ = మిక్కలి దుఃఖముతో వెందినదై ఆయాతి = తిరిగివచ్చుచున్నది.

తా : మనుష్యునకు అనేకవిషయములపై కోర్కెలు పుట్టి పెరుగును. ఆకోరినవస్తులాభమునకై నరుఁడు అన్నియు గాలించుచు. కొండ లెక్కును దిగును, వెదకును గొప్పనగరములు, తడవి చూచును. కోటలలో వెదకును. నడచి వెళ్ళి చూచుటకు వీలు కాని నదుల ప్రాంతములను పరిశోధించును కాని అనుకొన్నది

దొరకునా? లభింపదు. అప్పుడామనస్సు మిక్కిలి చింతాక్రాంతమై నిర్వీర్యమై విషయము పెట్టినప్పుడెట్లు నిశ్చేష్టమై హీనస్థితికి వచ్చునో అట్టి విచారకరమైన స్థితిలో దిరిగివచ్చును.

అవ॥ అట్టిస్వభావముగల మనస్సును, నిగ్రహించుట యెంతకష్టమో ఉపమానపూర్వకముగా వివరించుచున్నారు,

**తుమ్బీఫలం జలాన్తర్బలా దధః క్షిప్త మప్యుపై**
**త్యూర్ధ్వమ్।**
**తద్వ న్మనః స్వరూపే నిహితం యత్నా ద్బహి ర్యాతి॥**
**71**

ప్ర : తుంబీఫలం = సొరబుఱ్ఱ గలపండు, జలాన్తః = నీటిలోపల, బలాత్ = బలవంతముగా, అధః = క్రిందకు క్షిప్తమ్ = త్రోయఁబడినది, (నొక్కబడినది) అపి = అయినను, (చేయివిడువగానే, వెంటనే) ఊర్ధ్వం = నీటిపైకి, ఉపైతి = వచ్చును. తద్వత్ = అదేవిధముగా, మనః = మనస్సు యత్నాత్ = మిక్కిలిప్రయత్నముతో, స్వరూపే = ఆత్మస్వరూపమందు, నిహితం (అపి) = ఉంచఁబడినదయ్యు, బహిః అనాత్మయగు వెలుపలికే యాతి = వచ్చుచు.

తా : ఎండుసొరకాయబుఱ్ఱను మనుష్యుఁడు నీటిలోపలపైకి రాకుండ నుంచవలె నని చాలక్రిందుగా బలవంతముగా నొక్కి పట్టుకొన్నను చేయి కొంచెము వదలుటతోడనే యది క్షణమైన నట నుండక వెంటనే నీటిపైకి వచ్చితేలును. అట్లే మనుష్యుఁడు తనమనస్సును తనప్రత్యగాత్మస్వరూపమందు, మహాప్రయత్నముతో నుంచినను అది క్షణమైన నట నిలువలేక వెంటనే బాహ్యానాత్మప్రపంచమువైపు పరుగెత్తును. అట్టిదానిని నిగ్రహించుట మిక్కిలి కష్టము.

గీతాప్రమాణవచనము :

శ్లో॥ "చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥
గీ 6-34

ఓకృష్ణ! మనస్సు మిక్కిలి చంచలమైనదియే గాక, శరీరమును ఇంద్రియములను మథించి పరవశము చేయుశీలము గలది. అంతే కాదు. ఏసాధనముచేతను దానిని నియమించుటకు శక్యము కానంత బలముగలది. సర్పాకారమైన జలజంతువిశేషమగు తంతునాగము నెట్లు ఛేదింప శక్యముగాదో యట్లే యీమనస్సును అచ్ఛేద్యమైనది. అట్టిదృఢమైనది మనస్సు, అట్టిమనస్సుయొక్క నిగ్రహము లేదా, నిరోధము, దుష్కరమగు వాయునిగ్రహము కంటె, కూడ దుష్కరతర మని నేను తలంచుచున్నాను". అని అర్జును డన్నాడు.

అవ॥ మనుష్యుడు ఇప్పుడు కోరకున్నను పూర్వకర్మానుసారముగా సుఖదుఃఖములు వచ్చుచు గల్గును.

ఇహ వా పూర్వభవే వా స్వకర్మణైవార్జితం ఫలం
యద్యత్ ।
శుభ మశుభం వా తత్తద్భోగో ఽప్యప్రార్థితో భవతి॥ 72

ప్ర : ఇహ = (ఇక్కడ), ఈలోకమందు, వా = కాని, పూర్వభవే వా = వెనుకజన్మములోగాని. స్వకర్మణా ఏవ = తనయొక్క కర్మముచేతనే, ఆర్జితం = సంపాదింపబడిన, యద్,యద్ = ఏదే, శుభం, అశుభం, వా = మంచి కాని, చెడుకాని (కలదో), తత్తద్భోగః, (తద్,తద్,భోగః) దాని,దాని సుఖ దుఃఖానుభవము, అప్రార్థితః = మన (యిచ్ఛలేని) ప్రార్థన, లేకయే, భవతి = (అగును) కల్గును.

తా : మన కిప్పుడులభించు సుఖదుఃఖములు మనమీజన్మమందుఁగాని, మనపూర్వజన్మమందుఁగాని మనము చేసినకర్మములయొక్క పుణ్యపాపములఫలములై యున్నవి. వానియనుభవము కల్గి తీరును. తప్పించుకొన వీలులేదు. కర్మఫలములుగాని సుఖదుఃఖములు రావు. కావున మనము ముందుమేలుకొఱకే తగిన కర్మాచరణము చేయవలయును. మోక్షమునకును యత్నింపవలయును. ఇప్పుడిక్కడ చేయుకర్మములకుఁ గూడ ఈజన్మమందే యనుభవ మున్నదా? వీనికి ముందుజన్మములందుఁగదా యనుభవము? అన్నచో, నిజమే. ఇప్పు డిక్కడ చేయుకర్మములఫలము సాధారణముగా ముందుజన్మములోనే మనుష్యుఁ డనుభవించును. కాని అవి ప్రబలపుణ్యములు, పాపములు నైనప్పు డీజన్మములోనే వానిఫలితములు రావచ్చును. "అత్యుత్కటైః పుణ్యపాపైరిహైవ ఫలమశ్నుతే." అనుశాస్త్రనిర్ణయానుసారముగా. ఇదే ప్రహ్లాదుఁడు దైత్యబాలకులకుఁ జెప్పినాఁడు "దుఃఖంబులు వాంఛితంబులు గాక చేకుఱుభంగి సుఖంబులును గాలానుసారంబులై లబ్ధంబు లగు." ఆంధ్రభాగవతము 7వ స్కంధము

సంస్కృత భాగవతము (7-6-8)లో శ్రీవ్యాసభారతి :

సుఖ మైంద్రియకం దైత్యాః దేహయోగేన దేహినామ్॥
సర్వత్ర లభ్యతే దైవాద్యథా దుఃఖ మయత్నతః 7-6-8
తత్ప్రయాసో న కర్తవ్యః యత ఆయుర్వ్యయః పరమ్।"

ఓ దైత్యులారా! ఇంద్రియసంబంధులగు దుఃఖము లెక్కడఁ గోరకున్నను, దేహధారులకు సర్వదా, వారిప్రయత్నములేకయే వచ్చుచున్నట్లే ఇంద్రియవిషయసుఖములుకూడ (విధి) దైవము వలననే వారియిప్పటి ప్రయత్నము లేకయే వచ్చును. అందువలన

సకెసుఖములకొఱకు నెక్కువగా గష్టపడుట వృథాశ్రమ, కాల వ్యయము, ఆయుర్నష్టము. ఆ కాలమందు, యత్నము ముక్తిని సాధించుటకొఱకుఁ జేయుట కర్తవ్యము అని ప్రకరణార్థము.

అవ॥ దుష్కరమైనను మనస్సును నిగ్రహించుట కుపాయ మగు వైరాగ్యమును ఉపదేశించుచున్నారు.

చేతః పశు మశుభపథం ప్రధావమానం నిరాకర్తుమ్।
వైరాగ్య మేక ముచితం గలకాష్ఠం నిర్మితం ధాత్రా ॥ 73

ప్ర : అశుభపథం = చెడుత్రోవనుగూర్చి, పాపముచేయవలెనని ప్రధావమానం = మిక్కిలిగా పరుగెత్తుచున్న, చేతఃపశుం = ఈమనస్సు లేకబుద్ధి అనుపశువును, నిరాకర్తుం = నిగ్రహించుటకు, ధాత్రా = బ్రహ్మదేవునిచేత (సృష్టికర్తచేత,) వైరాగ్యం = విరాగ మను, ఏకం= ఒక, ఉచితం= తగినటువంటి, గలకాష్ఠం = గుదిబండ లేక బండకొయ్య (జంతువులిటునటు పోకుండ యజమాని దానిస్వేచ్ఛాగమనము నరికట్టుటకు దానిమెడలోఁ గట్టు బరువైన కొయ్య.) నిర్మితమ్ = ఏర్పాటుచేయఁబడినది.

తా॥ ఈమనస్సు పశువు వంటిది. అడ్డదిడ్డముగా గనఁబడిన గడ్డి నెల్ల మేయుటకు అటునిటు మిక్కిలిగా పరిపరివిధములఁ బరుగెత్తును. ఇంటిదొడ్డిలోనుండి పాఱిపోకుండఁ జేయుటకు, సరిగా మార్గములో నడిపించుటకు యజమాని దానిమెడ కొకబరువైన కొయ్యను గట్టును. ఆపశువు అడ్డదిడ్డముగా నడచుటకు పరుగెత్తుటకు యత్నించినపుడు కాలికికొట్టుకొనుచుండి ఆ కొయ్య ప్రతిబంధకమగును. అట్లది యజమాని కోరినట్లు సరియైన మార్గములో నతనికీవశమై నడచును, నిలుచును. అట్లే యీామనస్సుకూడ మంచిత్రోవను వదిలి, పుణ్యములు చేయవలె నను బుద్ధి మాని, విషయభోగములమీఁది యాశవలన పాపములు చేయుటకు మిక్కిలిగా పరువెత్తును, దానిని నియమించుటకు సృష్టికర్త యగుచతు

సుస్రుఖబ్రహ్మ మనుష్యులకు విరాగ మనెడుసాధన మిచ్చినాడు అదొక్కటే మనస్సును నిగ్రహించుటకు, స్వాధీనమునకు దెచ్చుటకుఁ దగిన సుసాధనము. విషయములందలిదోషములను మాటిమాటికి జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచు, అవి, ఎక్కువ ప్రయాసతో తాను సంపాదించినవి స్వల్పకాలముమాత్రమే యుండునవి, అనిత్యము లైనవని మాటిమాటికి తలంచుచుండుట వలన, విరాగము పుట్టి పెరుఁగును. మనోనిగ్రహము బలపడుచుండును. ఆత్మసుఖాపేక్షచే విషయసుఖమింకను నిందింపఁబడుచున్నది.

శ్రీభగవానువాచ శ్రీకృష్ణుఁడు పలుకుచున్నాఁడు:

శ్లో॥ అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్।
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే॥ 6_35

ఓమహాబాహూ, అర్జునా!

మనస్సు దుర్నిగ్రహ మైనది, చల మైనది అనుమాటలందు సంశయములేదు. అయినప్పటికిని మనోనిగ్రహోపాయములుగా అభ్యాసవైరాగ్యము లున్నవి. అభ్యాసమనఁగా ఏదేనొకచిత్తభూమియందు చిత్తముయొక్క సమానప్రత్యయావృత్తి. ఏదేని ఒక్కధ్యానవిషయకజ్ఞానము, లేకభావము పరంపరగా, ఒకదాని వెనుకమఱొకటిగా, అదేజ్ఞానము లేక అదేభావము, చిత్తములో దిరిగితిరిగి వచ్చుచుండునట్లుచేయుటయే అభ్యాసము. వైరాగ్యమనఁగా దృష్టాదృష్టభోగములందు దోషదర్శనాభ్యాసమువలన గలుగు తృష్ణారాహిత్యము (వితృష్ణత). ఇట్టివైరాగ్యాభ్యాసముల చేత చిత్తముయొక్క విక్షేపరూపమగు ప్రచారము నిరోధింపఁబడుచున్నది. అనఁగా చిత్తము వశమందుంచుకొనుట యను మనోజయము కల్గుచున్న దని భావము.

(ప్ర. 12)

అవ॥ ప్రత్యగాత్మసుఖాపేక్షచే విషయసుఖ మింకను నిందింపఁబడు చున్నది.

నిద్రావసరే యత్సుఖ మేత త్కిం విషయజం యస్మాత్।
న హి చేంద్రియప్రదేశావస్థానం చేతసో నిద్రా॥ 74

ప్ర : నిద్రా + అవసరే = నిద్రించుచున్న సమయమందు, యత్ సుఖం = ఏసుఖము, (అస్తి = ఉన్నదో), ఏతత్ = ఈసుఖము, విషయజం, కిమ్ = విషయములవలన పుట్టినదా? (కాదు. అప్పుడు మనస్సునకు ఇంద్రియ ములతో బొత్తిగా సంబంధము లేదు) యస్మాత్ = ఎందువల్ల ననఁగా, చేతసః = మనస్సుయొక్క, ఇంద్రియావస్థానం చ = ఇంద్రియములతో కలిసి యుండుట, నిద్రా న హి = నిద్ర కాదుగదా! (అది జాగ్రదవస్థయే యగును.)

తా : నిద్రాసమయమందు ప్రతిజీవియు, ఒకేవిధముగా సుఖ మనుభవించుచున్నాఁడు అదివిషయములవలన వచ్చిన దన నచ్చునా? అనుటకు వీలులేదు. అప్పుడు మనస్సు ఇంద్రియము లతో కలిసి యుండుటలేదు. మఱి మన స్సింద్రియములతో కలిసి వ్యవహరించుస్థితిని నిద్ర యని యనరు. జాగ్రద్దశ యందురు. నానావిధవిషయసుఖము లేకున్నను, మానవునకు నిద్రయందు చక్కని సుఖానుభవ మున్నది. కావున సత్యసుఖాశ్రయమును, బుద్ధిమంతుఁ డన్వేషింప వలెననియు వైరాగ్యాభ్యాసములచే మనో నిగ్రహము కర్తవ్య మనియు నిరూపిత మగుచున్నది.

అవ॥ మనోవిగ్రహమును సాధించుట ఎట్లో దృష్టాంతములతో చెప్పు చున్నారు.

అద్వారతుంగకుడ్యే గృహే ఒవరుద్ధో యథా వ్యాఘ్రః।
బహునిర్గమప్రయత్నైః శ్రాన్త స్తిష్ఠతి పతఞ్ శ్వసంశ్చ
తథా॥ 75

సర్వేన్ద్రియావరోధా దుద్యోగశతై రనిర్గమం వీక్ష్య।
శాన్తం తిష్ఠతి చేతో నిరుద్యమత్వం తదా యాతి॥ 76

ప్ర : యథా = ఏవిధముగా, అద్వారతుఙ్గకుడ్యే = ద్వారములు లేనట్టియు ఎత్తైనగోడలు గలట్టియు, గృహే = ఇంటియందు, అవరుద్ధః = అడ్డగింపఁబడిన, వెలుపలసంచార మరికట్టఁబడిన, వ్యాఘ్రః = పెద్దపులి, బహునిర్గమప్రయత్నైః = బయటికి వచ్చుటకు చేయఁబడిన అనేకప్రయత్నములచేత, శ్రాన్తః = అలసిసొలసినదై, పతన్ = క్రిందపడుచున్నదై (అశ్రమచేత) శ్వసన్ = నిట్టూర్పులువిడుచుచున్నదై, తిష్ఠతి = ప్రయత్నము లన్నియు మాని) అయింటనే నిలువఁబడునో, తథా = అదేవిధముగా, సర్వేంద్రియ నిరోధాత్ = బయటికిరాగలసమస్తమైనఇంద్రియద్వారములయొక్క నియమనరూప నిగ్రహమువలన, చేతః = మనస్సు ఉద్యోగశతైః = బయటవిషయప్రచారము నకై చేయు నూర్లకొలదిప్రయత్నములు వృధాయగుటచేత అనిర్గమం = బయటికి రాలేకపోవుట యనుతనయశక్తతను, వీక్ష్య = చూచి, శాన్తః = ప్రయత్నము లన్నివదలి శాంతిని పొందినదై, తిష్ఠతి = నిలుచును. తదా = అప్పుడు, నిరుద్యమత్వం = ప్రయత్నములు చేయకుండుటను, సర్వప్రారంభ పరిత్యాగభావమును, యాతి = పొందును.

తా. బయటికివచ్చుటకు ద్వారము లేమియు లేనట్టియు, ఎగిరి వచ్చుటకు వీలులేకుండ మిక్కిలి యెత్తైనట్టియు గోడలు గల గృహమందు (లేక పంజరమందు) ఒకపెద్దపులిని బంధించినచో నది బయటికి రావలె నని శక్తికొలది యనేకప్రయత్నములు చేయును. ద్వారములు లేవు గనుక ఎగిరివచ్చుటకై ప్రయత్నించి యెగురును. కాని గోడలు మిక్కిలియెత్తై దాటుటకు వీలులేనందున, అది మాటిమాటికి ఎగిరి వృథాగా క్రిందపడి దెబ్బలు తినును. ఈబహుప్రయత్నములచేత కొంతకాలమునకు అది మిక్కిలి యలసి పోవును. ఆయాసముచే నిట్టూర్పులను విడుచును.

దానితో నిక లాభము లేదని ప్రయత్నము లన్నియు నాపి ఆ గదియందే లేక బోనునందే నిలువఁబడును. అట్లే మనస్సును కూడ అది బయటికి వచ్చుద్వారములైన ఇంద్రియములను వశ మందుంచుకొని కట్టివేసినయెడల బాహ్యవిషయములమీఁదకుఁ బోవలయు నని అనేకప్రయత్నములు చేసిచేసి, విసిఁగి వేసారి, తన యశక్తతను అనుభవపూర్వముగా నెఱింగి బయటకుబోవుఁ బ్రయత్నము లేమానుస్థితికి వచ్చును. శాంతిని పొందును. ఇది మనో వ్యాఘ్రమును బంధించి వశముచేసికొనుమార్గము.

అవ॥ వైరాగ్యాంగముగా మనస్సును నిరోధించుటకు నాల్గు ముఖ్యసాధనము లిందుఁ జెప్పుచున్నారు.

**ప్రాణస్పందనిరోధాత్ సత్సఙ్గా ద్వాసనా త్యాగాత్।**
**హరిచరణభక్తియోగా న్మనః స్వవేగం జహాతి శనైః ॥ 77**

ప్ర : మనః = మనస్సు, ప్రాణస్పందననిరోధాత్ = ప్రాణాయామమువలనను, సత్సంగాత్ = సత్పురుషులతో కలిసి మెలసి సద్భాషలాడుచుండుటవలనను, వాసనాత్యాగాత్ = సంస్కారరూపమునను్న కోరికలను వదలిపెట్టుటవలనను, హరిచరణభక్తియోగాత్ = పరమేశ్వరుఁడైనశ్రీమహావిష్ణుని పాదములయందలిభక్తి నలవఱచుకొనుటవలనను, శనైః = నెమ్మదిగా స్వవేగమ్ = తనతొట్రుపాటు తొందరపాటులను, జహాతి = విడిచిపెట్టును.

తా॥ మనస్సునం దనేకమైన కోర్కెలు పుట్టును. అవి సాధించుకొనుట కది తొందరపడును. దానివలన అనేకమైన యిక్కట్లకు పాలగును. వానిని తగ్గించుటకు మందు, మనస్సును నిగ్రహించుట. దాని కుపాయములు నాల్గు. యోగశాస్త్రములో చెప్పఁబడిన ప్రాణాయామము మొదటిది. సత్పురుషులతో స్నేహము చేయుట రెండవది. వారు మనస్సును చెడుమార్గము లందుఁ బోనీక సత్కృత్యములలోనికిని ఆత్మతత్త్వవిచారములోని

కినిద్రిప్పుదురు. వారిసాంగత్యమువలనఁ దనకు నట్టి శుభస్థితి కల్గును. మూఁడవది వాసనాత్యాగము. మానవునకు ప్రియాప్రియ విషయములందుఁ బూర్వమనుభవించిన సుఖదుఃఖముల ననుసరించి రాగద్వేషబీజరూపమున చిత్తమున సంస్కారము లేర్పడును. ఇవి లోకశాస్త్రాదివిషయములు. వీనివలననే సంకల్పకామాదు లుద్భవించి మానవునిప్రవృత్తికి కారణము లగుచున్నవి. ఆత్మోన్ముఖుఁడగు ముముక్షువునకు; ప్రవృత్తిహేతువులగు నీవాసనలను త్యజించినచో విషయములనుండి నివృత్తి సిద్ధించును. ఆత్మప్రబోధము సుకరముగా నలవడును. ఇంక నాల్గవది మనస్సునకు వ్యాపారాలంబమునకు ముఖ్యమైన హరిభక్తి. ఇది విష్ణుపదసేవ సర్వవిలక్షణుఁడై యొకఁడైనపరమేశ్వరునిభజించుట. ఆయనమహిమలు, చేసిన ఘనకార్యములు వినుట, కీర్తించుట ధ్యానించుట మొదలైన వానివలనను, ఆయనయే తన్నుఁ గృతార్థుని జేయువాఁడని దయాసముద్రుఁడని తనకోర్కెలదీర్పఁగలవాఁడని, సర్వజ్ఞుఁడని తెలియును. ముందు సకామముగా నాయన నర్చించినఁ దనకోరిన విచ్చును. నిష్కామముగా సేవించియర్థించిన ముక్తినే యిచ్చును. ఈనాల్గుపాయము లవలంబించిన నెమ్మదినెమ్మదిగా మనస్సు నిగ్రహింపఁబడి ముక్తిమార్గములోనికి వచ్చి ఆరాటములను వీడి శాంతిని బొందును. నిత్యసుఖప్రాప్తికిఁ జేరువగును. [ప్రాణాయామ మది చక్కఁగా సాధించిన యోగులవద్ద నేర్వవలెను ]

## 6. వైరాగ్య ప్రకరణమ్ ( వైరాగ్య ప్రకరణము )

అవ॥ మోక్షమునకు ముఖ్యప్రతిబంధమును, దుఃఖమునకుఁ గారణము నైనది రాగము. దానిని లేకుండఁ జేసికొనవలెను. అనగా వైరాగ్యము సాధింప వలెను. దానియాచరణవిధానమును స్పష్టముగా జెప్పుచున్నారు.

పరగృహగృహిణీపుత్రద్రవిణానా మాగమే వినాశేవా
కథితే హర్షవిషాదౌ కిం వా స్యాతామ్ క్షణం స్థాతుః॥ 78

దైవా త్స్థితం గతం వా యం కంచి ద్విషయ మీడ్య
మల్పం వా।
నో తుష్య న్నచ సీదన్ వీక్ష్య గృహే ష్వతిథివ
న్నివసేత్ ॥ 79

ప్ర : (పరగృహే = ఇతరుని యింటియందు) క్షణంస్థాతుః=(వచ్చి అతిథివలె) క్షణకాలముమాత్రము (అతిస్వల్పకాలము) ఉండువానికి, పరగృహగృహిణీపుత్రద్రవిణానాం-పర = ఇతరునియొక్క, గృహ = ఇంటి యొక్కయు, గృహిణీ = యజమానిభార్యయొక్కయు పుత్ర = కుమారుల యొక్కయు, ద్రవిణానాం = ధనధాన్యములు, పశువులు, మడిమాన్యములు, మొదలైన వానియొక్కయు ఆగమే = వచ్చుట, వా = లేక, వినాశే = నష్ట మగుట, కథితే = చెప్పఁబడిన దగుచుండగా, హర్షవిషాదౌ = సంతోషమును దుఃఖమును, స్యాతాం కిం వా = కలుగునా యేమి? (కలుగవు) (అట్లే మనుష్యుఁడు) (స్వ = తనయొక్క) గృహేషు = ఇంటివిషయములందు, ఈడ్యం = మెచ్చుకొనఁదగినది, గొప్పదైనదిగాని, వా = లేక, అల్పం = కొద్దిది, నిరసింపఁదగినదిగాని యంకంచిత్ = ఏదేనియున్నవానిలో నొకటైన విషయం = బాహ్యపదార్థమగు దారపుత్రధనధాన్యాదివిషయమునుగూర్చి, దైవాత్=తనపూర్వకర్మఫలితముగా పరమేశ్వరునిచే నీయఁబడినది, స్థితంవా = (లభించి) ఉన్నదానినిగాని, గతంవా = పోయినదానినిగాని (నష్టమైనదానిని) వీక్ష్య=చూచి, నోతుష్యన్ = సంతోషించుచున్నవాఁడు కాకుండగను, (పొంగి

పోవువాఁడు కాకుండగను) చ = మఱియు, న సీదన్ = దుఃఖించుచున్నవాఁడు (క్రుంగిపోవువాఁడు) కాకుండగను, అతిథివత్ = ఆయింటికి క్షణకాలము అనుకోకుండ వచ్చి యుండిపోవు తటస్థుఁడగు అతిథివలె, నివసేత్ = నివసింపవలెను.

తా॥ ఒకఁడు మఱొకయపరిచితుని యింటికి అనుకోనకుండ క్షణకాలము తలదాఁచుకొనుటకు వెళ్లినాఁడనుకొనుము. అక్కడ ఆయజమానికి శుభములు జరుగుచుండవచ్చును, అశుభములు జరుగుచుండవచ్చును. యజమానికి వివాహమే జరిగి గృహిణీలాభము కల్గవచ్చును. లేక ఆమె నవమాసములు మోసి పుత్రుని ప్రసవించి యుండవచ్చును. లేక మఱొకలాభము, క్రొత్తగా నిల్లు గట్టుకొని గృహప్రవేశమో, పశువులు మడిమాన్యములు కొనుటో మొదలగు శుభకార్యములు జరుగవచ్చును. యజమాని తన కవి చెప్పినప్పుడు, ఆయతిథి ఆకథనంతయు నిర్లిప్తతో విని, పనితీరి, తనదారిని దానుపోవును. కాని పారవశ్యము చెంది, తనకే యది లభ్యమైనంతగా హర్షమును పొందఁడు. ఉబ్బి తబ్బిబ్బుగాఁడు. (శుభమును జూచి పొంగఁడు) ఇతఁడు ప్రవేశించి యక్కడయున్న యాక్షణకాలమందు, (ఒకపూటయో కావచ్చు అనంతమైనకాలములో నది క్షణమువంటిదే యగును.) ఆయజమానికి పాపకర్మ ఫలముగా గొప్పయాపద సంభవించి యుండవచ్చును. అతని భార్యయే మరణించి యుండవచ్చును. అతని కుమారుఁడు గతించి యుండవచ్చును. లేక యేదో సంపదపోవుట- గృహమో, పశువో, మడిమాన్యములో నష్టము కావచ్చును. ఇవి యజమాని వాని పుట్టిమునిఁగినట్లు అతిథికిఁ జెప్పి దుఃఖింపగా, నీయతిథి యజమానికి సానుభూతిగా నూరడింపుమాటలు చెప్పవచ్చును. కాని ఆయాపద తనకే వచ్చినట్లు తాను క్రుంగిపోఁడు. దుఃఖము వచ్చిన మీఁదట క్రుంగిపోవుట విషాదము.

ఈయతిథి- సాక్షిమాత్రుఁడుగా నిర్లేపుఁడుగా యజమానికి సహా

యము చేసిన చేయనచ్చును. తానుమాత్రము నిర్వికారముగా నుండును ఇది పరగృహమందు తా నతిథిగా వెళ్లినప్పుడు కలిగిన యనుభవము. ఇది మఱచిపోకుండ బుద్ధిమంతుఁడు, వివేకశాలి యైన గృహస్థు, తనస్వగృహమందుకూడ పైఅతిథివలెనే తనకు తనపూర్వకర్మఫలితముగా భార్యాపుత్రాదులు, ధనధాన్యాదిసంపదలు ఎక్కువగాఁగాని, తక్కువగాఁగాని లభింపనచ్చును. నష్టము కావచ్చును. ఏది యెట్లైనను దానివలనియు హర్షవిషాదములు పొందకుండ వానివలనఁ దనలో మార్పులేదని గ్రహించి నిర్వికారముగా నుండవలెను. అనఁగా 79వశ్లోకములోఁ జెప్పినట్లు భార్యాదిబాహ్యవిషయములందు మమతాబుద్ధిపరిత్యాగవిధము తనదగు యిాయిల్లు తనది కానట్లుండవలయును. ఇదివైరాగ్యపరిపక్వార్థము సాధనవిధము.

అవ॥ అటువంటి మనుష్యుఁడు తనగృహము వీడి సన్యసింపక యందే యున్నను సుఖముగా నుండఁగలఁ డనుచున్నారు.

**మమతాభిమానశూన్యో విషయేషు పరాఙ్ముఖః పురుషః ।**
**తిష్ఠన్నపి నిజసదనే న బాధ్యతే కర్మభిః క్వాపి ॥80**

ప్ర : మమతాభిమానశూన్యః = ఇదినాది, నేను దేహాదులను, కర్తను భోక్తను, అనెడిభావములు లేనివాఁడును, విషయేషు = అనాత్మలగువిషయములందు, పరాఙ్ముఖః = కోరికను విడిచినవాఁడును అగు, పురుషః = పురుషుఁడు, నిజసదనే = తనయింటియందు, తిష్ఠన్ అపి = ఉన్నవాఁడైనప్పటికిని, క్వ + అపి = ఎక్కడకూడ ఏవిషయమునందు, కర్మభిః = కర్మములచేత, న బాధ్యతే = బాధింపఁబడఁడు.

తా॥ మనుష్యులకు వచ్చు సర్వబాధలకును అనాత్మవిషయములందు 'ఇది నాది' 'ఇది నేను, అదినేను' అను నుమోహాం

ధానములు- ఈ రెండును లేని పురుషుఁడు, విషయభోగవిరక్తుఁడై, తనయింటనే వసించుచున్నప్పటికిని మూఢసంసారివలె కర్మముల చేత బంధింపఁబడఁడు. అంతియకాని విషయతృష్ణను వదలక, జీవవిషయాదులందు అహంమమభావములను వర్జింపక, మనుష్యుఁడు అడవులందు వసించినను, కాషాయవస్త్రదండాదులు దాల్చి సంన్యసించినను అతఁడు బద్ధసంగుఁడు, కర్మబద్ధుఁడే గాని ముక్తసంగుఁడు కర్మకుశలుఁడు గాఁడని తాత్పర్యార్థము. ఇది వైరాగ్యసమగ్రతాస్థితి. బోధప్రకాశకమును ఇందులకు "విహాయ కామాన్ యః సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః। నిర్మమో నిరహంకారః స శాంతి మధిగచ్ఛతి'' గీ 2_71 శ్రీకృష్ణభగవానుని ఈగీతాస్మృతి వచనము ప్రమాణము. నిశ్శేషముగా కామములన్నింటిని బరిత్యజించినపురుషుఁడు (సంన్యాసి) జీవనమాత్రచేష్టాశేషుఁడై పర్యటించుచున్నాఁడు. ఈజీవనమాత్రక్రియలందైనను, కోరికలేనివాఁడగు నిస్పృహుఁడితఁడు. ఈశరీరజీవమాత్రార్థ మీయఁబడిన యన్నపానాదిపరిగ్రహమందుఁగూడ ఇది నాది యను మమతాభావము లేనివాఁడును, విద్యావత్త్వాది నిమిత్తములందు ఇది నేను అనుఆత్మబుద్ధిలేని నిరహంకారుఁడతఁడు. ఇట్టి బ్రహ్మవిదుఁడగు స్థితప్రజ్ఞుఁడు సర్వసంసారదుఃఖోపశమన లక్షణమైన మోక్షరూపశాంతిని పొందుచున్నాఁడు. బ్రహ్మభూతుఁడగుచున్నాఁ డనియర్థము.

అవ : మమతాభిమాన శూన్యుఁడైన వైరాగ్యవంతుఁడు ప్రకృతిసిద్ధ నిరాడంబర జీవన మెట్లు గడుపునో వర్ణించుచున్నారు.

**కుత్రా ప్యరణ్యదేశే సునీలతృణవాలుకోపచితే ।**
**శీతలతరుతలభూమౌ సుఖంశయానస్య పురుషస్య ॥ 81**

(ప్ర. 12)

తరవః పత్రఫలాఢ్యాః సుగన్ధి శీతానిలాః పరితః ।
కలకూజితవరవిహగాః సరితో మిత్రాణి కిం న స్యుః॥ 82

ప్ర : అరణ్యప్రదేశే = అడవులున్నచోట, కుత్ర + అపి = ఎక్కడనైనను, సునీలతృణవాలుకోపచితే-సునీల = చక్కని నీలవర్ణముకల, తృణ= దట్టమైన)పచ్చ గడ్డియును, వాలుకా = (మెత్తని) యిసుకయును ఉపచితే = కూడయున్నటువంటి, శీతలతరుతలభూమౌ-శీతల = చల్లని, తరుతల = చెట్ల క్రిందిప్రదేశముకల భూమౌ=స్థలమందు, సుఖం = హాయిగా, శయానస్య = పండుకొనియున్న, పురుషస్య=మనుజునకు, పత్రఫలాఢ్యాః-పత్ర = ఆకుల చేతను, ఫల=పండ్లచేతను, ఆఢ్యాః = సంపన్నములైన, తరవః = వృక్షము సుగన్ధిశీతలానిలాః-సుగన్ధి= మంచి సువాసనలతోఁగూడిన శీత = చల్లనైన, అనిలాః=వాయువులును, పరితః=అన్నివైపుల, కలకూజితవరవిహగాః కల= మనోహరమైన కూజిత=కూఁతలతో కూడిన, వర=శ్రేష్ఠములైన, విహగాః= పక్షులును, సరితః = నదులును, మిత్రాణి = (ఆహ్లాదమును కలిగించు నిష్టము లైన) మిత్రులు, నెయ్యురు, కిం న స్యుః = కావా? ఆనందమును గూర్చు మిత్రములు తప్పకుండ నగు నని తాత్పర్యము.

తా॥ విరాగియై అహంమమతాభిమానశూన్యుఁడైన పురుషుఁడు వనప్రదేశములం దున్నను ప్రకృతిసిద్ధమహానందమును బొందును. అక్కడ పచ్చనిగడ్డితో నిండినవియు, మెత్తనియిసుకతోఁ గూడి పరుండట కనుకూలముగా నున్నట్టియు, నదులు సరస్సులను గలప్రాంతములు నుండును. చల్లని నీడ నిచ్చు గొప్ప వృక్షము లుండును. అవి యాకులతోను బండ్లతోను నిండి కనువిందుగా నుండును. ఆచెట్లపైనుండి నలువైపుల నాకాశములో విచిత్రవర్ణములుగల ఱెక్కలతో నెగురుచు మనోహరధ్వనులు చేయుపక్షులు మిక్కిలి యానందకరదృశ్యము. పత్రములపుష్పములను వాసనలను బంచిపెట్టు మందమలయానిలములు వీచును. ఈ ప్రకృతిసహజసిద్ధవస్తువాతావరణములు నతనికిమిత్రములై కావల

సిననిర్మలనిరాడంబర సుఖజీవనసాధనము లగును. చక్కని యా చెట్లనీడలలో నదులపొంత మెత్తనియిసుకలమీద, పచ్చనిమెత్తని గడ్డిమీద సుఖముగా శయనించుచు, సువాసనల గుబాళించుపిల్లచల్ల వాయువులు మెల్లనవీచుచుండఁగా, నన్నివైపుల విచిత్రరూపము లతో వీనులకు విందుగా మనోహరముఁగా బక్షులు పాడు చుండఁగా త్రాగుటకు నిర్మలోదకములు, తినుటకు రుచ్యములైన ఫలములు నుండఁగా నిర్మమనిరహంకారుఁడగు నతఁడు పొందని యానంద మేముండును? అతఁడు పరమశాంతిని, సుఖమును నిశ్చయముగా ననుభవించును.

అవ॥ అతఁ డెట్లు కృతార్థుఁ డగునో వర్ణించుచున్నారు.

వైరాగ్యభాగ్యభాజః ప్రసన్నమనసః నిరాశస్య।
అప్రార్థితఫలభోక్తుః పుంసో జన్మని కృతార్థతేహ స్యాత్॥
83

ప్ర : వైరాగ్యభాగ్యభాజః = వైరాగ్యమను మహాభాగ్యము ననుభ వించువాఁడును, ప్రసన్నమనసః = నిర్మలప్రశాంతమైన మనస్సుకలవాఁడును, నిరాశస్య = దేనియందును (ఆశ,) కోరిక లేనివాఁడును, అప్రార్థితఫలభోక్తుః తాను కోరకుండనే లభించినభోగముల ననుభవించువాఁడును, అగు, పుంస = పురుషునకు, ఇహ = ఇక్కడనే, (జీవించియుండఁగనే.) జన్మని = ఈ జన్మమందే, కృతార్థతా = నేను పొందవలసినవాని నన్నిఁటిని బొందితిని, ఇంక నేను గోరఁదగినది, పొందవలసినది ఏమియును లేద, అను పరమతృప్తి స్యాత్ = (తప్పక) కల్గును.

తా : ఇందుఁ గృతార్థుఁ డగుపురుషుని వర్ణించుచున్నారు. వైరాగ్యమే యతనికి మహాభాగ్యము. కోరికలున్నవాఁడు చక్ర వర్తియైనను దరిద్రుఁడే కోరికలు లేని సంన్యాసి మహాభాగ్య

వంతుఁడు. అప్పు డతఁడు గొప్పశాంతిని బొందును. తాను గోర కుండ వారియంతట అవి వచ్చుభోగములను అతఁ డనుభవిం చును. రానివాని కలమటింపఁడు. వచ్చినవానిని వదలఁడు, రానిచోఁ జింతింపఁడు. మనస్సెప్పుడును నిర్మలముగాఁ బ్రశాంత ముగా నుండును అతఁ డీజన్మ మందే యిచటనే, ఇప్పుడే కృతా ర్థుఁడు.తాను బొందవలసిన సర్వశ్రేయస్సులుపొందితి ననియునింకఁ బొందవలసిన వేమియు లేవనియు నతఁడుపరమ తృప్తినిబొందియుం డును. ఇది వైరాగ్యాత్మబోధాతిశయఫలము. దీనినే పోతనమహా కవిగారు ప్రహ్లాదాజగరసంవాదమందిట్లు వర్ణించియున్నారు.

క॥ లేదని యెవ్వరి నడుగను
రాదని చింతింపఁ బరులు రప్పించినచోఁ
గాదని యెద్దియు మానను
ఖేదము మోదమును లేక క్రీడింతు మదిన్॥

క॥ నిందింపఁ బరుల నెన్నఁడు,
వందింప, ననేకపీడ వచ్చిన మది నా
క్రందింప, విభవముల కా
నందింపఁ; బ్రకామవర్తనంబున నధిపా!॥

అవ॥ విషయతత్త్వ మెఱింగి, బుద్ధిపూర్వకవిషయత్యాగముఫల మనంత మనుచున్నారు.

ప్రపన్నం పల్లవతశ్చ్యుతం యది భవేత్త్యాపి
ప్రమాదాత్తదా।
శోకాయాథ, తదర్పితం శ్రుతపతే తోషాయ చ శ్రేయసే।
స్వాతంత్ర్యా ద్విషయాః ప్రయాన్తి యదమీ శోకాయతే
సుశ్చిరం॥

సంత్యక్తాః స్వయ మేవ చేత్సుఖమయం నిశ్శ్రేయసం
తన్వతే॥ 84

ప్ర : క్వాపి = ఏప్రదేశమందైనను, ప్రమాదాత్ = ఏమఱుపాటు వలనగాని, వంచనవలనగాని, వల్లవతః = చెఱఁగు కొంగునుండి, ద్రవ్యం = బంగారువంటిధనాదులు, చ్యుతం యది = నష్టపడి (లేకజాఱిపడి) పోయినచో, తదా = అప్పుడు, శోకాయ = (శోకము) దుఃఖముకొఱకే, (ద్రవ్యము అగుచున్నది.) అథ = అట్లుగాక, తత్ = ఆబంగారువంటిద్రవ్యము, శ్రుత వతే = వేదపండితునకు, అర్పితం = దానముచేయఁబడినచో, శ్రేయసే చ = మేలగు పుణ్యము (సంతోషఫలము) కొఱకే, (భవతి) = అగుచున్నది. అమీ విషయాః = ఈద్రవ్యాదివిషయములు, స్వాతంత్ర్యాత్ = తమపనులవలన తమకుఁదామే ప్రయాన్తి యత్ = జాఱిపడి వదలి పోవునవి యగుచో, తే = అవిషయములు, చిరం = అధికమై చిరకాలముండు, శోకాయ = దుఃఖము కొఱకే స్యుః = అగుచున్నవి. స్వయమేవ = వైరాగ్యబుద్ధిపూర్వకముగా స్వయముగానే సంత్యక్తాః చేత్ = లెస్సగా నిశ్శేషముగా విడువఁబడిన వగుచో, సుఖమయం = సుఖస్వరూపమైన, నిశ్శ్రేయసం = మోక్షమును తన్వతే = విస్తరించుచున్నవి, అనగా ఇచ్చుచున్నవి.

తా॥ కొంగున గట్టుకొన్న బంగారము మొదలైన ద్రవ్య రాశి, ఏప్రమాదముచేతనో యెక్కడేని తెలియకుండ జారిపడి పోయిన, నరుఁడు ఆపోయినదానికై ఎంతయో యేడ్చును. కాని అట్టిద్రవ్యము పాత్రుఁడగు ఏవేదపండితునకో దానము చేయఁ బడినచో, అది అధికసంతోషమును పుణ్యమును దెచ్చును. కావున ద్రవ్యాదివిషయములు, తమంతటతామే జాఱిపడియో యితరులచే దొంగిలింపఁబడియో, నష్టమయినప్పుడు, ఆ(ద్రవ్య)ధన వంతునకు చిరంతనశోకమునే కల్గించుచున్నవి. కాని ఆనరుఁడు ఈద్రవ్యాదివస్తుస్వభావమెఱింగి అవి శోకకారకములని, వైరాగ్య వంతుఁడై వివేకవిజ్ఞానముతో తానే ఆవిషయపరిత్యాగశీలుఁ డగుచో, వానికి శాశ్వతసుఖరూపమగు మోక్షానందానుభవమే

సిద్ధించుచున్నది. ఇట్లు పరిపక్వవైరాగ్యము, ఉచితాత్మబోధ యుక్తమై సాక్షాన్మోక్షసాధన మగుట నిరూపితము. ఇది 5వ శ్లోకమందలి ప్రతిజ్ఞావచనసార్థసాధనవిధము.

అవ॥ వైరాగ్యాత్మబోధగలవానికగు నిత్యానందప్రాప్తినిజూపి, వీనినాశ్రయింపక, విషయలోలుఁడగు నరుని వ్యర్థజీవితమును కన్నులఁగట్టినట్లు లేడి దృష్టాంతముతో నిరూపించుచున్నారు.

శా॥ విస్మృత్యాత్మనివాస ముత్కటభవాటవ్యాం చిరం
పర్యటన్।
సన్తాపత్రయదీర్ఘదావదహనజ్వాలావలీవ్యాకులః।
వల్గన్ ఫల్గుషు సుప్రదీప్తనయన శ్చేతః కురఙ్గో
బలాత్!
దాశాపాశవశీకృతో ఽపి విషయవ్యాఘ్రైర్ని ర్ధృశ్యో
హన్యతే॥ 85

ప్ర: చేతఃకురఙ్గః = మనస్సనెడులేడి, ఆత్మనివాసం = తనయొక్క యింటిని, ప్రత్యగాత్మయను తనయాధారమును, విస్మృత్య = మఱచి, ఉత్కట భవాటవ్యాం, ఉత్కట = గొప్పదైన, భవ = సంసారమను, అటవ్యాం = అడవియందు, చిరం = చిరకాలము, పర్యటన్ = అడ్డదిడ్డముగా, దారితెన్ను లేక సంచరించుచున్నదై, సన్తాపత్రయదీర్ఘదావదహనజ్వాలావలీవ్యాకులః సన్తాపత్రయ = ఆధ్యాత్మిక - ఆధిభౌతిక - ఆధిదైవిక మను మూఁడు దుఃఖతాపములనెడు, దీర్ఘ = పొడవైన, విస్తృతమైన, దావదహన = అడవిలో పుట్టి వ్యాపించు కార్చిచ్చుయొక్క జ్వాల ఆవలీ = మంటలసమూహముచేత, వ్యాకులః = దిక్కుదోఁచకుండ చేయఁబడి దుఃఖపెట్టఁబడినదై, ఫల్గుషు = సారములేని విషయములందు, వల్గన్ = సంచరించుచున్నదై సుప్రదీప్తనయనః = మిక్కిలిగాప్రకాశించుచున్న కన్నులు గలదై, జేవురించిన కన్నులతో బలాత్ = బలవంతముగా, ఆశాపాశవశీకృతః = ఆశలనెడి త్రాళ్లబంధముల

చేత కట్టఁబడినదై, వివశమై వానిలోఁ జిక్కుపడి తప్పించుకొనలేక, అపి = కూడ విషయవ్యాళైః = తాను కోరినవిషయములనెడు బెబ్బులులచేత మృషా = వ్యర్థముగా, హన్యతే = చంపఁబడుచున్నది.

తా॥ పురుషునిమనస్సు జింకవంటిది. అది సుఖము, శాంతిని కూర్చు స్వస్థానమును వదిలి, విహారాహారములు సంపాదింపవచ్చునను కోర్కెలతో మిక్కిలి భయంకరమైన సంసారమనెడు అడవిని ప్రవేశించినది. అది చిరకాలము సంచరించుచు ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికమనెడు బహుదుఃఖముల బాధింబడినది. ఆదుఃఖానలమే భయంకరమైన కార్చిచ్చుగాఁబరిణమించినది. అంతట లేడి మనస్సు కలతపడినది మండుచున్న కనులతో దిక్కుదోచక యది చివరకు ఆవిషయము లనెడు బెబ్బులులచేఁ ఈవిధముగా నాకురంగ మాశాపాశశతములకు జిక్కి వృథాగా నశించినది. పురుషునిమనస్సు కూడ నట్లె దానిస్వస్థానమును, అసఁగా నాధారమైన, నిత్యనిరంతరానందస్థానమైన అంతరాత్మను విడిచి, బాహ్యవిషయములందలియాశతో భయంకరమైన గొప్పదైన సంసారమనునరణ్యములోనికి బలవంతముగా నీడ్వఁబడినది. ఇందు తాపత్రయము లనెడి భయంకరమైన కార్చిచ్చు దానిని జుట్టుముట్టినది. తాపత్రయ మనగా నాధ్యాత్మికాధిభౌతికాధిదైవికదుఃఖముల సముదాయము. ఆధ్యాత్మికదుఃఖములు శరీరమువలన వచ్చు భయంకరములైన వ్యాధులు, చింతలు. అధిభౌతికములు పరిసరజీవజంతువు లగుకుక్కలు, ఎలుకలు, తేళ్లు, సర్పములు, దోమలు, శత్రువులు, మొదలగు జీవులవలని బాధలు. అధిదైవికములు దేవతలును, ప్రకృతియు విజృంభించి కలిగించు నుపద్రవరూప మగు అధికశీతాతపములు వర్షములు, పిడుగుపడుట భూకంపములు మొదలగువానివలన బాధలు. ఈమూడువిధము

లుగా బాధలు కార్చిచ్చువలెఁ దన్నుఁ గాలింపగా భయభ్రాంతమై దిక్కుదోఁచక ఎట్లువడినకన్నులతో వీనిని దప్పించుకొనటకు విఫల యత్నము లొనగించి, ఆశలే తప్పించుకొనలేని పాశములుగా దన్ను బంధింపఁగాఁ, జివరకు విషయము లనెడుబెబ్బులులవాతఁ బడి వృథాగాఁజచ్చినది. కావున మానవునిజీవితము మిథ్యావిషయ తృష్ణారతమైన లేడివృత్తము వంటిది కాకూడ దని నిషేధరూపోపదేశము. అనఁగా విషయభోగవిముఖమైన స్థిరవైరాగ్యమును, బ్రహ్మసత్యత్వజగన్మిథ్యాత్వరూపమైన ఆత్మబోధను జీవితప్రధానలక్ష్యములుగా నుంచుకొని, వానిని సాధించి మోక్షానందానుభవము పొందవలయునని యీ యారుప్రకరణముల సారోపదేశము, ప్రబోధము.

## 7. ఆత్మసిద్ధిప్రకరణమ్ (ఆత్మసిద్ధిప్రకరణము)

అతిసూక్ష్మమై, అతీంద్రియమై, సర్వప్రాపంచిక విషయములకంటె సర్వవిధముల విలక్షణమై, పరబ్రహ్మరూపమైన ప్రత్యగాత్మ, నిత్యసిద్ధ మని హేతు విచారణపూర్వకముగా నిశ్చయింపబడిన ప్రకరణము గాన ఆత్మసిద్ధిప్రకరణమనిరి

అవ॥ ఒకదానినొకటియపేక్షించునట్టి వైరాగ్యాత్మబోధభక్తియనుత్ర్యవయవకసముదాయమందు 6 ప్రకరణములలో వైరాగ్యవిషయమును ప్రధానముగా విశదీకరించియిప్పుడు తొమ్మిదిప్రకరణములను ఆత్మబోధ ప్రధానములుగాఁజేసి ముందుగా నిత్యసుఖానుభూతికై ఆత్మబోధావశ్యకతను దానిసాధనోపాయమును బోధించుచున్నారు.

**ఉత్పన్నేఽపి విరాగే వినా ప్రబోధం సుఖం న స్యాత్ ।86**
**సభవే ద్గురూపదేశా త్తస్మా ద్గురు మాశ్రయే త్ప్రథమమ్ ॥**

ప్ర : విరాగే = విషయములందు వైరాగ్యము, ఉత్పన్నే అపి = పుట్టినప్పటికిఁ గూడ, ప్రబోధం = (కేవలాత్మయగుఁ దన్ను గుఱించిన) జ్ఞానము వినా = లేకుండ, సుఖం = (నిత్యమైన) ఆనందము, న స్యాత్ = కలుగఁ బోదు: సః = ఆ ఆత్మజ్ఞానము, గురూపదేశాత్ = గురువు తనకుఁ దెలియ

జెప్పుటవలన, భవేత్ = కాఁగలదు. తస్మాత్ = అందువలన, పురుషుఁడు, ప్రథమమ్ = మొట్టమొదట, గురుం = ఆత్మసాక్షాత్కారము నంది, ఆశ్రిత భక్తశిష్యునియజ్ఞానాంధకారమునుబాఱఁద్రోలఁగలసమర్థుఁడైన(బ్రహ్మనిష్ఠుఁడైన) గురువును, ఆశ్రయేత్ = ఆశ్రయింపవలెను.

**తా :** అతిప్రయాసము మీఁదఁ బురుషుఁడు **విషయ**ము లందు "ఇవి యనిత్యములు, అనిత్యసుఖమును మాత్రమే ఈయఁగలవు. ఇది సుఖమనుటయు భ్రాంతియే. వీనిని సంపాదించుట కెన్నికష్టములో? పడవలెను ఈవిధముగా వానిదోషదర్శనము వలన (వానియందు) విరాగము పొందవచ్చును. కాని యంత మాత్రమునఁ దా **నా**శించిన నిత్యసుఖము రాదు. దానికిఁ గావలసినది అతీంద్రియమైన ఆత్మయొక్క ప్రబోధము. నిత్యుఁడైన తా **న**వరో నిశ్చయముగాఁ తెలిసికొనుట. అదెట్లు లభించును? సంప్రదాయసిద్ధముగా నెఱింగి, ఆత్మానుభవముకల్గి, ఆత్మనిష్ఠుఁడై శిష్యునకు నిస్సందేహముగా ఆత్మజ్ఞాన మెఱిగించి, వానిని జ్ఞానయోగిగాఁ జేయుఁ జాలినసమర్థుఁడగు జీవన్ముక్తుఁడగు గురువు నాశ్రయించుటవలన లభించును ఆమహాపురుషుని సమీపించి, తన సేవవలన, భక్తివలన నాయనను దృప్తునిఁ జేసి, తాను దెలియఁగోరినయాత్మానాత్మవిషయమై పరిప్రశ్నలువేయుచు, శ్రద్ధావినయవంతుఁడై శ్రీశాస్త్రాచార్యోపదేశములను మనస్సునకు గట్టిగా బట్టించుకొనవలెయును.

అవ॥ దీని కొక చక్కని యుదాహరణ మిచ్చుచున్నారు.

యద్యపి జలధే రుదకం, యద్యపి వా ప్రేరకో ఽనిల స్తత్ర।
తదపి పిపాసాకులితః ప్రతీక్షతే చాతకో మేఘమ్ ॥ 87

(ప్ర. 14)

ప్ర : జలధేః = సముద్రముయొక్క, ఉదకమ్ = నీరు (ఎదుట) యది, (అస్తి) అపి = ఉన్నప్పటికిని, (దానిని మేఘముగా మార్చి తన కందించుటకు తత్ర = అక్కడ, ప్రేరకః = కారకుఁడగువాఁడు అనిలః వాయువు, వా = కాని, యది (అస్తి) అపి = ఉన్నప్పటికిని,పి పాసాకులితః పిపాసా = దప్పికచేత (త్రాగవలె ననుకోరికచేత) ఆకులితః = బాధింపఁబడుచు, (యది) అపి = ఉన్నప్పటికిని, చాతకః = చాతక మనుపక్షి, మేఘమ్ = మబ్బునుమాత్రమే, ప్రతీక్షతే = ఎదురుచూచును.

తా : చాతకజాతికిఁ జెందినపక్షి స్వయముగా సముద్రము నది మొదలగువానినుండి తక్కినపక్షులవలె నీరు త్రాఁగదు. అది మేఘమునుండి పడుచున్న జలధారలనే త్రాఁగును. మేఘ జలము పుట్టుస్థానమై అపారజలముతో నిండిన సముద్ర మెదురుగానున్నను, ఆమేఘమును తనదగ్గఱకు నెట్టుకొనివచ్చిన సాధనమగు వాయువుకూడ నెల్లప్పు డున్నను ఈసముద్రవాయువులరెంటి యపేక్షలేకయే ఆచాతకపక్షి ఆమేఘజలధారలకొఱకై కాచుకొని యుండును. భూమిపైపడకముందే త్రాగును. ఈచాతకపక్షికి దప్పికవలె నొకపురుషునకు నిత్యానందరూపమోక్షమునందు కోరిక పుట్టియుండవచ్చును, దానికి ప్రధానసాధనమగు నాత్మజ్ఞానమును గల్గఁజేయు సముద్రమువంటి ప్రజ్ఞాననిధానములగు వేదవేదాంతములుకూడ సమీపమందే యుండవచ్చును. ఈశ్వరానుగ్రహము కూడఁ దనపూర్వపుణ్యవశమున సిద్ధముగా నుండవచ్చును. ఐనను ఆవిజ్ఞానమును జీర్ణము చేసికొనవలెనన్న మేఘమువలె సూటిగాఁ దనకందిపఁగల గురువు నాముముక్షు వాశ్రయింపవలయు నని హెచ్చరిక. తెలిసి చక్కగాఁ జెప్పఁగల గురువు లేనిచో ముముక్షువునకు దత్త్వముకలరూపు తెలియదు. కావున ఆత్మవిజ్ఞానార్థము అతఁడు ప్రప్రథమమున సమర్థుఁడగు గురువు నాశ్రయింపవలెను.

అవ॥ ఆత్మపస్వానుభవ మెట్లు కల్గునో సోదాహరణముగాఁ జెప్పు చున్నారు.

త్రేధా ప్రతీతి రుక్తా శాస్త్రా ద్గురుత స్తథాఽఽత్మన స్తత్ర।
శాస్త్రప్రతీతి రాదౌ యద్వ న్మధురో గుడో ఽస్తీతి ॥ 88
అగ్రే గురుప్రతీతి ర్దూరా ద్గుడదర్శనం యద్వత్ ।
ఆత్మప్రతీతి రస్మా ద్గుడభక్షణజం సుఖం యద్వత్॥ 89

ప్ర ! ప్రతీతిః = (దేనినైనను) తెలిసికొనుట (జ్ఞానము) శాస్త్రాత్ = శాస్త్రమువలనను, గురుతః =గురువుద్వారమునను, ఆత్మనః = తనయనుభవమువలనను (ఇట్లు) త్రేతా = మూడువిధములుగా ఉక్తా = చెప్పఁబడినది. తత్ర = ఆమూడురకములజ్ఞానమందు ఆదౌ = మొదట, మధురః = తీయని గుణముగల వస్తువగు గుడః = బెల్లము, అస్తి = ఉన్నది, ఇతి = అని యద్వత్ = (చెప్పుట) ఎట్టిదో (తద్వత్ = ఆవిధమువంటిది) శాస్త్రప్రతీతిః = శాస్త్రమువలనఁ దెలిసికొనుట దూరాత్ = దూరముగానుండి, అగ్రే= తనయెదుట గుడదర్శనం = బెల్లమును చూచుట యద్వత్ = ఎట్టిదో, గురుప్రతీతిః = గురువువలనఁ దెలిసికొనుట (తద్వత్ = అట్టిది అగును.) అస్మాత్ = ఈరెండువిధములకంటె వేరైన గుడభక్షణజం = ఆబెల్లమును (తెచ్చుకొని) తినుటవలన పుట్టినదైన సుఖం = సుఖము యద్వత్ = ఎట్టిదో (తద్వత్ = ఆవిధమువంటిది) ఆత్మప్రతీతిః తానుగావిన్నదానిని, గన్నదానిని అనుభవపూర్వకముగా రుచిచూచి తెలిసికొనుట.

తా : ఏదైన సరికొత్తవస్తు వనుభవమునకు రావలెనన్న శాస్త్రగుర్వాత్మప్రతీతి యని మూడుభాగములను (దశలను) గల్గి యున్నది. (ఉదాహరణము:) 'బెల్లము తీయగా నుండును' అని శాస్త్రము చెప్పగా, విని తెలిసికొన్నది మొదటిదశ. (శాస్త్రప్రతీతి) ఇది తెలిసినగురువు దానిని దెలియఁగోరిన తన శిష్యునకు ముందుఁబెట్టి దూరముగా బెల్లమును జూపించి ''యిది

బెల్లము. ఇది మధురముగా నుండును" అని కొంతవివరించి దాని ననుభవింపవలె నను ప్రేరణ పుట్టునట్లుగా విన్నంతనే కల్గినతెలివి రెండవదశ (గురుప్రతీతి) ఆపిదప శిష్యుఁడు ఆబెల్లమును గ్రహించి భక్షించి, "బెల్లము తీయగా నున్న దని, అదిసుఖసాధన మని అనుభవించి సుఖమును బొంది తెలిసికొంట మూఁడవదశ (ఆత్మప్రతీతి.) ఈమూఁడుభాగములు లేకుండ నేదియును బూర్ణముగా దెలియదు. ఆత్మజ్ఞానముకూడ ఇట్లే లభించును. ఆత్మనుగుఱించి భ్రమప్రమాదములులేని పరమేశ్వరరూపాపౌరుషేయమైన శాస్త్రము చెప్పవలెను. దానిని అనుభవపూర్వకముగా సాక్షాత్కరించుకొన్న గురువు, శిష్యున కాత్మను కన్నులకుఁ గట్టినట్లు ఆత్మవిషయమును వివరించుచు, ఆత్మగానిదానియందు ఆత్మబుద్ధి గల శిష్యుని యధ్యాసను దొలఁగఁబెట్టుచు, వాని కిదివఱకు దెలిసిన సర్వమునకు ఆధారమైన వస్తువు, ఆత్మయని తెలియఁజెప్పవలెను. ఆపిదప శిష్యుఁడు శాస్త్రగురుబోధసారమును గ్రహించి ఉపనిషదుక్తయుక్తులవలన ఆత్మవిషయమును మననము చేసికొని, స్వానుభవపూర్వకముగా 'నేను నిత్యముక్తాత్మను' అని తెలిసికొని విశ్రాంతితో సుఖింపవలె నని తాత్పర్యార్థము.

అవ॥ వస్తుజ్ఞానానుభవము స్థూలదేహమునకు నింద్రియములకు ప్రాణమునకు లేదని, వీనికంటె భిన్నమైనదానికే గలదని నిరూపించుచున్నారు.

రసగన్ధరూపశబ్దస్పర్శా అన్యే పదార్థాశ్చ ।
కస్మా దనుభూయన్తే నో దేహే స్వేన్ద్రియ గ్రామాత్ ॥90
మృతదేహేన్ద్రియవర్గో యతో న జానాతి దాహజం
దుఃఖమ్ ।
ప్రాణశ్చ న్నిద్రాయాం తస్కరబాధాం స కిం వేత్తి॥ 91

ప్ర : అన్యే = తనకంటె ఇతరములైన రసగన్ధరూపశబ్దస్పర్శాః = రుచి, వాసన, రూపము, ధ్వని, స్పర్శములను, విషయరూపములను, పదార్థాః = వస్తువులను, కస్మాత్ = ఎవనివలన, అనుభూయన్తే = అనుభవింపఁబడుచున్నవి. ? (అనఁగా వాని ననుభవించునాత్మ యెవరు?) (ఈవిషయానుభవము) నో దేహాత్ = శరీరమువలనఁ గాదు. న ఇన్ద్రియగ్రామాత్ = ఇంద్రియసమూహమువలన గాదు. యతః ఎందుకనఁగా, మృతదేహేన్ద్రియవర్గః = చనిపోయినపిమ్మట దేహముగాని, ఇంద్రియసమూహముగాని దాహజం = ఆమృతశరీరమును తగులఁబెట్టుటవలన పుట్టినదైన దుఃఖం = దుఃఖమును, బాధను, న జానాతి = తెలిసికొనుట లేదు. అందువలన స్థూలదేహముగాని, యింద్రియములుగాని విషయానుభవకర్తలు గావు. పోనిమ్ము. అట్టిఅనుభవకర్త ప్రాణః చేత్ = ఉచ్ఛ్వాసనిశ్వాసకారణమగు ప్రాణము అన్నచో నిద్రాయాం = నిద్రించియున్నప్పు డున్నప్రాణము, తస్కరబాధాం = ఆనిద్రాసమయమున దొంగలు వచ్చి కల్గించు నష్టమును, (బాధను) న వేత్తి కిం = ఆప్రాణము తెలిసికొనుచున్నదా? తెలిసికొనుటలేదు. (కావున ప్రాణము కూడ విషయజ్ఞానమును పొందుకర్తయగు ఆత్మ కాదు.)

తా : మనుష్యుఁడు ఉన్నదున్నట్లుగా తెలిసికొనవలసినది, ఆత్మస్వరూపస్వభావములను గుఱించి. కాని లోకములో సాధారణముగా మనుజుఁడు తానీస్థూలదేహమని, యింద్రియములని అనుకొనుచున్నాఁడు విషయముల నిట్లుగాని, మఱట్లుగాని, తెలిసికొనున దాత్మవస్తువు. ఇప్పుడు ప్రపంచములోని వస్తువులగుణములగు రుచి, వాసన, రూపము, ధ్వని స్పర్శములను, అవి కలవస్తువులను (గుణులను) ఎవఁడు తెలిసికొనుచున్నాఁడు? వీనిని దెలిసికొనువాఁ డాత్మయేగాని దేహేంద్రియసముదాయమును (ప్రాణమును) గాదనిశాస్త్రాచార్యోపదేశములు. ఈవిషయవిచారణయందు న్యాయముచే నిరూపణము చేయఁనగును. చచ్చిపోయినపిమ్మట పనిచేయకపడియున్న ఆస్థూలశరీరముగాని, ఇంద్రియములుగాని, ఘొబడలు తగులఁబడుచుండగా కల్గుదహనబాధను అనుభవించుట

లేదు. అందువలన వనకుఁ గనఁబడు ఈస్థూలదేహము, ఈ యింద్రియములు కర్తృభోక్తృరూపమైన చేతనాత్మ కాదని నిర్ణయింపఁబడెను.. పోనిమ్ము ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములను కల్గించి శరీరము జీవించియున్నదని చెప్పుటకుఁ గారణమైన ప్రాణమే తెలిసికొను ఆత్మయని చెప్పఁగూడదా యన్నచో నదియును గుదురదు. ఎందువలన ననగా మనుష్యుఁడు నిద్రించిన సమయమందుకూడ ప్రాణము తానుండి తనపనిని, చేయుచునేయున్నది. ఒకదొంగ యింటిలో ప్రవేశించి వస్తువుల దోఁచుకొని నష్టము కల్గించునపుడు శరీరమందున్న ప్రాణము దానిని దెలిసికొనుట లేదు. అందువలనఁ బ్రాణముగూడ తెలిసికొనునాత్మ కాదని నిర్ణయమైనది.

అవ ॥ మనస్సుకూడ ఆత్మ కాదని చూపుచున్నారు.

## మనసో యది వా విషయ స్తద్యుగప త్కిం న జనాతి ।
## తస్య పరాధీనత్వా ద్యతః ప్రమాదస్య క స్త్రాతా ॥ 92

ప్ర : వా = అట్లుగాక, (ఆతెలిసికొనుట) మనసః = మనసుయొక్క, విషయాః పని, (అనఁగా నాతెలిసికొనుఆత్మ మనస్సు) అన్నచో, తద్ = ఆమనస్సు, యుగపత్ = (తనముందున్న శబ్దాదివిషయపదార్థము లన్నిటిని) ఒకేసారి, కిం, న, జానాతి = తెలిసికొన లేకున్నదేమి? తస్య = ఆమనస్సుయొక్క, పరాధీనత్వాత్ = స్వాతంత్ర్యములేక మఱియొకదాని మీఁదనాధారపడి దానిచెప్పుచేఁతలందే యుండుటవలన అది సరిగాఁ దెలిసికొనమికి అనఁగా భ్రమప్రమాదములకు వశమగుచుండుటవలనయతః = అందువలన, ఆమనస్సు తెలిసికొను ఆత్మపదార్థము కాదు. ప్రమాదస్య = ఈపొరపడు మనస్సుయొక్క త్రాతా = పరిపాలించి రక్షించువాఁడు, కః ఎవఁడు ? అతఁడే యాత్మ కావలెను.

తా : పోనిమ్ము ఈ తెలిసికొనుఆత్మ మనస్సే యనఁగూడదా? అన్నచో, మనస్సున కెదురుగా శబ్దాదిసర్వవస్తువు లున్నందువలన వాని నన్నిఁటిని (ఒకదానితరువాత మఱొక దానిని గాక,) ఒకేసారి వానినన్నింటిని తెలిసికొనవలెను. కాని మన స్సట్లు తెలిసికొనుట మనస్సునకు స్వాభావికము గాదు. అనఁగా తెలిసికొను మూలపదార్థము మనస్సు గాదని, యది మఱొకదానిపని యని ఆమనస్సు ఆమూలపదార్థమున కధీనమై యున్నదని చెప్పవలెను. అప్పుడు మాత్ర మాయాత్మ యన్నిఁటిని ఒకేసారి యెందుకు దెలిసికొనుట లే దన్నచో, దానికి సాధనము మన స్సనియు, మనస్సున కట్టిశక్తి లేనందువలన, మనస్సుద్వారమున నెంతవఱకుఁ దెలిసికొనఁ గలదో యంతవఱకు దెలిసికొనుచున్న దని సమాధానము చెప్పవచ్చును. దీనివలన తెలిసికొనుటలో మనస్సు స్వతంత్రముగలది కాదనియు నది మఱి యొకరిపై నాధారపడి యున్న దనియు ధ్రువమైనది. మఱియు మనస్సు భ్రమప్రమాదములకు వశ మగుచున్నది. మఱల చూడు మని, సరిగా గ్రహింపు మని దానిని భ్రమప్రమాదముల నుండి తప్పించువాఁడు మఱొకఁ డుండవలెను. అతఁడే ముఖ్యాత్మ. అతనిశక్తివలననే మనస్సు పనిచేయుచున్న దన వలెను. ఈవిధముగా శరీరము, ఇంద్రియములు, ప్రాణము, మనస్సు ఇవేవియు స్వాభావికముగా తెలిసికొనునాత్మ కాదని నిరూపితము. అంతర్యామియై చిత్స్వరూపమైన ఆత్మ తన సాన్నిధ్యమువలన వీనినన్నిటిని నడిపించుచున్నది. ఇట్టిఇట్టిలక్షణములుగల ఆత్మపదార్థము ఉన్నదని నిశ్చయముగా న్యాయసమ్మతముగా సిద్ధించినది. కావుననే దీనిని ఆత్మసిద్ధిప్రకరణమన్నారు.

అవ॥ ఈయర్థము నొకచక్కని యుదాహరణముతో విశదీకరించు చున్నారు. రెండుశ్లోకములలో.

గాఢధ్వాన్తగృహాన్తతః క్షితితలే దీపం నిధా యోజ్జ్వలం।
పఞ్చచ్ఛిద్రముఖం హి కలశం తస్యోపరి స్థాపయేత్ ।
తద్బాహ్యే పరితో ఽనురన్ధ్రి మమలాం వీణాంచ
కస్తూరి కాం।
సద్రత్నం వ్యజనం న్యసే చ్చ కలశచ్ఛిద్రాధ్వనిర్గచ్ఛతా॥
93

తేజోంశేన పృథక్పదార్థనివహజ్ఞానం హి యజ్జాయతే 94
త ద్వస్త్రైః కలశేన వా కిము మృదో భాణ్డేన తైలేన వా।
కిం సూత్రేణ స చైత దస్తి రుచిరం ప్రత్యక్షబాధా దతో
దీపజ్యోతి రిహైక మేవ శరణం దేహేత థాఽఽత్మాస్థితః॥

ప్ర : గాఢధ్వాన్తగృహాన్తతః గాఢః దట్టమైన, ధ్వాన్త = చీకటిగల, గృహాన్తతః = ఇంటిలోపల, క్షితితలే = నేలమీఁద (మట్టిప్రమిదలో మంచివత్తిచమురు పోసి వెలిగించినపిమ్మట) ఉజ్జ్వలం = మిక్కిలిగా ప్రకాశించు, దీపం = దీపమును, నిధాయ = ఉంచి, తస్య = అబాగుగా వెలుగుచున్నదీపముయొక్క ఉపరి = పైభాగమందు, పఞ్చచ్ఛిద్రం = ఐదురంధ్రములు కలదియు, అధోముఖంహి = మూతి క్రిందుగాఁ గలదియు బోర్లింపఁబడినదియు నగునట్లే, కలశం = కుండను స్థాపయేత్ = ఉంపవలెను. (మఱియు,) తద్బాహ్యే = ఆకుండకు వెలుపల, పరితః = అన్నివైపుల, అనురన్ధ్రిం = ఆయైదురంధ్రముల కెదురుగా, అమలాం = ఉసిరికకాయను, వీణాం = (మ్రోగు) వీణను, కస్తూరికాం = పరిమళించుచున్న కస్తూరిని. సద్రత్నంచ = మెఱయుచున్నటువంటి మంచి రత్నమును, వ్యజనం = (గాలినికల్గించు) వీవనను కూడ న్యసేత్ = ఉంచవలెను. (అప్పుడు) కలశచ్ఛ

ద్రాధ్వనిర్గచ్ఛతా కలశ = ఆకుండయొక్క ఛిద్ర = రంధ్రములయొక్క, అధ్వ = మార్గములగుండ, నిర్గచ్ఛతా = బయలువెడలుచున్నదైన, తేజోఽంశేన = కాంతికిరణభాగముచేత, పృథక్పదార్థనివహజ్ఞానం పృథక్ = వేరుగా వేరుగానున్న పదార్థ = నేలఉసిరికకాయ, వీణ, కస్తూరి, రత్నము, విసనకర్రల యొక్క నివహ = సమూహముయొక్క, యత్జ్ఞానం = వానిస్వరూపములను రుచి, (శబ్ద), ధ్వని, వాసన, రూపము, స్పర్శములగుగుణములచేత (తెలిసికొనుట) ఏతెలివి జాయతే = పుట్టుచున్నదో, తద్ = ఆవస్తుజ్ఞానము హి = ఏకారణమువలన కల్గుచున్నది? కలశేన = ఆకుండవలననా? రంధ్రైః = అకుండయొక్క రంధ్రములవలననా? (జాయతే = పుట్టుచున్నది?) వా = లేక, మృదః భాణ్డేన = మట్టితోఁజేయఁబడినప్రమిద (పాత్ర,) వలననా? కిము = లేక తైలేన (జాయతే) = దీపమును వెలిఁగించుచూనెవల నఁ బుట్టినదా?, వా = లేక, కిం సూత్రేణ = (దీపపు) వత్తివలన (పుట్టినదా?), ప్రత్యక్షబాధాత్ = ఇంద్రియజ్ఞానానుభవమునకు సరిపోక పోవుట వలన, ఏతద్ = పైపేర్కొన్నజ్ఞాన కల్పకారణముదెలియు, రుచిరం = సరియైన కారణముగా, న అస్తి = లేదు. అతః = ఇందుచేత, ఇహ = ఇక్కడ విచారించినఈజ్ఞానోత్పత్తికి ముఖ్యకారణము (సరియైన సమాధానము)గా, దీపజ్యోతిః = దీపముయొక్క వెలుగు ఏకం ఏవ = ఒక్కటిమాత్రమే శరణమ్ = (మనకు సరియైన యుత్తరముగా) రక్షించునది. తథా = ఆయుజ్జ్వల దీపజ్యోతివిధముగా దేహే = శరీరమునందు, ఆత్మా = పంచేంద్రియజ్ఞానద్వారములుగల జ్ఞానాత్మ, అస్తి = ఉన్నాఁడు.

**తా :** పైశ్లోకార్థమును ఒకచక్కని యుపమానముతో స్పష్టపఱచుచున్నారు కటికచీఁకటి యావరించిన యొకయింటిలో నేలమీఁద మట్టిప్రమిదలో నున్నచమురువత్తితో మిక్కిలిప్రకాశవంతముగా వెలుఁగు నొకదీపము నుంచుము. దానిపై నైదు రంధ్రములుగల యొకకుండను మూతి నేలపై నుండునట్లు బోరగిల నుంచుము. దానికి వెలుపల రంధ్రముల కెదురుగా నొకదాని దగ్గఱ ఒకఉసిరికకాయను, మఱొకరంధ్రమునెదుట మ్రోగుచున్న వీణను, మూడవదానియెదుట పరిమళించుచున్న కస్తూరిని, నాల్గవ

దానియెదుట బాగుగా మెఱయుచున్న యొకమంచిమణిని, మిగిలిన రంధ్రమునద్ద గాలివీచువిసనకఱ్ఱను ఉంచుము. ఇప్పు డారంధ్రములనుండి వచ్చుకాంతివలన నాయెదుటవస్తువులజ్ఞానము గదిలో నున్న మనకుఁగల్గుచున్నది? అది ఆకలశములవలననా? లేక కలశముయొక్క రంధ్రములవలననా? లేక యాకుండవలననా? లేక దీపమును వెలిఁగించు నూనెవలననా? లేక దీపపువత్తివలననా? నిజముగాఁ జూచినచో వీనిలో దేనివలనఁ గూడ నావస్తువులజ్ఞానము మనకుఁ గలుగుట లేదని రూఢియగుచున్నది. ఆదీపమును దీసివేసినచో ప్రత్యేకముగా నివన్ని యున్నను వానిజ్ఞానము మనకు ఏమాత్రమును గల్గదు. కావున నీజ్ఞానము కల్గించునది యొక్క దీపమే, మఱొకటి కాదని సిద్ధించుచున్నది. అదేవిధముగా జ్ఞానేంద్రియరంధ్రములుగల యాశరీరమందున్న చిద్రూపాత్మయే యీ సర్వవస్తువులజ్ఞానమునకు ముఖ్యకారణ మని నిశ్చయింపవలెను. ప్రాపంచికవిషయసేవాభిరతజ్ఞానశూన్యలకజీవితమే, కాఱుచీకట్లతో నిండినయిల్లు. ఇందు పంచరంధ్రములుగల కలశమే యీస్థూలశరీరము. ఐదురంధ్రములు నైదుజ్ఞానేంద్రియములగు చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు. వానికెదురుగా నుంచిన వస్తువులు వానిచేతఁ దెలియఁబడు శబ్దాదివిషయములు. రుచిచేత నుసిరికకాయ, ధ్వనిచేత వీణ, వాసనచేత కస్తూరి, రూపముచేత (మణి) రత్నము, వీచుగాలి శరీరమునకుఁ (తగులుట) స్పర్శము వలన వీవన, వీనిజ్ఞానము మనకుఁ గల్గును. దీపముగల మట్టిప్రమిద, ప్రాణిభౌతికావయవసమూహము. ఇందలి దీపపువత్తి మనస్సు. దీపమును పోషించుతైలము ప్రాణము. ఇవేవియును ఒక్కొక్కటిగాని, కొన్నిగాని, యన్నిగాని, వస్తువిజ్ఞానమును, ఇవిగాని మఱొక్కటిలేనిది, గల్గింపజాలవు కావున నివేవియు తెలియు ముఖ్యాత్మ కావు. దేనియునిత్యమాత్రమున వీనియన్నింటియుని

కిని గలుగఁజేసినట్లు హానివాని పనుఁ యుఁదు ప్రేరకమాత్రమో యన్నట్లున్న చిద్రూపపదార్థమే ముఖ్యాత్మ. ఇది సర్వాధిష్ఠానము. అది పైఁజెప్పిన వేవియునుగానిది, నిర్విశేషమైనదియు ఈపంచవిధవస్తుజ్ఞానము కల్గుటకు మూలాధారమైన పదార్థముగా ఆత్మయే సిద్ధించుచున్నది. కావున, ఇది ఆత్మసిద్ధిప్రకరణమైనది.

## గురుశిష్య ప్రశ్నోత్తరరూపము

ఇచ్చట శ్రీశంకరభగవత్పాదులవారు గురుశిష్యప్రశ్నోత్తరరూపమున ప్రబోధించిన ప్రసిద్ధమైన యేకశ్లోకర్థము స్మరణీయము.

శ్లో॥ కిం జ్యోతి స్తవ భానుమా నహని మే రాత్రౌ ప్రదీపాదికం,
స్యా దేవం రవిదీపదర్శనవిధౌ కిం జ్యోతి రాఖ్యాహి మే।
చక్షు స్తస్య నిమీలనాదివిషయే కిం, ధీ, ర్ధియో దర్శనే
కిం త త్రాహ మతో భవాన్ పరమకం జ్యోతి స్తదస్మి
ప్రభో ॥

గురువు ప్రశ్న : కిం జ్యోతి స్తవ? విషయములను దెలియఁజేయు వెలుఁగు లేక చైతన్యము నీకేది?

శిష్య సమాధానము : మే అహని భానుమాన్ రాత్రౌ ప్రదీపాదికమ్। నాకుఁ బగటియందు సూర్యుఁడును, రాత్రియందు, పెద్దదీపము నక్షత్రములు, చంద్రుఁడు మొదలైనవి జ్యోతిస్సులు.

ప్ర : స్యా దేవం రవిదీపదర్శనవిధౌ కిం జ్యోతి రాఖ్యాహి మే? అట్లే కావచ్చును. కాని ఆసూర్యదీపాదులను జూచుక్రియయందు జ్యోతి ఏదియో నాకుఁ జెప్పుము.

స : మే చక్షుః। ఆసూర్యచంద్రాదులఁ జూచుక్రియయందు

నాకన్నుఅను ఇంద్రియమే జ్యోతిస్సు.

ప్ర : తస్య నిమీలనాదివిషయే కిం ? ఆకంటిని మూసికొని యున్నను, ఈకన్నుపనిచేయని కలయందును నీకు జ్యోతి స్సేది?

శి : ధీః ఆసమయములందు నానిశ్చయాత్మకబుద్ధియే నా జ్యోతిస్సు.

ప్ర : ధియోదర్శనే కిం? ఆబుద్ధినిగూడ దెలిసికొనుజ్యోతి స్సేది?

స : తత్రాహం=ఆబుద్ధినిజూచువిషయమందు నేనే జ్యోతిస్సను అనగా నేను సర్వజ్ఞచైతన్యమును.

గురువు : అతో భవాన్ పరమకం జ్యోతిః। ఈకారణమువలన నీవు సూర్యాదులకన్నింటికంటె నెక్కువైన పరమజ్యోతివి, పరమాత్మవు.

శిష్య : తదస్మిప్రభో- ఓగురుదేవా! ఆపరమజ్యోతిస్స్వరూపుఁడు గనే నే నున్నాను. ఆసర్వాతీతసర్వాధిష్ఠానసాక్షిచైతన్య స్వరూపుఁడగు ఆత్మను నేనే అని తాత్పర్యార్థము. ఇట్లాత్మపదార్థము చైతన్యజ్యోతిగా సునిశ్చితము,

“జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే” ఇతి గీ 13-17 లోకములోఁ దెలియఁబడుచున్న సూర్యచంద్రనక్షత్రాదిజ్యోతుల కన్నింటికి జ్యోతి యైనది అజ్ఞానగమ్యమైనది కేవలాత్మ. ఆ యాత్మజ్యోతి అజ్ఞానాంధకారమునకంటె భిన్న మైనది.

“అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయ స్థితః” గీ 10–20 ఓజితనిద్ర! అర్జున! నేను సర్వప్రాణులయొక్క హృదయమందున్న ప్రత్యగాత్మ (స్వరూపుఁడ)ను.

ఈమొదలైన గీతాప్రమాణవాక్యములచేతను ఆత్మపదార్థము నిత్యసిద్ధ మని సునిశ్చితము.

ఆత్మవిషయబోధకు ఉపనిషత్తులు ప్రమాణశాస్త్రము. అందు "ఆత్మా వా ఇదం ఏక ఏవ అగ్ర ఆసీత్" ఐతరేయోపనిషది 1-1-1 "ఈనామరూపకర్మభేదములచే ననేకముగా కనఁబడుచున్న ఈజగత్తు దీని సృష్టికిఁ బూర్వమందు ఒకటైన యాత్మగనే యుండెను. "సదేవ సోమ్యేద మగ్రఆసీ దేక మే వాద్వితీయమ్" ఛాందోగ్యోపనిషది 6-2-1, "ఓసోమ్య! బుద్ధిచేత నామరూపక్రియావంతమై వికృతముగా ఉపలభ్యమాన మగుచున్న యీ జగత్తు దీనియుత్పత్తికిఁ బూర్వమందు ఉనికియే స్వరూపముగాఁ గల సత్పదార్థముగనే ద్వితీయవస్తురహితమై ఏకముగనే యుండెను. ఆసత్పదార్థము సూక్ష్మమును, నిరతిశయమును, భేదరహితమును, సర్వగతమును, ఏకమును, నిరంజనమును, నిరవయవమును, విజ్ఞానము నైన దని సర్వవేదాంతములవలన తెలియఁబడుచున్నది.

ఇట్లు ఆత్మసిద్ధి శ్రుతిస్మృతిన్యాయసిద్ధ మైనది.

## 8. మాయాసిద్ధి ప్రకరణమ్ (మాయాసిద్ధిప్రకరణము)

అవ॥ త్రిగుణాత్మకమాయాశక్తియే సర్వవ్యావహారికజగత్తుగాఁ బరిణమించుటను నిరూపించుప్రకరణ మగుటచే ఇది మాయాసిద్ధిప్రకరణ మైనది.

ఈకనఁబడుచున్న జగద్వస్తుజాలమం దేదియునుగాక, వీనినన్నింటిని బ్రకాశింపఁజేయుచున్న స్వయంప్రకాశమానమైన సద్వస్తువుగా సిద్ధించినది కేవలాత్మ. మఱి యీదృశ్యమానజగత్స్వరూపస్వభావము లెట్టివో విశదీకరించుచున్నారు. "జన్మాద్యస్య యతః"– బ్ర.సూ. 1-1-2. ఈదృశ్యమానప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములు దేనివలననో యది బ్రహ్మము". "యతో వా

ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశన్తి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ. తై 3-1-1. అనగా సర్వజీవులయొక్కయు సర్వప్రపంచముయొక్కయు సృష్టిస్థితిలయములు ఏపదార్థమువలన గల్గుచున్నవో అది బ్రహ్మము. బ్రహ్మతటస్థలక్షణము. "తటస్థలక్షణం నామ యావల్లక్ష్యకాలమనవస్థితత్వే సతి తద్వ్యావర్తకమ్ తదేవ (వేదాంతపరిభాష 7-3). తెలియబడవలసిన లక్ష్యపదార్థమగు కేవలాత్మ యున్న సర్వకాలములందును తాను లేకున్నను, ఆలక్ష్యమును తక్కినవానినుండి వేఱుచేసి చూపునదే తటస్థలక్షణము. అది లక్ష్యమగు బ్రహ్మస్వరూపమును వాచ్యముగా సాక్షాత్తుగాఁ జెప్పకున్నను తక్కినవాని నుండి బ్రహ్మమును వేఱుచేసి అవిగాక మిగిలి ప్రకాశించుచున్న వస్తువని తెలుపునది. (చూపునది) సృష్టిస్థితిలయములు త్రికాలాబాధితముగా నిజముగా లేవు. కాని అజ్ఞులగు సంసారులచే అనుభవింపఁబడుచున్నవి. వీని కాధారమైనది, బ్రహ్మము. మాయాశక్తివలన సృష్టిస్థితిలయాది వ్యావహారికజగత్తు సిద్ధించినట్లున్నవి, ఆమాయాశక్తిని గుఱించి వివరముగాఁ జెప్పఁబోవుచున్నారు.

**చిన్మాత్రః పరమాత్మా హ్యపశ్య దాత్మాన మాత్మతయా।**
**అభవ త్సో ఽహన్నామా తస్మా దాసీ ద్భిదో మూలమ్॥**
**95**

ప్ర : చిన్మాత్రః = కర్మకాండవిహితజ్ఞాననిశ్చయఫలరూపియు, పరమాత్మా = సర్వోత్కృష్టమైన శ్రౌతకర్మఫలశరీరము కలవాఁడగు హిరణ్యగర్భుఁడు, ఆత్మానం = తనస్వరూపమును, ఆత్మతయా = తనపూర్వజన్మవిజ్ఞానసంస్కృతునిగా, అపశ్యత్ = చూచుకనెను. సః = అతఁడు, అహం = "నేను" అనునదే పేరుగాఁ గలవాఁ డాయెను, తస్మాద్ = దానివలన, భిదః = భేదమునకు (వైవిధ్యమునకు) మూలమ్ = ఆధారము, కారణము, ఆసీత్ = కల్గెను.

తా॥ శ్రుతికర్మకాండవిహిత సర్వజ్ఞాననిశ్చయసంపన్నుఁడై ఆవైదికజ్ఞానకర్మఫలకార్యభూతుఁడును పరమశ్రేష్ఠములైన శిరఃప్రాణాదిలక్షణశరీరియు, అండజన్ముఁడై ప్రథముఁడునగు

హిరణ్యగర్భుఁ డను పేరుగల ప్రజాపతి, తనను గూర్చి, పూర్వ జన్మశ్రౌతవిజ్ఞానసంస్కృతునిగా, ప్రథమసంభూతునిగా జూచెను. (ఎఱింగెను) సర్వాత్మరూప, విరాట్ పురుషప్రకారుఁడఁగు ప్రజాపతిని "నేను" అని పలికెను. కావున అతఁడు 'నేను' పేరుగలవాఁడు అహన్నాముఁ డయ్యెను. వాని యీ యహంభావము లేక అహంకారము మిగిలిన సర్వవిధభేదోత్పత్తికి మూలకారణ మయ్యెను. బ్రహ్మము నిర్గుణము భాగములులేనిది. మార్పులులేనిది. నిర్వికార మైనది. ఏకమై రెండవది లేనిది. ఇది పారమార్థికసత్యము. ఐనను దానియం దొకశక్తి కలదని శాస్త్రము చెప్పినది. అదే మాయాశక్తి. "యామా (భూత్ పరమార్థతః) సా మాయా" ఏది పరమార్థము కాదో అది మాయ. అనఁగా నిజముగా కేవలాత్మకన్న వేఱుగా వస్తుత్వము లేనిది. ఆమాయాశక్తి యెప్పుడు ఆత్మకానిది. కాని ఆత్మ లేకుండ స్వతంత్రముగా తాను లేనిది. అదే మిథ్యాస్వభావము. బొత్తిగా లే దని చెప్పుటకు వీలు లేనిది. దానివలన ప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములు, వివిధ జీవులతో గూడినప్రపంచము వచ్చి కొంతకాలము నిలిచి, తిరిగి యందే లయమగుచున్నట్లు ఆద్యంతములు లేకుండ సాగుచున్నట్లు కనఁబడును. ఇదంతయు నిమాయాశక్తి ప్రభావము. మార్పులేని సత్పదార్థము మాఱుచున్నట్లు అజ్ఞులగు సంసారులకు కనఁబడును. బొత్తిగా లేనిది వచ్చిన దనుటకే వీలు లేదు. అందువలన ఆశక్తి అనిర్వచనీయ మైనది. అవ్యాకృతముగా ఉండి (అదే) తరువాత అనేకము (నానా)గా, వైవిధ్యముతో ప్రపంచాకారముగా వ్యాకృతమై నామరూపములతో వచ్చినట్లు కన్పడబడును. [Unmanifested (మాయ) manifested అగును] ఈమాయాశక్తి యే అవ్యాకృతము, మూలప్రకృతి, ప్రకృతి, అవిద్య మొదలగు

పేర్లతో నామరూపపరిస్థితులను బట్టి చెప్పఁబడును. కేవల చిన్మాత్రము, చైతన్యము, (జ్ఞానమే) సత్తే స్వరూపముగా గలది. సచ్చిదానందరూపబ్రహ్మము. అది సత్ వస్తువు. అది యట్లే యుండగనే, దానియందు **మాయ**, పరిణామశీల, తోఁచును. త్రిగుణాత్మకమైన ఒక (విషయము) వస్తువు మఱొకటిగా మాఱుస్వభావము కలదిగా తోఁచును. ఇది వేఱొకటిగా మారుట, కావున- సదాభావముగల బ్రహ్మము లేక కేవలాత్మయే, ఈ మాయాశక్తియేఉపాధిగాఁగల దైనట్లు భావించినప్పుడైనది. ఈశ్వరతత్త్వము మాయకు పైది. సర్వజ్ఞమై, ఆమాయను నిత్యము తనవశమందుంచుకొనఁ గలది. ఇట్లు మాయ, శక్తి, ఈశ్వరుఁడు, శక్తిమంతుఁడు. మాయావి ఈశక్తి శక్తిమంతులు వేఱుకాదు. ఈరెంటికి అవినాభావసంబంధము. ఇది శాస్త్రనిర్ణయము. ఆ యీశ్వరతత్త్వము, వస్తువు కాలము, దేశములచే మితిలేనిదిగా నున్నది. అనాద్యనంత మైనది. ప్రపంచసృష్ట్యాదులకు నిమిత్తోపాదనకారణమైనది. సదాశివ, నారాయణ, శ్రీకృష్ణ, లలితాదేవి మొదలగు పేర్లతో భక్తుల కోర్కెలఁ దీర్పఁగలది.

అవ॥ బృహదారణ్యకోపనిషత్తు 1-4లోని మొదటిమూడుమంత్రరూపమగు యాజ్ఞవల్క్యమైత్రేయీసంవాదార్థమే యీక్రిందిశ్లోకములలో సంగ్రహముగాఁ జెప్పఁబడుచున్నది.

ద్వేధైవ భాతి తస్మాత్పతిశ్చ పత్నీ చ తౌ భవేతాం వై।
తస్మాదయ మాకాశః స్త్రియైవ పరిపూర్యతే సతతమ్॥
96

సోఽయ మపీక్షాం చక్రే తతో మనుష్యా అజాయన్త।
ఇ త్యుపనిషదః ప్రాహు ర్దయితాం ప్రతి
యాజ్ఞవల్క్యోక్త్యా॥ 97

ప్ర : సః = అనేనుపేరుగల (ప్రథమశరీరుఁడు) ద్వేధా ఏవ = స్త్రీ శక్తి, పురుషశక్తిమంతుఁడు రెంపుప్రకారములుగా (ఇద్ధఱుగానే) భాతి = (భేదముగా) ప్రకాశించుచున్నాఁడు, తస్మాత్ = కావున, ఆపురుషునినుండి పతిః చ = భర్తయును, పత్నీ చ = భార్యయును, భవేతాం వై = అగుదురు గాక, ఇట్లు భార్యా-భర్తలసంజ్ఞలు రెంఢుగలవాఁడాయెను విరాట్పురుషుఁడు. తస్మాత్ = ఆయనవలన, అయం ఆకాశః = ఈయాకాశము, స్త్రియా ఏవ = ప్రకృతిస్త్రీచేతనే, సతతమ్ = ఎల్లప్పుడును, పరిపూర్యతే = చక్కగా అంతట పూరింపఁబడుచున్నది. సః, అయమ్ అపి, = ఈస్త్రీపురుషులజంట లోపురుషుఁడుగా విభక్తుడైన వానిపేరు మనువు. ఇతడుఁకూడ ఈ ఊంచ్రకే = సుఖింప ఆలోచించెను. ఆలోచించి, తనకంటెవేఱుగానున్న పత్నియగు శత రూపతో రమించెను,) తతః = ఆదంపతులనుండి, మనుష్యాః = మనుజులు (మనువునుండి పుట్టినవారు) అజాయన్త = పుట్టిరి. (ఆప్రథమదంపతులనుండి) ప్రజాభివృద్ధి ఆయెను,) ఇతి = అని (ఈపైవిషయము) ఉపనిషదః = బృహదారణ్యకోపనిషత్తులు (ఉపనిషద్వాక్యములు), దయితాం ప్రతి = తన భార్యయైనమైత్రేయినిగూర్చి, యాజ్ఞవల్క్యాః = ఆమెభర్తయు, (యజ్ఞ వక్త) యగు హిరణ్యగర్భుఁడు లేక యజ్ఞమునికుమారుఁడగు యాజ్ఞవల్క్య మహర్షివచనము (చెప్పినట్లుగా) ప్రాహుః = విస్తరించి, ప్రకటముగాఁ జెప్పినవి.

తా : అహిరణ్యగర్భుఁడు సత్యసంకల్పుఁడు గాన, సంసారరతిసక్తుఁడై రెండు విధములుగా స్త్రీభాగముగ పురుష భాగముగా తానే రెండుగా ఆయెను. ఒకే ద్విదళబీజమందలి విడి రెండుసమానదళములవలె పతియు, పత్నియు నను రెండు సగమేనులుగా విభక్తమైన ప్రథమదంపతులు, వారు. అందు వలననే భర్తయగు పురుషుఁడు, భార్యయగుస్త్రీ లేకుండ రతి సుఖము పొందలేఁడు. రెండవవారు లేనిచో వారుభయులు అసం పూర్ణులు. ఒకే బీజమొక్క (ద్విదళబీజములైన కంది, సెనగ, బఠాని

మొదటైన రెండు బద్దలు గలవి) రెండుసగము బద్దలనంటి వారు భార్యాభర్తలు. రెండవదానివలననే ఒక్కొక్కరు పరిపూర్ణతను జెందవలసినవారు. ఒకరి శూన్యశేషాకాశము రెండవసగమగు వారి చేతనే పరిపూర్ణమగును. అప్పుడే రతిఆనంద మిచ్చునదగును. ఒక్కరేయున్న అట్టుసుఖింపలేరు, క్రీడింపలేరు. రమింపలేరు. వారికలయికనుండియే ప్రజాభివృద్ధి కల్గుచున్నది. కాని ఇదంతయు వదలవలసిన సంసారవిషయమే గాని, తద్భిన్నమగు ముఖ్యాత్మ విషయముగాదు. ఈసంగ్రహవిషయమును ఆత్మోపదేశసమయమందు యాజ్ఞవల్క్యమహర్షి తనభార్యయైన మైత్రేయికిం జెప్పెనని బృహదారణ్యకోపనిషత్తులు చెప్పుచున్నవి.

గీతాప్రమాణవచనములు :

శ్లో॥ మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధా
మ్యహమ్।
సంభవః సర్వభూతానాం తతో భవతి భారత॥గీ 14అ-3శ్లో॥

శ్రీకృష్ణభగవానులు చెప్పుచున్నారు.

ఓభారత! అర్జునా! నాసంబంధమైనదే త్రిగుణాత్మకయు ప్రకృతియునగు మాయ. ఇది కార్యరూపములగు సర్వభూతముల యొక్క ఉత్పత్తికి (యోని) మూలకారణము. ఈమాయ, తన పరిమాణముచేత కడుమిక్కిలిపెద్దదియును (మహత్తు) తనసర్వవికారములను బుట్టించి పోషణరూపమున భరించుచుండుటవలన బ్రహ్మమైనదియు, ఈయోని (మాయ)యే. విశాలతనుమై బృహత్తమమైన ఈప్రకృతియోనియందు హిరణ్యగర్భునిజన్మమునకు బీజమై సర్వభూతజన్మకారణమగు (గర్భము) బీజమును నిక్షేపించుచున్నాను. అనగా క్షేత్రక్షేత్రజ్ఞప్రకృతిద్వయశక్తిమంతుండగు ఈశ్వరుండైన నేను, అవిద్యాకామకర్మోపాధిస్వరూపాను

విధాయియగు క్షేత్రజ్ఞుని, క్షేత్రముతో సంయోగింపఁజేయుచున్నాను. ఇట్లు నాచేసినగర్భబీజనిక్షేపమువలన, హిరణ్యగర్భోత్పత్తిద్వారమునను సర్వభూతోత్పత్తియు అగుచున్నది

శ్లో॥ సర్వయోనిషు కౌంతేయ మూర్తయః సంభవంతి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా॥
గీ 14-4

ఓ కౌంతేయ ! దేవపితృమనుష్యపశుమృగాదిసర్వయోనులందు దేహసంస్థానలక్షణములై కలియకట్టబడిన శరీరావయవములుగల వివిధాకారములుగల ఏయేమూర్తులు పుట్టుచున్నవో, వానికన్నింటికి (గారణమై క్షేత్రరూపావస్థలన్నింటిని పొందుచుండునది పైచెప్పిన మహద్బ్రహ్మయగు (మాయా) ప్రకృతియే (తల్లి వంటిది) బీజప్రదుడను ఈశ్వరుఁడనగు నేను గర్భాధానమునకు కర్తనైన తండ్రిని.

అవ॥ మఱి యిదంతయుఁ బారమార్థికసత్యమా? కాదు. మఱిదెట్లు వచ్చినది? మాయవలన. అదెటువంటిదో వివరించుచున్నారు.

**చిర మానన్దానుభవాత్ సుషుప్తి రివ కా ప్యవస్థాఽభూత్।**
**పరమాత్మన స్తు తస్మా త్స్వప్నవ దేవోత్థితా మాయా ॥**
**98**

ప్ర : (పైచెప్పిన సృష్టి సత్యమైనట్లు తోచును) తు = కాని, పరమాత్మనః = పరమేశ్వరునకు, చిరమ్ = చిరకాలము, ఆనన్దానుభవాత్ = ఆనందమును అనుభవించుటవలన, సుషుప్తిః ఇవ = నిద్రవంటిదైన కాఽపి అవస్థా = ఒకానొకయవస్థ, అభూత్ = ఆయెను. (కల్గెను). తస్మాత్ = ఆయవస్థవలన మాయా = త్రిగుణాత్మికయగు మాయ, స్వప్నవత్ఏవ = కలవంటిదిగానే ఉత్థితా = లేచెను,

తా : వ్యష్టిజీవునకు జాగ్రత్స్వప్నసుషుప్తు లని మూఁడవస్థలు కలవు. అందులో నిద్రావస్థ పూర్ణానందానుభవమే కాని ఏమియుఁదెలియ దను నజ్ఞానానుభవ మందుఁ గలదు. నిత్యసర్వజ్ఞుఁడగు పరమేశ్వరుఁడు నిత్యజ్ఞానానందస్వరూపుఁడు. ఆయనకు చిరకాలానన్దానుభవము (జీవునకు నిద్రవలె) సాగి కలవంటిదే యైన మాయ సృష్టిచ్ఛతో వ్యక్తమయ్యెను.

అవ॥ సర్వసృష్టికి ఉపాదానకారణమైన మాయాశక్తి స్వరూపమును వర్ణించుచున్నారు.

**సదసద్విలక్షణా ఽసౌ పరమాత్మసదాశ్రయా ఽనాదిః।**
**సా చ గుణత్రయరూపా సూతే సచరాచరం విశ్వమ్॥99**

ప్ర : అసౌ = ఈమాయ, సత్, అసత్, విలక్షణా = సత్(ఉన్నది) అసత్ (లేనిది) అను రెండుభావాభావములకు వేరైన స్వరూపము కలది అనిర్వచనీయ. అనఁగా ఉన్నదని కాని, లేనిదని కాని, చెప్పుటకు వీలులేనిది, పరమాత్మ + సదా + ఆశ్రయా = పరమేశ్వరునే యెల్లప్పుడు ఆశ్రయించి యుండునది, అనాదిః = మొదలెప్పుడని నిర్ణయింపరాని, గుణత్రయరూపా= సత్త్వము, రజస్సు, తమస్సు అనుమూఁడుగుణములసముదాయము స్వరూపముగా గలది. సాచ = మఱియు, ఆమ యాశక్తియే సచరాచరం = కదలునవి కదల లేనివి యగు వస్తుసంచయముగల, విశ్వం=సర్వప్రపంచమును సూతే = (కను చున్నది) ప్రసవించుచున్నది.

తా : ఈమాయాశక్తి విచిత్రమైనది. అది యున్నదని చెప్పుటకు వీలులేదు అది లేనిదని చెప్పుటకుఁ గూడ వీలులేదు. అదెప్పుడు పరమేశ్వరు నాశ్రయించియే యున్నది. దానికి పుట్టుక ఈనాఁడని నిర్ణయింపఁబడ రానిది. అది సత్త్వ, రజస్తమస్సులను మూఁడుగుణములు స్వరూపముగాఁ గలది. స్థావర జంగమరూపమైన యీదృశ్యమానసర్వప్రపంచమును సృజించు చున్నది.

శ్లో॥ అస్తి భాతి, ప్రియం, రూపం, నామ, చేత్యంశపఞ్చకమ్।
ఆద్యం, త్రయం, బ్రహ్మరూపం, జగద్రూపం తతో
ద్వయమ్॥ వాక్యసుధ-20

ఉన్నది, ప్రకాశించుచున్నది, ఇష్టమైనది, నామము, రూపము ప్రతివస్తువునందు ఈయైదుభాగములు సముదాయరూపముగా గలవు. అందు మొదటిమూటిసముదాయము బ్రహ్మస్వరూపమును, మిగిలినవి రెంటి జంట ప్రపంచరూపమును (మాయాకార్యమును) దెల్పును. ప్రతివస్తువునందు మాఅనిభాగమగు సద్రూపమును, మాఉభాగమగు నామరూపగుణములు కలవు. వెండిచెంబు వెండికంచము వెండికమండలువు అని చెప్పినప్పుడు మాఅనిద్రవ్యము వెండి. నామరూపగుణములు కంచము చెంబు, కమండలువు మొదలైనవి వానిఆకారములు మాఉనవి. కంచమన్నదానిని చెంబనము, చెంబన్నదానిని కమండలు వనము. అట్లే కంచమురూపము చెంబునకులేదు, చెంబురూపము కమండలువునకు లేదు. కాని ఈపేర్లకు ఆకారములకు వస్తుత్వము వానిఉపాదానకారణమైన వెండియ స్తిత్వముకంటె వేఱుగా లేదు. అనఁగా వీనికి స్వతంత్రమైన యునికిలేదు. ఎల్లప్పుడు నివి వెండి యునికిని నాశ్రయించియే (వెండిమీదనే ఆధారపడి) యున్నవి. అయినప్పటికిని ఈనామరూపములు లేనివిగా లేవనుటకు వీలు లేదు. వానికి ప్రత్యేకరూపము, నామము,నీరు తెచ్చుట, మొదలగు ప్రత్యేకప్రయోజనములు, (గుణములు) కలవు. అందువలన నివి సత్తుకాదు, అసత్తుకాదు. ఎప్పుడును (వెండి) వస్తువు నాశ్రయించియే యుండును. ఇట్లే మాయాశక్తి సర్వదా దానికాశ్రయమగు (ఈశ్వరుఁడులేక) బ్రహ్మము లేకుండ లేదు. స్వతంత్రముగా దాని కునికిలేదు గాన ఆమాయాశక్తి సత్తనుటకు వీలు

లేదు కాని జగత్తుగాఁ మాఱి గనఁబడుచుండుటవలన బొత్తిగా (గొడ్డాలికుమారునివలె) అసత్తని లేనిదనియనుటకు వీలులేదు. సర్వప్రపంచము దీనివలననే భాసించుచున్నది. ఇట్టిదే మాయా శక్తి. మాయాశక్తిఉపాధిద్వారముననే పరబ్రహ్మము జగత్తునకు ఉపాదానకారణము, ఈశ్వరుఁడుగా నిమిత్తకారణము. శక్తి కనఁబడకుండనుండుట దానియవ్యక్తస్థితి లేక అవ్యాకృతస్థితి, కనఁబడినప్పటిది దానివ్యక్తస్థితి లేక వ్యాకృతస్థితి.

"మమ మాయా దురత్యయా" గీ-7-14

ఈశ్వరుఁడగు నాసంబంధియైన త్రిగుణాత్మకయైనమాయను అతిక్రమించుట దాటుట అతిదుర్ఘటమైన విషయము.

శ్లో॥ యావత్ సంజాయతే కించిత్ సత్త్వం స్థావరజంగమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ తద్విద్ధి భరతర్షభ॥ గీ-13-26

ఓభరతశ్రేష్ఠా! స్థావరజంగమరూపమై పుట్టుచున్నఏయొక్క వస్తువైనను క్షేత్రక్షేత్రజ్ఞసంయోగమువలననేసుమా పుట్టుచున్నదని యెఱుంగుము. ఎట్టిక్షేత్రక్షేత్రజ్ఞసంయోగస్వరూప మిచ్చట యుద్దేశింపఁబడినది! అవయవరహితత్వలక్షణుఁడగుటవలన క్షేత్రజ్ఞునకు క్షేత్రముతో త్రాడుతోవలె కుండకున్న అవయవ సంశ్లేషద్వారకమైన సంబంధవిశేషమగు సంయోగము సంభవింపదు. తంతువస్త్రములకువలె క్షేత్రక్షేత్రజ్ఞులకు ఇతరేతరకార్యకారణభావము అంగీకరింపఁబడదుగాన, సమవాయలక్షణమగు సంయోగము నసంభవమే. భిన్నస్వభావములుగల విషయవిషయిలగు క్షేత్రక్షేత్రజ్ఞులకు ఇతరేతరతద్ధర్మాధ్యాసలక్షణరూపమైన సంయోగమే సంభవము. ఇది రజ్జుశుక్తికాదులయొక్క ఆయావస్తువివేకజ్ఞానాభావమువలన ఆరోపితసర్పరజతాదిసంయోగమువలె క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపవివేకాభావనిబంధనరూపాధ్యాసమే కావలయును. ఈ

యథార్థ్యసస్వరూపమైన క్షేత్రక్షేత్రజ్ఞసంయోగము మిథ్యాజ్ఞానలక్షణమేగదా. ముంజనుండి దానియిషీకమును విభజించినట్లు శాస్త్రానుసారముగా క్షేత్రక్షేత్రజ్ఞలక్షణభేదపూర్వకముగా పూర్వ ప్రదర్శిత రూపమైన క్షేత్రమునుండి క్షేత్రజ్ఞుని చక్కగా వేఱుపఱచి, ఈ క్షేత్రజ్ఞుని సర్వోపాధివిశేషరహితమై జ్ఞేయమైన బ్రహ్మస్వరూపముగానే (చూచి) తెలియవలెను. మఱియు క్షేత్రమును, మాయానిర్మితహస్తి స్వప్నదృష్టవస్తుగంధర్వనగరాదివలె అసద్రూపమేయై సద్రూపమువలె అవభాసించుచున్నదని నిశ్చితజ్ఞానానుభూతి పొందవలయు. ఇట్లు క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపవిషయమందు నిశ్చితవిజ్ఞానుఁడైన వానికి జన్మహేతువగు మూలావిద్య నశించుటవలన, పైచెప్పినసమ్యగ్జ్ఞానవిరోధమువలనను, మిథ్యాజ్ఞానమును నశించుచున్నది.

అవ్యక్తనామ్నీ పరమేశశక్తి రనాద్యవిద్యా త్రిగుణాత్మికా పరా.
కార్యానుమేయా సుధియైవ మాయా, యయా జగ త్సర్వ మిదం ప్రసూయతే॥ వివేకచూడామణి-110

సన్నా ప్యసన్నా ప్యుభయాత్మికా నో భిన్నా ప్యభిన్నా ప్యుభయాత్మికా నో
సాంగా ప్యనంగా ప్యుభయాత్మికా నో మహాద్భుతాఽనిర్వచనీయరూపా॥ 111

శుద్ధాద్వయబ్రహ్మవిబోధనాశ్యా, సర్పభ్రమో రజ్జువివేకతో యథా।
రజ స్తమఃసత్త్వ మితి ప్రసిద్ధా, గుణా స్తదీయాః ప్రథితైః స్వకార్యైః 112

ఏమియుఁ బనిచేయక నిద్రలోవలె మత్తునివలె నుండుట తమోగుణము. పనిలోనికి దిగి ఏదో చేయుట రజోగుణము.

తెలివిగా ప్రశాంతముగా నుండుట సత్త్వగుణము. ఈమూఁడును మాయాగుణములు. ఈపరమేశ్వరశక్తి వివేకవంతులచే దాని కార్యములచేత మాత్రమే యెఱుఁగఁబడును. అది యవ్యక్త మను పేరు గలది. అది లేనిదా? అజ్ఞానమే స్వరూపముగా గలది. ప్రపంచమంతయు దానివలననే కల్గుచున్నది. అదిసత్తుకాదు. అసత్తు, (లేనిది) కాదు. రెండుగుణములు కల దనుటకును వీలు లేదు. అది బ్రహ్మముకన్న వేఱనుటకుఁగాని, వేఱు కాదను టకుఁగాని ఈరెండువిధముల కలదనుటకుఁగాని వీలులేనిది. అది భాగములు కలదనుటకుఁగాని, లేనిదనుటకుఁగాని రెండువిధము లుగా నుండుననుటకుఁగాని వీలులేనిది. అది మిక్కిలి యాశ్చర్య కర మైనది. ఇట్టిదని చెప్పుటకు వీలులేనిది. శుద్ధమైన పరబ్ర హ్మము తెలియుటతోడనే పూర్తిగా నశించునది. పాముకాదు ఇది త్రాడనితెలియుటతోడనే త్రాడునందుఁ గనఁబడిన పామెట్లు లేకపోవునో అట్లే ఇది ప్రపంచముకాదు పరబ్రహ్మమేయని నిశ్చ యానుభవముచేత పూర్తిగా నశించునది. దానికార్యములచేత నది సత్త్వరజస్తమోగుణములు స్వరూపముగాఁ గల దని గ్రహిం పఁబడునది. పరమేశ్వరునిమాయాశక్తి.

అవ॥ ఇప్పు డొక యాక్షేపణ లేవఁదీయుచున్నారు,

**మాయా తావ దదృశ్యా దృశ్యం కార్యం కథం జనయేత్ ।**

**తన్తుభి రదృశ్యరూపైః పటోఽత్ర దృశ్యః కథం భవతి ॥ 100**

ప్ర : తావత్ = ముందుగా ఇప్పుడు, అదృశ్యా = కనులకుఁ గనఁ బడని, మాయా = మాయాశక్తి, కథం = ఎట్లు, దృశ్యం = కనులకు గనఁ

బడుచున్న ప్రపంచమును కార్యం = కార్యమైన వస్తువును, జనయేత్ = పుట్టింపఁగలదు? అత్ర = ఇక్కడ (లోకములో), అదృశ్యరూపైః = కనులకుఁగనఁబడని, తన్తుభిః = దారములచేత, దృశ్యః = కనులకుఁ గనఁబడు, పటః = వస్త్రము, కథం = ఎట్లు, భవతి = కల్గును? కలుగదుగదా యని భావము.

తా : ప్రపంచములో నెక్కడ నైనను దృశ్యములైన కారణములనుండియే దృశ్యములగు కార్యములు పుట్టుచున్నవి. దృశ్యములైన దారములనుండి దృశ్యమైన వస్త్రము వచ్చును. కనఁబడనిదారములనుండి కనఁబడువస్త్రము పుట్టుట అసంభవము. మఱిమీరు కారణమైన మాయాస్వరూపము కనఁబడనిది, అదృశ్యము అనుచున్నారు. దాని కార్యమైన ప్రపంచము మాత్రము కనఁబడుచున్నది గాన దృశ్యము అనుచున్నారు. ఇదేమిన్యాయము? ఇది యెక్కడను లేనిది, అసంభవముగదా అని ఆక్షేప రూపము.

అవ॥ పై ఆక్షేపణకు ఉత్తరము రెండుశ్లోకములలో చెప్పుచున్నారు.

స్వప్నే సురతానుభవా చ్ఛుక్రద్రావో యథా శుభే వసనే ।
అనృతం రతం ప్రబోధే వసనో ఒపహాతి ర్భవేత్ సత్యా ॥ 101

స్వప్నే పురుషః సత్యో యోషి దసత్యా తయో ర్యుతిశ్చ మృషా ।
శుక్రద్రావః సత్య స్తద్వత్ ప్రకృతే ఒపి సంభవతి॥ 102

ప్ర : యథా = ఏవిధముగా, స్వప్నే = కలలో, సురత + అనుభవాత్ = తా నొకస్త్రీతో (కలలోని అసత్యమైన స్త్రీతో) జరిపిన రతిక్రీడ

వలన, శుభే = శుభ్రమైన, వసనే = తనకట్టుబట్టయందు శుక్రద్రావః = వీర్యము ప్రవహించుట, భవేత్ = సంభవించుచున్నదో, (తథా = అదేవిధముగా) రతం = సురతక్రీడ, అనృతం = అసత్యముగా నిజముగా జరుగనిదే భవేత్ = కావచ్చును. ప్రబోధే = మెలకువ వచ్చినకాలమందు, వస్త్ర + అపహాతిః = వస్త్రము (దెబ్బతినుట) మలినమగుట సత్యా = యదార్థము భవేత్ = కలుగవచ్చును. స్వప్నే = కలయందు, పురుషః = కలఁ గనెడు పురుషుఁడు, సత్యః = నిజముగా నున్నవాఁడే యోషిత్ = అతఁడు కలిసిన స్త్రీమాత్రము అసత్యా = అసత్యమైనది (వాస్తవముకానిది అందువలన) తయోః = వారిద్దఱియొక్క యుతిః = కలయిక, మృషా = మిథ్యా అస్థత్యము లేక కల్పితము. (కాన) శుక్రద్రావః = వీర్య (పతన) ము వెలువడుట మాత్రము, సత్యః = సత్యమైనది. అసత్యముకాదు. తద్వత్ = అదే విధముగా, ప్రకృతే + అపి = ప్రస్తుతవిషయమందుఁగూడ, అసత్యమైన ప్రపంచము పుట్టుట, సంభవతి = కలుగును, సంభవమేసుమా!,

తా : పై ఆక్షేపణకు సమాధానము చెప్పుచున్నారు. నీవిచ్చిన ఉదాహరణము, నీవు చెప్పినదానికి సరిపోయినను, లోకములో నేను చెప్పిన విషయమునకును (దానికిని) ఉదాహరణలు లేకుండ పోలేదు. కావున సృష్టి నీవనుకొన్నట్లే ఉండవలెను, నేను చెప్పినట్లుండఁగూడదు అను నియమము లేదు. నీవు చెప్పిన న్యాయము (దాని) తాత్పర్యము, కనఁబడని అసత్ కారణము నుండి, సత్యమైన కార్యము పుట్ట దనికదా! ఇది చూడుము. జాగ్రత్తగా వినుము. ఒక పురుషుఁడు తనకలలో ఒకసుందరియైన యువతితో కలసినట్లు కలఁ గనుచున్నాఁడు. వెంటనే యతనికి వీర్యము పతనమై అతఁడు కట్టినవస్త్రమును మలినము చేయుచున్నది. ఇందులో కలగన్న పురుషుఁడు సత్యము. కలలోని స్త్రీ అసత్యము. నిజముగా లేదు. కావున వారు కలిసి రమించుకొనుట కూడ అసత్యము. అయినప్పటికిని దానిఫలితముగా, నతని శుభ్ర వస్త్రమునందు వీర్యము పడి మలినమగుట మాత్రము సత్యము.

ఎందు కనఁగా మెలకువ వచ్చిన పిదప నతఁడు (దానిని) ఆమాలి న్యమును ప్రత్యక్షముగాఁ జూచుచున్నాఁడు. అందువలన నసత్యమైన కారణమునుండి సత్యమైన కార్యము పుట్టదని చెప టకు వీలులేదు. అట్లే అసత్యమై కనఁబడని మాయనుండి, సత్యముగాఁ గనఁబడు ప్రపంచము పుట్టవచ్చును. ఇది అసంభవము కాదు. ఇదియు న్యాయమే.

అవ : ఈవిషయమునే స్పష్టము చేయుచున్నారు.

**ఏవ మదృశ్యా మాయా తత్కార్యం జగ దిదం దృశ్యమ్।**
**మాయా తావ దియం స్యా ద్యా స్వవినాశేన హర్షదా**
**భవతి॥ 103**

ప్ర : ఏవమ్ = ఈవిధముగా, మాయా = మాయాశక్తి, అదృశ్యా = కనఁబడనిదే యయ్యు (ఇంద్రియములకుఁ బ్రత్యక్షము కానిదయ్యు) తత్కార్యం = దానివల్ల కల్గినదైన, ఇదం జగత్ = ఈప్రపంచము, దృశ్యమ్ = కనఁబడునది ఇంద్రియగోచర మగునది) గావచ్చును. (అనఁగా) తావత్ = ఇదంతయు, యా = ఏది, స్వవినాశేన = తనయొక్క నాశనముచేత, హర్షదా = సంతోషము నిచ్చునది, భవతి = అగుచున్నదో, ఇయం = ఇదియే, మాయా = మాయ యను పేరు గలది కాఁగలదుసుమా.

తా॥ ఈవిధముగా మాయ జ్ఞానేంద్రియగోచరముగాని యదృశ్యస్వభావము గలదియే యయ్యును, దానినుండి యింద్రియ గ్రాహ్యమగు దృశ్యమైన (కనఁబడు) ప్రపంచము పుట్టవచ్చును. ఇది అసంభవము కాదు. మఱొకచిత్రము. ఇప్పుడు మాయ తాను నశించి పురుషున కానంద మిచ్చునదగును. మాయ నశించిన, దాని ఫలమగు జగమును, దానితో వచ్చిన సర్వసంసారము దుఃఖములు నశింపఁగా మిగిలి యుండునది ఆనందస్వరూపుఁడగు తానే. కావున ఈమాయాబీజమును నశింపఁజేయునది, కేవలాత్మ

ప్రబోధము గాన, ఆయాత్మప్రబోధము, ముందట వైరాగ్యద్వారమున ముక్తిఁగోరువాఁడు సాధింపవలయు నని ధ్వనిబోధ.

అవ : మఱియొక యుదాహరణచే తేలికగా దాటరాని యా మాయాశక్తి ప్రభావమును వర్ణించుచున్నారు.

రజనీ నాతిదురన్తా న లక్ష్యతేఽత్ర స్వభావో ఽస్యాః।
సౌదామినీవ నశ్యతి మునిభిః సంప్రేక్ష్యమాణైవ ॥ 104

ప్ర : రజనీ ఇవ=కాముకులను రాగయుక్తులను జేయుస్వభావము గల్గి, వస్తుయథార్థస్థితిని తెలియనీయని (అజ్ఞానమనెడు) రాత్రివంటి దైనదియు, అతిదురంతా=మిక్కిలి చెడ్డనిర్ణయములు గలదియు, బూర్తిగా అంతు చిక్కని దియు, (ఇయం మాయా = ఈమాయ) అత్ర = ఇక్కడ, ఈసమయమందు అస్యాః = ఈమాయయొక్క, స్వభావః = (స్వభావము) నిజలక్షణము, న లక్ష్యతే=తెలియఁబడనిది అనిర్వచనీయ, ఇది యిట్టి దని చెప్పనలవి కానిది. కాని మునిభిః = ఆత్మవిచారణనిపుణశీలురైన జ్ఞాననిష్ఠుల (మునుల)చేత, సంప్రేక్ష్యమాణా + ఏవ=సరిగా చూడఁబడుచుండఁగనే, సౌదామినీ + ఇవ= మెఱుపువలె, నశ్యతి=క్షణములో నశించుచున్నది.

తా॥ ఈమాయ యతిచిత్ర మైనది. రాత్రిచీకటివలె నంతు లేనిది. అపార మైనది. దాట రానిది. కాముకులను రాగపరవశులను జేయునది. సంసారసాగరమందే కట్టిపడవేయునది. దీనిని దెలియుట దుర్ఘటము. దానిస్వభావ మిట్టి దని యెవరును జెప్పలేనిది. ఆత్మానాత్మలను విచారించుటలో నిపుణులైన పండితులగు జ్ఞానయోగులు (మునులు) దానిని గుఱించి విచారించుచుండఁగనే తళుక్కున మెఱుపువలె మెఱసి క్షణములో నాశనమగునట్టిది.

అవ : మాయ, అవిద్యలను గుఱించి చెప్పుచున్నారు.

మాయా బ్రహ్మోపగతా ఽవిద్యా జీవాశ్రయా ప్రోక్తా।
చిదచిద్గ్రన్థి శ్ఛేతః త దక్షయం జ్ఞేయ మామోక్షాత్ ॥ 105

ప్ర : మాయా=మాయ, బ్రహ్మ+ఉపగతా=బ్రహ్మమును సమీపించియున్నప్పుడు మాయా=మాయఅని ప్రోక్తా=చెప్పబడినది జీవ+ఆశ్రయా=జీవుని యాశ్రయించియున్నప్పుడు(జీవోపాధి)అవిద్యా-అవిద్యయనియు,ప్రోక్తా=చెప్పఁబడినది.చేతః=చిత్తముచిదచిద్గ్రన్థిః,చిత్+అచిత్+గ్రన్థిః=సద్బుద్ధిదుర్బుద్ధులబంధనరూపము(ముడివంటిది)(చిత్తును,అచిత్తునుకలుపుముడి)తత్(చేతః)=చిత్తము ఆమోక్షాత్=ముక్తి లభించునంత ఆకు, అక్షయమ్=నశింపని దని, జ్ఞేయమ్=తెలియబడవలెను, ఇచ్చట మతొకవిధాన్వయము. ఆమోక్షాత్ = అవిద్యాచిత్తము యొక్క సంపూర్ణనాశనమువలననే, అక్షయం = వికారరూపనాశరహితమైనదైన తద్=ఆబ్రహ్మము, జ్ఞేయం==ఎఱుంగఁదగినది.

తా॥ బ్రహ్మస్వరూపుఁడైన ఈశ్వరునకు మాయ ఉపాధి. అవిద్య (లేక అజ్ఞానము) జీవున కుపాధి. జీవు నాశ్రయించి యుండునది. జ్ఞానాజ్ఞానబంధనరూపమైన ముడివంటిది చిత్తము. నేను ఈసనుభవించునట్టి యిదియే, వేఱుకాదు, అనునే ముడి. నే నిది కాదని, వేఱైనవాఁడనని యెఱుఁగుట ముడి తెగుట. అవిద్యాబంధనమునుండి విడువను ముక్తితోడనే ఈచిత్తము నశించును అంతవఱకు ఇది నాశనము కాదు. ఇచ్చట వేఱొకవిధమైన యన్వయమును గలదు. ఈయవిద్యావిశిష్టచేతస్సు యొక్క సంపూర్ణనాశనము వలననే, ఏవిధక్షయలక్షణములేక అక్షయముగానున్న పరబ్రహ్మమును ఎఱుంగవలసిన పరమార్థవస్తువుగాఁ దెలియవలయు. వాసనలతోఁగూడ మూలావిద్యారూపప్రకృతినాశనమువలననే తానైన పరబ్రహ్మము నెఱుంగవలయునని తాత్పర్యార్థము. విరాగికి ఇట్టి ఆత్మబోధానుభూతి కావలయునని ప్రబోధము. ఇందులకు 13 అ - 34 వ గీతా శ్లోకార్థమును ప్రమాణము.

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మంతరం జ్ఞానచక్షుషా।
భూతప్రకృతిమోక్షం చ యే విదు ర్యాన్తి తే పరామ్ ॥

ఈశ్వరుని పరాపరప్రకృతిద్వయ (మాయ) రూపమగు క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క ఇతరేతర వైలక్షణ్యవిశేషమును శాస్త్రాచార్యోపదేశజనితాత్మప్రత్యయికజ్ఞాన మనెడి కంటితో, సర్వప్రాణులయొక్క అవిద్యాలక్షణమై యవ్యక్త మను పేరుగల భూతప్రకృతియొక్క యభావగమనరూపమోక్షణమును, ఏజ్ఞాననిష్ఠులు తెలిసికొనుచున్నారో వారు పరమార్థతత్త్వమైన బ్రహ్మమును బొందుచున్నారు. వారింక పునర్జన్మమును బొందరని యర్థము.

అవ॥ ఇక్కడ జీవలక్షణ వ్యవహారముల గుఱించి సోదాహరణముగా వివరించుచున్నారు.

**ఘటమఠకుడ్యై రావృత మాకాశం తత్త దాహ్వాయం భవతి ।**
**తద్వ దవిద్యావృత మిహ చైతన్యం జీవ ఇత్యుక్తః॥ 106**

ప్ర : ఘటమఠకుడ్యైః, ఘట=కుండచేతను మఠ = మఠముచేతను కుడ్యైః = గోడలచేతను, ఆవృతమ్=ఆవరింపఁబడిన, వేఱుచేయబడిన, పరిచ్ఛిన్నమైన, ఆకాశం=ఏకరూపమైన ఒకేయాకాశము, తత్తదాహ్వాయం = తత్, తత్, ఆహ్వయం = ఆయాపేరులు గలది అనగా ఘటాకాశము, మఠాకాశము, కుడ్యాకాశము అని ఆయాయాభాగములు వేఱువేఱు పేరులు గలది, భవతి = అగును. తద్వత్=అదే విధముగా, ఇహ=ఇక్కడ, అవిద్యావృతం=అజ్ఞానముచే నావరింపఁబడిన, చైతన్యము=జ్ఞానస్వరూపుఁడు, జీవః ఇతి = జీవుఁరు అని, ఉక్తః=చెప్పఁబడినాఁడు.

**తా॥** అంతములేని, విభువైన ఏకమైన ఒకేరూపమైన ఆకాశమును ఆవరించినట్లు కప్పి వేఱుచేసినట్లు కనఁబడు కుండ, మఠము గోడ మొదలగువానినిబట్టి కుండలోనియాకాశమును ఘటాకాశమని, మఠములోని యాకాశమును ఘటాకాశమునకంటె భిన్నమైన మఠాకాశమని, గోడలోనియాకాశమును ఆరెంటికి వేఱైన కుడ్యాకాశ

మని పిలువఁబడుచున్నది. ఇవి నిజముగా నాకాశమును ముక్కలు చేయుట లేదు. కుడ్యము రూపు దాల్పకముందున్న యాకాశమే కుడ్య మేర్పడినపిమ్మటను ఆ యాకాశ మట్లేయున్నది. కుండలో, మఠములో ఆకాశము వాని చే వేఱుచేయఁబడినట్లు (కనఁబడినను) వ్యవహరింపఁబడినను, నిజముగా నాకాశము ముక్కలు గాలేదు. కుండగా నున్నమృద్భాగమందుఁగూడ ఆకాశము లేకుండఁ బోలేదు. మఠముగోడలు కూడ మఠాకాశమును మహాకాశము నుండి వాస్తవికముగా వేఱు చేయుటలేదు. స్పష్టముగా దెలియు నిమిత్తము వ్యవహారములోమాత్ర మట్లు వాడుచున్నారే గాని నిజముగా విభువైన యాకాశ మెక్కడను ఖండములు కాలేదు. కుడ్యమున్న ప్రతియణువునందు నాకాశ మున్నది. కుడ్యాదులు నశించినపిమ్మటను, తొల్లింటియాకాశ మట్లే యుండును. అట్లే ఏకము నిత్యజ్ఞానస్వరూపము అయిన బ్రహ్మమునందు, కుడ్యాదులవంటివగు వేఱు వేఱు అవిద్యావిశేషములగు మనస్సులను బట్టి వేఱువేఱుజీవులని వ్యవహార మగుచున్నది. ప్రకృతిరూపాజ్ఞానావృతుఁడైన జ్ఞానస్వరూపమే జీవుఁడు.

అవ॥ ఇచట నొకపూర్వపక్షాక్షేపమును లేవఁదీయుచున్నారు.

**నను కథ మావరణం స్యా దజ్ఞానం బ్రహ్మణో విశుద్ధస్య ।**
**సూర్యస్యేవ తమిస్రం రాత్రిభవం స్వప్రకాశస్య ॥ 107**

ప్ర : నను = మఱి, స్వప్రకాశస్య = సొంతముగా ప్రకాశించు స్వభావము గలవాఁడగు, సూర్యస్య = సూర్యునకు, రాత్రిభవం = రాత్రియందున్నట్టిదైన, తమిస్రం = కాఱుచీకటి ఏవిధముగా ఆవరణమై సూర్యుని నిజప్రకాశమునకు మాఱ్పును గల్గింపలేదో, అట్లే, విశుద్ధస్య = పరిశుద్ధజ్ఞానస్వరూపుఁడైన, బ్రహ్మణః = బ్రహ్మమునకు, అజ్ఞానం = చీకటివంటిదైన అజ్ఞానము, కథం =

ఎట్లు, ఆవరణమ్ = కప్పునది (మూసివేయునది) స్యాత్ = కాఁగలదు? కాఁజాల
దని భావము.

తా॥ పై శ్లోకనిర్ణయమునకు (ఇచ్చట) నొకయాక్షేపణను లేవదీయుచున్నారు. నిత్యము, స్వయముగాఁ బ్రకాశించు సూర్యుని, రాత్రియందున్న చీకటి యెప్పుడైనను సూర్యుని గప్పఁగలదా? సూర్యోదయముతో, రాత్రి-చీకటి నాశనమగుట లేదా? ఇది లోకానుభవసిద్ధ మేగదా! అట్లే నిత్యజ్ఞానస్వరూప సూర్యుఁడైన బ్రహ్మమును అజ్ఞానాంధకార మెట్లు కప్పఁగలదు? ఇది అసంభవము. అందువలన అజ్ఞానముచేఁ గప్పఁబడిన జ్ఞాన భాగము జీవుఁ డనుట కుదురదు. ఇది పూర్వపక్షవాదము.

అవ॥ పైయాక్షేపణకు రెండు శ్లోకములలో చక్కని సమాధానమును చెప్పుచున్నారు.

**దినకరకిరణోత్పన్నై ర్మేఘై రాచ్ఛాద్యతే యథా సూర్యః ।**
**నఖలు దినస్య దినత్వం తై ర్వికృతైః సాన్ద్రసంఘాతైః ॥ 108**

**అజ్ఞానేన తథాఽఽత్మా శుద్ధోఽపి చ్ఛాద్యతే సుచిరమ్।**
**స వరం తు లోకసిద్ధా ప్రాణిషు తచ్చేతనాశక్తిః ॥ 109**

ప్ర: యథా = ఏవిధముగా, సూర్యః = సూర్యుఁడు, దినకరకిరణోత్పన్నైః = తనయొక్క కిరణములచేతనే పుట్టినవైన, మేఘైః = మేఘములచేత, ఆచ్ఛాద్యతే = కనఁబడకుండ మఱుగు జేయఁబడుచున్నాఁడో, వికృతైః = వికృతాకారములు కల్గిన, తైః = ఆ, సాన్ద్రసంఘాతైః = దట్టములైన యామేఘముల గుమిచేత, దినస్య = పగటియొక్క, దినత్వం = పగలుగా నుండుస్వరూపము, న (ఆచ్ఛాద్యతే) = కప్పఁబడలేదు, ఖలు = కదా. తథా = అట్లే, శుద్ధః = నిర్మలమైన **ఆత్మా = ఆత్మ,** (స్వచ్ఛుఁడు, నిర్వికారుఁడు), అజ్ఞానేన = అజ్ఞానముచేత,

సుచిరమ్ = బాగుగా మిక్కిలిపెద్దకాలము అపిచ్ఛాద్యతే = కప్పఁబడినట్లుతలపఁ బడునే, పరంతు = కాని, ప్రాణిషు = సర్వజీవులయందు, లోకసిద్ధా = లోకమందుఁ బ్రసిద్ధముగాఁ దెలియఁబడుచున్నదైన తచ్చేతనాశక్తిః = అజ్ఞానస్వరూపము, శుద్ధమై, నిర్వికారమై, నిత్యమై, స్వతస్సిద్ధమైన బ్రహ్మము, న ఛాద్యతే = కప్పఁబడలేదు, వాస్తవముగా.

తా॥ పై ఆక్షేపణకు సమాధానమును చెప్పుచున్నారు. సూర్యుఁడు స్వయముగా బ్రకాశించుస్వభావముగలవాఁడు. ఆయనను ప్రకాశమునకు విరుద్ధమైన ఏచీకటియును ఎప్పుడును, నిజముగాఁ గప్పలేదు. ఆయనదఱికిఁగూడ రాదు. వచ్చినోఁ ఆ చీకటి దానే నష్టమైపోవును. కాని ఆయన కిరణములచేతనే మేఘములు పుట్టుచున్నవి. అవి సూర్యుని మనకుఁగనఁబడకుండ మఱుఁగుపడునట్లు మాత్రము, కన్నులకుఁ అడ్డువచ్చుచున్నవి. ఐనను వికారరూపములైన ఈమేఘబృందములచేత మనలోకములో ఎంతచీకటి కల్గినట్లున్నను, ఆసూర్యుఁడాకాశమున బ్రకాశించుచునే యున్నాఁడు. ఆపగలు పగలు కాకుండఁ బోలేదు. పగలును, వచ్చినచీకటిచేత రాత్రి యగుచుగదా! అట్లే సూర్యునివంటివాఁడగు నిర్వికారుఁడు, నిత్యజ్ఞానస్వరూపుఁడు అయిన ఆత్మకు, (బ్రహ్మమునకు) ఎప్పుడును చీకటివంటి విరుద్ధమైన యజ్ఞానము దఱిఁజేరి నిజముగాఁ గప్పలేదు. మేఘజాలమువలె, కంటివంటి మనగ్రహణశక్తిమాత్ర మడ్డువచ్చి ఆత్మస్ఫూర్తికిగాని ఆత్మస్ఫూర్తి గాని లేకుండఁజేయుచున్న దీయజ్ఞానము. మనగ్రహణము లేనంతమాత్రమున నిత్యనిర్వికారాత్మజ్యోతి కెట్టి మార్పు గాని అభావముగాని రాలేదనుట, వివేకవిధము. సుచిరకాలము నేనును అజ్ఞానములో నున్నాను అను జీవాత్మ, అజ్ఞానముచేఁ గప్పబడినట్లు వచ్చుచున్న వ్యవహారము

సాగుచునే యున్నది. ఈవ్యవహారము పరమసత్యము కాదని ఆత్మ బుద్ధు లెఱుంగుదురు. పైవ్యవహార మాత్రమునఁ సర్వప్రాణుల యందు ప్రపంచమునఁగు సర్వాధిష్ఠానముగా మనకు సిద్ధించిన శుద్ధ చైతన్యమగు బ్రహ్మచైతన్యమును దానికి విరుద్ధమైన అజ్ఞాన మెప్పుడును నిజముగా ఆవరింప లేదు. ఆవరించినట్లు, సంసారులగు అజ్ఞానుల వ్యవహారముమాత్ర మని ఎఱింగిన పైయాక్షేపణము నిరస్తమైనది. ఇక్కడ అతివిచిత్రమైన విషయము మాయారూపమగు అవిద్యకాశ్రయమైన జీవుఁడు. అనాదియైన అజ్ఞానముతో అధ్యాసతో లోకములో వ్యవహరించుచున్నట్లు కనఁబడువాఁడు. అవిద్యాసమగ్రనాశముతో, శుద్ధాత్మస్వరూపముతో నిర్వికారనిత్యబ్రహ్మముగా నుండుట పరమార్థసత్యము. "జీవో బ్రహ్మైవ నాऽపరః" జీవుఁడు బ్రహ్మమే. వానికంటె భిన్నుఁడు కాఁడని ఉపనిషద్ఘోష. శుద్ధబ్రహ్మము సత్యము. మాయాజగత్తు మిథ్య, దృశ్యనష్టస్వభావము గలది.

## 9. లింగదేహాదినిరూపణప్రకరణమ్

(లింగదేహాది నిరూపణప్రకరణము)

అవ॥ సాక్షాన్ముక్తిహేతువగు వైరాగ్యాత్మబోధభక్తిత్రయమందు మొదటి 6 ప్రకరణములలో ప్రధానముగా వైరాగ్యవిశేషవిశదీకరణ మైనపిమ్మట, దాని పోషకఫలమగు ఆత్మబోధాంశముగా, ముందుగా ఆత్మ(సిద్ధి)యున్నదని నిరూపించి (7వ ప్రకరణమందు) తర్వాత 8 లో అనాత్మయగు మాయ (సిద్ధి) ఉన్నదని, అది నశింపఁజేయఁదగినదని నిరూపించి, ఆమాయాపరిణామములగు స్థూలాదిచతుర్విధశరీరవిశేషప్రబోధము చేయుచున్నారు. ఆత్మప్రబోధికాపర్యవసానముగా గ్రహింపఁదగినది, ఈప్రకరణార్థము.

**స్థూలశరీర స్యాన్త ర్లిఙ్గశరీరం చ తస్యాన్తః ।**
**కారణ మప్య స్యాన్త స్తతో మహాకారణం తుర్యమ్॥110**

ప్ర : స్థూలశరీరస్య = స్థూలశరీరముయొక్క, అన్తః = లోపల, లింగ శరీరం = సూక్ష్మశరీరము (కలదు) చ = మఱియు, తస్య = ఆసూక్ష్మశరీరము యొక్క, అంతః = లోపల, కారణమ్ = కారణశరీరము, అపి = కూడ (ఉన్నది) అస్య = ఈకారణశరీరముయొక్క, అంతః = లోపల, తతః = ఆకారణదేహమునకు, మహాకారణం, తుమ్ = నాల్గవదగు మహాకారణ శరీరము, భవతి = (ఉన్నది).

తా॥ మనకు బయటికి కనఁబడునది స్థూలశరీరము. దీనిలోపల లింగశరీరమను సూక్ష్మశరీరము కలదు. దానిలోపల కారణ శరీరమును, దానిలోపల మహాకారణమను పేరుగల నాల్గవశరీరమును కలవు.

అవ॥ స్థూలశరీరమును వెనుక విపులముగా వర్ణించుటచేత నిప్పుడు రెండవదగు సూక్ష్మశరీరమును రెండు శ్లోకములలో వర్ణించుచున్నారు.

**స్థూలం నిరూపితం ప్రాగధునా సూక్ష్మాదికం బ్రూమః।**
**అఙ్గుష్ఠమాత్రః పురుషః శ్రుతిరితి యత్ప్రాహ తత్సూక్ష్మమ్ ॥ 111**

**సూక్ష్మాణి మహాభూతాన్యసవః పఞ్చేన్ద్రియాణి పఞ్చైవ।**
**షోడశమన్తఃకరణం తత్సఙ్ఘాతో హి లిఙ్గతనుః ॥ 112**

స్థూలం = స్థూలశరీరము, ప్రాక్ = (ముందు) గడచిన ప్రథమాధ్యాయమందు. నిరూపితం = చక్కగా వివరింపఁబడినది. అధునా = ఇప్పుడు, సూక్ష్మాదికం = సూక్ష్మశరీరము మొదలగు నితరశరీరములఁ గూర్చి బ్రూమః = చెప్పుచున్నాము. (అందు సూక్ష్మశరీరము పరిమాణమును గుఱించి,) పురుషః = పురుషుఁడు, అంగుష్ఠమాత్రః = తనబొటనవ్రేలంత పరిమాణము కలవాఁడు, ఇతి = అని, శ్రుతి = వేదము యత్, ప్రాహ = దేనిని చెప్పి యున్నదో, తద్ = అది. సూక్ష్మమ్ = సూక్ష్మశరీరము.

సూక్ష్మాణి = సూక్ష్మములైన, మహాభూతాని = మహాభూతములగు, పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము అనున వైదును, పఞ్చ = ఐదు, అసవః = ప్రాణములగు, ప్రాణాపానవ్యానోదానసమానము లనఁబడునవి యును, చ = మఱియు, పఞ్చ, ఏవ = ఐదే, అయిన ఇన్ద్రియాణి = ఇంద్రియములు - జ్ఞానేంద్రియములగు, శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము [ముక్కు]లను, షోడశమ్ = పదునారవది యగు, అన్తఃకరణమ్ = లోపలి యింద్రియమగు మనోబుద్ధ్యాదియును, తత్సంగాతః = ఈపదునాఱింటిసమూహమువలన నేర్పడిన శరీరము, లింగతనుః, హి = లింగశరీరము, సూక్ష్మశరీరము సుమా.

తా॥ స్థూలశరీరమును గూర్చి మొదటియధ్యాయమందే విపులముగాఁ జెప్పినారు గాన దానిని మఱల నిచటఁ జెప్పఁబని లేదు. ఇక మిగిలిన సూక్ష్మశరీరము మొదలైన వానిని గుఱించి చెప్పుచున్నాము. అందు సూక్ష్మశరీరము ప్రమాణము తన బొటనవ్రేలియంత. ఇది "అంగుష్ఠమాత్రః పురుషః" "పురుషుఁడు బొటనవ్రేలియంత పరిమాణము గలవాఁడు" అను శ్రుతి చేతఁ జెప్పఁబడినది. ఈసూక్ష్మశరీరములోని యవయవములు మొత్తము పదునాఱు. సూక్ష్మమహాభూతములైన ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి యనునవియైదును ప్రాణ-అపాన-వ్యాన ఉదాన-సమానములను ప్రాణములైదును; జ్ఞానేంద్రియములగు చెవి, కన్ను, చర్మము, నాలుక, ముక్కు అనునవి యైదును, అంతఃకరణ మను లోపలియింద్రియ మొకటియును గలసిన యీ పదునారింటి యవయవసముదాయమే సూక్ష్మశరీరముసుమా. జీర్ణించునది శరీరము. దహింపబడునది దేహము. ఈపదునాఱింటిలో నంతర్గతము లైనవే పుర్యష్టక భాగములు. శ్రీ శంకరులే "వివేకచూడామణి" 98 వ శ్లోకములో సూక్ష్మశరీరమును పుర్యష్టక మని యుట్లు వర్ణించిరి.

శ్లో॥ వాగాదిపంచ శ్రవణాదిపంచ, ప్రాణాదిపం, చాభ్రముఖాని పంచ,
బుద్ధ్యా, ద్యవిద్యాఽపి చ కామకర్మణీ, పుర్యష్టకం సూక్ష్మశరీరమాహుః॥

నోరు (నాలుక), చేయి, పాదము, మలమూత్రవిసర్గనేంద్రియము లనఁబడు కర్మేంద్రియము లైదు గలసి యొకటి, చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు అనెడు జ్ఞానేంద్రియము లైదుగలసి రెండు, ప్రాణాపానవ్యానోదానము లనెడి ప్రాణము లైదుగలసి మూడు, ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, భూమి యనెడు మహాభూతము లైదుగలసి నాల్గు, బుద్ధ్యాది యైదు, అవిద్య ఆఱు, కామము ఏడు, కర్మము ఎనిమిది- ఈ ఎనిమిదింటిసమూహముగల పు: మునే (పుర్యష్టకమని) సూక్ష్మశరీర మని పెద్దలు చెప్పుదురు.

శ్లో॥ పఞ్చప్రాణమనోబుద్ధిదశేన్ద్రియ సమన్వితమ్।
అపఞ్చీకృతభూతోత్థం సూక్ష్మాఙ్గం భోగసాధనమ్॥

శ్రీశంకరాచార్యకృత ఆత్మబోధ-13

అపంచీకృతములు అనఁగా కేవలతన్మాత్రములై సూక్ష్మములైన భూమి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశ మనుపంచమహాభూతములనుండి పుట్టిన ఐదుప్రాణములు, మనస్సు, బుద్ధి, పది (జ్ఞాన, కర్మ) ఇంద్రియములు గలసిన పదునేడింటిసముదాయమే సూక్ష్మశరీరము. ఇదిసుఖదుఃఖాదిరూపభోగమునకు సాధనమైనది. ప్రస్తుతపు పదునాఱులోని యంతఃకరణమే మనోబుద్ధులుగా జెప్పబడినది. కాన ఉక్తిభేదమే గాని వస్తుభేదము లేదని గ్రహించుట వివేకము. ఈసూక్ష్మశరీరము ముక్తిపర్యంతము నశింపకుండ సాగునది,

ఇందులో వివేకచూడామణిలో చెప్పిన యవిద్యాకామకర్మ ముల పేర్లు లేవు. అంతమాత్రమునవి భోగసాధనమన్న ఈసూక్ష్మ శరీరములో లేవనుటకువీలులేదు. అంతర్గర్భితములై యుండుటచేత ప్రమాణగ్రంథములందుండు ఉక్తిభేదములను వస్తుసమన్వయదృష్టితో ప్రమాణములుగనే గ్రహింపవలయును.

అవ॥ మూడవదికారణశరీరము, మహాకారణశరీరము నాల్గవ దని వానిని వివరించుచున్నారు.

**తత్కారణం స్మృతం యత్ర స్యాత్స్యాద్వాసనాజాలమ్।**
**తస్య ప్రవృత్తిహేతు ర్బుద్ధ్యాశ్రయ మత్ర తుర్యం**
**స్యాత్॥ 113**

ప్ర : తస్య=పై చెప్పినసూక్ష్మశరీరముయొక్క, అన్తః=లోపల, వాసనాజాలమ్=వాసనలసమూహము, వాసనలవల, యద్=ఏది, (అస్తి=కలదో,) తద్=అది, కారణం=కారణశరీర మని, స్మృతమ్=చెప్పఁబడినది. అత్ర= ఇక్కడ, తస్య=ఆకారణశరీరముయొక్క, ప్రవృత్తిహేతుః= పనిచేయుటకు, కారణ మైనది, బుద్ధ్యాశ్రయమ్= బుద్ధిని ఆశ్రయించి యున్నది, (యద్= ఏయజ్ఞానము, అస్తి= కలదో, తత్= ఆయజ్ఞానము, ఆవిద్య,) తుర్యం= నాల్గవదైన మహాకారణశరీరము, స్యాత్= అగును.

తా॥ జీవుఁడాయా జన్మములలో ననుభవించు ననుభవముల సంస్కారములు మనస్సునందు ముద్రితములై యుండును. వానిని వాసన లందురు. మనుష్యుఁడొకవృక్షమును జూచినప్పుడీప్రత్యక్ష వృత్తి వెనుక చిత్తములో పూర్వానుభవమువలన నిలిచిన వృక్ష సంస్కారము (Impression)నుబట్టి 'ఇది వృక్ష'మని గుర్తించును. ఈవిధముగా నిప్పటిజ్ఞానానుభవములకు కారణములగు పూర్వ విషయవాసనారూపసంస్కారములతో, గూడినచిత్తభాగము కారణ శరీర మని చెప్పఁబడినది. ఈవాసనాజాలమే, సూక్ష్మస్థూలశరీర

ములప్రవృత్తికిఁ గారణము. సర్వవ్యవహారమునకు వాసనలకును మూలమైనది తనయథార్థస్వరూపమును సరిగా దెలియమియు, విరుద్ధముగాఁ దెలియుటయునసెడు యజ్ఞానము. దానివలన బుట్టిన యథ్యాసావరణవిక్షేపశక్తులు విజృంభించును. ఫలితముగా మిథ్యాజ్ఞానియై జీవుఁడు తాను కర్తనని, భోక్తనని, కించిజ్ఞుఁడనని, విషయములన్నిటిని సంపాదించి యనుభవించినఁ గాని సుఖము లేదని నిశ్చయించును. ఇట్టిబుద్ధియాదలికోర్కెలవలన పుణ్యపాపకర్మములు చేయుశీలముతోనుండును ఆవిషయభోగసుఖమును సాధించుటకు సూక్ష్మస్థూలశరీరములు పని చేయును. కావున వీనియన్నిటి లోపలనున్న, భోక్తృత్వకర్తృత్వబుద్ధిని బుట్టించినయజ్ఞానమే మహాకారణశరీర మనఁబడునాల్గవశరీరము. దీనికి ఉనికిపట్టు నిశ్చయాత్మకబుద్ధియే, ఈస్థూల, సూక్ష్మకారణ, మహాకారణశరీరములు, క్రమముగా అంతరతమము లనఁగా లోలోపలవి. ఈసూక్ష్మశరీరములోనిసర్వసంస్కారములకుఁ బ్రవృత్తికి నాధారమైన వాసనాజాలనిధియగు అంతఃకరణమును గారణశరీరమనియు, దానికి లోపలనుండి దానికంతకును మూలకారణమైన యవిద్యను మహాకారణశరీరమని యుంను, జెప్పఁబడినది. ఇట్లిక్కడ నాల్గుశరీరములు చెప్పఁబడినవి. సామాన్యముగా మూడన్నప్పుడు, నాల్గవమహాకారణశరీరము కారణశరీరమం దంతర్గతమని యెఱుంగుట వివేకసరణి.

ప్రమాణవచనము :- ముండకోపనిషత్తులో 2-2-9లో "భిద్యతే హృదయగ్రంథిః" సంసారకారణమై అవిద్యావాసనాప్రచయమై బుద్ధ్యాశ్రయమైన కామమే హృదయగ్రంథి. ఈ వాసనాప్రచయము బుద్ధి నాశ్రయించినదేగాని, శుద్ధాత్మను ఆశ్రయించినది కాదు. అనఁగా ముక్తిరూపకేవలాత్మకు ఈయవిద్యాది

శరీరమునకు ఆశ్రయాశ్రితభావము లేదని స్పష్టము. బ్రహ్మసమ్యగ్జ్ఞానమే ఈగ్రంథవినాశము చేయునది. 113వ శ్లోకములోఁ జెప్పిన నాల్గుశరీరములును, నశింపఁజేయఁదగినదని పూర్వప్రకరణమందుఁ జెప్పిన మాయయొక్క కార్యములే. కావున ఆత్మబోధచే దీనిని గూడఁదొలగఁబెట్టవలయు నని పర్యవసితార్థము.

అవ॥ ఇక్కడ జీవలక్షణమును వివరించి చెప్పుచున్నారు.

**తత్సారభూతబుద్ధౌ య ప్రత్పతిఫలితం తు శుద్ధచైతన్యమ్।**
**జీవః స ఉక్త ఆద్యై ర్యో ఽహ మితి స్ఫూర్తికృ**
**ద్వపుషి॥ 114**

ప్ర : తు= కాని, తత్సారభూతబుద్ధౌ= ఆసూక్ష్మశరీరమందలి ముఖ్యమగు బుద్ధియందు శుద్ధచైతన్యం= నిర్మలమైన చైతన్యస్వరూపమగు ఆత్మస్వరూపమే, ప్రతిఫలితం= ప్రతిఫలించినచైతన్యము (అద్దమునందుప్రతిబింబమువలె) ఆద్యైః= పూర్వాచార్యులచేత, జీవః (ఇతి) = జీవుఁడు అని, ఉక్తః = చెప్పఁబడినాఁడు. యః = ఈప్రతిఫలితచైతన్యరూపజీవప్రసిద్ధుఁడు, వపుషి= శరీరమందు, అహంఇతి= (శరీరమ్) నేను అని, స్ఫూర్తికృత్= వ్యవహారప్రకాశమును జేయుచున్నవాఁడు.

తా॥ కాని యాశరీరము లన్నియుఁ జడములు. అవి స్వయముగా వ్యవహరింప లేవు. అద్దమునందు వస్తువుప్రతిబింబ మెట్లు ఏర్పడుచున్నదో అట్లే ఆసూక్ష్మశరీరమందు ప్రధానమైన బుద్ధియందు శుద్ధచైతన్యబ్రహ్మ మనువస్తువుయొక్క ప్రతిఫలనచైతన్యమేర్పడుచున్నది. ఈప్రతిబింబితచైతన్యమునే జీవుఁ డని పూర్వాచార్యులు చెప్పిరి. ఈజీవుఁడు శరీరమందే ఆత్మబుద్ధి అనఁగా శరీరమే నేను అనునిశ్చయము గలఁవాఁ డగుచు వ్యవహరించుచున్నాఁడు. నిర్లింగ, నిర్విశేష, నిర్వికార, నిష్కలమై కేవలాత్మరూపమైనది బ్రహ్మమే. అనగా, స్త్రీపురుషభేదము లేని, ఏ భేదాలు

విశేషము) లేని ఏమార్పు (వికారము) లేని, భాగములు లేని అచ్ఛముతానైనచైతన్యమే శుద్ధబ్రహ్మము. నిత్యము తానట్లే యుండగనే, దీనికి విరుద్ధముగా సూక్ష్మబుద్ధియందు ప్రతిఫలించిన చైతన్యమగుజీవుఁడిట్లు భావించును. శరీరమే నేను అనినిశ్చయించును. నేను కించిజ్ఞుఁడను. జరామరణములు కలవాఁడను, అనిత్యుఁడను, అజ్ఞానిని: సంసారిని, దుఃఖిని, మొదలైనయీవ్యవహారలక్షణమే త్వ జీవత్వము అని శ్లోకార్థసారాంశము.

అవ॥ ఇట్టిజీవుని చాంచల్యాదులకు కారణమును చెప్పుచున్నారు.

చరతరతరఙ్గసఙ్గా త్ప్రతిబిమ్బం భాస్కరస్య చ చలం స్యాత్।
అస్తి తథా చఞ్చలతా చైతన్యే చిత్తచాఞ్చల్యాత్॥ 115

ప్ర: భాస్కరస్య = సూర్యునియొక్క, ప్రతిబిమ్బమ్ చ = నదులు, సరస్సులు మొదలైన జలస్థలములందలిప్రతిబింబముకూడ, చరతరతరంగాత్ = మిక్కిలిగఁ గదలుచున్న నీటియలలతోడఁ గూడియుండుటవలన, చలం = (చలించుచున్నది,) కదలుచున్నది, స్యాత్ = అగును. తథా = అదేవిధముగా, చిత్తచాఞ్చల్యాత్ = జీవునిఉపాధియైన చిత్తముయొక్క చాంచల్యమువలన, చైతన్యే = జీవచైతన్యమునందు, చఞ్చలతా = మిక్కిలికదలిక, (కంపనభావము), అస్తి = కలదు,

తా॥ వస్తువగు సూర్యునియం దెట్టివికారము, మార్పు లేకపోయినను, కదలుచున్న నీటిలోనిసూర్యుని ప్రతిబింబమందును పెక్కుకదలికలు (చలనభావము) కల్గుచున్నవి. అట్లే వస్తువగు బ్రహ్మమునిర్వికారమైయుండగనే నీటితరంగములవంటి చిత్తముయొక్క వికారాతిశయములవలన ఆచిత్తమందు ప్రతిఫలించిన బ్రహ్మచైతన్యరూపమగు చిదాభాసజీవుఁడే సర్వవిషయములకు, బాధ

శకుఁడగుచు, సర్వవిధసంసారదుఃఖములచే బాధింపఁబడుచున్నట్లు కనఁబడుచున్నాఁడు.

అవ॥ ఈ నిర్ణయవిషయమున ఒకయాక్షేపము లేవఁదీయబడుచున్నది, సమ్యగ్విచారణముకొఱకు.

న న్వర్కప్రతిబిమ్బః సలిలాదిషు యః స చావభాసయతి।
కి మితరపదార్థనివహం ప్రతిబిమ్బో ఒప్యాత్మన
స్తద్వత్॥ 116

ప్ర: నను = మఱిఅదెట్లు?, సలిలాదిషు = ప్రతిఫలింపఁజేయు వస్తువులగు జలాదులందు యః = ఏ, అర్కప్రతిబిమ్బః = సూర్యునియొక్క ప్రతిబింబము (అస్తి = కలదో) సః = ఆసూర్యప్రతిబింబము, ఇతరపదార్థనివహమ్ = తక్కినవస్తువులసమూహమును, చ = కూడ, అవభాసయతి, కిం = ప్రకాశింపఁజేయునా యేమి? (ప్రకాశింపఁజేయదుకదా!) తద్వత్ = ఆవిధముగనే, ఆత్మనః ప్రతిబిమ్బః అపి = శుద్ధబ్రహ్మమైనఆత్మయొక్క ఈప్రతిబింబరూపచైతన్యమగు జీవుఁడుకూడ, ఇతరవస్తువులను ప్రకాశింపఁజేయఁగూడదు. అనగా జీవుఁడుతక్కిన వస్తువులజ్ఞానమును కలిగియుండఁగూడదు. కాని జీవుఁడు తక్కినవాని నెఱుఁగుచున్నాడుగదా, అందువలన నిది అనుభవమునకు విరుద్ధముగా నున్నది. ఈసిద్ధాంతము సరియైనదికాదు అని యాక్షేపము.

తా॥ సూర్యునకు సూర్యునిప్రతిబింబమునకు గలపోలిక చెప్పి జీవుఁడట్లే శుద్ధబ్రహ్మముయొక్క ప్రతిబింబ మైనవాఁడనుచున్నారు. నీరుమొదలైనవానిలో ప్రతిబింబించిన సూర్యప్రతిబింబముయొక్కకాంతి, తక్కినవస్తువులను ప్రకాశింపఁజేయ లేదు. అట్లే శుద్ధచైతన్యమైన ఆత్మరూపబ్రహ్మముయొక్క ప్రతిబింబమైన జీవుఁడుకూడ ఇతరవస్తువులను దెలిసికొని వ్యవహరింపఁగల సామర్థ్యముకలవాఁడు కాఁకూడదు. కాని మనయనుభవములో జీవుఁడు తక్కినవస్తువులను దెలిసికొనఁ గల్గుచున్నాఁడు. వానితో

వ్యాపారాదులు సల్పుచు సంసారిగా నున్నాఁడు. ఈవైరుధ్యము వలన నీవు చెప్పినసిద్ధాంతము, (పోలిక) సరియైనదికాదు అని ఆక్షేపస్వరూపము.

అవ॥ పై యాక్షేపణకు సమాధానముగా లోకానుభవసిద్ధమగు మఱొక యుదాహరణ మిచ్చుచున్నారు.

**ప్రతిఫలితం యత్తేజః సవితుః కాంస్యాది పాత్రేషు।**
**తదను ప్రవిష్ట మన్తర్గృహ మన్యా నర్థాన్ ప్రకాశయతి॥**
**117**

ప్ర : కాంస్యాదిపాత్రేషు = కంచు (వెండి) మొదలైనలోహములతోఁ జేయఁబడిన పాత్రలయందు, ప్రతిఫలితం = ప్రతిఫలింపఁజేయఁబడిన, యత్ = ఏప్రసిద్ధమైన, సవితుః తేజః = సూర్యకాంతిగలదో (అది), అన్తః గృహమ్ = ఇంటిలోపల భాగమును, అనుప్రవిష్టం (సత్) = అనుసరించి ప్రవేశించినదై అన్యాన్ పదార్థాన్ = గృహములోని యితరపదార్థములను, ప్రకాశయతి = ప్రకాశింపఁజేయుచున్నది.

తా॥ పైయాక్షేపమునకు సమాధానము ఇచ్చుచున్నారు. జలములలోని సూర్యప్రతిబింబముయొక్క కాంతి తక్కిన వస్తువులను ప్రకాశింపఁజేయకున్నను, గృహమువెలుపలనున్న కంచుమొదలైన పాత్రములమీఁదఁ బడినసూర్యకాంతి లోపలగృహములో నున్న తక్కినవస్తువులనెట్లు ప్రకాశింపఁ జేయుచున్నదో, అట్లే జీవచైతన్యము ప్రతిబింబలక్షణము గలదైనను తక్కినవస్తువులను ప్రకాశింపఁజేయుచున్నది. అనఁగాఁ దెలిసికొనుటకు సమర్థమగుచున్నది. కావున పైఆక్షేపము లోకానుభవసిద్ధన్యాయముచేత త్రోసి వేయఁబడినది.

అవ॥ ఈవిషయమును ఇంకను స్పష్టముగా వివరించుచున్నారు.

చిత్ప్రతిబిమ్బ స్తద్వ ద్బుద్ధిషు యో జీవతాం ప్రాప్తః।
నేత్రాదీన్ద్రియమార్గైర్బహి రర్థా న్సోఽవభాసయతి॥ 118

ప్ర॥ తద్వత్ = అదేవిధముగా, యః చిత్ప్రతిబిమ్బః = ఏశుద్ధచైతన్య ప్రతిబింబము, బుద్ధిషు = బుద్ధివృత్తులయందు, జీవతాం = జీవస్వభావమును, ప్రాప్తః = పొందినదో, సః = ఆప్రతిబింబిత చైతన్యరూపజీవుఁడు, నేత్రాదీన్ద్రియమార్గైః = కన్ను మొదలైన ఇంద్రియముల దారులగుండ, బహిః = వెలుపలికివెళ్ళి, అర్థాన్ = విషయరూపవస్తువులను, అవభాసయతి = ప్రకాశింపఁజేయుచున్నాఁడని. (తెలిసికొని వానితో వ్యవహరించుచున్నాఁడని భావము.)

తా॥ ఇంటివెలుపలనున్న కంచు మొదలైన వానితోఁ జేయబడిన పాత్రములమీఁదఁ బడినసూర్యకాంతి ఇంటిలోనున్న ఇతరవస్తువులమీఁద ప్రసరించి (ఎట్లు) వానిని బాగుగాఁ గనఁబడునట్లు చేయునో, అట్లే బుద్ధులయందు ప్రతిఫలించిన వికారభూతచైతన్యరూపులగు జీవులు ప్రపంచములోని వస్తువులను (విషయములను) భాసింపఁ జేయుచున్నారు. అనఁగా జీవులు తక్కిన వస్తువులను దెలిసికొని సంసారులుగా వ్యవహరింపఁ గల్గుచున్నారు. ఇది లోకానుభవసిద్ధము.

## 10. అద్వైతప్రకరణమ్ (అద్వైతప్రకరణము)

అవ॥ వెనుకప్రకరణములో శరీరములును వానినిధరించుజీవులనుగూర్చి చెప్పఁబడినది. ఇది ద్వైతము, నానాత్వవిషయమై పారమార్థికనిత్యసత్యము కాకున్నది. కేవలము ప్రాతిభాసికసత్యరూపమో లేదా వ్యావహారికసత్యరూపమో మాత్రమైనది. ఇట్టిరెండురకములసత్యములకు, ఆధారభూతమై అవి కల్పితమాత్రములని, అందువలన నవి మిథ్యారూపము (మాయాకార్యము) లగుచున్నవని తెలియజేయు నాధారము (అధిష్ఠానము) అయిన ప్రజ్ఞానరూప, (శుద్ధాత్మకంటె భిన్నముగాని) పరబ్రహ్మమే, నిత్యపరమార్థసత్యవస్తువని, అది (సర్వమని,) సర్వభేదరహితమై, ఏకమై, రెండవసద్వస్తువు లేనిదని నిరూపించునది గాన

ఇది అద్వైతప్రకరణము. ఈయద్వైతసిద్ధాంతము వేదవేదాంత, గీతాదిస్మృతి, న్యాయానుభవసిద్ధమని సంగ్రహముగా విశదపరచుచున్నారు. "అహం బ్రహ్మాస్మి" "నేను బ్రహ్మమునే" యను యద్వైతానుభవమే ఈకావ్యార్థసిద్ధి యని ధ్రువపఱచుటకే కీలకకేంద్రస్థానవిషయముగా గ్రంథనాభియందు, 10వది అద్వైతప్రకరణము. మొదటితొమ్మిదిప్రకరణములు ఉపనిషదాదివేద్యమగు ఈపరమార్థసత్యగమ్యమానములను, "అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా" "జన్మాద్యస్య యతః" "శాస్త్రయోనిత్వాత్" అను మొదటిమూడుబ్రహ్మసూత్రార్థములుగా ఈ 10వ ప్రకరణారంభముతో బ్రహ్మస్వరూపస్వభావనిరూపణము గావించినవి. తర్వాతితొమ్మిది (11 నుండి 19 వరకుగల) ప్రకరణములు, "తత్తు సమన్వయాత్" అనునాల్గవబ్రహ్మసూత్రార్థరూపముగా ఆయద్వైతబ్రహ్మమందు, లౌకికవైదికకర్మములయు ఉపాసనలయు, భక్తి, జ్ఞానవైరాగ్యములయు, సర్వప్రవృత్తినివృత్తులయొక్క సర్వసమన్వయమును, కల్పితరూపానన్యత్వమును హృద్యముగా విపులముగా నిపుణముగా నిరూపించునవియై యలరారుచున్నవి.

తదిదం య ఏవ మార్యో వేద బ్రహ్మాహమస్మీతి।
స ఇదం సర్వం చ స్యాత్తస్య హి దేవాశ్చ నేశతే
ఉభూత్యై॥ 119

ఏషాం స భవత్యాత్మా యోఽన్యామథ దేవతా
ముపాస్తే।
అహమన్యోఽసౌ పన్య శ్చేత్థం యో వేద పశువత్సః॥
120

ఇత్యుపనిషదా ముక్తిస్తథా శ్రుతిర్భగవదుక్తిశ్చ।
జ్ఞానీ త్వాత్మైవేయం మతిర్మమేత్యపరి యుక్తిరపి।
121

ప్ర : అహం = నేను, బ్రహ్మ = బ్రహ్మముగా, అస్మి = ఉన్నాను, ఇతి = అని, యః ఆర్యః = ఏపూజ్యగుణవంతుఁడు, తత్ = ఆఏకమైన బ్రహ్మము, ఇదం = జీవునిగాను, ప్రపంచముగాను జూడబడుచున్నయిది, ఏవం

= ఇట్లు వేద= ఎఱుఁగునో, సః= ఆమహాజ్ఞాని, ఇదమ్ సర్వం చ= ఈ సమస్తమైన విశ్వముకూడ, స్యాత్= కాఁగలఁడు; హి= అందుచేతనే, దేవాః చ= దేవతలుకూడ, తస్య= ఆబ్రహ్మజ్ఞానియొక్క, అభూత్యై= అనైశ్వర్యమునకు (నాశనమునకు, హానికి), న ఈశతే= సమర్థులుకారు. (ఎందువల్ల ననఁగా), సః = అతఁడు, ఏషాం= ఈదేవతలందఱికి, ఆత్మా, భవతి= ఆత్మ యగును. అథ= పిదప, యః = ఎవఁడు, అన్యాం = (తనకంటె) వేరైన, దేవతాం= దేవతను, ఉపాస్తే = ఉపాసించునో, ధ్యానించునో, అహం అన్యః= నేను వేఱు, అసౌ అన్యః చ= నే నుపాసించు దేవతకూడ నాకంటె వేఱు (అని), ఇత్థం= ఈవిధముగా, యః= ఎవఁడు, వేద=ఉపాసనచేయునో (భావించునో), సః= అతఁడు, (తేషాం= ఆదేవతలకు) పశువత్= యజమాని కుపకరించు) పశువువలె వారిని సేవించును, వారికి ఉపకరించువాఁడు (భవతి= అగును).

ఇతి= అని, ఉపనిషదాం ఉక్తిః= ఉపనిషత్తులవాక్యము (కలదు). తథా= అట్లే, శ్రుతిః= వేదవచనము (కలదు). భగవదుక్తిః చ= భగవానుఁడైన శ్రీకృష్ణుఁడు, తనభగవద్గీతలో చెప్పినవాక్యమును ఈయర్థము గలదే. జ్ఞానీతు= కాని, నన్ను అపరోక్షముగాఁ దెలిసికొన్న జ్ఞాని, ఆర్తుఁడు, అర్థార్థి, జిజ్ఞాసువు, జ్ఞానియను నలుగురుభక్తులందెకఁడు, ఆత్మా ఏవ= నేనైన యాత్మస్వరూపుఁడేసుమా. ఇయం= ఇది, మమ మతిః= నాయొక్క అభిప్రాయము, ఇతి= అని స్మృతియైన గీతావాక్యప్రకటనము, అత్ర= (ఇక్కడ) ఈవిషయములో అనగా బ్రహ్మమే శుద్ధాత్మ సర్వమదే సమ్యగ్జ్ఞాని ఆత్మయే అనువిషయములో యుక్తిః అపి= తర్కము, (న్యాయము) కూడ (ఉన్నది).

తా॥ గతప్రకరణమందు, శరీరములందు వర్తించుజీవుఁడు చిత్ప్రతిబింబ మని చెప్పబడినది. ముఖ్యబింబము శుద్ధచైతన్యమగు బ్రహ్మమే సత్యము ఇందు సిద్ధాంతము, అద్వైతబ్రహ్మమే అని చూపఁబడుచున్నది. నిత్యమైన తత్త్వము నిత్యమైన వాక్కులచేతనే, అనగా అపౌరుషేయములైన వేదమువలననే నిర్ణయింపఁబడవలెను. వేదప్రామాణ్య మంగీకరించినప్పటికిని ద్వైతవిశిష్టాద్వై

తులు భేదములను నిత్యసత్యములనుగా జూపించుచుండగా అట్లు గాదని అద్వైతమును అనుభవముతో జాటు ప్రత్యక్ష మహావాక్యమును ముందు జూపినారు. "అహం బ్రహ్మాస్మి" "నేనే బ్రహ్మమును"- బృ. 1-4-10 ఈయర్థమునే చాటు ఇతరోపనిషన్మహావాక్యములు "త త్త్వ మసి" (నీవు బ్రహ్మముగా నున్నావు ఛాం 6-2-7 "అయ మాత్మా బ్రహ్మ" ఈకేవలాత్మయే, (ఇతరుడుగాఁగనఁబడుచుండగనే) బ్రహ్మము బృ 2-5-19 ఈపరమార్థ తత్త్వము ఏకమే యని ధ్రువపఱచు మఱికొన్ని శ్రుతివాక్యములిట్లున్నవి. "ఇది తెలిసినవాఁడు సర్వము అగును" బృ 1-4-10 అతఁడే సర్వ మైనప్పుడిఁక ఆత్మకంటె వేరైన దేమున్నది? ఇట్లుగాక వాచ్యముగా జెప్పిన వాక్యములుకొన్ని. "ఏక మే వాద్వితీయం బ్రహ్మ" ఛాం 6-2-1 బ్రహ్మము ఒక్కటియే, రెండవది లేనిది." ఆత్మావా ఇద మేక ఏవ అగ్ర ఆసీత్ ఐత 1-1-1 "ఇదంతయు సృష్టిమొదట ఏకముగానే ఉండెను." ఇదం సర్వం య దయ మాత్మా" బృ 2-4-6, ఈసర్వముగానున్నదంతయు ఆత్మయే." సర్వం ఖ ల్విదం బ్రహ్మ. ఛాం 3-14-1 ఈసర్వము బ్రహ్మమే. అంతియ కాక అనేకత్వమును నిరసించుశ్రుతులు కూడ పెక్కు కలవు. "నేహ నా నాస్తి కించన" ఇక్కడ కొంచెముకూడ (నానా) అనేకము లేదు. "మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" బృ 4-4-19 కఠ 4-10 ఇక్కడనెవఁడు (నానా) అనేకము (భేదము)ను చూచునో, అతఁడు ఒక మృత్యువునుండి మఱొకమృత్యువును పొందును. అనగా జన్మపరంపరలోఁ బడును. "ద్వితీయాద్వై భయం భవతి." రెండవదానినుండి భయము కల్గునుసుమా. న తు తద్ద్వితీయ మస్తి, తతో ఽన్య ద్విభక్తం య త్పశ్యేత్ బృ 4-3-33 "కాని దానికంటె వేఱుచూచుటకు దానికన్న (వేఱైనది) రెండవది లేదు." తత్ర

శో మోహః క శోక ఏకత్వ మనుపశ్యతః "ఈశా 7." ఏక (బ్రహ్మ) త్వమునే చూచుచున్న వానికి (అక్కడ) అసమయమందు ఏశోకము లేదు. ఏమోహమును లేదు." అథ యో ఽన్యాం దేవతా ముపాస్తే అన్యో ఽసా వన్యో ఽహ మస్మీతి న స వేద యథా పశు రేవ స దేవానామ్ బృ 1-4-10 ఎవఁ డితర దేవతను "నేను వేఱు ఆయన వేఱు" అని ఉపాసించునో అతఁడు సరిగాఁ దెలిసికొనలేడు. అతఁడు దేవతలకు పశువువంటివాఁడు. ఇట్టి ద్వైతభావనిరాసకార్థ నిందావాక్యములనేకము చూపవచ్చును. స్మృతులుకూడ ఇట్లే చెప్పుచున్నవి భగవద్గీతలలో.

శ్లో॥ చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతి నోఽర్జున।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥ 7-16

శ్లో॥ తేషాం జ్ఞాని నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే।
ప్రియో హి జ్ఞానినో ఽత్యర్థ మహం స చ మమ ప్రియః॥ 7-17

శ్లో॥ ఉదారాః సర్వ ఏ వై తే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్।
ఆస్థితః స హి యుక్తాత్మా మా మే వానుత్తమాం గతిమ్॥ 7-18

ఓ అర్జునా! నన్ను నాలుగువిధములైన పుణ్యాత్ములు భజించుచున్నారు. వారు బాధలలో నున్నవారును, నన్ను తెలిసికొనఁ గోరువారును. నానుండి ధనము మొదలగు సంపదలను గోరువారును, జ్ఞానులును. అందులో జ్ఞాని యెప్పుడును నాయందే యున్నవాఁడు, నన్ను మాత్రమే భజించువాఁడు. అతఁడుతక్కిన వారిం జెనిమించును. అతఁడు నాకు మిక్కిలి ప్రియుఁడు. నేనతనికి మిక్కిలి ప్రియుఁడను. వీరందఱు గొప్పవారే. కాని జ్ఞాని నాయొక్క ఆత్మయే, నేనే యతఁడు, అతఁడే నేను. అని నాయభిప్రాయము

అతఁడు నిత్యము ఈజ్ఞానయోగముతో కూడిఉండి, ఉత్తమ గతిని నన్నే పొందును. ఆతఁడే నేను అని తాత్పర్యము. "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత." గీ. 1-32 సర్వ క్షేత్రములందున్న క్షేత్రజ్ఞుఁడగు జీవుఁడు నేనే అని తెలిసికొనుము. భారతభాగవతములనుండి కూడ ఇట్టివి పెక్కులు చూపవచ్చును. తర్కము (న్యాయము) గూడ ఈయద్వైతసిద్ధాంతమునే ఋజువు చేయుచున్నది. ప్రతిమనుష్యుఁడు తా నెప్పుడు నుండవలెననియు, సర్వము దెలిసికొనవలెననియు, ఆనందముగానుండవలెననియు, అందఱికన్న నెక్కువగా నుండవలెననియు, సహజముగా గోరుచున్నాఁడు. ఆకోరిక తాను చేతనుఁడై, సర్వము తానైననే సమకూరును. సర్వము తననుండి వచ్చినది, తనయందే లయించునది, అనఁగా మిథ్యయైనది, తాను సర్వమునకు నీశుఁడుగాను, సర్వాతీతుఁడుగా అద్వితీయుఁడుగా నున్ననే కుదురును. ఇట్లు పరతత్త్వము అద్వైత మని, సర్వము మిథ్యయని న్యాయమువలనగూడ తేలును. కావున అద్వైతము. పరమార్థమగుట శ్రుతిస్మృతిన్యాయ సిద్ధ మైనది. అట్టిదే మహాత్ములయనుభవమును. కావున వివేకి ఈవిధమైన ఆత్మబోధను శ్రమపడి తెలిసికొని ముక్తుఁడుగా సుఖింపవలె నని తాత్పర్య బోధ.

అవ॥ "బ్రహ్మ సత్యం జగ న్మిథ్యా జీవో బ్రహ్మైవ నాऽపరః" అని శ్రుతి. బ్రహ్మ మొక్కటే సత్యము. జగత్తు మిథ్య. మఱియాజీవుఁడేమిటి? అన్నచో జీవుఁడు సారభూతముగా బ్రహ్మమే. వేఱుకాఁడు. బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి" బ్రహ్మమును తెలిసికొన్నవాఁడు (బ్రహ్మజ్ఞాని) బ్రహ్మమే యగును. ( ముం. 3.2.9 ) అని శ్రుతు లన్నను దీనికి విరుద్ధముగా జీవుఁడు వ్యవహారము చేయుచున్నాఁడే. అజ్ఞానియైన సంసారివలె నున్నాఁడే జీవబ్రహ్మముల కభేదమే సామాన్యులకు కనఁబడుట లేదే అన్నచో సమాధానము రెండుశ్లోకములతోఁ జెప్పుచున్నారు.

(ప్ర. 20)

ఋజు వక్రం వా కాష్ఠం హుతాశదగ్ధం స దగ్నితాం యాతి ।
తత్కిం హస్తగ్రాహ్యం ఋజువక్రాకారసత్త్వేఽపి॥122

ఏవం య ఆత్మనిష్ఠో హ్యాత్మాకారశ్చ జాయతే పురుషః ।
దేహీవ దృశ్యతేఽసౌ పరం త్వసౌ కేవలో హ్యాత్మా ॥ 123

ప్ర : ఋజు = తిన్ననైనది, వంకరలేనిది, వా = లేక, వక్రం = వంకరకలది అయిన, కాష్ఠం = కొయ్యముక్క, అగ్నిదగ్ధం సత్ = అగ్నిచేఁ గాల్పఁబడినదై, అగ్నితాం యాతి = అగ్నిత్వమునే పొందుచున్నది. అగ్నియే యగును) తత్ = ఆకాల్పఁబడిన కొయ్యముక్క, ఋజువక్రాకారసత్త్వే + అపి = తిన్నగా, వంకరగా ఆకారము కల్గియున్న(ట్లుకనఁబడిన) ను, హస్తగ్రాహ్యం = చేతితో నెత్తి పట్టుకొనఁదగినది, భవతి (కిం) = అగునా యేమి? కాదని భావము.

ఏవం = ఇట్లే, యః పురుషః = ఏపురుషుఁడు, ఆత్మనిష్ఠః = జ్ఞానము సంపాదించి, ఆత్మయందే నిశ్చయముగా నున్నవాఁడే యగునో, హి = అందువలన, ఆత్మాకారః + చ = ఆత్మయేరూపము, ఆకారము కలవాఁడుగా, జాయతే = అగునో అసౌ = ఇతఁడు, దేహీ + ఇవ = శరీరముకలవానివలె, దృశ్యతే = (ఇతరులచే) చూడఁబడుచున్నాఁడు, పరంతు = కాని, అసౌ = ఇతఁడు, కేవలః ఆత్మా హి = కేవలము ఆత్మయే గదా!

తా॥ వంకరగా గాని, వంకరలేక తిన్నగా గాని యున్న యొక కట్టెముక్క అగ్నిచే బాగుగాఁ గాల్పబడినప్పుడు, అది పూర్తిగా నెఱ్ఱనై యగ్నియే యగును. ఆయగ్ని భావము పొందును. మునుపటివలె ఉండుచున్నకట్టెయొక్క యాకారము వంకరగా గాని తిన్నగాగాని కనఁబడుచున్నను, ఉండుచున్నదానినిగాని, మండి నుసియై వంకరగాగాని తిన్నగాగాని కనఁబడుచున్నదానిని గాని చేతితో బట్టుకొనుటకు వీలు లేదు. కట్టెతనము నశించిన

ఁదని సారాంశము. అట్లే బ్రహ్మము తానని యనుభవములో నెఱింగిన బ్రహ్మజ్ఞాని, మునుపటియట్లు శరీరధారివలె నితరులకుఁ గనఁబడును. కాని యతఁడు శరీరమే లేనట్టియు, దేహిభావము నశించినట్టియు కేవలము బ్రహ్మమే యగు శుద్ధాత్మయేసుమా. ఎప్పుడును వెనుకటి యజ్ఞానదశలో వలెనే ప్రవర్తింపఁడు అనఁగా ఆ ప్రవర్తించువానియందు ఆత్మాభిమానము లేక యుండును. అద్వైతసిద్ధుఁ డతఁడు.

శ్రీశంకరాచార్యులవారు 1-1-4 బ్రహ్మసూత్రభాష్యములో ఈప్రశ్నను లేవఁదీసి ఇదే సమాధాన మిచ్చినారు. "నను శ్రుతబ్రహ్మణో ఽపి యథాపూర్వం సంసారిత్వదర్శనా న్న రజ్జుస్వరూపకథనవ దర్థవత్త్వ మిత్యుక్తమ్, అత్ర ఉచ్యతే నావగతబ్రహ్మాత్మభావస్య యథాపూర్వం సంసారిత్వం శక్యం దర్శయితుమ్."

పూర్వపక్షి :- బ్రహ్మజ్ఞుఁడుఁగూడ వెనుకటివలెనే సంసారిగా నుండుట కనఁబడుచున్నది. ఇది పాముగాదు త్రాడు అని చెప్పినప్పు, డది విన్నవానికి భ్రాంతితొలఁగుటవంటి ప్రయోజనము శ్రుతబ్రహ్మవిషయమందుఁ గనఁబడుటలేదే అనిపూర్వపక్షి అనగా, జాబు :- అట్లు కాదు బ్రహ్మము నెఱుఁగనప్పు, డెట్లు సంసారిగా నున్నాఁడో, బ్రహ్మజ్ఞుఁడైకూడ సరిగా నట్లె ప్రవర్తింపఁజాలఁడు. ఇది అనుభవసిద్ధమని ప్రత్యక్షముగా నారు వివరించినారు. కావున బ్రహ్మజ్ఞుఁడు వెనుకటివలె సంసారికాఁడు. అద్వైతబ్రహ్మమే యతఁడు.

అవ: అట్లైనచో ఒక్కఁడైన బ్రహ్మము లోకములో అనేక జీవులుగాఁ గనఁబడుట యెట్లు కుదురు ననగా సమాధానము చెప్పుచున్నారు.

ప్రతిఫలతి భాను రేకో ఽనేకశరావోదకేషు యథా ।
తద్వ దసౌ పరమాత్మా హ్యేకో ఽనేకేషు దేహేషు ॥ 124

ప్ర: ఏకః భానుః = ఒక్కఁడే యైనసూర్యుఁడు, యథా = ఎట్లు, అనేకశరావ-ఉదకేషు = అనేకములైన మూకుళ్లలోని జలములందు, అనేకథా = అనేకవిధములుగా, ప్రతిఫలతి = ప్రతిఫలించునో, తద్వత్ = అదేవిధముగా, అసౌ పరమాత్మా = ఈపరమాత్మ, ఏకః = ఒక్కఁడేయయ్యు, అనేకేషు దేహేషు = అనేకములైన శరీరములందు (ప్రతిఫలం) హి = అనేక ప్రతిబింబములుగా (జీవులుగా) కనఁబడుచున్నాఁడుసుమా!

తా॥ సూర్యుఁ డొక్కఁడే యైనను వేలువేలు మూకుళ్లలోని జలములందు వేలువేలుసూర్యప్రతిబింబములతో ననేక సూర్యులుగాఁ నెట్లుగనఁబడుచున్నాఁడో యట్లే ఒక్కఁడే యైన పరమాత్మ వేలువేలు దేహములందు వేలువేలుజీవులుగాఁ, పరమాత్మ ప్రతిఫలించిన ప్రతిబింబములుగాఁ, గనఁబడుచున్నాఁడు. ఇందు వైరుధ్యము లేదు.

అవ॥ జీవుఁరు చలించినను బ్రహ్మము చలించుట లేదనుట సత్యజ్ఞానము.

దైవా దేకశరావే భగ్నే కింవా విలీయతే సూర్యః ।
ప్రతిబిమ్బచఞ్చలత్వా దర్కః కిం చఞ్చలో భవతి ॥ 125

ప్ర: ఏకశరావే = ఒకమూకుడు, దైవాత్ = అప్రయత్నముగా, దైవము వలన, భగ్నే = (సతి) పగిలిన దగుచుండఁగా సూర్యః = [ఆకాశమండలి] వాస్తవిక సూర్యుఁడు, విలీయతే కిం,వా = విలయము చెందునా యేమి? [నశించునా యేమి?] నశింపఁడు. ప్రతిబిమ్బచఞ్చలత్వాత్ = కారణాంతరములచే మూకుడులోని నీటియందున్న] సూర్యుని ప్రతిబింబమునకుఁ బట్టినమిక్కిలికదలికతనము వలన అర్కః = [ఆకాశమండలి] సూర్యుఁడు, చఞ్చలః = కదు కంపించువాఁడు

భవతి కిం = అగునా ఏమి? కాఁడుసుమా అని భావము, [జలాది] ఉపాధిధర్మము వలనఁ బ్రతిబింబమందుఁ గల్గు [చలనాది] ధర్మవికారములు, నిరుపాధికసత్య వస్తువునందు వికారములు గల్గవని నిరూపితము.

తా॥ ఒక మూకుడు పగిలిపోయి, దానిలోనిజల మొలికి పోయి, ఆజలములోఁ గనబడ్డ పూర్వప్రతిబింబము (లయ) నాశ మైనను, నాకాశమందలి నిజసూర్యుఁడు లయము చెందఁడు. [ఆయన తక్కిన మూకుళ్లయందు ప్రతిఫలింపకుండ నుండఁడు. అట్లే యొకజీవుఁడు ముక్తిపొందినయెడల దానితో తక్కినజీవులు, సృష్టి, యీశ్వరుఁడు లేకుండపోరు. మూకుడులోని సూర్య ప్రతి బింబము, మూకుడులోని జలము కంపించుటవలన, కంపించినను, ఆకాశమందలి సూర్యుఁడు మాత్రము కంపింపఁడు. ప్రతిబింబ చైతన్యమగు జీవునియందుఁ గనఁబడు సుఖదుఃఖాదివికారములు, వస్తుచైతన్యమగుపరబ్రహ్మమునం దెట్టిమార్పును దీసికొనిరావు. కావున జీవత్వము నశించినను, అద్వైతబ్రహ్మత్వము నశింపదు.

అవ॥ ఈచరాచరవిశ్వమంతయు [ఈజీవులు, ప్రపంచము] ఒక్క ఈశ్వ రునివలననే ప్రవర్తించుచున్నదా? దీనికి సమాధాన మిందుఁ జెప్పుచున్నారు.

## స్వవ్యాపారం కురుతే యథైకసవితుః ప్రకాశేన ।
## తద్వచ్చరాచర మిదం మేకాత్మసత్తయా చలతి ॥ 126

ప్ర : యథా = ఏవిధముగా, ఏకసవితుః = ఒక్క సూర్యునియొక్క, ప్రకా శేన = కాంతిచేత, [వెలుఁగుచేత] ఇదం = ఈ, చరాచరం = స్థావరజంగమాత్మక ప్రపంచమంతయు స్వవ్యాపారం = తనపనులను, కురుతే = చేసికొనుచున్నదో, తద్వత్ = అదేవిధముగా, ఇదం చరాచరమ్ = ఈస్థావరజంగమాత్మకమైన [కద లికగల, కదలికలేని] సర్వజీవరాశి, ఏకాత్మసత్తయా = ఒక్క ఆత్మయగు బ్రహ్మముయొక్క ఉనికిమాత్రముననే, చలతి = కదలుచున్నది, వ్యాపారవంత మగుచున్నది.

తా॥ సూర్యుఁ డుదయింపఁగనే సమస్తమైన జీవరాశి మేల్కొనును. సూర్యకాంతి, సమస్తవస్తుప్రకాశకమగుటచే జీవు లందఱు వారివారి సొంతపనులందుఁ బ్రవృత్తు లగుచున్నారు. అట్లే ఒక్క బ్రహ్మమగు ఆత్మయొక్క యునికిమాత్రముననే, చరాచరరూపమగు సర్వజీవావళి ప్రవర్తించుచున్నది. ఆయన యునికి మాత్రముననే, సర్వమునకు ఉనికిఁ గల్గి, క్రియావాతమై సాగిపోవుచున్నది. అనఁగా అద్వైతబ్రహ్మము సత్యమైన దగుటచేతనే సర్వజగత్తునకును వ్యావహారికసత్యత్వ మబ్బినదని పిండితార్థము.

అవ॥ బ్రహ్మమగు ఒక్కనిసత్తవలననే ఇదంతయు జరుగుచున్నచో, జీవులందఱయం దొకేవిధమగు ప్రవృత్తి యుండవలెను. కాని భిన్నప్రవృత్తు లుండవచ్చునా ? ఒకేకారణము (వర్ష) నుండి భిన్నభిన్నప్రవృత్తిగల కార్య మెట్లు కల్గినది ? ఈయాక్షేపణకు సమాధాన మిక్కడ దృష్టాంతముతో జెప్పుచున్నారు.

**యే నోదకేన కదలీచమ్పకజాత్యాదయః ప్రవర్ధన్తే।**
**మూలకపలాణ్డులశునాస్తేనైవైతే విభిన్నరసగన్ధాః॥ 127**

ప్ర : యేన, ఉదకేన = ఏజలకారణముచేత, కదలీచమ్పకజాత్యాదయః = కదలీ = అరటి, చమ్పక = సంపెంగ, జాతీ = జాజి, ఆదయః = మొదలైనవి, ప్రవర్ధన్తే = వృద్ధిపొందుచున్నవో, తేన, ఏవ = ఆయేకవిధజలముచేతనే, ఏతే = ఈ, మూలకపలాణ్డులశునాః = ముల్లంగి, నీరుల్లి, వెల్లుల్లి [మొదలైనవి] విభిన్నరసగన్ధాః = వేఱువేఱురుచులను వాసనలను కార్యరూపమున గల్గినవి, [భవన్తి = అగుచున్నవి.]

ఒకే (వర్ష)జలముచేత అరటి, సంపెంగ, జాజిపువ్వు మొదలైనవి మంచి రుచి, వాసనలు కలవిగాఁ బెరుఁగుచున్నను. అదే (వర్ష)జలముచేత ముల్లంగి, నీరుల్లి, వెల్లుల్లి మొదలైనవి వేఱువేఱు రుచులు వాసనలు గలవిగాఁ బెరుఁగుచున్నవి. అట్లే వివిధజీవుల యొక్క పూర్వకర్మానుసారముగా వచ్చిన స్వభావములచేత వారి

చర్యలు భిన్నభిన్నములైన గుణములను ఫలితములను గల్గి యున్నవి. వివిధవృక్షాదులకు వానిపోషకజలమువలె ఈనానాత్వముగల సర్వమునకు పోషకముగా నొకేబ్రహ్మ మున్నదన్న సిద్ధాంతము సహేతుకమే, సాధువే, (సరియైనదే)

అవ॥ ఏకమైన బ్రహ్మమే మాయోపాధిగాఁగల యీశ్వరుఁడు; అతఁడే ఈ సర్వమునకు నిమిత్తకారణమై సర్వమును ఆడించుచు నడపుచున్నాఁడు.

**ఏకో హి సూత్రధారః కాష్ఠప్రకృతీ రనేకశో యుగపత్ ।**
**స్తమ్భాగ్రపట్టికాయాం నర్తయతీహ ప్రగూఢతయా ॥ 128**

ప్ర: ఇహ = ఇక్కడ, ఈప్రపంచమందు, ఏకః, సూత్రధారః = ఒక సూత్రధారుఁడు. బొమ్మలనాడించువాఁడు, ప్రగూఢతయా = (తానెవరికిని గనఁబడకుండ రహస్యముగా వెనుక నిలువఁబడి మిక్కిలిగూఢముగా, స్తమ్భాగ్రపట్టికాయాం = స్తంభమునకు ముందు కట్టఁబడిన గుడ్డతెఱమీఁద, కాష్ఠప్రకృతీః = కొయ్యతోఁ జేయఁబడిన వివిధములైన బొమ్మలను, అనేకశః = అనేకవిధములుగా, చిత్రవిచిత్రములుగా, యుగపత్ = అన్నిఁటిని ఒకేసారి, నర్తయతి హి = ఆడించుచున్నాఁడుగదా!

తా॥ కొయ్యతో జేయఁబడిన చిత్రవిచిత్రములైన బొమ్మలను ఒకే సూత్రధారుఁడే యెవ్వరికిని గనఁబడకుండ గూఢముగా తెఱవెనుక నిలిచి తనముందు స్తంభమునుండి వ్రేలాడఁదీసిన బట్టతెఱమీఁద; వానిని చిత్రవిచిత్రములైన యనేకవిధముల నొకేసారి యాడించుచున్నాఁడుగదా! అట్లే యీజగన్నాటకమున కంతకును సూత్రధారుఁడైన పరమేశ్వరుఁడు మిక్కిలి గూఢముగా అవ్యక్తమూర్తిగా వెనుక నిలిచి బహువిచిత్రముగా ఒక్కేమా అందఱి నాడించుచున్నాఁడు. ఇట్లు జగదీశ్వరుఁడు, జగద్వ్యాపారమునకుఁ బ్రేరణాకర్తయైనాఁడునుమా!

శ్లో॥ ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥
గీ 18-61

ఓ విశుద్ధాంతఃకరణుఁడవగు అర్జునా! ఈశన (నియమన) శీలుఁడగు నారాయణుఁడు సర్వప్రాణులయొక్క హృదయప్రదేశమందు సంస్థితుఁడై యున్నాఁడు రంగులరాట్నము (Merry-go-round) మొదలగు యంత్రము నధిష్ఠించియున్న కొయ్యబొమ్మలో యన్నట్లున్న సర్వభూతములను ఆ నారాయణుఁడు ఆత్మీయమైన మాయ చేతఁ ద్రిప్పుచున్నాఁడు.

అవ॥ ఒకేకారణద్రవ్యమునుండి భిన్నరూపకార్యములైన వస్తువులు జనించునా ? అనిన, సోదాహరణముగా నట్లు సృష్టి యుండవచ్చు నను చున్నారు.

గుడఖణ్డశర్కరాద్యా భిన్నాః స్యుర్వికృతయో
యథైకేక్షోః।
కేయూరకఙ్కణాద్యా యథైకహేమ్నో భిదాశ్చ
పృథక్ ॥ 129

ఏవం పృథక్స్వభావం పృథగాకారం పృథగ్వృత్తి।
జగదుచ్చావచ ముచ్చైరేకేనైవాత్మనా చలతి ॥ 130

ప్ర : యథా = ఎట్లు, ఏక + ఇక్షోః = ఒకేచెఱకుగడరసముయొక్క, వికృతయః = మాఱురూపములు, దానినుండి పుట్టినవైన, గుడఖణ్డశర్కరాద్యాః = బెల్లము, కలకండ (పటికబెల్లము), పంచదార మొదలైనవి. భిన్నాః = వేఱువేఱురూపములు, రుచులు గలవిగా స్యుః = అగుచున్నవో, యథా = ఎట్లు ఏకహేమ్నః = ఒకేబంగారముయొక్క, భిదాః = భేదములు, భిన్నరూపములైన, కేయూరకఙ్కణాద్యాః = భుజకీర్తులు, (భుజములపై ధరించు సొమ్ములు) బాహాపురులు = చేతికిఁదొడుగుమురుగులు, గాజులు మొదలైనవి (ఉంగరములు, హార

ములు, కిరీటములు, నూపురములు మొదలైనవి) పృథక్ = వేరైనవిగా (స్యుః = అగుచున్నవో), ఏవం = అట్లే, పృథక్స్వభావం = వేఱువేఱుస్వభావములుగల్గియు, పృథగాకారం = వేఱువేఱురూపములుగల్గియు, పృథగ్వృత్తి = వేఱువేఱుప్రవృత్తులుగల్గియు, ఉచ్చావచం = హెచ్చు తగ్గు ఎక్కువ తక్కువ అను భేదములును గల, జగత్ = ప్రపంచము, ఏకేన, ఏవ = ఒక్కటియగు, ఆత్మనా = ఆత్మచేత, (బ్రహ్మముచేత) ఉచ్చైః = అత్యధికముగా, చలతి = కదలుచున్నది, (ఒప్పుచున్నది).

తా॥ ఈప్రపంచము అతివిచిత్రముగా నున్నది. ఒకటి యున్నట్లు మఱొకటుండదు. స్వభావములు వేఱు, రూపములు వేఱు, వానిప్రవర్తనలు వేఱు, కొన్ని చేతనములు, కొన్ని అచేతనములు, హెచ్చుతగ్గులు, ఉన్నతమైనవి, నీచమైనవి. ఊహించుటకుఁగూడ వీలు లేనంత యెక్కువగా నున్న దీసృష్టివైచిత్ర్యము. ఒక్క ఆత్మయగు బ్రహ్మమునుండియే యిన్నిభేదము లెట్లువచ్చినవను సందియము కల్గును. కాని, ఇందేమియుఁ జిత్రము లేదు. ఇది యసంభవముఁ కాదు. ఒకే చెఱకుగడరసమునుండి వివిధములైన, వేఱువేఱురూపములు రుచులుగల బెల్లము, పంచదార, కలకండ (పటికబెల్లము) మొదలైనవి కల్గుచున్నవికదా? ఒక్క బంగారమునుండియే ఎత్తుగా తలపై నిడుకొను కిరీటములు, మెడలో ధరించు హారములు, భుజములపై ధరించు భుజకీర్తులు బాహువులపై ధరించు కేయూరములు, ఉంగరములు, కమ్మలు, మురుగులు, గాజులు, పాదములకు ధరించు నూపురములు, ఎక్కువ విలువగలవి, చిత్రవిచిత్రములైన రూపములతో బుట్టుచున్నవి. అట్లే యీయొక్కయాత్మ (బ్రహ్మము) భిన్నుఁడుగాని మాయావిశిష్ట సర్వేశ్వరునుండియే యీనానావిధ సృష్టి గొప్పవింతగా వెలయుచున్నది. "ఏకేనైవ ఆత్మనా"- ఒక్కటియేయగు నాత్మచేతనే అనుటవలన, ఈకనఁబడుచున్న విచిత్రప్రపంచమున కంతయు

ఆత్మస్వరూప మొక్కటియే యని నిశ్చయించుటతో ముఖ్యాత్మ లును శరీరమువలె, భిన్నములును, పెక్కులు నను ద్వైతవాదములు నిరస్తము లైనవి. ఇట్టి ఏకాత్మస్వరూపమే సత్యమైనది కావున దానినే తెలిసికొనవలె నని నొక్కి చెప్పిన ట్లైనది. ఈ జ్ఞానము ముక్తిసాధనప్రధానాంశమగు ఆత్మబోధవిశేషాంశము.

అవ॥ పరమప్రమాణమగు వేద మట్లు చెప్పినదని వినుట, అట్లు (కోరుట) ఉపాసించుటవలననే ముక్తిలాభము రాదు. ఆముక్తికి బ్రహ్మాత్మైక్య జ్ఞానమనుభవపూర్వకముగా దెలిసికొన్నవే సాక్షన్ముక్తి లాభ మగును. అంతవఱకు ఎవ రెన్ని చేసి చూచినను శోకమోహభయాదులు పోవవు.

**స్కన్ధధృతసిద్ధ మన్నం యావ న్నాశ్నాతి మార్గగ స్తావత్ ।**
**స్పర్శభయక్షుత్పీడౌ తస్మి న్భుక్తే న తే భవతః ॥ 131**

ప్ర : యావత్ = ఎంతవఱకు, మార్గగః = ప్రయాణముచేయుచున్న బాటసారి, స్కన్ధధృతసిద్ధం = (ఇంటిదగ్గఱ వండించుకొని, మార్గమధ్యమునఁ దినవలె నని) మూటఁగట్టుకొని భుజముమీఁద మోసికొని తెచ్చు, అన్నం = అన్నమును, న అశ్నాతి = తినఁడో, తావత్ = అంతవఱకు, స్పర్శభయ క్షుత్పీడౌ = మోతబరువు, ఆకలిబాధయనురెండును (అన్నము తినవలసినది గాని తాకవలసినది కాదు. ఆచారపరులు దానినంటిన చేతిని కడుగుకొందురు. అందువలన తాకుట భయకారణముకూడ కావచ్చును). స్తః = ఉండును, (వదలవు కాని) తస్మిన్ భుక్తే = ఆయన్నము తినఁబడిన దగుచుండఁగా, తే = ఆ భయ పీడలు రెండును (తే = వానికి) న, భవతః = కలుగవు.

తా॥ సాధారణముగా నేదో పనిమీఁదఁ బోవుబాటసారి, మార్గములో భుజించుటకై యింటిదగ్గ నన్నము వండించి, కూర పచ్చళ్లు మొదలైనవానితో మూటఁగట్టి, భుజముమీఁదఁ బెట్టుకొని ప్రయాణము చేయును. అతఁడు దానిని దిననంతవఱకు, దాని మోఁతబరువు, ఆకలిబాధ లుండును. ఎవరైన వచ్చి

దానిని లాగుకొనిపోవుదురేమో యను భయము, పరిశుభ్రతకు లోపము గల్గించుచున్న దనుశంక వానిని వదలవు. కాని యతఁడు దానిని భక్షింపఁగనే అది తానే యై శంక, తొల్లింటి భయము, పీడ అన్నియుఁ దొలఁగిపోవును. తాను బలముపొంది ఉత్సాహవంతుఁడై తృప్తితో సుఖించుచున్నాఁడు. అట్లే బ్రహ్మమగు ఏకాత్మను గురించిన విషయము పరమప్రమాణమైన వేదమువలన ఆచార్యోపదేశమువలనను వినుట, దానినే ఉపాసించుట మొదలగునవి మాత్రము చేయుచున్న యెడల తాను సర్వోత్కృష్టుఁడను గావలెనన్న కోరిక తీరదు. నిత్యసచ్చిదానందుఁడుగా నుండు నప్పటితృప్తి కలుగదు. శోకమోహభయాదులు వీడవు. సర్వజ్ఞుఁడు సర్వశక్తిమంతుఁడు అను పరమేశ్వరుఁడు మహాకరుణామయుఁ డని యెంత చెప్పినను తనకంటె వేఱుగా నున్నాఁ డన్నచో భయము పూర్తిగా పోదు. ("ద్వితీయాద్వై భయం భవతి") రెండవది తనకంటె హీనమైన దున్నను, భయము పోవదు. క్రిమికీటకాదులనుండి కూడ మనుష్యుఁడు భయపడుచునే యున్నాఁడు. సానుకూలలైయె, అనంతప్రీతిపాత్రియైన భార్యవలనఁగూడ అతనికి భయమున్నది. సమానులైన మిత్రులుగూడ తన కపకారులుగా మాఱవచ్చును. నేఁడు మహాకరుణామయుఁడై, తనయందు మహానురక్తుఁడు అయిన ప్రభువునుండి కూడ నతనిభయము పోదు. కావున తానా పరమేశ్వరుఁడ రెండవదే లేదని, తానే నిత్యసచ్చిదానందసర్వజ్ఞసర్వశక్తిమంతుఁడగు పరమేశ్వరుఁడ నని, విని భావించుట ఉపాసించుటమాత్రిమే చాలదు. దానవి బాగుగా మనను చేసి యనుభవపూర్వకముగాఁ దెలిసికొన్ననే పరమతృప్తి, మోక్షము కల్గును.

అవ॥ యథార్థజ్ఞానమువలననే అద్వయబ్రహ్మానందానుభవ మగునని చెప్పుచున్నారు.

**మానుషమతఙ్గమహిషశ్వసూకరాదిష్వనుస్యూతమ్।**
**యః పశ్యతి జగదీశం స ఏవ భుంక్తేఽద్వయానన్దమ్॥132**

ప్ర ః యః = ఎవఁడు, మానుషమతంగమహిషశ్వ, సూకరాదిషు, మానుష= మనుష్యులు, మతంగ= ఏనుగులు, మహిష = దున్నలు, శ్వ= కుక్కలు, సూకర= పందులు, ఆదిషు = క్రిమికీటకాదులు మొదలగువానియం దును, అనుస్యూతమ్= తప్పకుండ వానియన్నింటిలోపల వానికంటె విలక్షణ ముగా వ్యాపించియున్న, జగదీశం = జగన్నాయకుఁడగు, పరమేశ్వరుని, పశ్యతి= చూచుచున్నాఁడో, సఃఏవ= అతఁడే, అద్వయానందమ్= (తిరుగు లేని, తరుగులేని, సాటిలేని), భేదములులేని, తనకంటె నన్యములేని యాత్మ యైన పరబ్రహ్మానందమును, భుంక్తే = అనుభవించుచున్నాఁడు.

తా॥ కనఁబడుచున్న మనుష్యునియందును, ఏనుఁగునం దును, దున్నపోతునందును. కుక్కయందును, పందియందును, పక్కిపిల్లి క్రిమికీటకాదులు మొదలైన సమస్తప్రాణులందును అనంతముగానున్న సగుణపరమేశ్వరుని మిథ్యారూపవిభూతులగు వీనియన్నిటియందు అంతరతమముగా అవ్యక్తముగా సర్వవ్యాపిగా నున్న జగన్నాథునిపరభావమైన రూపరహితనిర్గుణపరబ్రహ్మమును ఎవని చూచుచున్నాఁడో, ఆసమ్యగ్దర్శనుఁడే కేవలాత్మాభిన్నమై ఏమై, తనకంటెవేఱైన రెండవది లేనిదై ముక్తిరూపమైన పర బ్రహ్మానందరసానుభవము కలవాఁడు. ఈబ్రహ్మానందానుభవ మందు ద్వైతప్రపంచబుద్ధిభావము నశించుటవలన అద్వైతమే పర మార్థమని యిందు నిరూపిత మగుటచే దీనికద్వైతప్రకరణము సార్థకనామము.

ఈతత్త్వదర్శనవిధానమందు శ్రీకృష్ణగీతాప్రమాణవచనము గీ 5-18 స్మరింపఁదగినది.

శ్లో॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శునిచైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః॥
గీ 5అ-18శ్లో.

ఉత్తమసంస్కారములగు విద్యావినయములచే సంపన్నుఁడై నా శ్రోత్రియుఁడైన బ్రాహ్మణునియందును, రజోగుణమధ్యమ సంస్కారములుగల గోవునందును, సంస్కారహీనమై కేవలతమోగుణస్వరూపమైన ఏనుఁగు మొదలైనవానియందు (కుక్కయందును, దానినివండి తిను మాలవానియందును)ను, సత్త్వాదిగుణముల చేతగాని, వానినుండిపుట్టిన సంస్కారములచేతగాని, అట్లె రాజస తామస (గుణ) ముల చేతనుగాని, వానినుండిపుట్టినసంస్కారముల చేతనుగాని, ఏమాత్రమునుగూడ స్పృశింపఁబడనట్టియు(గుణదోషరహితమైనట్టియు) వికారరహితమైనట్టియు, పరబ్రహ్మమును చూచుటయే శీలముగా గలవారగు పండితులు సమదర్శనులు (బ్రహ్మవేత్తలు).

## 11, కర్తృత్వభోక్తృత్వప్రకరణమ్

(కర్తృత్వభోక్తృత్వప్రకరణము)

అవ॥ 126వ శ్లోకములో విశ్వమునంతయు మాంత్రికునివలె పరమేశ్వరుఁడే వెనుక గూఢముగా నిల్చి యాడించుచున్నాఁడని చెప్పఁబడినది. అట్లైన జీవుఁడు కర్త, భోక్త కాఁడనవలెనా? మఱి కర్తృత్వభోక్తృత్వములు పరమేశ్వరునకుఁగూడఁ జెంవా? వానివలన నాయన సంసారి దుఃఖాదుల కలవాఁడు కాఁడా? ఈసందేహములకు సమాధానము చెప్పుచున్నారు.

యద్వత్తూర్యే ఽభ్యుదితే స్వవస్త్రవహారం జనః కురుతే
తం న కరోతి వివస్త్రాన్న కారయతి తద్వదాత్మాఽపి॥ 133

ప్ర : యద్వత్ = ఏవిధముగా, సూర్యే = సూర్యుఁడు, అభ్యుదితే = పైకివచ్చిఉదయించుచున్నవాఁడు కాఁగా, జనః = జనుఁడు, స్వవ్యాపారం = తనకార్యమును. (పనిని,) కురుతే = కర్తయైచేయుచున్నాఁడో, వివస్వాన్ = సూర్యుఁడుమాత్రము, తం = (దానిని,) అనరుని పనిని, న కరోతి = చేయుట లేదో, న కారయతి = చేయించుటలేదో, తద్వత్ = అదే విధముగా, ఆత్మాఅపి = బ్రహ్మమైన యాత్ముఁడుకూడ ఏపనిని చేయఁడు చేయింపఁడు. (అందువలన కర్తృత్వభోక్తృత్వము లాయాత్మకు లేవు, ప్రతిఫలితచైతన్యరూపుఁడును, అవిద్యాకామవివశుఁడునగు జీవునివే.)

తా॥ సూర్యుఁడు భూమిపైకి వచ్చి ఉదయించుచున్నట్లు కనఁబడఁగనే, సర్వజీవులు నిద్రనుండి లేచి, ఆసూర్యకాంతవలన బాహ్యవిషయజ్ఞానము గల్గి, తమతమపనులందుఁ బ్రవృత్తము లగుచున్నవి. అంతియకాని. ఆసూర్యుఁడుమాత్రము, ఆయాపను లను తాను చేయుటకాని, చేయు మని యితరులను ప్రోత్సహించి చేయించుట గాని లేదు, ఆయన ఎట్టి వ్యాపారి కాఁడుగదా! అట్లే సూర్యునివలె సర్వప్రకాశమానుఁడగు ఆత్మపరమార్థముకూడ, అజ్ఞానులగు జీవులు చేయుపనులకు కర్తయు (చేయువాఁడు) గాఁడు. కారయితయు [చేయించువాఁడును] గాఁడు. సర్వప్రాణు లును తమస్వభావమునుబట్టి తామే పనులుచేసికొని పోవుచున్నారు. ఆయాత్ముఁడు కేవలసాక్షిమాత్రుఁడై నిర్లేపుఁడుగా నున్నాఁడు.

అవ॥ జీవునిబాధ లాయాత్మకు లేవని మఱొకయుదాహరణ మిచ్చుచున్నారు.

**లోహే హుతభుగ్వ్యాప్తే లోహాన్తరతాడ్యమానేఽపి।**
**తస్యాన్తర్గతవహ్నేః కింస్యాన్నిర్ఘాతజం దుఃఖమ్॥ 134**

ప్ర : హుతభుగ్వ్యాప్తే = అగ్నిచేత వ్యాపింపఁబడిన, లోహే = ఇనుము లోహాన్తరతాడ్యమానే = మఱొకయినుపముక్కచేత [సుత్తె మొదలగు

వానిచేత] కొట్టబడినది కాఁగా, తస్యాన్తర్గతవహ్నేః అపి = ఆ మొదటియినుము లోపల వ్యాపించియున్న యగ్నికిగూడ, నిర్ఘాతజం = మఱొక యినుముక చేత కొట్టుటవలనఁ బుట్టినదైన దుఃఖం = బాధ, స్యాత్ కిం = కలుగునదేమి? కలుగ దని భావము.

తా॥ ఇనుమును కోరినరూపమునకు మార్చుటకు కమ్మరి దానిని బాగా కొలిమిలో నెఱ్ఱగాఁ గాఁగునట్లు చేయును. అప్పుడది అగ్ని, తనయందు పూర్తిగా వ్యాపించుటచేత నెఱ్ఱఁగా నగును. అప్పుడు దానిని దిమ్మపైనుంచి కమ్మరి మఱొకసుత్తితో బాగుగా మోదును. ఇనుమును బాగుగాఁ గొట్టును.) ఈసుత్తి దెబ్బలు కాలిన ఇనుమును బాధించి దాని రూపమును మార్చునుగాని, ఆయినుముతోఁ గలిసియున్న యగ్నిని బాధింపలేవు. దెబ్బలవలనిదుఃఖము అగ్నికి రాదు, లేదు. అట్లే కర్తృరూపజీవుని క్రియాకలాపముగాని భోక్తృరూపజీవుని కర్మఫల సుఖదుఃఖములుగాని, జీవసంబంధములే గాని జీవునియం దంతరంతరవ్యాప్తమైన నిత్యజ్యోతియగు పరమాత్మకెట్లును సంబంధింపవు. అనగా కేవలాత్మకు కర్తృత్వభోక్తృత్వములు లేవని సిద్ధాంతము.

ఆవ॥ దీనినే మఱొకయుదాహరణముచేత 2 శ్లోకములలో వివరించుచున్నారు.

నిష్ఠురకుఠారఘాతైః కాష్ఠే సఞ్ఛిద్యమానేఽపి।
అన్తర్వర్తి వహ్నిః కిం ఘాతైశ్ఛిద్యతే తద్వత్॥ 135

తనుసమ్బన్ధా జ్జాతైః సుఖదుఃఖై ర్లిప్యతే నాత్మా।
బ్రూతే శ్రుతిరపి భూయోఽనశ్నన్నన్యోఽభిచాక
శీత్యాది॥ 136

ప్ర: నిష్ఠురఘాతైః, నిష్ఠుర = కఠినములైన వాడియైన క్రూరములైన, కుఠార = గొడ్డలియొక్క, ఘాతైః = దెబ్బలచేత, కాష్ఠే = కట్టెకొయ్య, సఞ్ఛే

ద్యమానే + అపి = బాగుగా చీల్చి వేయఁబడుచున్న దైనప్పటికిని, అన్తర్వర్తీ = కట్టెలోపలనుండు, వహ్నిః = కాష్ఠాగ్ని, ఘాతైః = గొడ్డలిదెబ్బలచేత, ఛేద్యతే కిం = చీల్చివేయఁబడునా యేమి? కొంచె మైనను చీల్చివేయఁబడదు. తద్వత్ = అదే విధముగా, తనుసమ్పన్ధాత్ = శరీరముతో సంబంధించుటవలన, జాతైః = పుట్టినటువంటివైన, సుఖదుఃఖైః = సుఖములచేత దుఃఖములచేత, ఆత్మా = తనువునందు లోలోపలనున్న ఆత్మ, న లిప్యతే = అంటబడఁడు. అతఁడాసుఖదుఃఖములను రవ్వంతయు బొందఁడు. శ్రుతిః అపి = వేదముకూడ, భూయః = విరివిగా, అనేకార్యాయములు, అన్యః = కర్తృభోక్తృరూపజీవున కంటె నితరుఁడై విలక్షణుఁడగు, పరమాత్మ అనశ్నన్ = శరీరవృక్షకర్మఫలములను భుజింపఁకుండ, అభిచాకశీతి = నిర్లిప్తుఁడై చూచుచుండును. ఆది = మొదలైనవి, బ్రూతే = చెప్పుచున్నది.

తా॥ ప్రపంచములో కట్టెలో కూడ కనఁబడకుండ నగ్ని దాగి యున్నది. యజ్ఞములు చేయువారికి పవిత్రమైనయగ్ని కావలెనని, రెండు కట్టెపుల్లలను (అరణులనఁబడువానిని వేగముగా నొకదానితో నొకటి రాపిడిపెట్టుటవలన నగ్నిని పుట్టించి దానితో యజ్ఞహోమాదులు చేసెదరు. ఇట్లు కట్టెలందు దుంగలందు అగ్ని కనబడకుండ లోపలఎల్లప్పుడునున్నది. ఇప్పుడు కట్టెలను కొట్టువాఁడు పెద్దగొడ్డంద్రను దీసికొని గట్టిగా బలముగా కట్టె మొద్దులు పగిలు నట్లు కొట్టును. ఇట్లు మొద్దునెంతను బలముగాఁ నెంతకొట్టినను కట్టెలోపల దాఁగియున్న అగ్నిని ఈగొడ్డలిదెట్టు బాధించుచున్నదా? ఈదెబ్బలవలన నగ్ని యేమియు బాధపడుట లేదు. అట్లే కట్టెవంటిశరీరసంబంధమువలన శరీరాత్మాభిమాని యగు జీవునకు వచ్చినసుఖదుఃఖములు శరీరాంతర్యామియగు పరమాత్మ నేమియు నంటఁజాలవు వికారినిగాఁ జేయలేవు. ముండకోపనిషచ్ఛ్రుతి "అనశ్నన్నన్యో అభిచాకశీతి" రెండవవాఁడు అనఁగాఁ బరమేశ్వరుఁడు ఎట్టికర్తృత్వభోక్తృత్వములులేక కర్మఫలములను గుడువక, శరీరోపాధిజీవునిచేఁతలను సుఖదుఃఖానుభవ

ములను ఊరక చూచుచుండును. ఈమొదలగు విషయమునే చెప్పుచున్నవి. ముండకశ్రుతి "ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే తయో రన్యః పిప్పలం స్వాద్వ త్త్య నశ్నన్నన్యో ఽభిచాకశీతి." ఎప్పుడును కలిసియుండు రెండు పక్షులు (మంచిఱెక్కలు గలవి), సమానమైన పేర్లు కలవి ఒకే వృక్షమును ఆశ్రయించి యున్నవి. అందొకటి విచిత్రమైన (మాధుర్యాది) రుచులుగల ఆచెట్టుఫలములను భక్షించును. రెండవది తాను ఏమియు చేయక, ఏమియుఁ దినక, ఆచేయుచుఁదిను రెండవ దానిని కేవలము చూచుచుఁ గూర్చున్నది.

ఇందు వృక్షము శరీరము. రెండుపక్షులు, జీవాత్మఁ పరమాత్మలు. శరీరియగు జీవాత్మ తాను జేసిన కర్మలయొక్క సుఖదుఃఖరూపవిచిత్రఫలముల ననుభవించుచున్నది. శరీరియగు రెండవది నిర్వికారముగా నిష్క్రియముగా నుండి ఆరెండవదానిని కేవలము చూచుచున్నది. కావున తననిజరూపమైన పరమాత్మ సంసారియగు జీవునివలె సుఖదుఃఖాదు లనుభవింపదు. ఆజీవుఁడును బరమాత్మతత్త్వస్వరూపమును శ్రవణమననాదులచేఁ దెలిసికొని మోక్షమును బొందును. ఎప్పుడును ఆత్మ, కర్తయుభోక్తయు గానే కాఁడు. శరీరముతో తాదాత్మ్యము చెందిన (శరీరమే నే నను కొన్న) స్థితిలోనే జీవుఁడు కర్తయు భోక్తయు నగుచున్నాఁడు.

అవ॥ మఱొకయుదాహరణముతో దీనినే వివరించుచున్నారు. ఆత్మకు సుఖదుఃఖములు లేవని. కావున స్వభావముచేత ఆత్మ అకర్త, అభోక్త యని సారాంశము.

**నిశి వేశ్మని ప్రదీపే దీప్యతి చౌర స్తు విత్త మపహరతి।**
**ఈరయతి వారయతి వా తం దీపః కిం తథాఽఽత్మాఽపి॥ 137**

గేహాన్తే దైవవశా త్కస్మింశ్చి త్సముదితే విపన్నే వా।
దీప స్తుష్య త్యథవా ఖిద్యతి కిం, తద్వ దాత్మాఽపి॥ 138

ప్ర : వేశ్మని=ఇంటియందు, నిశి=రాత్రియందు, ప్రదీపే = బాగుగా వెలుఁగుచున్నదీపము, దీప్యతి=ప్రకాశించుచున్నది కాఁగా, చౌరః తు = దొంగ, (ఆదీపకాంతిముందు ఇంటిలోని) విత్తం = ధనమును, అపహరతి = దొంగిలించును. దీపః=ఆదీపము, తం=ఆదొంగవానిని, ఈరయతి కిం=దొంగిలించుమని ప్రేరేపించుచున్నదా? వా=లేక, వారయతి, కిం = వానిదొంగతనమును మాన్పించుచున్నదా! ( రెంటిని చేయుట లేదు. ) తథా = అదే విధముగా, ఆత్మా అపి = పరమాత్మకూడ ప్రపంచములో జరుగు వ్యవహారములో (పైదీపమువలె) సంబంధము లేనివాఁడు. నిర్వికారః వర్తతే = ఏమియును వికారమును బొందకుండ నుండును. మఱొక యుదాహరణము :-

గేహాన్తే=ఇంటిలోపల, దైవవశాత్ = దైవవశమున, తనప్రయత్నమేమియులేకయే, కస్మింశ్చిత్=ఒకానొకఁడు, సముదితే(సతి) = పుట్టినవాఁడగుచుండఁగా, వా=లేక, ఆఇంటియజమాని విపన్నే(సతి) = ఆపదచెందినవాఁడు, కాఁగా, దీపః = ఇంటిలోనిదీపము, తుష్యతి కిం = సంతోషించుచున్నదా ? అథవా=లేక, ఖిద్యతి కిం=దుఃఖించుచున్నదా ? రెండును చేయదు. తద్వత్ = అదేవిధముగా, ఆత్మా అపి=కేవలాత్మకూడ, కేవలద్రష్టగానే ఉండును. గాని గృహస్థునివలె హర్షశోకములను పొందదు.

తా॥ ఒకయింటిలో దీపము పెద్దగా వెలుఁగుచుండఁగా నొక దొంగ అందు ప్రవేశించి వస్తువులను, దొంగిలించుచున్నాఁడు. ఆతని పాపనికి ప్రేరేపించుట గాని వద్దని మాన్పించుట గాని వెలుఁగుచున్నదీపము చేయదు. అది నిర్వికారముగా నున్నది గదా! అట్లే దొంగవంటి జీవుఁ డొనర్చుపనులతోఁగాని, వానిసుఖదుఃఖరూపకర్మఫలానుభవములతోఁగాని, సాక్షిగాఁ జ్యోతిరూపాత్మ సంబంధింపఁడు. సర్వమును సాక్షిగాఁ జూచుచుండును. అతఁ డేవికారమును బొందఁడు.

అట్లే దీపము వెలుగుచుండగా ఒకయింటిలో దైవవశమున నొకశిశువు జనించినయెడల ఆశిశుజననమునకు దానితలిదండ్రుల వలె దీపము సంతోషించునా? సంతోషింపదు. మఱొకఁడు ఆ యింటిలోఁ జచ్చినయెడల వాని బంధువు లేడ్చిన ట్లాదీపము దుఃఖించునా? అదియెల్లప్పు డొకేరీతిగా నిశ్చింతగా, నిర్వికార ముగా నుండును. అట్లే పరమాత్మయు దేహాభిమానియైన జీవుఁడు పొందునట్లు సుఖదుఃఖములను పొందఁడు. అనఁగా కర్తృత్వ భోక్తృత్వలక్షణములు రెండును అజ్ఞానియగు జీవలక్షణములేగాని, జ్ఞేయమగు ఆత్మలక్షణములు గావని రూఢియైనది. ఇది ముఖ్య మైన ఆత్మబోధవిశేషము. ముముక్షువు ఈయాత్మలక్షణమం దెప్పుడును ప్రమాదపడరా దని హెచ్చరిక.

ఈయాత్మవిలక్షణవిషయమున భగవద్గీతలలో 5వ అధ్యా యమందలి 14వ శ్లోకమందు ప్రమాణవచన మిట్లున్నది.

శ్లో॥ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥ 5వ అ-14 శ్లో.

ప్రభువైన ఆత్మ, తనంతతానుగా ఏప్రాణిని ఈపనిని జేయు మని ప్రేరేపించుట (కర్తృత్వమును) చేయుట లేదు. అట్లే జీవున కీప్సితమములైన రథము, ఘటము (పాత్రాది), మేడలు మిద్దెలు మొదలైన సుఖసాధనవిషయజాలమును, (కర్మములను) సృజించుట లేదు. అట్లే రథాదినిర్మాతకు ఆకర్మఫలముతోడి సంయోగమునుగూడఁ జేయుట లేదు. ఇట్లు దేహియగు ఆత్మ, తనకుఁ దానుగా (స్వతః) ఏకొంచెమైన పనిని చేయుటగాని, ఇత రులచేచేయించుటగాని నిర్వర్తింపని నిష్క్రియుఁడగుచో, ఎవఁడు, చేయుచు చేయించుచు ప్రవర్తించుచున్నవాఁడు? అను ప్రశ్నకు, ప్రవర్తకము ఆత్మగాక, స్వభావ మని సమాధానము.

ఈస్వభావ మననేమి? అవిద్యాలక్షణయగు ప్రకృతి (ఈశ్వరపరాపరప్రకృతులు, దైవీరాక్షస్యాసురీప్రకృతులు అనుపేర్లుగల మాయ)యే,[త్రిగుణములు, త్రిగుణములందే]ప్రవర్తించుచున్నది. అనఁగా ప్రభువగు ఆత్మ లేక పరమాత్మ, తనకుఁ దానుగా నిష్కర్ముఁడేగాని మాయోపాధిస్థుఁడై, ఈశ్వరుఁడుగా, లోకనాథుఁడుగాఁ ప్రవర్తించుచున్నాఁడు. మాయామోక్షణమే- మాయయొక్క అత్యంతాభావగమనమే, ఆత్మజ్ఞానఫలమే- ముక్తి యని సారాంశాత్మబోధ.

## 12. స్వప్రకాశతా ప్రకరణమ్ (స్వప్రకాశతా ప్రకరణము)

అవ॥ ముక్తిసాధనమైన ఆత్మబోధాంగముగా, గతాధ్యాయమందు, ఆత్మకు కర్తృత్వభోక్తృత్వలక్షణమును నిరాకరించి, (నిషేధించి) యీయధ్యాయమందు ఆత్మయొక్క స్వయంప్రకాశతాలక్షణమును నిరూపించుచున్నారు.

**రవిచన్ద్రవహ్నిదీపప్రముఖాః స్వపరప్రకాశాః స్యుః।**
**యద్యపి తథా ప్యమీభిః ప్రకాశ్యతే క్వాపి నైవాత్మా॥ 139**

ప్ర : రవి-ప్రముఖాః, రవి=సూర్యుఁడు, చన్ద్ర=చంద్రుఁడు వహ్ని=అగ్ని, దీప=దీపము, ప్రముఖాః = మొదలైనవి, స్వపరప్రకాశాః = తమ్ము, ఇతరవస్తువులను ప్రకాశింపఁజేయునవి, (ఉన్నట్లు తెల్పునవి) స్యుః=అగును. యద్యపి=అవి యట్లైనను, తథా = అవిధముగా, ఆత్మాఅపి = ఆత్మకూడ అమీభిః=వీనిచేత, క్వ+అపి=ఎక్కడనుకూడ, న ప్రకాశ్యతేఏవ = తెలియఁజేయఁబడుటయే లేదు.

తా॥ ప్రపంచములోని వస్తువులు రెండు రకములు. తమ్ము స్వయముగాఁ దెలియఁజేయునవి, సూర్యుఁడు, దీపము మొదలైనవి, స్వయంప్రకాశము లనఁబడును. ఇతరసహాయములేక తెలియఁబడనివి, గోడ, చెట్టు మొదలైనవి పరప్రకాశ్యములు.

సూర్యుఁడు పగలును, చంద్రుఁడు, అగ్ని, దీపము మొదలైనవి రేయియందును, తమ్మే కాకుండ ఇతరవస్తువులనుగూడ ప్రకాశింపఁజేయు స్వభావము కలవి. కాని ఈసూర్యాదు లేవియు నాత్మను (నన్ను) ప్రకాశింపఁజేయలేవు. ఈవిషయమున గీతలలో 15 అ.లో 6వ శ్లోకార్థము ప్రమాణము.

శ్లో॥ "న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః" గీ 15-6 ఆతేజోరూపమై వైష్ణవమైన ఆత్మస్థానమును (పదమును) సూర్యుఁడు ప్రకాశింపఁజేయ లేఁడు. అట్లే చంద్రుఁడును, అగ్నియును ఆత్మను ప్రకాశింపఁజేయ లేరు.

అవ॥ వస్తుజ్ఞానమునకు ఆత్మప్రకాశత్వమే ముఖ్యమూలకారణ మని తెల్పుచున్నారు.

**చక్షుర్ద్వా రైవ స్యాత్పరాత్మనా భాస మేతేషాం।**
**యద్వా తేఽపి పదార్థా న జ్ఞాయన్తే ఽథ కేవ**
**లాలోకాత్॥ 140**

**తత్రా ప్యక్షిద్వారా సహాయభూతో న చే దాత్మా।**
**నో చే త్స తాంల్లోకే పశ్య త్యన్ధః కథం నార్థాన్॥ 141**

ప్ర : ఏతేషాం = ఈరవిచంద్రాదులయొక్క, భానం = ప్రకాశము, విషయజ్ఞానము, చక్షుర్ద్వారా ఏవ = కన్నుద్వారముననే, పరాత్మనా = చిదాత్మచేతనే, స్యాత్ = కావలయును. యద్వా = ఎందుకనఁగా, తే పదార్థాః అపి = ఆపదార్థములు (రవిచంద్రాగ్నిదీపాదులు) అథ = మఱి, కేవలాలోకాత్ = వానికాంతిమాత్రముచే, న జ్ఞాయన్తే = తెలియఁబడుట లేదు. తత్ర అపి= ఆపదార్థజ్ఞానవిషయమందైనప్పటికిని, ఆత్మా = ఆత్మ, అక్షిద్వారా = కంటిద్వారమున, సహాయభూతః = సహాయము చేయువాఁడు (అగును). న చేత్= కానిచో, తేఽపి పదార్థాః= ఆసూర్యాదిపదార్థములుకూడ, న జ్ఞాయం

తే= తెలియబడుట లేదు. (అని పై శ్లోకమునుండి ఆవృత్తమురావలయుపదము లు.) నోచేత్ = అట్లు కంటిద్వారమునఆత్మసహాయభూతుఁడు కాదేని, ఆలోకే సతి= కాంతికిరణములుండినను, అన్ధః = కండ్లులేని గ్రుడ్డివాఁడు, అర్థాన్ = వస్తువులను, న పశ్యతి= చూచుట లేదుగదా!, కథం= ఇదెట్లు (సంఘటతి= సంభవించుచున్నది?.)

తా॥ స్వపరప్రకాశకములగు వస్తువు లన్నియు, వానికన్న వేఱగు పరాత్మచేతనే, (నా చేతనే) కంటిమార్గమున తెలియఁబడు చున్నవి. కావున పరప్రకాశకసూర్యాది వస్తువులను దెలిసికొను టకు కన్ను అనెడుసాధనముతోఁ బనిచేయు ఆత్మచైతన్యము ప్రధానము. అట్లు కాదేని, గ్రుడ్డివాడు (తానున్నను- ఆత్మయు న్నను) దీపకాంతిముందున్న వస్తువుల నెందుకుఁ జూచుట లేదు? కావున, స్వప్రకాశప్రకాశవస్తుజ్ఞానమునకు, నేత్రేంద్రియసాధన యుక్తమగు ఆత్మయే ప్రధానము.

అవ॥ ఆత్మవస్తుప్రాధాన్యమునే విషయగ్రహణమందు నిరూపించుచు న్నారు.

సత్యాత్మన్యపి కిం నో జ్ఞానం, త చ్చేన్ద్రియాన్తరేణ స్యాత్।
అన్ధే దృక్ప్రతిబన్ధే కరసంబన్ధే పదార్థభానం హి॥ 142

ప్ర : ఆత్మని=ఆత్మ (తాను,) సతి అపి= ఉన్నప్పటికిని, నో జ్ఞానం కిం= పదార్థముల జ్ఞానము గ్రుడ్డివానికి కల్గుట లేదేమి?, తత్ చ= అజ్ఞానము కూడ (ఇతరవస్తువులను దెలిసికొనుట) ఇన్ద్రియాన్తరేణ = మఱొకఇంద్రియముచేత, స్యాత్= కలుగవచ్చును. హి=ఎందుకనఁగా, అన్ధే=గ్రుడ్డివాఁడు, దృక్ప్రతిబన్ధే (సతి)= చూపులేనివాఁ డగుచుండఁగా, కరసంబన్ధే (సతి) = అతడు ఆవస్తువులను తనచేతులతో తాకుట యనువస్తుహస్తసంబంధమున్న దగు చుండఁగా, పదార్థభానం= వస్తువులజ్ఞానము, అవి ఉన్న వని తెలిసికొనుట, (భవతి= అగుచున్నది).

తా॥ ఆత్మకన్న కన్నే ప్రధానమా? కన్ను లేనివో ఆత్మ ఏవిధమునను వస్తువులను దెలిసికొన లేదా? ఆత్మ కంటికంటె వేఱైన ఇంద్రియముల చేత వస్తువులను దెలిసికొనవచ్చును. ఎట్లనఁగా గ్రుడ్డివాడు కంటితో వస్తువులను జూచి తెలిసికొన లేకున్నను చేతులతో స్పృశించి, వాసన చూచి ఇతరేంద్రియముల ద్వారా వస్తువులను దెలిసికొనుచునే యున్నాఁడు. కాబట్టి ఆత్మయే, తానే ముఖ్యముగా ప్రపంచమందలి సర్వవస్తువులను దెలసికొనువాఁడు. కావున ఇట్లాత్మప్రకాశకత్వస్వభావము ధ్రువపఱుపఁబడినది.

అవ॥ సర్వమును దెలిసికొనునది చైతన్యరూపమగు ఆత్మయే. అది దేనిచేతను దెలియఁబడునది కాదు. కాన తన్ను తానే యెఱుంగవలెను. ఆత్మ ఏకము. అద్వయము. కాన సర్వముగా భాసించునది తానే. సర్వమును దెలిసికొనునది, చూచునది తానే. అన్నిఁటికిని మొదట నున్నది తానే. తాను లేకుండ నేమియు నెక్కడ జరుగదు. అని యుపనిషత్తులు చెప్పిన వని చూపుచున్నారు.

**జానాతి యేన సర్వం కేన చ తం వా విజానీయాత్।**
**ఇత్యుపనిషదా ముక్తి ర్బుధ్యత ఆత్మా ఽఽత్మనా**
**తస్మాత్॥ 143**

ప్ర : యేన= (ఎవని) ఏఆత్మచేత, ఎవరుకారణముగా, సర్వం = సర్వమును, జానాతి = తెలిసికొనుచున్నాఁడో, (అనఁగా నెవఁరు సర్వమును దెలిసికొనుచున్నాఁడో) తం= వానిని, కేనవా= మఱి (దేనిచేత,) యేసాధనముచేత, విజానీయాత్= తెలిసికొన శక్యమగును? ఇతి= అని, ఉపనిషదాం =ఉపనిషత్తులయొక్క, ఉక్తిః= వచనము. తస్మాత్= అందుచేత, ఆత్మా= తాను, ఆత్మనా= తనచేతనే, అనఁగా ఆత్మగనే (తృతీయకు అభేదార్థము) బుధ్యతే= తెలిసికొనును. (రెండవది లేనప్పుడు, తెలిసికొనుచున్నచో నిఁకఁ దన్ను తానే తెలిసికొనుచున్నఁ డనియే చెప్పవలెను.)

**తా॥** నిర్విశేషమగు ఏయాత్మ ఈసర్వము నెఱుంగుచున్నదో యాచైతన్యాత్మను ఏయింద్రియసాధనములతో విశేషముగా

తెలియంగ శక్యమగును? శక్యము కాదని భావము. కావున ఆత్మ తన్ను తానే యెఱుంగఁగలదు. ఇతరములచేఁ దెలియఁబడదు. ఇట్లని యుపనిషద్ఘోష. దీనివలన ఆత్మ స్వప్రకాశత్వలక్షణము సిద్ధము. - ఉపనిషత్తులు "ఆత్మా వా ఇదం ఏక ఏవ అగ్ర ఆసీత్ నాన్యత్ కించన మిషత్" (ఐత 1-1). "ఇదంతయు మొదట ఆత్మ యొక్కటిగనే యుండెను. దానికన్న వేఱుగా మఱేమియు ఱెప్పవాల్పు లేదు" అనఁగా మఱొకపదార్థమే లేదు. ఆఆత్మయే యీసర్వము. ప్రత్యక్షముగా తెలిసికొనుట యనుక్రియ జరుగవలె నన్నచో ఉన్నవి అనేకము కావలెను. అప్పుడే ఒకటి మఱొక దానిని చూచుట వినుట మొదలగుక్రియలు జరుగును. లేనిచో జరుగవు. బృహదారణ్యకము మైత్రేయీబ్రాహ్మణములో 2-4-14

"యత్ర హి ద్వైత మివ భవతి, తదితర ఇతరం
జిఘ్రతి, తదితర ఇతరం పశ్యతి, తదితర ఇతరం శృణోతి,
తదితర ఇతర మభివదతి, తదితర ఇతరం మనుతే,
తదితర ఇతరం విజానాతి; యత్ర వా అస్య సర్వ మాత్మై వాऽ
భూ త్తత్కేన కం జిఘ్రేత్, తత్కేన కం పశ్యేత్ తత్కేన కం
శృణుయాత్, తత్కేన క మభివదేత్- తత్కేన కం మన్వీత,
తత్కేన కం విజానీయాత్? యే నేదం సర్వం విజానాతి
తం కేన విజానీయాత్? విజ్ఞాతార మరే కేన విజానీయా దితి"

యాజ్ఞవల్క్యమర్షి తనభార్యయైన మైత్రేయికిఁ జెప్పుచున్నాఁడు. "ఒసే, ద్వైత మని యున్నయెడల, అనఁగా అనేక వస్తువు లున్నయెడల నప్పు డొకఁ డింకొకదానిని (ఒకనిని) వాసన చూచుట జరుగును. ఒకఁడు మఱొకనిని చూచుట జరుగును. ఒకఁడు మఱొకనిని వినుట జరుగును. ఒకఁడు మఱొకనితో మాటాడుట జరుగును. ఒకఁడు మఱొకనిఁ దలఁచుట జరుగును.

ఒకఁడు మఱొకని దెలిసికొనుట జరుగును. (ఇదంతయు నజ్ఞానావస్థ తెలిసికొనుచు నున్న దొక్కటే యని, యది తానే యని తెలియనియవస్థ మఱి జ్ఞానావస్థలో) ఎక్కడ సర్వము ఆత్మయే, అనఁగా నిరవయవనిష్క్రియనిర్వికారచైతన్యస్వరూపము దానే యాయెనో, తనకన్న వేఱేమియు లేనిస్థితిలో నతఁడు ఏసాధనముతో (ఇంద్రియముతో) ఎవనిని వాసనచూచును? దేనితో నెవనిని జూచును? దేనితో నెవనిని వినును? దేనితో నెవనిని మాట్లాడును? దేనితో నెవనిని దలచును? దేనితో నెవనిని దెలిసికొనును? క్రియ జరుగవలె నన్న దానికి (అధిష్ఠానము) శరీరము, కర్త, కరణము (వివిధసాధనములు), ప్రాణచేష్టలు, అనుగ్రాహకదేవతలు అనెడుఐదు వస్తుసామగ్రి యుండవలెను. (గీత 18లో 14శ్లో) అకర్తగా ఉన్నదొక్కటియాత్మయే యైనప్పు డెట్టి క్రియయును జరుగుటకే వీలులేదు. జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము ఏమియు నుండవు. క్రియలేదు ఫలము లేదు. అందువలన కర్త లేఁడు. భోక్త లేఁడు.'' అని స్పష్టముగా నుపనిషద్వాక్యము లున్నవి. 'కాదు కూడదు తెలిసికొనును' అనిచెప్పవలసివచ్చినప్పుడు, ఉన్నవాఁడొక్కఁడే ఆత్ముఁడే గనుక దన్ను దానే తెలిసికొనుచున్నాఁడనవలెను వెనుకటిశ్లోకములో ఆత్మ ఇంద్రియసహాయముతోఁ దెలిసికొను నని చెప్పఁబడినది. అక్కడ ఆత్మయన్నప్పుడు ముఖ్యాత్మప్రతిబింబమగుజీవుఁడు చెప్పఁబడినాఁడు. అది యిందు నిరాకరించుట ముఖ్యాత్మతత్త్వప్రబోధార్థమే. ఇట్లే కేనోపనిషత్తులోఁగూడఁ జెప్పఁబడినది. ''యద్వాచా నభ్యుదితం యేన వాగభ్యుద్యతే। తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే'' కే. 5 ''ఏది వాక్కుచే చెప్పఁబడదో, దేనిశక్తిచేత వాక్కు చెప్పుటకు శక్తిగల దగుచున్నదో, అదే బ్రహ్మము. సర్వో

త్కృష్ట మైనది, అన్నిటకన్న గొప్పది" అని నీవు తెలిసికొనుము. లోకముపాసించుచున్న సోపాధికేశ్వరాది, ఆత్మ కాదు. ఉపాసన క్రియలో తాను (ఉపాసకుఁడు) వేఱు, ఉపాసింపఁబడు పరమేశ్వరుఁడు వేఱు, అనుబుద్ధితో ఉపాసన చేయఁబడును. ఈవిధి భేదయుక్తద్వైతము, అజ్ఞానముతో కూడినది. బ్రహ్మమే ఆత్మయగు నేను. రెండవది లేదు. అందువలన అద్వైతమునందు ఉపాస్య-ఉపాసక-భేదము లేదు. వాక్కు కర్మేంద్రియమున కుదాహరణ. ఇట్లే తక్కినఇంద్రియములకు, లోపలివి, వెలుపలివి, ప్రాణము మొదలైన వానిని గుఱించిన శ్లోకము లున్నవి. కావున ప్రకరణసారాంశముగా ఆత్మలక్షణము ఏకత్వస్వయంప్రకాశత్వమే గాని పరప్రకాశ్యము గాదని తేటతెల్ల మైనది. ఈజ్ఞానమే ముక్తిసాధనము.

## 13. నాదానుసన్ధానప్రకరణమ్

(నాదానుసంధానప్రకరణము)

అవ॥ ఇక్కడ యోగముచేత సమాధిస్థితిని బొందుటను చెప్పుచున్నారు.

**యావత్ క్షణం క్షణార్ధం స్వరూపపరిచిన్తనం క్రియతే।**
**తావ ద్దక్షిణకర్ణే త్వనాహతః శ్రూయతే శబ్దః॥ 144**

ప్ర : యావత్= ఎంతవరకు, క్షణం= క్షణకాలముకాని, క్షణార్ధం= సగముక్షణముకాని, స్వరూపచిన్తనం = తననిజస్వరూపమగుబ్రహ్మమునుగుఱించి (ఆలోచించుట,) ధ్యానించుట, క్రియతే= చేయబడునో, తావత్=అంతవఱకు, దక్షిణకర్ణే, తు= కుడిచెవియందే, అనాహతః= కృత్రిమముగా కొట్టబడునది కానట్టి, శబ్దః= సూక్ష్మధని, శ్రూయతే= వినఁబడును.

తా॥ సాధకుఁడు మనస్సునకు బాహ్యవిషయప్రవృత్తిని పూర్తిగా మాన్పి, అంతర్ముఖుఁడై తనయాత్మస్వరూపమునే, ధ్యానింపవలెను. అట్టిధ్యానము క్షణమో అర్ధక్షణమో అయినను,

అప్పుడతని కోరకవిచిత్రానుభవము కల్గును. అది యతని కుడిచెవి యందద్భుతమైన సూక్ష్మశబ్దము వినవచ్చుట. ఇది అత్యంతమధుర మై ప్రవాహరూప మైనది. అది సాధారణముగా మృదంగము, వీణ మొదలగు సంగీతవాద్యసాధనములను కొట్టుట, తాకుటవలన ఉద్భవించునటువంటి స్థూలశబ్దము కాదు. లోపలనే సహజప్రాణ స్పందనమువలన నేర్పడే నిత్యము సాగుచుండు (యనాహత) సూక్ష్మధ్వని. ఇది పతంజలి మహర్షి చెప్పిన యోగాంగమగు ప్రాణాయామవిశేషమనవచ్చును.

అవ॥ నాదానుసంధానము మనస్సుయొక్క సుస్థితిని, వాసనాశుద్ధిని సూచించు నని చెప్పుచున్నారు.

సిద్ధ్యారమ్భ స్థిరతావిశ్రమవిశ్వాసబీజశుద్ధీనామ్।
ఉపలక్షణం హి మనసః పరమం నాదానుసన్ధానమ్॥ 145

ప్ర : హి = ఎందుకనఁగా, పరమం = శ్రేష్ఠమైన, నాదానుసన్ధానం = (అమనోహరమైన) అనాహతసూక్ష్మశబ్దమునే వినుచుండుట, మనసః = మనస్సు యొక్క, సిద్ధ్యారమ్భ... శుద్ధీనాం, సిద్ధ్యారమ్భ = పరమాత్మయందు లయింపఁ జేయుట అనులక్ష్యము త్వరలో ప్రాప్తింపనున్న దనుశుభసూచనయొక్కయు, స్థిరతా = చాంచల్యమును వీడి (స్థిరత్వము) నిలుకడను పొందుటయొక్కయు విశ్రమ = శాంతిని పొందుటయొక్కయు, విశ్వాస = తానుసరియైన మార్గము నందున్నా ననుగట్టినమ్మకము కల్గుటయొక్కయు, బీజశుద్ధీనాం = తెలియఁబడు చున్న జాగ్రత్కాలమనస్సునకు మూలకారణమైన నిగూఢసంస్కారరాశిలో రాగాది మాలిన్యములు క్రమముగాఁ దొలఁగి, చిత్తము పరిశుద్ధి యగుచుండుట యొక్కయు, ఉపలక్షణమ్ = సూచన అగుచున్నది.

తా॥ చెవియందా సూక్ష్మమధురశబ్దము వినిపించిన దనఁగాఁ దనలక్ష్యము సిద్ధించుట కారంభమగుచున్న దనియు, మనస్సు తనసహజ చాంచల్యమును వీడి స్థైర్యమును పొందుచున్న దనియు,

శాంతిని పొందుచున్నదనియు, తాను సరియైన మార్గమందే యు న్నా ననుగట్టినమ్మకము పెరుఁగుచున్నదనియు, చిత్తశుద్ధిచాల వఱకు కల్గిన దనియు, దెలియఁదగును. ఇవికల్గిననే యటుఁవంటి సూక్ష్మనాహతశబ్దము ధారగావినుట కల్గునని తాత్పర్యము.

అవ॥ అప్పుడు మనస్సునకు గొప్పయానందము కల్గు నని చెప్పుచు న్నారు.

భేరీమృదంగశఙ్ఖాద్యాహతనాదే మనః క్షణం రమతే।
కిం పున రనాహతే ఽస్మి న్మధుమధురే ఽఖణ్డితే స్వచ్ఛే॥
146

ప్ర : మనః= మనస్సు, భేరీమృదంగశంఖాద్యాహతనాదే – భేరీ= భేరి, మృదంగ= మద్దెల, శంఖా= శంఖము. ఆది= మొదలైన (ఢక్క, డమరు, వీణ మొదలైనవి) వాద్యములయొక్క, ఆహతనాదే= కొట్టుటవలనఁ గల్గిన మధురమైన శబ్దమందు క్షణం = వినినపిదపక్షణకాలము, రమతే = ఆ నందమును జెందును. మధుమధురే= తేనెవలెతీయనై (ఇష్టమైన) మధురతర మై అఖిణ్డితే= విడువకుండ సాగివచ్చునట్టిదియు, స్వచ్ఛే = స్వచ్ఛమైనట్టిదియు నగు, అస్మిన్ అనాహతే= ఈస్థూలముగా మీటుట, కొట్టుట లేకుండ పుట్టి మ్రో గుచుండు దివ్యమైన ఈయనాహతసూక్ష్మశబ్దమునందు, (ఆశబ్దము విన్నపుడు కల్గు నానందమునుగూర్చి;) కింపునః (వక్తవ్యమ్)=చెప్పవలసిన దేమున్నది? అనగా నపరిమితానందము కల్గు నని భావము.

తా॥ సాధారణముగా సంగీతవాద్యములగు భేరి, ఢక్క, మద్దెల మొదలగువానిని గొట్టినప్పుడు, మురళివీణవాయులీనము మొదలగువానిని చక్కగా వాయించినప్పుడు కలుగుమృదుమధుర సంగీతము విన్నప్పుడు మనస్సు క్షణకాల మైనను మహానందమును జెంద కుండదు. అట్టిచోఁ దనసాధనసిద్ధించుచున్న దని సూచించు చుఁ దనచెవులలో మృదుమధురతరమై స్వచ్ఛమైన ప్రాణావాయు సంచారజన్యసంగీతరూపమగు అనాహతనాదము ఎడతెగకుండ

వినఁబడినప్పుడు ఆయోగి చెందు పరమానందము వర్ణించుటకు వీలులేనిది. [సంగీతముయొక్క ప్రభావము మనుష్యులనేకాదు శిశువులను పశువులను చివరకు పాములనుగూడ సంతోషపెట్టును. 'శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణీ.' గానముయొక్క స్వారస్యమును, రసమాధుర్యమును పసిబాలుఁడు, పశువు, పాము కూడ (ఎరుగును.) ఆస్వాదింతురు.]

సుభాషితేన గీతేన యువతీనాం చ లీలయా
చేతో న భిద్యతే యస్య స వై ముక్తో ఽథవా పశుః॥

మధురముగాఁ బాడఁబడిన పాటచేతను, యువతులయొక్క విలాసములచేత నెవనిమనస్సు ఆనందముచేఁ గరఁగదో యతఁడు ముక్తుఁడైనను గావలెను, లేదా, పశు వైనను గావలెను.

ఆహతసంగీతమే యట్టిదైన సూక్ష్మమైన యనాహతదివ్యగాన నాదమువలనియానందము వర్ణనాతీతము. ఇది యాత్మయందు మనోలయ మొనర్చుటకు సుకరనిశ్చితమార్గము.

అవ॥ దానినిగుఱించియే యింకను జెప్పుచున్నారు.

చిత్తం విషయోపరమా ద్యథా యథా యాతి నైశ్చల్యమ్।
వేణోరివ దీర్ఘతర స్తథా తథా శ్రూయతే నాదః॥ 147

ప్ర : విషయ + ఉపరమాత్ = ఇంద్రియముల నాకర్షించు విషయభోగములనుండి విరమించుటవలన, చిత్తం = మనస్సు, యథాయథా = ఏవిధముగా, నేవిధముగా, నెంతెంతవఱకు, నైశ్చల్యమ్ = చాంచల్యమును విడిచిపెట్టి స్థిరముగా నుండుటను, యాతి = పొందునో, తథా తథా = ఆవిధముగా నావిధముగా, నంతంతవఱకు, (దానికిఁ దగినట్లు,) వేణోః (నాదః) ఇవ = మురళీధ్వనివలె, దీర్ఘతరః నాదః = ఎడతెగని కడుదీర్ఘమైన నాదము, (గానధ్వని), శ్రూయతే = ఆసాధకునిచే వినబడుచున్నది.

తా॥ సామాన్యమనుష్యునకు తానానందస్వరూపుఁడ నని తెలియదు. ఆనందము తనకు వెలుపలనున్న, విషయములవలన వచ్చు నని అజ్ఞానముచే అనుకొనును. అందువలన మనస్సును ఇంద్రియములను వానిపైపు బంపి వానిని సంపాదింపు మనును. ఆ మనస్సు చెప్పుచేఁతలందుండుటతో సంసారము, శ్రమ, బహుకష్టములు, దుఃఖములు ప్రాప్తవిషయములు నశించుచుండగా మరల మరల సంపాదింపవలె నని యత్నము. జన్మపరంపర సాగును. వానివలన నిత్యానందము రాదని తెలిసికొని, అది తనయందే యున్నదను శ్రుతివాక్యము విని, గ్రహించి, దానిని అనుభవించుటకై బయటికిపోవు ఇంద్రియములను విషయములనుండి మరలించి జీవుఁడు తనవైపు త్రిప్పుకొనును. ఇది యెంతవిరివిగా జరుగునో అతనికంత విరివిగాఁ దనసహజానందము ప్రస్ఫుట మగుచుండును. ఇది యనుభవైకవేద్యము సాధకునిచంచలమైన మనస్సు తుచ్ఛమైన విషయములనుండి మరలి, యేయేవిధముగా నిశ్చలమై తన స్థానమందు నిల్చునో దానికి తగినట్లుగా అతని కాయనాళాంత గానధ్వని మధురముగా మురళీధ్వనివలె ఝంకారము వినబడుచుండును. ఇది యోగమార్గసాధనవిశేషము.

ఆవ॥ యోగికి అనేకవిధములైన విచిత్రానుభవములు కల్గును. విచిత్రమైన సంగీతములను వినుటేకాదు విచిత్రమైన కాంతులను గూడ చూచునని చెప్పుచున్నారు.

నాదాభ్యన్తర్వర్తి జ్యోతి ర్య ద్వర్తతే హి చిరమ్।
తత్ర మనో లీనం చే స్న పునః సంసారబన్ధాయ॥ 148

ప్ర : నాదాభ్యన్తర్వర్తి = ఆసూక్ష్మధ్వనిలోపలవర్తించునదిగా, జ్యోతిః = జ్యోతి (కాంతి), యత్ = ఏది, వర్తతే = కలదో, తత్ర = (అక్కడ,) ఆజ్యోతియందు, మనః = మనస్సు, చిరం = చిరకాలము, లీనం చేత్ = లీనమైన

యెడల, (ఆమనస్సు) సంసారబన్ధాయ= సంసారమను బంధముకొఱకు (జన్మ పరంపరలో పడుటకు,) పునః= తిరిగి, న (భవతి)= అగునది కాదు. (అన గా ముక్త మగుట తథ్యము.)

తా॥ యోగమువలన సాధకుఁడు అనేకచిత్రవిచిత్రానుభవములను బొందును. మధురసూక్ష్మధ్వనిరూపసంగీతము నను సరించి దానిలోపలగా దివ్యజ్యోతి కనఁబడును. మనస్సును దాని యందు చిరకాలము లగ్నము చేసినయెడల నతఁడు మరల సంసారములోఁ బడఁడు. తిరిగి జన్మలెత్తుట, దుఃఖమోహాదులలోఁ బడుట జరుగదు. ఇది చిత్తమును ఆత్మజ్యోతియందు లయము చేయు టగును.

అవ॥ ఈయోగపద్ధతి ప్రాశస్త్యమును వర్ణించుచున్నారు.

**పరమానన్దానుభవా త్సుచిరం నాదానుసన్ధానాత్।**
**శ్రేష్ఠ శ్చిత్తలయో ఽయం స త్స్వన్యలయే ష్వనేకేషు॥**
**149**

ప్ర : అన్య (చిత్త) లయేషు = చిత్తమునులయముచేయుటకు ఇతర మైన ఉపాయములు, (మార్గములు,) అనేకేషు సత్సు= అనేకము లుండఁగా, సుచిరం= అతిదీర్ఘకాలము, నాదానుసన్ధానాత్= తనకు వినఁబడు సూక్ష్మనాహత గాననాదమునందు మనస్సును లగ్నముచేయుటవలనఁ గల్గిన, పరమానన్దానుభవాత్ = పరమానందమును అనుభవించుటకారణముగా, అయం = ఈ, చిత్తలయః =చిత్తము లయముచేయు పద్ధతి, శ్రేష్ఠః= శ్రేష్ఠ మైనది.

తా॥ చిత్తము తన్మయత్వము చెంది ఆత్మయందు లయ మగుటకు శతాధికమార్గములు కలవు అని "విజ్ఞానభైరవతంత్ర" మను యోగశాస్త్రము పేర్కొన్నది. కాని ప్రాణస్పందనమువలన నేర్పడుచు సహజసూక్ష్మమును, శుద్ధమును, మృదుమధురమును, ప్రవాహరూపమగు అనాహతనాదమును మనస్సు సులభతరముగా

స్వీకరించి దానియానందరసాస్వాదమునందు లగ్నమగును. కావున ఇతరయోగతంత్రము లన్నిటికంటె ఈనాదానుసంధానవిధానమే శివసుందరమై కడుశ్రేష్ఠమైన దని శ్రీశంకరులతీర్పు. దీనిం గూడ నతిక్రమించినదై, ధ్వనికాంతిరహితమై పరమగమ్యమగు అద్వితీయబ్రహ్మానుభవమును ఆత్మబోధకార్యమునుగా మఱువరాదు. ఈనాదానుసంధానము మనోలయమునకు పూర్వాంగము, లేదా మార్గ మనియు మఱువరాదు.

## 14. మనోలయప్రకరణమ్ (మనోలయప్రకరణము)

అవ॥ "మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః।" మనుష్యులయొక్క బంధమునకు గాని, మోక్షమునకుగాని మనస్సే కారణము. సర్వమును దెలిసికొను ముఖ్యసాధనము మనస్సే. అది మలినమై బంధకారణమగును. "మనసై వానుద్రష్టవ్యం నేహ నానాస్తి కించన మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి॥" బృ 4-4-19 బ్రహ్మము (ఆత్మ) మనస్సుచేతనే తెలిసికొనఁబడవలెను. బ్రహ్మము ఏకము. ఇక్కడ (నానా,) అనేకత్వము లేదు. అనేక మిక్కడ చూచువాఁడు ఒకమృత్యువు (జన్మము) నుండి మఱొకమృత్యువు (జన్మము) నకుఁ బోవును. బృ 4-4-19 "న చక్షుషా గృహ్యతే నాపి వాచా నాన్యై ర్దేవై స్తపసా కర్మణా వా। జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వ స్తత స్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః. ముం 3-1-8 ఆబ్రహ్మము, (ఆత్మ,) కంటికి కనఁబడదు, వాక్కున కందదు. ఇతరేంద్రియములకు దొరకదు. తపస్సుచేతఁగాని, కర్మ చేతఁగాని అది చిక్కదు. విచారణచేసి పరిశుద్ధమైన మనస్సుగలవాఁడు భాగములులేని ఆయాత్మను ధ్యానించు, చూడఁ గలఁడు. కావున తపస్సు, యోగము, కర్మము, భక్తి మొదలైనవానిచే చిత్తశుద్ధిని బొందినవాఁడు విచారణచేతనే దానిని తెలిసికొన వలయును అప్పుడు మనస్సు పరమానందము బొందును. దానినుండి అది జాఱదు. అని చెప్పుచున్నారు.

**సంసారతాపతప్తం నానాయోనిభ్రమా త్పరిశ్రాన్తమ్।**
**లబ్ధ్వా పరమానన్దమ్ న చలతి చేతః కదా క్వాపి॥ 150**

ప్ర : సంసారతాపతప్తం = సంసారమందలిబహుదుఃఖములచేత మిక్కిలి బాధింపఁబడినదియు, నానాయోనిభ్రమాత్ = అనేకవిధములైన జన్మము లను బొందుటచేత, పరిశ్రాన్తం= మిక్కిలి బడలిక చెందినదియునగు, చేతః = మనస్సు, (పుణ్యపరిపాకము, ఈశ్వరానుగ్రహము వలన విరాగము చెంది సరియైన గురువునొద్ద ఆత్మవిచారణచేసి తత్త్వము తెలిసికొనుటవలన) పరమానన్దం= నాదానుసంధానసిద్ధిరూపమగు శ్రేష్ఠమైన అత్యుత్తమమైన ఆనందమును పొందినదై, తరువాత, కదా = ఎప్పుడును, క్వాపి = ఎక్కడనుకూడ, న చలతి= చలనము చెందదు. (జ్ఞానమునుండి) వచ్చిన యాయానందమునుండి జాఱిపోదు.

తా॥ ఈజీవుఁడు క్రిమికీటకపశుపక్షిమనుష్యాదిజన్మము లనేకము లెత్తి, అనేకవిధములైన సంసారబాధలచే దహింపఁబడినవాఁడై, విరాగముచెంది, శతకోటిజన్మములయందు చేయఁబడిన పుణ్యముచేత నాదానుసంధానరూపయోగసిద్ధినందియు, నాశ్రయించిన, సద్గురుకృపచేత పొందిన ఆత్మానాత్మ వివేకవిజ్ఞానము (విచారము) చేతను శాస్త్రార్థశ్రవణమననాదులచే మాత్రమే తెలియఁదగిన బ్రహ్మమును దానుగాఁ దెలిసికొనగానే సర్వదుఃఖములు పోఁగాఁ బరమానందము చెందును. ఇఁక నాతఁడు దానినుండి యెప్పుడును, ఏపరిస్థితియందును తిరిగి అజ్ఞానములోఁ బడఁడు. ఆస్థితిని వదలఁడు. దానినుండి జాఱఁడు.

అవ॥ అప్పుడు మనస్సు నిశ్చలమైపోవు ననుచున్నారు.

**అద్వైతానన్దభరాత్క్వమిదం కోఽహం చ కః స్యాహమ్।**
**ఇతి మన్థరతాం యాతం యదా తదా మూర్ఛితం చేతః ॥ 151**

ప్ర : అద్వైతానందభరాత్=జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము మొదలగు సర్వభేదములు నశించి, ఉన్నది తానొక్కఁడే యనుఅభయముతో కూడిన పరమమైన

ఆయాసందము మిక్కిలి మిక్కుట మగుటవలన, "కిం ఇదమ్ = ఇదేమిటి? కః అహం = నే నెవఁడను? చ = మఱియు, కస్య అహం = నే నెవరివాఁడను, ఇతి = అని యీవిధముగా శాస్త్రాచార్యోపదేశానుసారముగా ఆత్మస్వరూపస్వభావ సంశోధనమును జేసి, పొందిన వేదాంతసునిశ్చితార్థమందే, యదా = ఎప్పుడు, చేతః = మనస్సు, (కదలకనిలిచి) మన్థరతాం = ఇతరవిషయాదులందు పనిచేయకుండు లయస్థితిని, యాతం = పొందినదగునో, తదా = అప్పుడు, (తత్ = ఆ మనస్సు), మూర్ఛితమ్ = నిర్వ్యాపార మైనది, నిశ్చల మైనది, (భవతి = అగును).

**తా॥** నరుఁడు తాను అద్వయ బ్రహ్మము నని తెలిసికొనుటవలన సర్వశోకము లంతరించి, సర్వత్రిపుటిభేదము లంతరించి, భయము పోయి, పరమానందమును అనుభవించును. ఈ ప్రపంచ మేమిటి, నే నెవఁడను, నేనెవరివాఁడను మొదలగు వితర్కముల వలన జ్ఞానయోగారూఢుఁడై, యుండును. అప్పుడు మన స్సింక చేయవలసినది, పొందవలసినది లేదని గ్రహించినదై నిర్వ్యాపారము, నిశ్చలమును అగును.

అవ॥ అప్పటి మనస్థితిని వర్ణించుచున్నారు.

**చిర మాత్మానుభవా దాత్మాకారం ప్రజాయతే చేతః।**
**సరిదివ సాగరయాతా సముద్రభావం ప్రయా త్యుచ్చైః॥ 152**

ప్ర : సాగరయాతా = సముద్రమును బొందిన, సరిత్ = నది, ఉచ్చైః = సర్వమును (గొప్పదిగా), సముద్రభావం = తానాసముద్రములోఁ గలిసి తననామ రూపములుపోయి సముద్రభావమునే, ప్రయాతి = బాగుగా పొందును. ఆనది వలెనే, చేతః = మనస్సు, చిరం = చిరకాలమభ్యసించిన మననాదులవలన, ఆత్మానుభవాత్ = బ్రహ్మైక్యానుభూతివలన, ఆత్మాకారం = ఆత్మయొక్క స్వరూపమునే (ఆత్మగానే) ప్రజాయతే = పొంది స్థిరముగా నిలుచును.

తా॥ ఒకనది ప్రవహించి చివరకు సముద్రములోఁ గలిసి యిదినది యిదిసముద్రము అని వానిని విడఁదీయ లేనంతగా నైక్యముఁ జెంది సముద్రమే యగును. అట్లే యీమనస్సు చిర కాలము ఆత్మయొక్క మననధ్యానాదులచేత ఆత్మాకారమునే పొందిన దగుచు ఆత్మభావముతోనే మిగులును. ఇది మనస్సునకు ఆత్మయందు పూర్ణముగా లయమైన ఉత్తమస్థితి.

అవ॥ అప్పు డది విషయములను గోర దనుచున్నారు.

**ఆత్మ న్యనుప్రవిష్టం చిత్తం నాపేక్షతే పున ర్విషయాన్।**
**క్షీరా దుద్ధృత మాజ్యం యథా పునః క్షీరతాం న**
**యాతీహ ॥ 153**

ప్ర : యథా = ఎట్లు, క్షీరాత్ = పాలనుండి, ఉద్ధృతం = బయటికిఁ దీయఁబడిన, ఆజ్యం = నేయి, పునః = తిరిగి, క్షీరతాం = పాలుగా మాఱుటను, ఇహ = ఇక్కడ ఈలోకములో, న యాతి = పొందదో, తథా = అట్లే), ఆత్మని = ఆత్మయందు, అనుప్రవిష్టం = ప్రవేశించి తాను పూర్తిగా లయమైన (జ్ఞానమువలన నాత్మాకారమందిన), చిత్తం = మనస్సు, పునః = తిరిగి, విషయాన్ = విషయములను, నఅపేక్షతే = కోరదు.

తా॥ పాలను పెరుఁగు చేసి చిలికి బయటికి తీసిన వెన్నను కరఁగించి తెప్పించిన నేయి, మరల నేవిధముగా వెనుకటి పాలుగా మాఱదో, యట్లే యాత్మను గుఱించి చక్కగా నెఱిఁగి యాత్మాకారమును జెందిన మనస్సు తిరిగి వెనుకటివలెఁ దనకు సుఖము విషయములవలననే వచ్చు నను భ్రాంతిలోఁ బడి విషయ ములను గోరదు. మనోబుద్ధిచిత్తాహంకారవిషయరూపమగు ద్వైతభావము నశించినది. అద్వైతభావమే స్వయంప్రకాశముగా స్థిరమైనది.

అవ॥ ఈమనోలయస్థితినే యింకను విశదీకరించుచున్నారు.

దృష్టౌ ద్రష్టరి దృశ్యే య దనుస్యూతం చ
భానమాత్రం స్యాత్।
తత్రోపక్షీణం చే చ్చిత్తం త న్మూర్ఛితం భవతి ॥ 154

ప్ర : యద్ = ఏది ( ఏయాత్మ ) దృష్టౌ = చూచుటయందును, ద్రష్టరి=చూచువానియందును, దృశ్యే=చూడఁబడుదానియందును, (ఈమూటిని గలిపి త్రిపుటియందురు), అనుస్యూతం=(సూదియందుదారమువలె)ఎడతెగనిదై మూటియందు అనుసరించియున్నదో, చ = మఱియు, భానమాత్రం = ప్రకాశించుజ్ఞానమాత్రమే స్వరూపముగాఁ గలది స్యాత్=అగునో, తత్ర=ఆఏకమైన యాత్మయందు, చిత్తం=మనస్సు, ఉపక్షీణం, చేత్= (క్షయించిన) లయమైన దయినచో, తత్ = ఆమనస్సు, మూర్ఛితం = విషయసేనాదులందు (నిశ్చేష్టమైనది) నిర్వ్యాపారమైనది, భవతి=అగును. (ఇది మనోలయావధి. మోక్షసాధనము.)

తా॥ భేదము లున్నచోటనే మనస్సు పని చేయును. చూచుట (క్రియ) చూచువాఁడు (కర్త) చూడఁబడునది (కర్మము లేక విషయము) అనుసమూటియందు ఒకేచిద్రూపాత్మ నిత్యము ప్రకాశించుచునే యున్నది. మనస్సు, ప్రకాశించు నాత్మను విస్మరించి, భేదరూపత్రిపుటియందే పూర్వము, వ్యవహరించినది. కాని యిప్పుడు జ్ఞానవైరాగ్యములవలన ఆభేదవస్తువులందలి వ్యాపారమును సర్వ ముడిగి, అన్నిటిలోపలి నిత్యప్రకాశైకాత్మయందే లీనమై మనస్సు కూడ ఆత్మభావమునే పొంది ప్రకాశించుచున్నది. ఆత్మాకారమునే దాల్చిన మనస్సునకింక (నకర్తర)చేయవలసినది, పొందవలసినది లేదు. అందువలన నది నిర్వ్యాపారమై ఆత్మయందే లయించి నరునిముక్తిసాధన మగుచున్నది.

అవ॥ పైవిషయమే వివరించి జెప్పుచున్నాఁడు.

యాతి స్వసమ్ముఖత్వం దృఙ్మాత్రం వా యదా తదా భవతి।
దృశ్యద్రష్టృవిభేదో హ్యసంముఖే ఽస్మి న్నైత ద్భవతి ॥ 155

ప్ర : వా=మఱియు, యదా = ఎప్పుడు, చిత్తం = మనస్సు, స్వస మ్ముఖత్వం=విషయాభిముఖముగాక, విమర్శనవివేకముతో, లోపల తన్ను తానే చూచుచుండుటను, యాతి=పొందునో, తదా=అప్పుడు, దృఙ్మాత్రం = తాను తెలిసికొను చైతన్యమాత్రమే, భవతి=అగును. (అప్పుడు త్రిపుటి లేదు. అదే ద్రష్ట. అదే దృశ్యము. అదే దృష్టియు) హి=ఎందువల్ల ననఁగా, అస్మిన్ = ఈమనసు, అసమ్ముఖే = తనవంకే అభిముఖముగా లేని దగుచుండగా (అనగా విషయాభిముఖమైన దగుచుండఁగా) దృశ్యద్రష్టృవిభేదః = చూడఁబడునది, చూచునదిఅను విశేషభేదము, (కల్గుచున్నది) తదా = ఆరెండవస్థితికాలమందు, తద్ = మనస్సు, ఆదృక్కే నభవతి= అగుటలేదు.

తా॥ చిత్తము, తనకు(తో)తానే యెదురెదురుగా నున్నప్పుడు చూచునది చూడఁబడునది అనుభేదములేక, రెండు నొకటియేయై, దృక్కు అనఁగా చూచునది మాత్రమేయై యుండును. అట్లు స్వసమ్ముఖముగాని ఆచిత్తమే, లోకరీతిగా. (ఆత్మకెదురుగా లేనప్పుడే) విషయవిషయిభేదానుభవమునే పొందును. అప్పుడు చిత్తము ఒక్కదృక్కుమాత్రముగా నుండఁజాలదు. ఏకత్వాను భవము పోయి, నానాత్వానుభవము గలదియే యగును. ఈస్థితి ముక్తికి దూరము చేయున దని తాత్పర్యబోధ.

అవ॥ భేదబుద్ధియొక్క ఉత్పత్తి లయములు, ఫలములు సూచించు చున్నారు.

ఏకస్మిన్ దృఙ్మాత్రే త్రేధా ద్రష్టాదికం సముదేతి।
త్రివిధే తస్మిన్ లీనే దృఙ్మాత్రం శిష్యతే పశ్చాత్ ॥ 156

ప్ర : ఏకస్మిన్ = ఒక్కటియేయైన, దృఙ్మాత్రే = అచ్చపుచూపునందే [జ్ఞానాత్మయందే]ద్రష్టాదికం = ద్రష్ట, దృశ్యము, దృష్టి,[చూచువాఁడు, చూడఁబడునది, చూచుట అనగా జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము) అని త్రేధా = మూడు విధములుగా, సముదేతి = బాగుగా కనఁబడుచున్నది; లోకానుభవములో [ఉదయించుచున్నది] తస్మిన్, త్రివిధే = ఈమూడువిధములు లీనే=లీన మైన వగుచుండఁగా, పశ్చాత్=ఆపిమ్మట, లీనమైనానంతరము, దృఙ్మాత్రం = కేవలాత్మ [జ్ఞాత]మాత్రము, శిష్యతే=నిత్యముగా మిగులుచున్నది.

తా॥ బ్రహ్మమైన ఆత్మ నిర్లింగము, నిష్కలము, నిర్విశేషము, నిర్గుణము, నిరాకారము, నిర్వికారము, ఏకము, జ్ఞానమాత్రమే. దానియందే మాయవలన ఈద్రష్ట, దృశ్యము, దృష్టి రూపములో నున్న చిత్రరూపవిశ్వము ఉదయించుచున్నది. ఆసృష్టి కొంతకాలము సాగి పిదప నీమూడువిధములుగానున్న చిత్రరూప విశ్వమంతయు నాబ్రహ్మమునందే లీనమై, చిత్తము కూడ బ్రహ్మభావము పొందును. అప్పుడు తెలిసికొనుజ్ఞానాత్మ మాత్రము మిగులును. ఈమిథ్యావిశ్వచిత్రము పుట్టి, పెరిఁగి, లయించుచున్నట్లు భ్రాంతివలన కనఁబడుచున్నది. కావున ముక్తి సాధనోపకారియగు మనోలయము సాధింపఁదగిన దని హెచ్చరిక.

అవ॥ మనస్సువలననే బంధము సృష్టిమొదలైనవి కల్గుచున్నవి. మనస్సు లయ మైనప్పుడు ఆత్మమాత్రమే మిగులును అని సోదాహరణముగాఁ జెప్పుచున్నారు.

**దర్పణతః ప్రాక్ పశ్చా దస్తి ముఖం ప్రతిముఖం తదా భాతి ।**
**ఆదర్శేఽపి చ నష్టే ముఖ మస్తి ముఖే, తథై వాత్మా ॥157**

ప్ర : దర్పణతః = అద్దమునకు, ప్రాక్ = ముందుభాగమందు, ముఖం=ముఖము, అస్తి=కలదు, తదా = అప్పుడు, ప్రతిముఖం=అద్దములో ముఖరూపమువంటి ప్రతిబింబము, పశ్చాత్ = అద్దమునకు వెనుకభాగమునందు,

భాతి=ప్రకాశించును (కనఁబడును). ఆదర్శే = అద్దము, నష్టేఽపి = నష్టమై పోయినను కూడ ముఖం=ముఖము, ముఖే=అదియున్నస్థానమందే అస్తి= ఉన్నది. (కాని ప్రతిబింబము, అద్దముతోఁబాటుగా) నష్టమైపోయినది, తథా ఏవ=ఆవిధముగనే (ముఖమువలె) ఆత్మా=ప్రత్యగాత్మస్వరూపము, నిర్వికార ముగా సత్యముగా నిల్చియున్నది. అద్దమువంటిచిత్తము లయమైన దగుచుండగా, చిత్తములో ప్రతిబింబభావము లెల్ల నశించుచున్న వని భావము.)

తా॥ అద్ద మున్నను లేకున్నను ముఖ మున్నది. అద్ద మున్నప్పుడు దానిముందున్న ముఖముయొక్క ప్రతిబింబము అద్ద ములో వెనుకభాగమున కనఁబడును. అద్దము పగిలిపోయినచో, ప్రతిబింబము కనఁబడదు. కాని ముఖముమాత్రము ఎప్పటివలెనే యుండును. అట్లే ఆత్మయును సదా యుండును. అద్దమువంటి సంస్కారరాశియగు మనస్సు (చిత్తము) న్నప్పుడు ఆత్మ ప్రతి బింబితచైతన్యముతో జీవరూపము (ప్రపంచాదికమును)భాసించును. కాని మనస్సులయ మైనప్పుడు జీవసంస్కారాదిభేద ప్రపంచాదిక ము ను అదృశ్యమై, ఒక్క ఆత్మయే ఎప్పటియట్లు నిర్వికారమై, ఏకమై, ప్రకాశించుచుండును. అనాత్మరూపచిత్తలయ మొనర్చి, ఆత్మానుభూతిరూపముక్తిని సాధింపవలె నని ప్రకరణ తాత్పర్యము.

## 15. ప్రబోధప్రకరణమ్ (ప్రబోధప్రకరణము)

అవ॥ వెనుకటిప్రకరణములో బంధమోక్షములకుఁ గారణమైన మనస్సు ఆత్మను ధ్యానించుటవలన నాత్మాకారమును బొంది నిర్వ్యాపారియై ఆత్మయందు లయమయ్యె నని చెప్పఁబడినది. ముక్తిసాధనప్రబోధస్వరూపవిశేషాదులను వివ రింపబోవును ముందుగా ఆత్మను తెలిసికొన్నవారికి జగత్తు భాసించునా? భాసిం పదా? భాసించిన నెట్లు భాసించునో చెప్పుచున్నారు.

మాధుర్యం గుడపిండే యత్ తత్తస్యాంశకే ఽణుమాత్రేఽపి।
ఏవం న పృథగ్భావో గుడత్వమధురత్వయో రస్తి॥ 158

అథవా న భిన్నభావః కర్పూరామోదయో రేవమ్।
ఆత్మస్వరూపమనసాం పుంసాం జగ దాత్మతాం యాతి॥ 159

ప్ర: గుడపిండే = బెల్లపుముద్దయందు, యద్ మాధుర్యం = ఏతీయఁదనము, అస్తి = కలదో, తద్ = ఆతీయఁదనము, తస్య = ఆబెల్లపుముద్దయొక్క, అణుమాత్రే = చాలచిన్నదగు అణువంత పరిమాణము గలదగు, అంశకే + అపి = భాగమునందుఁగూడ, అస్తి = కలదు. ఏవం = ఈవిధముగా, అనఁగా, గుడత్వమధురత్వయోః = బెల్లపుఁదనము, తీయఁదనము, అనెడు రెంటికి పృథగ్భావః = వేఱుగ నుండుట, న, అస్తి = లేదు (అనఁగా రెండును ఒకటే, గుడత్వమే మధురత్వము, మధురత్వమే గుడత్వము. గుణము, (ద్రవ్యము) గుణినాశ్రయించియే యుండును. నిరాశ్రయముగా నుండదు. గుణి, గుణములు రెండు వేఱువస్తువులు కావు.)

అథవా = ఆరుచిసంబంధిగాక వాసనసంబంధిగా [మఱొకయుదాహరణ] కర్పూరామోదయోః = గుణియైన కర్పూరమునకును, గుణమైన దానిసువాసనకును, రెంటికి, భిన్నభావః = వేఱుగానుండుట, న అస్తి = లేదు. [కర్పూరము, సువాసన లేకుండ నుండదు. కర్పూరము దానిసహజవాసన రెండును వేఱువస్తువులుకావు. కర్పూరమే యాసువాసన, ఆసువాసనయే కర్పూరము. రెండు నొకేవస్తువు, గుణి, గుణములకు అవినాభావసంబంధము గలదు.] ఏవం = గుడత్వమాధుర్యములు, కర్పూరామోదములు విధముననే, ఆత్మస్వరూపమనసాం = ఆత్మాకారమును పొందినమనస్సుగల, పుంసాం = పురుషులకు జగత్ = ప్రపంచము, ఆత్మతాం = ఆత్మభావమును యాతి = పొందుచున్నది. [ఆత్మాశ్రయమే జగము. జగద్భావము నశించి, ఆత్మభావమే ప్రకాశించు నని తాత్పర్యము.]

తా॥ బెల్లము దాని మాధుర్యము మనకు రెండుగాఁ తోఁచవచ్చును. వానికి వేఱు పేర్లు పెట్టితిమి గనుక. కాని బెల్లములోని ఎంత చిన్నభాగము తీసికొన్నను మాధుర్యము లేకుండ నుండదు, తీపిలేని గుడఖండమే యుండదు. అనగా ఆ రెంటికి ఆధారములు రెండు లేవు, ఒకటే. బెల్లము గుణి; తీపి దానిగుణము. గుణి, గుణములు రెండు భిన్నాశ్రయములు గలవి కావు. గుణియగు ఒకటి లేకుండ గుణమగు రెండవ దుండదు. ఇది రుచివిషయకమైన యుదాహరణము. వాసనసంబంధమైన మఱొక యుదాహరణతో నిరూపించుచున్నారు. కప్పురము, సువాసనలవిచారము. కప్పుర మెంత చిన్నముక్క, (రవ్వంత) తీసి కొన్నను, దానికిని సువాసన తప్పక యుండును. ఆవాసనలేకుండ కర్పూర ముండదు. గుణమగు సువాసనకు, కర్పూరభావమునకు ఆశ్రయమైనది యొకే ద్రవ్యము (వస్తువు) లేక గుణి. అందువలనఁ గర్పూరము, వాసన రెండుభిన్నాశ్రయములు గలవి కావు. ఏకాశ్రయములు. కావున రెండును ఒకటే యనువ్యవహారము. అట్లే ఆత్మాకార మందిన మనస్సుగలవారికి, అనఁగా మనస్సు (చిత్తము) తనపూర్వవాసనాప్రవృత్తులులేక ఆత్మయందే లీనమై పోయి యున్నవారికి, కారణరూపమనస్సుచే కల్పితకార్యరూప మిథ్యా జగమంతయు ఆత్మయందు లీనమైనట్లే, అనఁగా జగద్భావము నశించి, జగత్తునందును ఆత్మభావమే కల్గునని తాత్పర్యము. ఇట్లు సర్వత్ర, అద్వయబ్రహ్మానుభవము గలవా రామహాత్ము లని తాత్పర్యము.

అవ॥ ఆత్మస్వరూపము ఆనంద మని శ్రుతి. "ఆనందో బ్రహ్మ" మఱి, మన స్సాత్మాకారమును బొందినపు డది యాయానందమును గుర్తింప వలెను. నిద్రలో నానందమే యున్నది. కాని యప్పుడు దాని నట్లుగుర్తించు

మనస్సు లేదు. ఈయాత్మానందమును తెలిసి మనస్సు గుర్తింపఁగలదా? అదెప్పు డనినఁ జెప్పుచున్నారు.

యద్భావానుభవః స్యా న్నిద్రాదౌ జాగరస్యాన్తే।
అన్తః స చేత్థ్సిరః స్యాల్లభతే హి తదా ఒద్వయానన్దమ్॥ 160

ప్ర : నిద్రాదౌ= నిద్రవచ్చుటకు సరిగా ముందు, జాగరస్య= మేల్కొనుటయొక్క, అన్తే= సరిగాచివర తర్వాత (జాగ్రద్దశముగిసి నిద్రావస్థ ప్రారంభింపకుండనున్న మధ్యక్షణమందు,) యద్-భావానుభవః = ఏనిష్ప్రపంచానుభవము, స్యాత్ = ఉన్నదో, సః = ఆయనుభవము, అన్తః= చిత్తములోపల, స్థిరః= కదలనిదై, (స్థిరమైనది) స్యాత్‌చేత్= అయినయెడల తదా= అప్పుడు, (సః= ఆత్మయోగి), అద్వయానన్దమ్ = రెండవదిలేని బ్రహ్మానందమును, (సాటిలేనియానందమును,) లభతేహి = పొందుచున్నాడు గదా!

తా॥ సూక్ష్మదృష్టితో గమనింపవలసినవిషయము. స్థూలదృష్టి సాధారణముగా గ్రహింపనంత సూక్ష్మమైనది. జాగ్రవస్థ పోయి, నిద్రావస్థ యింకను ప్రారంభింపకుండ ఉన్నమధ్యక్షణకాలమందు మానవుఁడు తనస్థితిని పరిశీలింపవలెను. జాగ్రదవస్థ అంతమయినది గనుక, దానికి సంబంధించిన రాగద్వేషములు, దుఃఖానుభవము లేవు. నిద్ర యింకను ప్రారంభింప లేదు గనుక తన్నుఁ దానెఱుఁగని అజ్ఞానస్థితి ప్రారంభము కాలేదు. ఆ రెండు సంఘటనలమధ్యక్షణకాలమందు, చిద్రూపాత్మ (ఎఱుక) ఉన్నది. అప్పుడు ఆత్మ, తాను అద్వయానందస్థితిలో నున్నాఁడు. అది నెమ్మదిగా లోలోపల బరిశీలించి, గుర్తించి ఆయనుభవమును అభ్యాసముచేత స్థిరము చేయఁగల్గినచో, నప్పుడు మనుష్యుఁడు తనయద్వయానందము ననుభవించువాఁ డగుచున్నాఁడు. ఇట్లే

యొకచిత్తవృత్తి పోయి మఱొకవృత్తి ప్రారంభింపకముందున్న క్షణమున నిశ్చల, నిర్వికార, సహజానంద మనుభవమునకు వచ్చును. అదే సమాధి. అప్పుడు మన స్సున్నదికాని, నిర్వ్యాపారమై, పూర్ణముగా నాత్మాకారము చెంది యుండును అది త్రిపుటిలేని, ప్రపంచవాసనలేని, ఆనందము.

అవ॥ ఏకము, అద్వితీయము, సచ్చిదానందమగు నాత్మాభిన్నమగు బ్రహ్మమే తానని యెఱింగినప్పటిస్థితిని వర్ణించుచున్నారు

**అతిగమ్భీరే ఽపారే జ్ఞానచిదానన్దసాగరే స్ఫారే।**
**కర్మసమీరణతరలా జీవతరంగావలిః స్ఫురతి॥ 161**

ప్ర : అతిగమ్భీరే= మిక్కిలిలోతైన, అపారే= అంతమగు ఆవలిగట్టు కనఁబడనిదై (అనంతమై,) స్ఫారే = విశాలవ్యాపకమైన, జ్ఞానచిదానన్దసాగరే = సర్వాధిష్ఠానమగు చిదానందరూపపరబ్రహ్మమందు భాసించుచున్నవాఁడును స్వభావసిద్ధసమస్తవిధపరిజ్ఞానమునకు విపులాశ్రయుఁడై నవాఁడగు మాయావిశిష్టేశ్వరుఁ డనెడిజ్ఞానసముద్రమునందు (లేదా మతొకవిధాన్వయము) జ్ఞానరూపనిర్గుణపరబ్రహ్మము నందలి సగుణుఁడగు చిదానందరూపమాయావిశిష్టేశ్వరుఁ డనెడుసముద్రమునందు, కర్మసమీరణతరలా= పూర్వకర్మవాసనలను వాయువులు వీచుటచేత రేచి కదలుచున్నదైన, జీవతరంగావలిః = జీవులనెడి అలలసమూహము, స్ఫురతి= బయలువెడలి కనిపించుచున్నది.

తా॥ ఏకము, అద్వితీయము, సచ్చిదానందము, ఆనంద ఘనము, చిద్ఘనము, శుద్ధనిర్వికారనిరంజననిర్విశేషనిర్గుణనిరాకారాత్మబ్రహ్మనుగుతనయందుభాసించుమయాధీశసర్వజ్ఞుడే యొకసముద్రము. దానియందు అనాదికర్తలపూర్వకర్మవాసన లనెడివాయువుచేత ప్రేరితములై జీవరాసులనెడు అలలసమూహములు లేచినట్లు కనఁబడుచున్నది. ఇదంతయు నాయఘటనాఘటనసమర్థము, అచింత్యము, అనిర్వచనీయము నగుమాయాశక్తి ప్రభావము.

ఆత్మప్రబోధనమగ్రావహనమునకు సంగ్రహరూపమైన కీలకశ్లోక మిది. ప్రసిద్ధరూపకాలంకారముతో సులభముగా బోధించుచున్నది. సర్వాధిష్ఠానమగు నిర్గుణచిదానందరూపపరబ్రహ్మము శుద్ధాత్మ. సర్వనియామకత్వ, సర్వజ్ఞత్వములు స్వభావముగాఁగల సగుణుఁడగు ఈశ్వరుఁని,, కర్మాధీనులు నస్వతంత్రులునగు జీవరాశిని, జీవభోగ్యవిషయమగు సర్వజగత్తును, వానివాని యదార్థస్థితిగతులను సరిగా నెఱింగినగాని సంసారబద్ధజీవునకు ముక్తి లేదు. ఇట్టిసర్వసమన్వయరూపమగు నద్వైతసిద్ధాంత మిందు ప్రతిపాదింపబడినది. నిరుపాధికసత్యజ్ఞానానందరూపము, కేవలాత్మయగునది, పరబ్రహ్మతత్త్వము. ఈపరబ్రహ్మము మూలముగాగల్గి, మాయోపాధికసత్యజ్ఞానానందరూపుఁడు, మాయాజీవప్రపంచముల నన్నింటికి నధీశ్వరుఁడైనది, ఈపరమేశ్వరుఁ డనెడి తత్త్వము. ఈయీశ్వరపరబ్రహ్మతత్త్వములు రెండును (1) అతిగంభీరములు. అనఁగా ఇతరులచే సర్వసమగ్రముగా తెలియఁబడనిస్వభావము గలవి. ఎన్నిశాస్త్రములుచదివి యెంతెంత తెలిసికొన్నను, ఇంకను దెలియనలసిన సంగతులు పెక్కులు మిగులునని భావము. (2) అపారములు- అంతులేనివి, అనంతములు (3) స్ఫారము లైనవి. అనఁగా సర్వవ్యాపకములు అంతటనిండియున్నవి. ఈరెండుతత్త్వములు (ఇవి) లేనిదేశకాలవస్తువులు లేవని తాత్పర్యము.

అతిగంభీరత్వము, (2)అపారత్వము(3)స్ఫారత్వమనుమూఁడు ధర్మములు సర్వజనానుభవసిద్ధమగు జలాదిసముద్రమునకును ఉన్నవి. కావున అద్వయచిదానందబ్రహ్మమందు మాయచే భాసించుచున్న మాయాధీశ్వరుఁడు; ఉపమేయము. సముద్రము ఉపమానము. ఈరెంటికి అభేదవర్ణనము రూపకాలంకారలక్షణము.

అనఁగా పరమేశ్వరసముద్ర మని సమాసము సిద్ధించును. సామాన్యలోకులకు సప్తవిధసముద్రములే ప్రసిద్ధములుగాని ఈశ్వరసముద్ర మంత ప్రసిద్ధము గాదు. అప్రసిద్ధములను, కవి రూపకాంగములుగా చేయవచ్చును. సముద్రము జలాదులకు నిధి, (జలాదినిధి) అనఁగా జలాదులకు విపులాధార మైన దని భావము. సముద్రమునకుఁగల ఈవిపులాధారత్వధర్మమును ప్రకృతమగు సర్వేశ్వరుఁడు తనస్వభావసిద్ధమగు సర్వవిధపరిజ్ఞానమునకు విపులాధారుఁడగుటచే- ఈశ్వరుని జ్ఞానసముద్రుఁ డనవచ్చును. అనఁగా జ్ఞాన (ఈశ్వర) సముద్ర మన్న నమాసము అర్థవంత మగును. కావున అతిగంభీరమును, అపారమును, స్ఫారము నగునది చిదానందబ్రహ్మమునందు ప్రకాశించుచున్న (భాసించుచున్న) స్వాభావికజ్ఞానసముద్రము, ఈశ్వరుఁ డని సిద్ధించినది. నిశ్చల (శాంత) సముద్రమునందు వాయువువీచునో, సముద్రోపరితలమందు, వేర్వేఱుగా భాసించు తరంగములు (అలలు) లేచును. తరంగములు, వేరునామరూపములతో నున్నను వస్తుత్వపరిశీలనకుశలురకు, సముద్రమునకంటె నవి వేరుకా వని వానియైక్య నిశ్చయజ్ఞానము కల్గును. అనాద్యవిద్యాకామకర్మాధీనులు, లోకులగు జీవప్రపంచము. ఈ జీవులకర్మఫలమే వాయువు.(అభేదకరూపకము) ఇట్టికర్మఫలరూపవాయువుచే అటునిటు త్రిప్పఁబడు నానావిధజీవకోటి పైనిరూపితేశ్వరజ్ఞానసముద్రమందు చలించుఅలలసమూహము. విచారణసమర్థశీలురకు, తరంగసముద్రములకువలె, జీవేశ్వరులకు ఏకత్వము సిద్ధించును. జీవునకున్న అవిద్యోపాధియు, ఈశ్వరునకున్న మాయోపాధియు మిథ్యారూపములుగాన,, వీరువవీరినిగూర్చినమిథ్యాజ్ఞానమును, శ్రవణమనననిదిధ్యాసముల చేత నశింపగా,అద్వైతబ్రహ్మచిదానందరూప కేవలాత్మయగు తాను,నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావముతో ప్రకాశించును. ఇది జీవన్ముక్తస్థితి.

ఈగ్రంథమందలి ప్రథమమంగళాచరణశ్లోకమందు చెప్పిన వస్తునిర్దేశము చక్కఁగా సముద్రరూపకముచే కనులకు గట్టినట్లు సంగ్రహముగా ఈశ్లోకమందును, విస్తారముగా ఈప్రకరణమందును నిరూపితము.

శ్రీకృష్ణభగవానుఁడు తనవిభూతిగా "సరసామస్మి సాగరమ్" గీ 10-24 "దేవతలచేఁ ద్రవ్వఁబడిన జలాశయములందు-సాగరమును నేను" అన్నాఁడు. తదనుసారిగా నిచ్చట జ్ఞానచిదానందసాగరే అని ఈశ్వరపరముగా జ్ఞానసాగరపదప్రయోగము. సగరచక్రవర్తిచేఁ భూమికి దేఁబడినదన్న వ్యుత్పత్తియు, వికారిత్వసగుణలక్షణసూచకమై బ్రహ్మమువలె నిర్గుణనిర్వికారము కాదనియు **సూచకము.**

అవ॥ మఱి యీచిత్రవిచిత్రజీవులు, ఈప్రపంచము పరమార్థ సత్యమా ? అన్నప్రశ్నకు జాబుజెప్పుచున్నారు.

ఖరతరకరైః ప్రదీప్తే ఽభ్యుదితే చైతన్యతిగ్మాంశౌ ।
స్ఫురతి మృషైవ సమన్తా దనేకవిధజీవమృగతృష్ణా ॥

**162**

ప్ర : ఖరతరకరైః = మిక్కిలి తీక్ష్ణములైన, (ప్రచండములైన) కిరణములతోడ, ప్రదీప్తే= మిక్కిలిప్రకాశవంతుఁడైన, చైతన్యతిగ్మాంశౌ= జ్ఞానమనెడుసూర్యుఁడు, అభ్యుదితే= ఉదయించి లేచినవాఁడు కాఁగా సమన్తాత్ =అన్నివైపుల (కనఁబడు), అనేకవిధజీవమృగతృష్ణా = అనేకవిధములైన జీవులతోఁగూడిన యీయెండమావి, మృషాఏవ = (అసత్యమే) మిథ్యయే, నిజముగా వస్తువు లేకయే, ఉన్నట్లు దానియాకారాదులు మాత్రము కనఁబడు నదిగా. స్ఫురతి= (తోఁచుచున్నది,) ప్రకటమగుచున్నది.

తా॥ ప్రచండములైన తనకిరణములతో సూర్యుఁ డుదయించి లేచినప్పుడు, **దూరముగా** మనకు ఆకిరణజాలమే అనేక

విధములైన చిత్రవిచిత్రములతోఁగూడిన యొకజలాశయముగా అనఁగా ఎండమావిగా కనఁబడుచున్నది. ఇది లోకానుభవసిద్ధము. కాని యాయెండమావిని సమీపించి చూచినప్పు డది యంత స్థానమై, అది యంతయు నసత్యము, మిథ్య (నీరు) లేకున్నను ఉన్నట్లు కనఁబడినయొకమాయాసృష్టి యని యనుభవమై నిర్ణయింపఁబడు చున్నది. అట్లే సచ్చిదానందబ్రహ్మమైన ప్రత్యగాత్మయం దుదయించి మిక్కిలి ప్రకాశించుచున్న యీశ్వర-రూపజ్ఞానసూర్యుని కిరణములే (మాయావిజృంభణమువలన) అనేకవిధజీవసముదాయముతోఁగూడిన యీప్రపంచము, వాస్తవికముగా లేకున్నను ఉన్నట్లు (భాసించుచున్నది.) గన్పట్టుచున్నది. కాని యథార్థమగు ఆత్మజ్ఞానము కలుగఁగనే యిదంతయు నిజముగా లేదు, (మృగతృష్ణ) ఎండమావి వలె నిజముగా లేని దని ప్రస్ఫుట మగుచున్నది.

అవ॥ అజ్ఞానమువలన నీయెండమావివంటిజగత్తు తనకు గనఁబడుచున్నది. జ్ఞానము రాఁగానే యిదంతయు నంతర్ధాన మగుచున్న దనుచున్నారు.

**అన్త రదృష్టే, యస్మిన్ జగ దిద మారాత్ పరిస్ఫురతి।**
**దృష్టే యస్మిన్ సకృదపి విలీయతే క్వా ప్యసద్రూపమ్ ॥**
**163**

ప్ర : అన్తః = లోపల, (బుద్ధిగుహయందు) యస్మిన్ = ఏ నిర్గుణమైన, సచ్చిదానందరూపమైన ఆత్మ, అదృష్టే = చూడఁబడినది కానప్పుడు, (అనఁగా చూడఁబడనప్పుడు,) ఆరాత్ = దగ్గఱగా, ఇదమ్ జగత్ = ఈప్రపంచము, పరిస్ఫురతి = బాగుగా విజృంభించి కనఁబడుచున్నది. కాని, సకృత్ అపి = ఒకమారైనను, యస్మిన్ = ఏయాత్మస్వరూపము, దృష్టే = చూడఁబడినది కాఁగా, అసద్రూపమ్ = వాస్తవికముగా అసద్రూపమైన సేశ్వరజీవాదిజగత్తంతయు, క్వాపి = ఏప్రదేశమందో, విలీయతే = (విలీనమగుచున్నది) - నాశనమగుచున్నది.

తా॥ నిర్గుణమైన యీయాత్మపదార్థము బుద్ధిచేత తెలియఁబడనప్పుడు, ఈచిత్రవిచిత్రమైన జీవేశ్వరప్రపంచము దగ్గఱగనే యనుభవింపఁబడుచున్నది. (విజృంభించుచున్నది). కాని యొకసారియైనను ఈయాత్మ తెలియబడినదికాఁగా, ఈనానావిధజీవేశ్వరప్రపంచమంతయు లేనిదై ఎందో పూర్తిగా నష్టమై కనఁబడకుండఁ బోవుచున్నది. సత్యాత్మానందానుభూతిమాత్రమే శేషించుచున్నది.

అవ॥ ఆత్మను తెలిసినవానిస్థితిని వర్ణించుచున్నారు,

బాహ్యాభ్యన్తరపూర్ణః పరమానన్దార్ణవే నిమగ్నో యః।
చిర మాప్లుత ఇవ కలశో మహాహ్రదే
జహ్నుతనయాయాః॥ 164

ప్ర : జహ్నుతనయాయాః = గంగానదియొక్క, మహాహ్రదే = గొప్పమడుగునందు, చిరమ్ = చిరకాలము, ఆప్లుతః = పూర్తిగా మునిఁగియున్నదైన, కలశః ఇవ = కలశమువలె, యః = ఎవఁడు పరమానన్దార్ణవే = శ్రేష్ఠమైన యానందమను సముద్రమునందు, నిమగ్నః = మునిఁగినవాఁడగునో, (సః = ఆతఁడు) బాహ్యాభ్యన్తరపూర్ణః = లోపలను వెలుపలను పరమానందముతో నిండినవాఁడు, (ఆవరింపఁబడినవాఁడు) అగును.

తా॥ ఆత్మజ్ఞుఁడు, తాను బ్రహ్మ మని తెలిసికొన్నవాఁడు, లోపల వెలుపల నంతట మహానందముతో నిండియుండి ఆత్మారాముఁడై యుండును. ఏవిధముగా నన్నఁ బరమపవిత్రమైన గంగానదిలోని గొప్పమడుగులో ముంపఁబడిన కుండ, (పాత్ర) లోపల వెలుపల యాపవిత్రజలముతో నింపఁబడియుండును. అట్లే యాత్మజ్ఞుఁడు పరమానందరసపూర్ణుఁడై యుండును. ఆత్మకు జ్ఞానానందములు స్వరూపలక్షణములే గాని భిన్నగుణములు కావని బోధ.

అవ॥ అజీవేశ్వరైక్యసమాధిస్థితి వాసుదేవునినిజస్వరూప మని వివరించుచున్నారు,

పూర్ణాత్పూర్ణతరే పరాత్పరతరే ఽ ప్యజ్ఞాతపారే హరౌ
సంవిత్స్ఫారసుధార్ణవే విరహితే వీచీతరంగాదిభిః,
భాస్వత్కోటివికాసితోజ్జ్వలదిగాకాశప్రకాశే పరే
స్వానన్దైకరసే నిమగ్నమనసాం న త్వం నచాహం
జగత్॥ 165

ప్ర : పూర్ణాత్పూర్ణతరే-పూర్ణాత్ = పూర్ణులైనవారికన్న, పూర్ణతరే = అధికపూర్ణుఁడును పరాత్పరతరే-పరాత్ అపి = ఉన్నతులగు వారికన్న కూడ, పరతరే= మిక్కిలి ఉన్నతమైనవాఁడును, అజ్ఞాతపారే = తెలియఁబడనిఆవలి గట్టులు కలవాఁడును వీచీతరంగాదిభిః= చిన్నవి పెద్దవి యగు అలలు మొదలైనవి (నురుగు), విరహితే = లేనివాఁడును, సంవిత్స్ఫారసుధార్ణవే సంవిత్ = సర్వజ్ఞానముచే, స్ఫార= విశాలమైన, సుధార్ణవే = అమృతసముద్ర మైనవాఁడును, భాస్వ......ప్రకాశే, భాస్వత్, కోటి= [ప్రకాశించుచున్నవారగు], కోటి సంఖ్యగల సూర్యులచేత, వికాసిత = ప్రకాశింపఁజేయఁబడినట్టియు, ఉజ్జ్వల= మిక్కిలి వెలుఁగుచున్నట్టియునగు దిక్ ఆకాశ =దిక్ప్రదేశముయొక్క కాంతివంటి కాంతిమంతుఁడును, స్వానన్దైకరసే = ఒకేవిధమైన ఆత్మానందస్వరూపుఁడును, పరే= శ్రేష్ఠపరబ్రహ్మమైనవాఁడునగు, హరౌ = వాసుదేవపరబ్రహ్మమునందు, నిమగ్నమనసాం= మునిఁగినమనస్సులుగలవారికి, త్వం= నీవు, న= లేదు, అహంచన= మఱియునేనులేదు, జగత్ చ= ప్రపంచమును, న= లేదు.

తా॥ వాసుదేవపరబ్రహ్మము పూర్ణులగు బ్రహ్మాదులకన్న నతిశయించిన పూర్ణుఁడు. గొప్పవారికన్న మిక్కిలిగొప్పవాఁడు. అనఁగా ఆహరి, పరమాత్మ, సాటిలేనివాఁడు, సువిశాల, ప్రబోధసుధాసాగరుఁడు. చిన్న, పెద్ద, అలలు, నురుగు, బుడగలు, మొదలైన జలభేదము లన్నియు నశించిన శాంతసముద్రుఁ

డు. తెలియఁబడని గట్టు గలవాఁడు, అనఁగా అనంతుఁడు. సర్వ
వ్యాపియైన జననమరణరహితస్వభావుఁడు. జ్ఞానామృతపరిపూర్ణుఁ
డు. జ్యోతులకెల్ల జ్యోతియైన స్వయంజ్యోతి. సాటిలేని ప్రకాశా
త్ముఁడు. కోటిసూర్యుల తేజస్సును మించిన తేజస్వి. సర్వేశ్వరుఁ
డును బరమేశ్వరుఁడు నతఁడే. సచ్చిదానందస్వరూపుఁ డా శ్రీకృ
ష్ణపరబ్రహ్మము. ఇట్లని యా శ్రీహరియాథాత్మ్య మెఱింగి దాని
తో నైక్యమంది (అనఁగా అది నేనని తెలిసి) నిర్వికల్పసమాధి
స్థితి ననుభవించిన యాత్మసమ్యగ్జ్ఞానులకు నీవు, నేను, జగత్త నెడి,
అవిద్యాకార్యరూపమైన సర్వభేదరూపమిథ్యాజ్ఞానము, సంపూర్ణ
ముగా నశించును. ఆ బ్రహ్మవిదుఁడు బ్రహ్మమే. "బ్రహ్మవిద్
బ్రహ్మైవ భవతి" అని యుపనిషన్నిర్ణయము. "జ్ఞానీ త్వాత్మైవ
మే మతమ్" గీ 7-18 "జ్ఞాని, నేనే సుమా అతఁడు నాకంటె వే
రైనవాఁడు కాఁడు (అనఁగా మాకిద్దఱకు శబ్దభేదమే గాని అర్థభే
దము లేదు.) ఇది నా నిశ్చయ మని శ్రీకృష్ణభగవత్కంఠోక్తి. ఇట్టి
యాత్మజ్ఞానియే జీవన్ముక్తుఁడు. గ్రంథారంభమందు 5వ శ్లోకము
లో చేసిన ప్రతిజ్ఞ- వైరాగ్యాత్మబోధభక్తిత్రయము ముక్తిసాధన
మని యీ ప్రకరణముతో చక్కగా నిరూపితమైనది. ఆత్మసంవి
త్స్ఫీతసుధార్ణవము, మిథ్యాహంకారాదివిశిష్టజీవజగద్రూపవీచి
తరంగాదిసర్వభేదరహితము, పర (తత్త్వ) బ్రహ్మమగు హరియే
యని యాలంకారిక మృదుమధురభాషలో- జీవన్ముక్తనిత్యసమా
ధినే వర్ణించిరి, లక్ష్యార్థబోధచే సిద్ధించిన జీవేశ్వరైక్యము, బ్రహ్మా
త్మైక్యమే పరమార్థమని వైరాగ్యాత్మబోధభక్తిత్రయపరిపక్వ
సమగ్రస్థితియే ముక్తిరూపమని సిద్ధాంతమైనది. "బ్రహ్మాత్మనా
సంస్థితి ర్ముక్తిః" బ్రహ్మస్వరూపముతో (అనఁగా బ్రహ్మమే
నేను ఇతరము కాదని) ఉన్న నిశ్చయస్థితియే మోక్షము" అని
వివేకచూడామణి రెండవ శ్లోకములోను సిద్ధాంతము చేసియున్నారు.

# 16. ద్విధాభక్తిప్రకరణమ్ (ద్విధాభక్తిప్రకరణము)

అవ॥ ముక్తికి, వైరాగ్యాత్మబోధభక్తిత్రయము అసాధారణకారణ మగుటచే వైరాగ్యహేతుస్వరూపాదులను ప్రధానముగా మొదటిఆఱుప్రకరణములందును, తర్వాత తొమ్మిదిప్రకరణములందును ఆత్మబోధయొక్క స్వరూపస్వభావకార్యాదులను ప్రధానముగా విపులముగా విశదపఱచి, యింక మిగిలినత్రయాంగ మగు భక్తిస్వరూపాదివిశేషములను ప్రధానముగా నాల్గుప్రకరణములలో వర్ణింపఁదలచిరి, ముందుగా సగుణభక్తి, నిర్గుణభక్తి యని భక్తిస్వరూపముయొక్క రెండువిధములలో మొదటిసగుణహరిభక్తిని వివరించుచున్నారు. మఱియుఁ దనభక్తునిగూర్చి శ్రీకృష్ణోక్తి:-

శ్లో॥ ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః।
మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే॥ గీ 13-18

ఇంతవఱకును క్షేత్ర మననేమో, జ్ఞాన మననేమో, జ్ఞేయ మననేమో, నాచే సంగ్రహముగాఁ జెప్పఁబడినవి. నాభక్తుఁడు వీని నిట్లుగా నెఱింగియే నాపరమాత్మభావమును బొందుచున్నాఁడు.

ఇచ్చట యీచెప్పిన మోక్షసాధన మగుసమ్యగ్జ్ఞానమున కధికారి యెవ్వఁడనఁగా మద్భక్తుఁ డని చెప్పుచున్నాఁడు. ఆభక్తలక్షణము లిట్లుండు నని శాంకరభాష్యవివరణము. మద్భక్తుఁ డనఁగా ఈశ్వరుఁడైనట్టియు, సర్వజ్ఞుఁ డైనట్టియు, పరమగురు వైనట్టియు, వాసుదేవుఁడైన నాయందు సమర్పితసర్వాత్మభావుఁడు. అనఁగా దేనిని జూచుచున్నాఁడో, దేనిని వినుచున్నాఁడో, దేనిని స్పర్శించుచున్నాఁడో ఆసర్వమును వాసుదేవుఁ డని (వాసుదేవుఁడే ఈసర్వము నని) ఈవిధమైన గ్రహణశీలబుద్ధి గలవాఁడే నాభక్తుఁడు.

వ్రజస్త్రీ లిట్టి భక్తురాండ్రని వివరింపఁబడును రాఁబోవుగ్రంథభాగములందు.

**చిత్తే సత్త్వోత్పత్తౌ తటిదివ బోధోదయో భవతి।**
**తస్త్యైవ స స్థిరః స్యా ద్యది చిత్తం శుద్ధి ముపయాతి॥** 166

ప్ర : చిత్తే = అంతఃకరణమునందు, సత్త్వ + ఉత్పత్తౌ = రజస్తమో గుణములను జయించి, సత్త్వగుణము, పుట్టి ప్రవర్తింపఁగా, బోధోదయః = జ్ఞానముయొక్క పుట్టుక, తటిత్ + ఇవ = మెఱుపువలె, భవతి = అగును. చిత్తం = మనస్సు, శుద్ధిం = దోషములుపోయి నిర్మలత్వమును, ఉపయాతి యది = పొందినయెడల, తర్హి ఏవ = అప్పుడేసుమా, సః = ఆప్రబోధము, అనఁగా ఆత్మజ్ఞానము, స్థిరః = స్థిరమైనది, స్యాత్ = కాఁగలదు.

తా॥ రజస్తమోగుణములు, క్రియాప్రవృత్తిమోహకారణములై శుద్ధజ్ఞానప్రతిబంధకములగుటచే ఈరెండుగుణములను అణఁగఁద్రొక్కి, సుఃఖశాంతికారకమగు సత్త్వగుణము చిత్తమునందు విజృంభించినప్పుడు, ముముక్షువునకు శాస్త్రాచార్యోపదేశములవలనఁ గలుగు ఆత్మబోధ మెఱుపువలెఁ జక్కగా ప్రకాశించుచు మిక్కిలి సులభముగా పట్టుఁబడును. ఈయాత్మబోధవలన వైరాగ్యము దృఢమై, చిత్తమునందలి రాగద్వేషాదిద్వంద్వరూప మలినములుకూడ క్రమముగాఁ దొలఁగి, చిత్తము నిర్మలమైనప్పుడు ఆయాత్మజ్ఞానము [సుస్థిర మగును] నిలుకడగా నిలుచును. గీతలందు 16వ అధ్యాయాదియందుఁ జెప్పిన సాత్త్వికసంపద లేక దైవీసంపల్లక్షణమును బోలియున్నది.

అవ॥ ఆచిత్తశుద్ధికిఁ గారణము హరిభక్తి యనుచున్నారు,

శుధ్యతి నాన్తరాత్మా కృష్ణపదామ్భోజభక్తిమృతే।
వసనమివ క్షారోదైర్భక్త్యా ప్రక్షాల్యతే చేతః॥ 167

ప్ర : కృష్ణపదామ్భోజభక్తిం ఋతే = శ్రీకృష్ణునియొక్క పాదపద్మములయందు భక్తిలేకుండ, అన్తరాత్మా = అంతఃకరణము (చిత్తము) న శుధ్యతి హి = నిర్మలత్వమును పొందదుగదా! క్షారోదైః = (ఒకవస్త్రమునకు రంగువేయఁగోరినప్పుడు ముందు దానిమాలిన్యమును దొలగించుటకు) ఉప్పునీటిచేత, వసనమ్ = వస్త్రము, శుధ్యతి ఇవ = మాలిన్యమును బాసినట్లు చేతః =

మనస్సు, భక్త్యా = ఇష్టదేవతాభక్తిచేతనే, ప్రక్షాళ్యతే = కడుగఁబడి, శుభ్రము చేయఁబడును.

తా॥ వాసుదేవుని పాదారవిందములందు భక్తి చేయకుండ చిత్తము తనకంటినమాలిన్యమును బోగొట్టుకొనలేదుసుమా! ఒకమలినవస్త్రమును (మన కిష్టము వచ్చినరీతిగా వేయవలె నన్న, దానిని) మొదట (చవుడుమొదలగు) నుప్పునీటిలో నానఁబెట్టి గుంజి, యుతుకుటతో దానిమాలిన్యము పూర్తిగాఁ బోయి వస్త్రము పరిశుద్ధమగును. ఇది లోకానుభవము. అట్లే చిత్తశుద్ధికి సులభతరమైన ఉత్తమోత్తమసాధనము, శ్రీహరిపాదాశ్రయభక్తి.

అవ॥ చిత్తశుద్ధిఫలితమును సోదాహరణముగా నిరూపించుచున్నారు.

**యద్వత్ సమలాదర్శే సుచిరం భస్మాదినా శుద్ధే।**
**ప్రతిఫలతి వక్త్రముచ్చైః శుద్ధే చిత్తే తథా జ్ఞానమ్॥ 168**

ప్ర : సమలాదర్శే = మాలిన్యముతోఁ గూడియున్న యద్దము, భస్మాదినా = భస్మము (నీరు) మొదలైన వానిచే, సుచిరం = తగినంత యెక్కువ కాలము, శుద్ధే = శుభ్రము చేయఁబడఁగా యద్వత్ = ఏవిధముగా, వక్త్రం = మనుష్యునిముఖము, ఉచ్చైః = మిక్కిలి బాగుగా (దానియందు) ప్రతిఫలతి = ప్రతిబింబము నిచ్చునో, తథా = అదే విధముగా, జ్ఞానం = ఆత్మనుగురించిన జ్ఞానము, శుద్ధే = పరిశుద్ధము చేయఁబడిన, (అనగా రాగాదిదోషము లన్నియుఁ దొలఁగింపఁబడిన) చిత్తే = మనస్సునందు, (భవతి) = అగును (ప్రకాశించును,)

తా॥ అద్దము మట్టి, దుమ్ము, చెమురు మొదలైన మాలిన్యములతో నిండి, మనుష్యుఁడు వానిలోఁ దనముఖమును చూచుకొన్నచో దాని ప్రతిబింబము సరిగా కనఁబడదు. కాని ఆయద్దమును మట్టి, విభూతి, నీరు మొదలైనవానిచే తగినంతకాలము రుద్ది, కడిగి, తుడిచి శుభ్రము చేసినచో, నది నిర్మలమై, అతని ముఖముయొక్క ప్రతిబింబమును చక్కగాఁ జూపును. అట్లే

రాగాదిదోషములచే మలినమై మన స్సున్నప్పుడు, అది యాత్మను గుఱించిన చక్కని జ్ఞానముయొక్క కలరూపును, ప్రకాశింపఁజేయ లేదు. కాని యమనియమాదులచేతను హరిభక్తిచేతను దాని యందలి రాగద్వేషాదిమాలిన్యములను తొలఁగించినచో నది పరిశుద్ధమై, యాత్మను గుఱించిన చక్కని సరియైనజ్ఞానమును ప్రతిబింబింపఁ గ్రహింపజేయ సమర్థ మగును.

అవ॥ ఆభక్తిలోని రెండువిధములను జెప్పుచున్నారు.

**జానన్తు తత్ర బీజం హరిభక్త్యా జ్ఞానినో యే స్యుః ।**
**మూర్తం చైవామూర్తం ద్వే ఏవ బ్రహ్మణో రూపే॥ 169**
**ఇత్యుపనిష త్తయో ర్వా ద్వౌ భక్తౌ భగవదుపదిష్టౌ ।**
**క్లేశా దక్లేశా ద్వా ముక్తిః స్యా దేతయో ర్మధ్యే ॥ 170**

ప్ర : యే = ఎవరు, హరిభక్త్యా = షడ్గుణుఁడగు శ్రీకృష్ణభగవానుని యందలి భక్తిచేత జ్ఞానినః = ఆత్మజ్ఞానులు, స్యుః = అగుదురో, (తే = వారు), తత్ర = అక్కడ, ఆయాత్మజ్ఞానప్రాప్తికి, బీజం = మూలకారణమును, జానన్తు = ఎఱుగుదురుగాక! బ్రహ్మణః = బ్రహ్మమునకు, మూర్తం = సాకారము, చ = మఱియు, అమూర్తం = నిరాకారము, ద్వేఏవరూపే = రెండుమాత్రమే రూపములు, (భవతః = కలవు) ఇతి = అని, ఉపనిషద్ = ఉపనిషత్తు (వదతి = చెప్పుచున్నది) తయోః వా = ఆసాకారనిరాకారములగు రెండురూపములయొక్కయు, సాకారబ్రహ్మభక్తులనియు, నిరాకారబ్రహ్మభక్తులనియు రెండువిధములైన భక్తులు, భగవదుపదిష్టౌ = భగవానుఁడగు శ్రీకృష్ణునిచేత భగవద్గీతలందు, నిర్దేశింపఁబడిరి. తయోః మధ్యే = ఆరెండురకములైన భక్తులకు (సంబంధించి) ముక్తిః = మోక్షము, క్లేశాద్వా = శ్రమవలనగాని, అక్లేశాత్ = అల్పశ్రమచే గాని సులభముగాగాని, (భవతి) = అగును.

తా॥ శ్రీహరి నుపాసించి, సేవించి జ్ఞానులైనవారు, వారి జ్ఞానసిద్ధికి మూలకారణ మెఱుఁగుదురు. అదెట్టిదో వివరించుచున్నారు. "బ్రహ్మమునకు సాకారమని, నిరాకారమని రెండు

విధములగు రూపములు కలవు". అని ఉపనిషత్తులు చెప్పుచు న్నవి, వాని ననుసరించి భక్తులుకూడ సాకార (సగుణ) బ్రహ్మ భక్తులనియు నిరాకార (నిర్గుణ) బ్రహ్మభక్తులనియు రెండువిధము లుగా నున్నారని భగవద్గీతలో భగవానుఁడైన, శ్రీకృష్ణుఁడు చెప్పియున్నాఁడు. అందు నిరాకారబ్రహ్మభక్తివలనగలుగు ముక్తి, ఎక్కునక్రమతోఁకూడి పొందఁబడునది. రెండవదగు సగుణబ్రహ్మ భక్తి సహజపరిణామసిద్ధమైన దగుటవలన ఈ భక్తిమార్గము తక్కున క్రమతో ముక్తిని జేర్చును.

ఉపనిషత్తులు - 'ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తం చైవా వా మూర్తంచ' బృ 2.3.1

బ్రహ్మమునకు రూపములు మూర్త మని యమూర్త మని రెండు. అవియే విశేషము, నిర్విశేషము అనియు, సగుణము, నిర్గుణము అనియు, సాకారము, నిరాకారము అనియు, స్థూలము సూక్ష్మమనియు చెప్పబడుచున్నవి. భగవద్గీతలలో విశ్వరూపదర్శ నానంతరము అర్జునుఁడు శ్రీకృష్ణభగవానుని, సగుణుఁడవైన విశ్వరూపవిశ్వేశ్వరుఁడగు నిన్ను ఉపాసించు నిరంతరధ్యాన యోగులగువారందును, నీకంటె వేఱై నిర్గుణనిరాకారుఁడగు అక్షర పరబ్రహ్మము నుపాసించు నిరంతధ్యానయోగులగు భక్తులందును యోగవిత్తము లెవరని తెలిసికొనుటకై ప్రశ్నించెను. కరుణా మయుఁడగు శ్రీకృష్ణజగద్గురువులయొక్క సమాధాన మిట్లున్నది. (12అ 5 శ్లో)

శ్లో॥ క్లేశో౽ధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్।

అవ్యక్తాహి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే॥ గీ 12-5

అర్జునునివంటి దేహాభిమానముగల భక్తజనులు, ఇంద్రియగోచ రమై, విశ్వరూపసహితమై, నిత్యముగా సత్త్వగుణ (మాయ)

ముపాధిగాగల సగుణబ్రహ్మమగు సర్వేశ్వర శ్రీకృష్ణమూర్తియే గమ్యముగను, అనన్యధ్యేయముగను నిశ్చయించి, వ్యక్తమైన పరమేశ్వరమూర్తియందే శ్రద్ధతో నిరంతరధ్యానకర్మాసక్తచిత్తులగుదురేని, జీవితాంతమువఱకు వారికిఁ గల్గు కష్ట మధికమే. ఇట్టి భక్తులగు యోగులు, మరణానంతరము సగుణరూపసర్వేశ్వరుని తప్పక చేరుదురు. సుఖింతురు. కాని ఈదేహాభిమానసహితులగు భక్తజనులే ఇంద్రియగోచరముగాక రూపాదిరహితమై నిత్యమవ్యక్తముగనే యుండు నిర్గుణబ్రహ్మమే గమ్యమును అనన్యధ్యేయము నని నిశ్చయించి ఆయవ్యక్తాక్షరబ్రహ్మమందే శ్రద్ధతో నిరంతర ధ్యానచిత్తు లగుదురేని, ఈయుపాసనకత్యవసరమైన దేహాభిమానపరిత్యాగముకొఱకు వారికిఁ గల్గు కష్టము అధికతరము. కావున వారికి సాధారణముగా దుఃఖమే ఫలించును. ఆనందసిద్ధి రాదు కాని దేహాభిమానరహితులగు సమజ్ఞానులు జీవించి యుండగనే బ్రహ్మప్రాప్తిని జెంది సుఖింతురు. కావున ఇచ్చట శ్రీకృష్ణుఁడు చెప్పిన యధిక క్లేశవిషయము, అధికతరక్లేశవిషయము నని క్లేశతారతమ్యము చెప్పినది పరమార్థదర్శులగు జ్ఞానులవిషయము కానేకాదు. అవిద్యాకార్యమగు దేహాభిమానము గల్గు విశ్వరూపవిశ్వేశ్వరభక్తుల విషయమని వివేకసూక్ష్మము. కావున అవిద్యావంతులై దేహాభిమానులగు భక్తిపరులకు ఈశ్వరరూపసగుణబ్రహ్మమునందే అధికారమని ఆభక్తియే వారికి సులువుగా క్రమముక్తి నిచ్చునదనియు నిర్ణయములు.

అవ॥ ఆరెండువిధములభక్తినే వివరించుచున్నారు.

స్థూలా సూక్ష్మా చేతి ద్వేధా హరిభక్తి రుద్దిష్టా।
ప్రారమ్భే స్థూలా స్యా త్సూక్ష్మా తస్యాః సకాశాచ్చ ॥ 171

ప్ర : హరిభక్తిః=శ్రీకృష్ణునందలిభక్తి, స్థూలాచ=స్థూల మైనదియును సూక్ష్మా=సూక్ష్మ మైనదియును ఇతి = అని, ద్వేధా = రెండువిధములుగా, ఉద్దిష్టా=ఉద్దేశింపఁబడినది. [చెప్పఁబడినది] ప్రారమ్భే = మొదట, [అహరి భక్తి] స్థూలా=స్థూల మైనది, స్యాత్ = కావచ్చును. తస్యాః సకాశాత్ = ఆ స్థూలస్థితినుండి, సూక్ష్మాచ=సూక్ష్మ మైనదియును, భవేత్=కాఁగలదు.

తా॥ శ్రీకృష్ణునియందలి భక్తి స్థూలమని, సూక్ష్మమని రెండువిధములుగా నున్నది. ప్రారంభములో నాభక్తి స్థూలముగా నుండి, క్రమముగా సూక్ష్మరూపిణిగా బరిణమించును.

అవ॥ సంసారమోక్షార్థమైన దైవసంపల్లక్షణమగు ఆస్థూలభక్తిస్వరూప విధానమును ముందు వివరించుచున్నారు.

స్వాశ్రమధర్మాచరణం కృష్ణప్రతిమార్చనోత్సవః నిత్యమ్।
వివిధోపచారకరణై ర్హరిదాసైః సంగమః శశ్వత్॥ 172

కృష్ణకథాశ్రవణే మహోత్సాహః సత్యవాదశ్చ।
పరయువతౌ ద్రవిణే వా పరాపవాదే పరాఙ్ముఖతా॥ 173

గ్రామ్యకథా సూద్వేగః సుతీర్థగమనేషు తాత్పర్యమ్।
యదుపతికథావియోగే వ్యర్థం గత మాయు రితి చిన్తా॥ 174

ఏవం కుర్వతి భక్తిం కృష్ణకథానుగ్రహోత్పన్నా।
సముదేతి సూక్ష్మభక్తి ర్యస్యాం హరి రన్త రావిశతి॥ 175

ప్ర : (స్థూలభక్తిలక్షణములు:) నిత్యం = ప్రతిదినమును, స్వాశ్రమ ధర్మాచరణం, స్వ = తనయొక్క, ఆశ్రమ = ఆశ్రమముయొక్క, అనఁగా

బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సంన్యాసాశ్రమములలో, తా నేయాశ్రమములో నుండెనో దానికి సంబంధించినదైన, ధర్మ + ఆచరణమ్ = శ్రుతిస్మృతులు చెప్పినధర్మములను (ఆచరించుట) చేయుటయు, వివిధోపచారకరణైః, వివిధ = అనేకవిధములైన, ఉపచార = ఆవాహనము, ఆసన మిచ్చుట, మొదలగు నుపచారములను, కరణైః = చేయుటతో (సాధనములతో), కృష్ణప్రతిమార్చనం = శ్రీకృష్ణుని (ప్రతిమను,) విగ్రహమును పూజించుటయు, హరిదాసైః = హరిభక్తులతో, శశ్వత్ = ఎల్లప్పుడు, సంగమః = కలసిమెలసి యుండుటయు, కృష్ణకథాశ్రవణే = శ్రీకృష్ణునిమాహాత్మ్యమును దెల్పు కథలను, మఱిమఱి వినుటయందు మహోత్సాహః = గొప్పపూనికయు, సత్యవాదః, చ = నిజము చెప్పుటయును, పరయువతౌ వా = ఇతరులయౌవనవతులగు భార్యలయందును, ద్రవిణే = ధనమునందును, పరాపవాదే = ఇతరులను గూర్చిన దూషణమునందు, పరాఙ్ముఖతా = (వైముఖ్యము,) ఇష్టపడకుండుటయు; గ్రామ్యకథాసు = ఏవగింపు కల్గించు నీచమైన లోకాభిరామాయణము కథలు వినుటయందు, ఉద్వేగః = (జుగుప్స, అసహ్యము,) అట్టిపనికిమాలినకథలను అసహ్యించుకొనుటయు, సుతీర్థగమనేషు = మంచితీర్థములను దర్శించుట, అచటస్నానాదులు చేయుట మొదలగువానియందు, తాత్పర్యం = అధికముగా నిష్టము కల్గియుండుటయు, ఆయుః = తనయొక్క యాయువు, యదుపతికథావియోగే = యదువంశనాథుఁడగు శ్రీకృష్ణునికథలు వినకుండ, వ్యర్థంగతం = వృథాగా పోయిన దని, (దుర్వ్యయ మైనదని), చిన్తా = విచారమును, ఏవం = ఈవిధముగా, భక్తిం = శ్రీకృష్ణభగవానునియందు స్థూలభక్తిని, కుర్వతి = శ్రద్ధగా చేయుచున్న వానియందు, సూక్ష్మభక్తిః = సూక్ష్మమానసికభక్తి, కృష్ణకథానుగ్రహోత్పన్నా = శ్రీకృష్ణునిదయవలనను వానికథలను తఱచుగా వినుచుండుటవలనను, సముదేతి = చక్కఁగాఁ బుట్టుచున్నది. యస్యాం [సత్యాం] = ఏసూక్ష్మభక్తి కల్గినదగుచుండఁగా హరి = ఆశ్రీకృష్ణుఁడే, అన్తః = ఆభక్తునిమనస్సులోపల, ఆవిశతి = [ఆవేశించును], అంతటనిండియుండును.

తా॥ ముమ్ముందుగా సాధకుఁడు శ్రీకృష్ణపరమేశ్వరునియందు స్థూలభక్తిని నిత్యము పెంపొందించుకొనవలెను. దానిలక్షణములు వానివిధములిట్లు కొన్ని చెప్పబడినవి. మొదటిది, భక్తుఁడు బ్రహ్మ

ప్ర : స్మృతిసత్పురాణవాక్యైః = భారతాదిస్మృతులు, భాగవతాదిపురాణములు చెప్పినప్రమాణవాక్యములచేత, యథాశ్రుతాయాం = తానువినినలక్షణములు కల్గిన, హరేః = శ్రీకృష్ణునియొక్క, మూర్తౌ = రూపమునందు, మానసపూజాభ్యాసః = పత్రపుష్పాదులతోడ, బాహ్యవిగ్రహముతోడ అపేక్షలేకయే మనస్సునందే పూజించునేర్పు నభ్యసించుటయు, విజననివాసే = [ఏకాంతముగా] ఒంటరిగా, నుండుటయందు, తాత్పర్యమ్ అపి = మిక్కిలియిష్టమును (గల్గును.)

తా॥ ఇదివఱకు స్థూలభక్తితో పూలు, అగరువత్తులు, కర్పూరము మొదలైనవి తెచ్చి, తనయెదుట శ్రీకృష్ణునిప్రతిమను బెట్టుకొని ఆవాహనాద్యుపచారములచేతఁ బూజించెడివాఁడు. ఇప్పు డట్లుగాక ఆబాహ్యద్రవ్యాపేక్ష లేకయే, మనస్సునందే యాశ్రీకృష్ణమూర్తిసన్నిధి నెలకొల్పుకొని పూజించునభ్యాసము మొదలిడినాఁడు. మనస్సులో నిల్పిన సచ్చైతన్యమూర్తి యెట్టిదనిన, దాను భారతాదిస్మృతులందు భాగవతాదిపురాణములందు వర్ణింపబడగా విన్న పీతాంబరుఁడు, శ్రీవత్సవక్షుఁడు, వనమాలాధారి, మురళీగానతత్పరుఁడు, జ్ఞానదయాసింధువు, గోగోపగోపీజనపాలనాసక్తుఁడు భక్తవత్సలుఁడు, ముక్తిప్రదాత మొదలగు లక్షణములుగలవాఁడు. కన్నులుమూసికొన్నను వానికిట్టి చూపునందుఁ గన్పడును. ఇదివరకు హరిదాసులతోఁ గలిసి యర్చాదులు చేయుటయందు దాసక్తి యుండెడిది. ఇప్పుడేకాంతముగా, ఆబుద్ధిసుఁడగు శ్రీకృష్ణభగవన్మధురమూర్తియొక్క ధ్యానమందు సామీప్యసాహచర్యమందు మహానందము ఇష్టము నలవడును.

సత్యం సమస్తజన్తుషు కృష్ణస్యావస్థితే ర్జ్ఞానమ్।
అద్రోహో భూతగణే తత స్తు భూతానుకమ్పా స్యాత్॥ 177

చర్యగృహస్థవానప్రస్థసన్న్యాసాశ్రమములు నాల్గింటిలోఁ దా నే యాశ్రమమం దున్నాఁడో, ఆయాశ్రమమునకు శాస్త్రము చెప్పిననిత్యధర్మవిధులను చక్కఁగా నాచరించుట. నిషిద్ధములైన పనులను జేయకుండుట. ఇది ముఖ్యమైన తపస్సు, రెండవది ప్రతి దినము శ్రీకృష్ణుని విగ్రహమును షోడశోపచారములతోఁ బూజించుట. మూడవది యెల్లప్పుడు సత్పురుషులగు హరిదాసులతో [కలసిమెలసిప్రవర్తించుట]. నాల్గవది సర్వదా శ్రీకృష్ణుని మహిమలు వర్ణించుకథలను వినుటయందు పరమోత్సాహము కల్గియుండుట. అయిదవది సత్యభాషణవ్రతము. ఆఱవది పరసుందరులయందును, పరధనాపహరణమందు, పరులనిందించుటయందును వైష మొగమై వానిజోలికిఁ బోకుండుట. ఏడవది పరిమాలినకథలు వినుట (కసహ్యము,) కు రోఁత. మంచిమంచి కాశీరామేశ్వరాది పుణ్యతీర్థములను సేవించుటయందుఁ బ్రీతి. అనఁగా అచట స్నానాదులు చేసి క్షేత్రదైవతమును ప్రాజ్ఞులను బూజించుటయం దాసక్తి, మొదలైన ప్రవర్తనము. ఎనిమిదవది "అయ్యో! నాజీవితకాల మెంతయో పవిత్రమైన శ్రీకృష్ణగాథలు వినకుండ వృథా యైనదే యనుపరితాపము. ఇట్లు స్థూలభక్తిలక్షణములుగల పవిత్రప్రవర్తనమువలన. శ్రీకృష్ణునిదయవలనను, వానికథాశ్రవణాది పుణ్యవిశేషముచేతను. ఆభక్తునియందు సూక్ష్మభక్తి పుట్టి పెరుగును. అప్పుడు ఈభక్తునిహృదయకుహరమందంతట శ్రీహరియే స్థిరనివాస మేర్పఱచుకొనును.

అవ॥ సూక్ష్మభక్తిలక్షణములను విపులముగా ప్రకరణాంతము వర్ణించుచున్నారు.

**స్మృతి సత్పురాణ వాక్యైర్యథాశ్రుతాయాం హరేర్మూర్తౌ॥**
**మానసపూజాభ్యాసో విజననివాసేఽపి తాత్పర్యమ్॥ 176**

ప్ర : సమస్తజన్తుషు = సర్వప్రాణులందు, కృష్ణస్య = శ్రీకృష్ణపరమాత్మయొక్క, అవస్థితేః = వసించియుండుటలో, సత్యం, జ్ఞానమ్ = సత్యమైన జ్ఞానము, భూతగణే = జీవసముదాయమందు, అద్రోహః = హింసమానుట, తతః తు = దానినుండియే, భూతానుకమ్పా = సర్వజీవులయందు [భూతదయ] దయ, స్యాత్ = కలుగఁగలదు.

తా॥ పైసూక్ష్మభక్తివలన సాధకునకు సమస్తజీవులయందుఁ బరమేశ్వరుఁ డున్నాఁడు అనఁగా శ్రీకృష్ణభగవానుఁడు సర్వవ్యాపి, సర్వసాక్షి, సర్వరక్షకుఁడు, సర్వేశరణ్యుఁడు అను గొప్పసత్యము తెలియును. ఈయీశ్వరతత్త్వజ్ఞానమువలన తోడి జీవులకు అపకారము చేయఁగూడదను బుద్ధియు, ఉపకారము చేయవలయు ననుబుద్ధియు, దానివలన సర్వప్రాణులయం దపారమైన సజీవమైన దయయును గల్గును. సర్వమునందు శ్రీకృష్ణసాన్నిధ్యము లభ్య మగును.

**ప్రమితయదృచ్ఛాలాభే సన్తుష్టి ర్దారపుత్రాదౌ ।**
**మమతాశూన్యత్వ మతో నిరహంకారత్వ మక్రోధః ॥ 178**

ప్రమితయదృచ్ఛాలాభే - ప్రమిత = మిక్కిలిమితముగా, తక్కువగానైనను, యదృచ్ఛా = తానాశింపకుండ, ప్రయత్నింపకుండ, దానంతట దేవచ్చిన, లాభే = లాభమందు, సన్తుష్టిః = మిక్కిలి తృప్తియును, దారపుత్రాదౌ = భార్య కుమారులు మొదలగువారి యందు, మమతాశూన్యత్వమ్ = వీరు నావారు, ఇవి నావి యనుభావము లేకుండుటయును, నిరహఙ్కారత్వమ్ = దేహాదులందు, జీవితమందు అహంబుద్ధి, [గర్వము] లేకుండుటయును, [అహంమమతలు పోవుటయు,] అక్రోధః = కోపములేకుండుటయును (కల్గును.)

తా॥ తనప్రయత్నము లేకుండ నెంతతక్కువ లభించినను నది దైవదత్తమనియు కావున దానితోనే తృప్తి కల్గి యుండుటయు, తనకు మిక్కిలి ప్రేమపాత్రులగు భార్యాపుత్రాదులయందు

వీరు నావారు ఇది నాది అనుభావము లేకుండుటయు, అటులనే దేహాదులందును సహ-భానము (గర్వము) లేకుండుటయును, చిత్తమునందు కామక్రోధనులు లేకుండుటయు (గల్గును).

మృదుభాషితా ప్రసాదో నిజనిన్దాయాం స్తుతౌ సమతా,
సుఖదుఃఖశీతలోష్ణద్వంద్వసహిష్ణుత్వ మాపదో న
భయమ్॥ 179

ప్ర : మృదుభాషితా= వాక్కు పరుషముగాఁగాక ప్రీతికరము (మృదువు)గా నుండుటయు, ప్రసాదః= చిత్తము నిర్మలముగా శాంతముగా నుండుటయు, నిజనిన్దాయాం= తన్ను నిందించినప్పుడును, స్తుతౌ = స్తుతించినప్పుడును, సమతా=సమముగా నుండుట, సుఖదుఃఖశీతలోష్ణద్వంద్వసహిష్ణుత్వమ్= సుఖదుఃఖములు, శీతోష్ణములు మొదలగు [మానావమానములు] ద్వంద్వముల నోర్చుకొనుశీలము కల్గియుండుట, ఆపదః= ఆపదవలన, న భయమ్=భయము లేకుండుట.

తా॥ అతఁడు పరుషముగా మాట్లాడఁడు. మృదుమధురముగా మాట్లాడును. మనస్సూచకమగు ముఖ మతిప్రసన్నముగా నుండును. తన్ను నిందించువారియెడలఁ గోపముగాని, మెచ్చుకొనువారియందు మక్కువగాని కల్గి యుండఁడు. అనగా నిందాస్తుతు లతనికి మనోవికారములను గల్గింపవు. సుఖము, దుఃఖము, చలి, వేడిమి, మానము, అవమానము మొదలగు ద్వంద్వములను నిర్వికారముగా నోర్చుకొనఁ గల్గును. ఆపదలు వచ్చినను తొణకఁడు. తా నేమో యైపోవుదు నని భయపడఁడు.

నిద్రాహారవిహారే ష్వనాదరః సఙ్గరాహిత్యమ్।
వచనే చాసపకాశః కృష్ణస్మరణేన శాశ్వతీ శాన్తిః॥ 180

ప్ర : నిద్రాహారవిహారేషు= నిద్రయందును, భోజనమునందును విహారము క్రీడలు మొదలగు వానియందును, అనాదరః = తృష్ణ (ఆసక్తి) లేకుం

డుటయును, సంగరాహిత్యమ్= ఇతరజనులతో కలిసియుండ వలె ననుకోర్కె-స్నేహములు లేకుండుటయును, వచనే= మాటాడుటయందు (మొదలగుక్రియలందు), అనవకాశః చ= అత్యల్పప్రయోజనము కల్గియుండుటయును, కృష్ణస్మరణేన= శ్రీకృష్ణుని స్మరించుట, ధ్యానించుటచేత, శాశ్వతీ = శాశ్వతమైన, శాన్తిః= శాంతియును [కల్గును].

తా॥ అతనికి జంతుసామాన్యములగు నిద్రయందును, అన్నపానాదులయందును, సుఖవిహారాది (మైథునాది) సుఖములందును పూర్వము వలె ఆసక్తి, (అతిప్రీతి) యుండదు వానియందు విముఖుఁడై యుండును. అందఱితో బంధుమిత్రాదులతో కలిసి మెలసి, కాలము గడుపవలె నని తహతహపడఁడు వృథాగా మాటలాడఁడు. మౌనశీలుఁ డగును. ఇతరులను తనసుఖమునకై ఉపయోగించుకొనుటకు యత్నింపఁడు. ఎప్పుడును, తప్పని సరియగు ఆహారవిహారాదులను, శ్రీకృష్ణస్మరణము అంతిసాన్నిధ్యము ననుభవించుచుండును. అందువలన శాశ్వతమైన మహశ్శాంతిని పొందుచుండును.

కేనాపి గీయమానే హరిగీతే వేణునాదే వా।
ఆనన్దావిర్భావో యుగపత్స్యాద్ హృష్టసాత్త్వికోద్రేకః॥ 181

ప్ర : కేన, అపి= ఎవనిచేతనైనను, హరిగీతే = శ్రీకృష్ణునిమహిమనుగుఱించిన గానముగాని, వా= లేక, వేణునాదే = మురళీగానముగాని, వినఁబడిన, యుగపత్ = ఏకకాలమందే, ఆనందావిర్భావః = ఆనందమును అనుభవించుటయు, హృష్టసాత్త్వికోద్రేకః = మహాహర్షముతో సాత్త్వికభావములు, శరీరము గగుర్పొడుచుట, పారవశ్యము మొదలైనవి ఆకస్మికముగా సంభవించు అనుభావవిభావసంపన్నుఁ డగుటయును.

తా॥ అప్పుడప్పు డాభక్తుఁడు పరమేశ్వరుఁ డగు శ్రీకృష్ణుని కథలు ఇతరుఁ డెవఁడైనను గానము చేయుట వినును. అట్లు వేణు

నాదమును వినవచ్చును. ఆసమయములం దతఁడు వెంటనే మహా నందమును బొందును. దానిచేత నతనికి శరీరము గగుర్పొడుచును. పారవశ్యము మొదలైన సాత్త్వికభావములు కూడ అనుభవించును. అట్లు అతఁడు శ్రీకృష్ణసంబంధలీలావిశేషములందు తన్మయత్వమును జెందును. అనఁగా మనస్సు లయమై శ్రీకృష్ణభావము శేషించును. ఇది సూక్ష్మభక్తికి (పరాకాష్ఠ) పైమేర (చివరి హద్దు).

అవ॥ అప్పు డతనిదశలు వర్ణించుచున్నారు.

తస్మి న్ననుభవతి మనః ప్రగృహ్యమాణం
పరాత్మసుఖమ్।
స్థిరతాం యాతే తస్మి న్యాతి మదోన్మత్తదన్తిదశామ్॥
182

ప్ర: తస్మిన్ = పైనవర్ణింపబడిన తీవ్రమైనసూక్ష్మభక్తిస్థితియందు, మనః = మనస్సు ప్రగృహ్యమాణం = అధికముగా గ్రహింపబడుచున్నదైన. పరాత్మసుఖం = ఉత్కృష్టమైన యాత్మానందమును, అనుభవతి = అనుభవించుచున్నది. తస్మిన్ = ఆపరాత్మసుఖము, స్థిరతాం = స్థైర్యమును, [నిలకడస్థితిని] యాతే = పొందిన దగుచుండఁగా, [మనః = మనస్సు] మదోన్మత్తదన్తిదశామ్ మదోద్రేకముచేతఁ దన్నుఁ దాను మఱచిన యేనుఁగుస్థితిని, యాతి = పొందును.

తా॥ అట్లు సూక్ష్మభక్తితో శ్రీకృష్ణేశ్వరునియందు తన్మయత్వము చెందిన మనస్సు శ్రేష్ఠమైన(ఈశత్వసుఖము)ఆత్మానందమనుభవించును. ఇదొకభావసమాధి. ఆయనుభవస్థితి స్థిరము కాఁగా మనస్సు, ఆనందముచే మదించి ఉన్మత్తమై మదోన్మత్తమైన ఏనుఁగువలె నగును. విశృంఖలస్వాతంత్ర్యసుఖ మనుభవించునని తాత్పర్యము.

అవ॥ హరిభక్తిపారమ్యమును వర్ణించుచున్నారు.

**జన్తుషు భగవద్భావం భగవతి భూతాని పశ్యతి క్రమశః।**
**ఏతాదృశీ దశా చేత్ తదైవ హరిదాసవర్యః స్యాత్॥ 183**

ప్ర : ఆభక్తుఁడు, క్రమశః = క్రమముగా, జన్తుషు = సర్వప్రాణులందు, భగవద్భావం = పరమేశ్వరునియునికియును, భగవతి = ఆపరమేశ్వరునందు, భూతాని = సర్వప్రాణులను, పశ్యతి = చూచును. ఏతాదృశీ, దశా = ఇటువంటిదశ, [భవతి] చేత్ = కల్గినయెడల, తదాఏవ = అప్పుడే, [సః = అతఁడు] హరిదాసవర్యః = హరిభక్తులలో [దాసులలో] శ్రేష్ఠుఁడు, స్యాత్ = అగును.

తా॥ క్రమముగా నట్టి భక్తుఁడు సర్వప్రాణులందుఁ బరమేశ్వరుని, పరమేశ్వరునందు సర్వప్రాణులను జూచును. అనఁగా విశ్వమునకు, విశ్వేశ్వరునకు అభేదానుభవజ్ఞానమును పొందును. ఇట్టిస్థితి వచ్చినచో అతఁడు హరిభక్తాగ్రేసరుఁ డగును. సర్వము అతనికి పరమేశ్వరరూపముగాఁ గనఁబడును. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' 'ఈసర్వమును బ్రహ్మమే గదా'అను ఉపనిషద్వాక్యార్థమును సగుణబ్రహ్మ (పరమేశ్వర) పరముగా గూడ అనుభవించును. ఇదియు గొప్ప భావసమాధియే. దీనిని విశ్వేశ్వర జ్ఞానలక్షణమైన సూక్ష్మభక్తియనియు నందురు. సర్వత్ర సమదర్శనలక్షణఫలములను శ్రీకృష్ణభగవానుఁడు గీతలందు (6వ అధ్యాయ ధ్యానాభ్యాసయోగమం దిట్లు 29, 30వ శ్లోకములందు వర్ణించిరి. "సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాఽఽత్మని। ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥" గీ6-29 యోగాభ్యాసముచేత సమాహితాంతఃకరణుఁడైన వాఁడు (యోగయుక్తాత్మ), చతుర్ముఖబ్రహ్మ మొదలుగడ్డిపోచవఱకు నున్న సర్వప్రాణులందును తానైన ఆత్మస్వరూపమును, అట్టిప్రత్యగాత్మయందు ఏకత్వమును పొందిన సమస్తప్రాణికోటిని జూచును. ఇట్లు

భిన్నములగు బ్రహ్మాదిస్తంబపర్యంతము గల సర్వభూతములం దును భేదరహితమై, బ్రహ్మాత్మైకత్వవిషయమై సమ (ఏక) రూప మైన జ్ఞానము కలవాఁడతఁడు (సర్వత్రసమదర్శనుఁడు).

శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥ గీ 6-30

సర్వభూతములందు, ఆసర్వమునకు ఆత్మరూపవాసుదేవుఁడగు నన్నును, అట్టిసర్వాత్మయగు నాయందు చతుర్ముఖబ్రహ్మాది భూతసమూహమును ఎవఁడు చూచుచున్నాఁడో ఆయాత్మైకత్వ దర్శియగు యోగికి ఈశ్వరుఁడనగు నేను ఎల్లప్పుడు ప్రత్యక్షుమే. అతఁడు నాకట్లే. మాయిద్దఱకు ఆత్మయొక్కటియే దేహములు (శరీరములు) వేఱుగా నున్నట్లున్నను అని భావము.

## 17. ధ్యానవిధిప్రకరణమ్ (ధ్యానవిధిప్రకరణము)

అవ॥ ఈశ్వరోపాసకుని ధ్యానమునకు అనుకూలముగా శ్రీకృష్ణునిరూప రేఖలు విశదముగా వర్ణింపబడుచున్నవి. శ్రీ శంకరాచార్యులవారు సాధారణము ముముక్షువులకు, భగవద్భక్తి, ధ్యానములను ఉపదేశించుచున్నారు.

యమునాతటనికటస్థితబృందావనకాననే మహారమ్యే।
కల్పద్రుమతలభూమౌ చరణం చరణోపరి స్థాప్య॥ 184
తిష్ఠన్తం ఘననీలం స్వతేజసా భాసయన్తమిహ విశ్వమ్।
పీతామ్బరపరిధానం చన్దనకర్పూరలిప్తసర్వాఙ్గమ్॥ 185
ఆకర్ణపూర్ణనేత్రం కుణ్డలయుగమణ్డితశ్రవణమ్।
మన్దస్మితముఖకమలం సుకౌస్తుభోదారమణిహారమ్॥ 186
వలయాంగుళీయకాద్యానుజ్జ్వలయన్తం స్వలంకారాన్।
గళవిలులితవనమాలం స్వతేజసాఽపాస్తకలికాలమ్॥ 187

గుఞ్జారవాలికలితం గుఞ్జాపుఞ్జాన్వితే శిరసి।
భుఞ్జానం సహగోపైః కుఞ్జాన్తరవర్తినం హరిం స్మరత॥ 188

ప్ర : యమునా....కాననే, యమునాతట = యమునానదియొడ్డుయొక్క, నికట= సమీపమందు, స్థిత = ఉన్నదైన, బృందావనకాననే = బృందావన మను పేరుగల అరణ్యమందు, మహారమ్యే= మిక్కిలి యందమైనదగు, కల్ప ద్రుమతలభూమౌ = కల్పవృక్షముయొక్క అడుగుభాగమున్న నేలయందు (దాని నీడలో), చరణోపరి= ఒకకాలిమీఁద, మఱియొకపాదమును, స్థాప్య = ఉంచి, తిష్ఠన్తం= నిలిచి యున్నవాఁడును, ఘననీలం = మేఘమువలె నల్లనైనవాఁడును, ఇహ= ఇక్కడ, స్వతేజసా= తనకాంతిచేత, విశ్వం= సమస్తప్రపంచమును, భాసయన్తం = ప్రకాశింపఁజేయువాఁడును, చన్దన........సర్వాంగమ్, చన్దన= మంచిగంధముచేతను, కర్పూర = కర్పూరముచేతను, (కర్పూరము చేర్చబడినమంచిగంధముచేత) లిప్త = పూయఁబడిన, సర్వాంగమ్ = ఎల్లయొడలు కలవాఁడును, ఆకర్ణపూర్ణనేత్రం= చెవులవఱకు విస్తరించిన నిండుకనులు కలవాఁడును, కుణ్డల....శ్రవణమ్, కుణ్డలయుగ = రెండుకుండలములను కర్ణాభరణములచేత, మణ్డిత= అలంకరింపబడిన, శ్రవణం = రెండుచెవులు కలవాఁడును, మన్దస్మితముఖకమలం = చిఱునవ్వుతో కూడిన పద్మమువంటి ముఖము కలవాఁడును, సుకౌస్తుభోదారమణిహారం, సుకౌస్తుభ = చక్కని కౌస్తుభమను పేరుగల మణిచేత, ఉదార= గొప్పదైన, మణిహారం= మణులు కూర్చిన హారము కలవాఁడును, స్వలంకారాన్ = చక్కని శోభనిచ్చు (తన) ఆభరణములగు, వలయాం....యన్తం, వలయ= కంకణములు, అంగుళీయక = ఉంగరములు, ఆద్యాన్= మొదలైనవానిని (భుజకీర్తులు మొదలగు సొమ్ములను) ఉజ్జ్వలయన్తం = మిక్కిలిగాఁ బ్రకాశింపఁ జేయువాఁడును, గళవిలులితవనమాలం, గళ= మెడయందు, విలులిత= అటునిటుగదలుచున్న, (దొరలింపఁజేయఁబడిన) దైన, వనమాలం= వనమాల కలవాఁడును [అడవిలోనిపూలచేత చేయఁబడిన మాలకలవాఁడును], స్వతేజసా= తనకాంతిచేత, అపాస్తకలికాలం= పోఁగొట్టఁబడిన, పాపపుకాలము కలవాఁడును, గుఞ్జాపుఞ్జాన్వితే=గురివింద పూలమొత్తములతోఁ గూడిన, శిరసి = శిరస్సునందు, గుఞ్జారవాలికలితం =

రుక్మను నింపైన రొదచేయు తుమ్మెదలతో నొప్పువాఁడును, గోపైః సహ= [తోడి] గోపాలబాలురతో కూడ కలిసి, భుక్షానం= [చల్ది అన్నములను] తిను వాఁడును, కుక్షాన్తరవర్తినమ్= పొదలమాటున నున్నవాఁడు, అగు, హరిం= విష్ణువగు శ్రీకృష్ణుని, ఓజనులారా, స్మరత= స్మరింపుఁడు, ధ్యానింపుఁడు.

తా॥ ఓభక్తజనులారా! ముముక్షువులారా! మీరందఱు శ్రీకృష్ణుని స్మరింపవలసినది. ధ్యానము చేయవలసినది అని శ్రీశంకరభగవత్పాదులు దయతో నుపదేశించుచున్నారు. ఆ శ్రీకృష్ణుఁ డెటువంటివాఁ డనిన సర్వేంద్రియహర్వగాని వర్ణించుచున్నారు. ఆయన మబ్బువలె నల్లనివాఁడు. పచ్చని పట్టువస్త్రమును ధరించిన వాఁడు. శరీరమంతట కర్పూరాదిమిశ్రితమైన చందనపు పూఁతకలవాఁడు చెవులవఱకు వ్యాపించిన విశాలమైన నేత్రములు కలవాఁడు. రెండుచెవులకుఁ జక్కని కుండలములు ధరించినవాఁడు. మిక్కిలిగాఁ బ్రకాశించు కౌస్తుభమణితోఁ గూడిన మణులహారము ధరించినవాఁడు. మెడలో నూగుచున్న వనపుష్పములమాలను ధరించినవాఁడు. ఎప్పుడును చిఱునవ్వుతో నందమైన పద్మము వంటి ముఖము కలవాఁడు. తనయందముచే బెంపొంది, మెఱయుచున్న కంకణమును, అంగుళీయకములు, భుజకీర్తులు మొదలైన భూషణములు కలవాఁడు. రుక్మను ముసురుచున్న తుమ్మెదల సమూహములు కల గురివెందపూలగుత్తులు శిరస్సునందు మెఱయు వాఁడు. తనతేజస్సుచేత విశ్వము నంతను వెలిఁగించువాఁ . ఒకప్పుడు బృందావనమందు మిక్కిలిమనోరమైన కల్పవృక్షము నీడలో ఒకకాలిపై మఱొకకాలు నానించి వేణువునూఁదువాఁడు. ఒకప్పుడు తోడిగోపాలురతోఁ గలిసి చల్దులారఁ గించువాఁడు. ఒకప్పుడు పొదరింటిలో విశ్రమించువాఁడు. ఇట్టు యమునాతీరవనమునం దనేకవిధములఁ గ్రీడించు నాయానంద గోపాలబాలమూర్తిని ధ్యానించి కృతార్థులు కండు.

అవ॥ ధ్యానములో దర్శించిన మహామూర్తికి నమస్కారమును విధించుచున్నారు.

మన్దారపుష్పవాసితమన్దానిలసేవితమ్ పరానన్దమ్ ।
మన్దాకినీయుతపదం నమత మహానన్దదం మహాపురుషమ్ ॥ 189

ప్ర : మన్దార .... సేవితం, మన్దారపుష్ప = మందారపుష్పములచేత వాసిత = పరిమళింపఁ జేయఁబడిన, మన్దానిల = పిల్లవాయువులచేత, సేవితం = సేవింపఁబడువాఁడును, మన్దాకినీయుతపదం = గంగానదితోకూడిన పదములు కలవాఁడును, (గంగానది శ్రీకృష్ణువిపదములందు జనించినదని పురాణప్రసిద్ధి) పరానన్దమ్ = పరమానందమే స్వరూపముగాఁ గలవాఁడును, అందుచేత మహానన్దదమ్ = (భక్తులకు) పరమానంద మీయఁగలవాఁడును, మహాపురుషం = పురుషోత్తముఁడును ఐన శ్రీకృష్ణుని (ఓభక్తముముక్షుజనులారా) నమత = (ఆయనకు) నమస్కరింపుఁడు!

తా॥ శ్రీకృష్ణుఁడు మందారపుష్పములవాసనలతో గుబాళించు పిల్లతిమ్మెరచేత సేవింపఁబడువాఁడు. ఆయన యున్న చోట నాహ్లాదకరములు పరిమళవంతములగు వాయువులు వీచును. ఆయన పాదములు పవిత్రగంగానదికి జన్మస్థానములు. అందువలన నాయన గంగానదికంటె నధికముగా అందఱను పవిత్రులుగాఁ జేయగలవాఁడు. ఆయన పరమానందమే స్వరూపముగాఁ గలవాఁడు. కావున తన్ను సేవించు భక్తులను నిత్యానందులఁగా జేయఁగలవాఁడు. ఆయన పురుషోత్తముఁడు పరమేశ్వరుఁడు. కావున నో ముముక్షుభక్తజనులార, ఆయనకు నమస్కరించి కృతార్థులు కండు.

అవ॥ శ్రీకృష్ణుని యోగ్యమహిమల నింకను వర్ణించుచున్నారు.

సురభీకృతదిగ్వలయం సురభిశతైరావృతం సదాపరితః ।
సురభీతిక్షపణపరం సురభీయం యాదవం నమత ॥ 190

ప్ర: సురభీకృతదిగ్వలయం = పరిమళింపఁజేయఁబడిన సర్వదిశలు కలవాఁడును, సదా = ఎల్లప్పుడును. పరితః = అన్నివైపుల, సురభిశతైః = వందలకొలఁది యావులచేత, ఆవృతమ్ = పరివేష్టింపఁబడినవాఁడును, సురభీతి క్షపణకరమ్ = దేవతలయొక్క (వలన) భయములనుగూడ తొలగించు సమరతకవాఁడును, సురభీయం = భక్తులకుఁ గామధేను వైనవాఁడు లేక గోవులకు మనోహరు డైనవాఁడును అగు యాదవం = ఈయదువంశజుఁడగు శ్రీకృష్ణుని, నమత = నమస్కరింపుఁడు.

తా॥ యదువంశమునందు జనించిన శ్రీకృష్ణుఁడు అలకాపరి. ఆయన చుట్టు వందలకొలది యావులును ప్రీతితో నిలిచి యాయన మనోహరరూపమును జూచుచుండెడివి. ఆయన యున్నచోట దివ్యపరిమళములు వెడలి దిక్కులంతటను వ్యాపించుచుండెడివి. ఆయన దేవతలభయములను దొలఁగించుటయందు మిక్కిలి సమర్థుఁడు. భక్తజనసులభుఁడు. కామధేనువువలె వారి కోర్కెలన్నియుఁ దీర్పఁగలవాఁడు. ఓముముక్షుదీనజనులారా! ఆయనను నమస్కారపూర్వకముగా సేవించి కృతార్థులు కండు.

భగవద్భక్తిలక్షణమగు మోక్షమార్గమందు శ్రద్ధతోఁ బ్రవర్తించువారిని (భక్తులను) గూర్చి గీతయందు శ్రీకృష్ణుఁ డన్న మాటలు.

శ్లో॥ మహాత్మాన స్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః।
భజ న్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్॥
గీ 9-13

వివేకులైన మహాత్ములు శమదమశ్రద్ధాదిలక్షణమైన దైవీప్రకృతి నాశ్రయించినవారలై, ఆకాశాదిభూతములకును, సర్వప్రాణులకును కారణమైన ఈశ్వరుఁ డగునన్ను, నాశము లేనివానిగా నెఱింగి, రెండవతలంపులేక, ఏకాగ్రచిత్తు లగుచు నన్నే సేవించుచున్నారు. ఎట్లన?

శ్లో॥ సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః।
సమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥
గీ 9-14

నిర్వికారనిర్గుణబ్రహ్మస్వరూపుఁడగు సగుణభగవంతుఁడైన నన్ను భక్తు లెప్పుడు కీర్తించువారలు. నాయారాధనగా, ఇంద్రియోపసంహారశమదమదయాఽహింసాదిలక్షణములగు ధర్మములను నిత్యము అనుష్ఠించు ప్రయత్నశీలురు. చాంచల్యములేని స్థిరమైన వ్రతనిష్ఠులు. నన్నే నమస్కరించువారు. వారిహృదయసీమలందు ప్రకాశించు, వారియాత్మరూపుఁడగనున్న నన్నే, నిత్యయోగులై భక్తితాత్పర్యముతో (ఉపాసించుచున్నారు) సేవించుచున్నారు.

అవ॥ ఆశ్రీకృష్ణుఁడు సౌందర్యదయారాశి, సర్వశక్తిమంతుఁడు, అనన్యశరణ్యుఁ డనుచున్నారు.

కన్దర్పకోటిసుభగం, వాఞ్ఛితఫలదం, దయార్ణవం, కృష్ణమ్ ।
త్యక్త్వా క మన్యవిషయం, నేత్రయుగం, ద్రష్టు, ముత్సహతే? 191

ప్ర; కన్దర్పకోటిసుభగం = కోటిమన్మథులంతటి సుందరుఁడైనవాఁడును, వాఞ్ఛితఫలదం=(భక్తులచే) కోరబడిన ఫలముల నెల్ల నిచ్చువాఁడును, దయార్ణవం = దయాసముద్రుఁడును అగు కృష్ణం = శ్రీకృష్ణుని, త్యక్త్వా వదలి, నేత్రయుగం=(మీ)కండ్లజంట, కం=ఎ, అన్యవిషయం = ఇతరవస్తువును, ద్రష్టుం=చూచుటకు, ఉత్సహతే=ఉత్సాహము చూపఁగలదు? చూపలే దని భావము.

తా॥ ఆశ్రీకృష్ణుఁడు దయాసముద్రుఁడు. అడిగిన కోర్కెలన్నింటి నీయ సమర్థుఁడు. కోటిమన్మథులంతటి సర్వాంగసుందరుఁడు. నిరుపమానుఁడు. అందఱ నాకర్షింప గలవాఁడు. అట్టిఁ

డని కని విని యున్నవాఁడు. ఎవఁడైనను, ఆయనను వదలి, మఱొకనిని, కన్ను లున్నవాఁడు జూచుట కుత్సహించునా? ఆయ నయే కనుగొందు. ధ్యానింపఁదగిన మూర్తివిశేషము. ఎఱుంగఁ దగిన మహాత్ముఁడు అని ఆత్మస్వరూపుఁడగుటచే శ్రీకృష్ణతత్త్వమే ద్రష్టవ్య మని ఉపనిషదర్థసూచక మిందలి ధ్వని.

అవ॥ జ్ఞానసాధనమగు ఈ కథామృతమును వదలి, గ్రామ్యకథావిష మారగించు (చెవులు) వారుందురా? ద్రష్టవ్యార్థమును జెప్పి, శ్రోతవ్యమును సూచించుచున్నారు.

**పుణ్యతమా మతిసరసాం మనోఽభిరామాం హరేః**
**కథాం త్యక్త్వా ।**
**శ్రోతుం శ్రవణద్వన్ద్వం గ్రామ్యం కథ మాదరం వహతి॥**
**192**

ప్ర : (మనుష్యులయొక్క) శ్రవణద్వన్ద్వం = వీనులజంట, పుణ్యతమాం = విన్నవారిని మోక్షముదరిజేర్చునంతటి పుణ్యప్రద మైనదియు (అంతియ కాక) అతిసరసాం = (విన్న) నవరసభరితమై మహానందానుభవముతోఁ గూడినదియును, మనోభిరామాం = (అందువలన) మిక్కిలి మనోహరమై మనస్సును, తనయందు లయ మొనర్ప గలదియునగు హరేః = శ్రీకృష్ణుని యొక్క, కథాం = కథను, త్యక్త్వా = విడచి, కథం = ఎట్లు, గ్రామ్యం = అశ్లీలమును, నీచము నైన చౌకబారు కథను, శ్రోతుం = వినుటకు, ఆదరం = ప్రీతిని వహతి = వహింపఁగలదు? వహింపఁజాల దని భావము.

తా॥ శ్రీకృష్ణుని కథలు నవరసభరితములు. అందువలన నత్యంతమనోహరములు. కర్ణరసాయనములు. పాపహారములు. చిత్తశుద్ధికరములు. అంతియ కాదు. అవి విన్న మహాపుణ్యమును గల్గించి, స్వర్గసుఖమును ముక్తిసుఖమునుగూడ క్రమముగా సమకూర్పఁగలవి. కావున శ్రోతవ్యములు. అట్టికథలను వినుటకు బుద్ధి

మంతు లుత్సహింతురు. అవివేకాని నీచములగు కథలను వినం గోరువాడు, పరమ మూర్ఖుండగు నజ్ఞానివ్యర్థజీవి.

అవ॥ విషయతృష్ణ దౌర్భాగ్య మని, దానిని వదలుటకై చెప్పుచున్నారు.

దౌర్భాగ్య మిన్ద్రియాణాం కృష్ణేవిషయే హి శాశ్వతికే।
క్షణికేషు పాపకరణే ష్వపి సజ్జన్తే యదన్యవిషయేషు ॥ 193

ప్ర : ఇన్ద్రియాణాం = ఇంద్రియములకు, శాశ్వతికే = నిత్యుండైన, కృష్ణే=శ్రీకృష్ణుండు, విషయే(సతి) = ధ్యానింపను, దర్శింపను, సేవింపను విషయమై యుండగా, (ఆయనను వదలి, తే=అవి), క్షణికేషు=క్షణమాత్ర ముండు నవియును, పాపకరణేషుఅపి = పాపమును చేయించునవియునగు అన్యవిషయేషు = శ్రీకృష్ణునకంటె ఇతరములైన విషయములందు, సజ్జన్తే = సక్తమగుచున్నవి. (ఇతి) యత్ = అనునిది ఏదికలదో, (తత్ = అది) (ఆ యింద్రియములయొక్క) దౌర్భాగ్యం హి = దురదృష్టమేకదా!

తా॥ నిత్యుండు, నిత్యమోక్ష మీయసమర్థుండును సర్వేంద్రియములకుం దృప్తినిచ్చు విషయరూపుండును, సగుణుండునగు శ్రీకృష్ణపరమాత్మ యుండగా, వానిని వదలి సర్వేంద్రియములు అశాశ్వత క్షణికసుఖము లిచ్చి, మోహింపంజేసి, పాపముల కొడిగట్టించు స్వభావముగల లౌకికవిషయములం దాసక్తము లగు చున్నవి. ఇది నిజముగా నామనుజులయింద్రియముల దౌర్భాగ్య ముగాక మఱేమి? కాన బుద్ధిమంతు లీయింద్రియరతిప్రమాదము నకుం బడంగూడదు. ముక్తిసాధనమగు వైరాగ్యాత్మబోధభక్తి త్రయమార్గమును వీడక పూనికతో సాధించి జీవన్ముక్తులు గా వలయు నని హెచ్చరిక. ఈ భక్తివలన సగుణనిర్గుణైక్యజ్ఞానము ధ్రువపడవలయు నని నిరూపింపంబోవుచున్నారు. నిగ్రహింపబడని

యింద్రియములు, స్వాభావికముగాఁ జేయు మహాదోషమును గూర్చి గీతా ప్రమాణ వాక్యము.

శ్లో॥ యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః।
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥ గీ 2-60

ఇంద్రియములు ప్రమథనశీలములు, అనఁగా పురుషుని విషయాభిముఖుని, జేసి, తమ్ము నిగ్రహింపయత్నించుచున్న ఎంతటి మేథావి నైనను, ఆకులపఱచి మనఃక్షోభమును దెచ్చిపెట్టుచున్నవి. అంతటితోనాగక వివేకజ్ఞానమైన మనస్సును బలాత్కారముగా నాశము చేయుచున్నవి. (దొంగిలించుచున్నవి.) కావున నరుఁడు ఇంద్రియవివశుఁడుగాక, వైరాగ్యాభ్యాసములచే జితేంద్రియుఁడై సర్వమునకు ప్రత్యగాత్మరూపుఁడైన శ్రీకృష్ణుఁడే పరమగతిగాఁ గలవాఁడు కావలయు నని పర్యవసితమైన ప్రబోధము.

## 18. సగుణనిర్గుణయోరైక్యప్రకరణమ్
### (సగుణనిర్గుణములయొక్క యైక్యప్రకరణము)

అవ॥ ఉన్న దొకే వస్తువు బ్రహ్మము. దానిపారమార్థికస్వరూపము నిర్గుణము. కావున నది విషేథపూర్వకముగనే గుణాత్మకుఁడగు జీవునిచే తెలియఁదగినది. కాని దాని యచింత్యాద్భుతశక్తియైన మాయవలన ఆసత్యవస్తువే, నిత్యజ్ఞానస్వరూపుఁడు, సచ్చిదానందస్వరూపుఁడు, సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్వ సర్వవ్యాపిత్వములుగల ఈశ్వరుఁడుగను, అజ్ఞానోపాధులుగల జీవులుగను, అచేతనమైన ప్రపంచముగను భాసించును. అజ్ఞానోపాధియగు జీవుఁడు ఈశ్వరానుగ్రహమువలన తాను వాస్తవికముగా, నిత్యమైన నిర్గుణబ్రహ్మము నని యనుభవపూర్వకముగా నెఱుఁగుటయే చెక్కుచెదరని ముక్తి. బ్రహ్మాత్మైకత్వ జీవేశ్వరైక్యజ్ఞానమువలవనే ముక్తి. జీవుని వర్ణాశ్రమధర్మానుష్ఠానములు మాలభక్తి మొదలైనవి అటిజ్ఞానకారణములు. అజ్ఞానము పరిపక్వమైన ముక్తి కరతలామలక మగును. - నిత్యసిద్ధనిర్వికారనిర్గుణబ్రహ్మవస్తువునందు వివర్తముగాఁ గల్పితమైనదే సగుణబ్రహ్మమగు ఈశ్వరజీవజగత్త్రిపుటము. నిర్గుణ

బ్రహ్మము పరమార్థసత్యము. సగుణబ్రహ్మమగు నీశ్వరాది, మిథ్యారూపవ్యావహారిక సత్యము. సమ్యగ్జ్ఞానముచేత సర్వమిథ్యయు నష్టము కాఁగాఁ బరిశేషించునది యేకము నద్వితీయమునగు నిర్గుణవస్తువుమాత్రము. ఈవిషయ మిచ్చట విపులముగా విశదముగా నిరూపింపఁబడుచున్నది.

**శ్రుతిభి ర్మహాపురాణైః సగుణగుణాతీతయో రైక్యమ్।**
**య త్ప్రోక్తం గూఢతయా త దహం వక్ష్యే**
**ఽతివిశదార్థమ్ ॥ 194**

ప్ర : వేదములచేతను, మహాపురాణైః=గొప్పవగుపురాణములచేతను, సగుణగుణాతీతయోః = సగుణముయొక్కయు, (గుణములను దాఁటినదగు) నిర్గుణముయొక్కయు, యద్, ఐక్యం=ఏయేకత్వము గూఢతయా = రహస్యముగా దాఁచఁదగినదిగా ప్రోక్తం=నిర్ణయించిచెప్పబడినదో. తద్=అట్లుచెప్పిన (దానిని) ఆసగుణనిర్గుణైక్యమును, అహం=నేను, అతివిశదార్థం = మిక్కిలి వివరముగా, బాగుగా దెలిసినయర్థము కలుగు నట్లుగా, వక్ష్యే = చెప్పఁబోవుచున్నాను.

తా॥ సగుణుఁడగు నీవిశ్వకర్తయు, ఆయనకు మూలమగు నిర్గుణబ్రహ్మమును రెండువస్తువులు కావు. అవి రెండువిధములుగాఁ గనఁబడు ఒకేవస్తువు. శ్రుతులుమహాపురాణములు ఈ సత్యవిషయమును విశదముగా వివరముగాఁ జెప్ప లేదు. గుప్తముగాఁ జెప్పినవి. ఆరెంటియైక్యవిషయమును నే నిప్పుడు బాగుగాఁ దెలియునట్లు వివరములతో నిరూపింపఁ బోవుచున్నాను. ఈసగుణనిర్గుణతత్త్వముల యైక్యమునుగూర్చి గీతలందు అర్జునునితో నన్న శ్రీకృష్ణవచనము.

శ్లో॥ మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా।
మత్స్థాని సర్వభూతాని న చాహం తే ష్వవస్థితః॥ గీ 9-14

ఈ(సత్వ)జగమంతయు, నాప్రకృష్టభావమై,యింద్రియగోచరముకాని యవ్యక్తస్వరూపముచేత వ్యాపింపఁబడినది. అట్టినాయవ్యక్త

మూర్తియందు చతుర్ముఖబ్రహ్మాది స్తంబపర్యంతముగల సర్వభూతములు ఉన్నవి. ఆత్మలేని యేయొక్క వస్తువుకూడ, వ్యవహార యోగ్యముకాదు. కావున సర్వభూతములు నాయందున్నవే (మత్స్థములే). అనఁగా అభూతముల కన్నింటికి అంతరతమముగా అవ్యక్తముగా ఆత్మగా నేనున్నాను. నాయునికివలననే వానికి తాత్కాలికయునికిఁ గల్గినది. అభూతముల కన్నింటికి నేను ప్రత్యగాత్మగా నున్నకారణమున, వానియందు నే నున్నట్లు మూఢబుద్ధులకు అవభాస కల్గినది. అందువలననే నేను అభూతములందున్నవాఁడను గానని నిషేధించి చెప్పితిని. నేను మూర్తపదార్థమువంటివాఁడను గాను. దేనితోడ (ఆకాశమునకువలె) నాకుసంశ్లేషము (కలిసి యుండిన యోగము) లేనే లేదు. అయాకాశమునకంటెకూడ నేను అంతరతముఁడను. (లోలోపలివాఁడను) ఎచ్చటను, ఎప్పుడును, (ఏవిషయ సంబంధములులేని) అసంసర్గివస్తువు, ఆధేయభావముతో, (ఆధారముగా మఱొకవస్తువుగలది ఆధేయము) నుండఁజాలముగదా!

కావున నాఅసంసర్గిత్వధర్మమువలన–

శ్లో॥ న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్।
భూతభృన్న చ భూతస్థో మ మాఽఽత్మా భూతభావనః॥
గీ 9-5

చతుర్ముఖబ్రహ్మాదిభూతములు నాయందున్నవికావు. (అనఁగా నాయీశ్వరసంబంధమైన (ఐశ్వరమగు) యీయోగరూపసంఘటనయగు ఆత్మయాథాత్మ్యమును జూడుము (ఎఱుంగుము) బృహదారణ్యకోపనిషత్తు (3-9-26) ను, అసంసర్గిత్వమువలననే అసంగత్వమును దెల్పుచున్నది. "అసంగో న హి సజ్జతే" "ఆత్మ సంగరహితుఁడు గాన దేనిని అంటఁడు" ఈమఱొకయాశ్చర్యమును

జ్ఞానము. అట్లసంగుఁడుగ నేయున్నవాఁడనై నప్పటికిని భూతములను భరించుచున్నాఁడను అధిష్ఠానరూపమున (పోషించుచున్నాఁడను) అసంగత్వధర్మముచే భూతములం దున్నవాఁడనుమాత్రము కాను. అట్లగుచో ఈశ్వరుఁడు 'మమ ఆత్మా' 'నాయాత్మ' అన్నమాట యెట్లు పొసగును? నేను ఆత్మను అనవలదా యని ఆక్షేపణము రాగా, లోకబుద్ధి ననుసరించి, దేహాదిసంఘాతమందు అహంభావ మారోపించి, నాయాత్మ అన్నాఁడేకాని, తెలియని యజ్ఞునివలె ఈశ్వరుఁడు వేఱు, ఆత్మ వేఱను భావన చొప్పున కాదు. ఈశ్వరునకు, బ్రహ్మమగు ఆత్మకు ఐక్యమే ప్రబోధితము. భూతోత్పత్తివర్ధనములకు కారకుఁడను, ఈశ్వరుఁడగు నేనేసుమా.

అవ॥ సగుణనిర్గుణైక్యభావమును వాచ్యముగా శ్రీకృష్ణపరముగా వర్ణించుచున్నారు.

**భూతేష్వంతర్యామీ జ్ఞానమయః సచ్చిదానన్దః।**
**ప్రకృతేః పరః పరాత్మా యదుకులతిలకః స ఏవాయమ్॥**
**195**

ప్ర : అయమ్ = ఈ, యదుకులతిలకః, ఏవ = యాదవవంశశ్రేష్ఠుఁడైన శ్రీకృష్ణుఁడే, సః = ఆ, ప్రకృతేః పరః = మూలప్రకృతికంటె భిన్నుఁడైన వాఁడును. భూతేషు = సర్వజీవులయందు, అంతర్యామీ = లోపలనుండి సర్వనియామకుఁడైన వాఁడును, జ్ఞానమయః = జ్ఞానఘనుఁడైనవాఁడును, సచ్చిదానన్దః = సచ్చిదానందస్వరూపుఁడును, అగు, పరాత్మ ఏవ = పరమాత్మయగు పరబ్రహ్మమేసుమా.

తా॥ సగుణమూర్తిగా యాదవవంశశ్రేష్ఠుఁడుగా నవతరించిన ఈశ్రీకృష్ణుఁడు, సర్వభూతములలో నంతర్యామిగా నుండి వానిని నడపించువాఁడును, సర్వవిధజ్ఞానముతో నిండినవాఁడును, సచ్చిదానందస్వరూపుఁడును. మూలప్రకృతికి అతీతుఁడైనవాఁ

డును, పరమాత్మయు నగు నిర్గుణపరబ్రహ్మమే. ఆనిర్గుణపరబ్రహ్మమే, ఈసగుణమూర్తిగాఁ గనఁబడుచున్నవాఁడు. ఈసగుణ నిర్గుణమూర్తులకు వాస్తవికభేదము లేదు. ఒకటవనుంగళారంభ శ్లోకతాత్పర్యవివరణము స్మరింపఁ దగినది. చూడుఁడు.

అవ॥ దీనిమీఁద నొకయాక్షేపణ లేవఁదీయుచున్నారు.

**నను సగుణో దృశ్యతను స్తథైకదేశాధివాసశ్చ।**
**స కథం భవే త్పరాత్మా ప్రాకృతవ ద్రాగదోషయుతః॥ 196**

ప్ర : నను= మఱి, సగుణః= గుణములతో కూడినవాఁడు, దృశ్యతనుః= కనఁబడుచున్నశరీరము గలవాఁడు, అనఁగాఁ బరిచ్ఛిన్నుఁడు, తథా= అట్లే, ఏకదేశాధివాసః చ = మఱియు నొకచిన్నదగుప్రదేశమం దున్నవాఁడు, ప్రాకృతవత్= ప్రకృతినుండి జనించిన అజ్ఞానియగు సామాన్యమనుష్యునివలె, రాగదోషయుతః=రాగద్వేషాదిదోషములు కలవాఁడును, అగు నీశ్రీకృష్ణుఁడు, కథం= ఎట్లు, సః= ఆ, వీనికంతకు విరుద్ధమైన నిర్గుణత్వాదిలక్షణములు గల, పరాత్మా=పరమాత్మ, భవేత్ = కాఁగలఁడు? ఇదిపూర్వపక్షము.

తా॥ ఈశ్రీకృష్ణుఁడు మనవలె మానవశరీరముతోఁ బుట్టినవాఁడు. అందఱియింద్రియములకుఁ గనఁబడువాఁడు. సగుణుఁడు సాకారుఁడు. పరిచ్ఛిన్నుఁడు. ఒకప్రదేశమందే యున్నవాఁడు. ఇక్కడ నున్న అక్కడ నుండఁడు, రాగద్వేషాదులు కలవాఁడు. కాముకునివలె అనేకగోపకామినులతో పరస్త్రీలతో క్రీడించినవాఁడు. శిశుపాలకంసాదులను కోపముతో ద్వేషముతో సంహరించినవాఁడు. కాని పరమాత్మ యన్నచో నిర్గుణుఁడు. నిరాకారుఁడు. దేశకాలములచేఁ బరిచ్ఛిన్నుఁడు కానివాఁడు. నిష్కలుఁడు. సర్వవ్యాపి. సర్వాంతర్యామి. అశరీరుఁడు. రాగద్వేషాదిరహితుఁడు. అన్నిటికంటెను, విరుద్ధగుణములు కలవాఁడు పర

మాత్ముండు. అట్టిచో శ్రీకృష్ణుడాకారమాత్ముడెట్లు కాగలడు! కాలేడు. కాన ఇదంతయు నసంబద్ధము. అని యాక్షేపణాస్వరూపము.

అవ॥ పై యాక్షేపమునకు రాబోవు గ్రంథభాగమున నుత్తర మిచ్చుచున్నారు.

**ఇతరే దృశ్యపదార్థా లక్ష్యన్తే ఽనేన చక్షుషా సర్వే।**
**భగవా ననయా దృష్ట్యా న లక్ష్యతే జ్ఞానదృగ్గమ్యః ॥**
**197**

ప్ర : ఇతరే = శ్రీకృష్ణునికంటె ఇతరములైన, సర్వే = అన్ని దృశ్యపదార్థాః = కనబడువస్తువులు, అనేన, చక్షుషా = ఈకంటిచేత, లక్ష్యన్తే = చూడబడుచున్నవి. కాని భగవాన్ = భగవంతుడు, అనయా దృష్ట్యా = (ఈసామాన్యదృష్టిచేత,) ఈచర్మచక్షువులచేత, న, లక్ష్యతే = చూడబడడు. (సః = ఆయన) జ్ఞానదృగ్గమ్యః = జ్ఞానచక్షువుచేతమాత్రమే చూడబడగలవాడు.

తా॥ మనకున్న యీలౌకికన్నులు, శ్రీకృష్ణుడుతప్పతక్కిన లోకములోని సర్వస్థూలపదార్థములను మాత్రమే చూడగలవు. భగవానుడైన సూక్ష్మరూపశ్రీకృష్ణుడు, ఈకంటికి గనబడడు, ఆయనను జూడవలె నన్న జ్ఞానదృష్టియే కావలయును,

మనకున్న కన్ను మొదలగు నింద్రియములు, దేశకాలపరిచ్ఛిన్నములు, సగుణములు, సాకారములు నైన వస్తువులనే చూడగలవు. చూచువాడున్న యొకచోట, చూచువాడున్న కాలములో నున్న (వి యగు) వస్తువులనే వానియింద్రియములు సరిగా బనిచేయుచున్నప్పుడు మాత్రమే చూడగలవు. కాని యన్ని చోటుల, నన్నికాలముల నున్నవస్తువులను జూడలేవు. కావున నీ కన్ను భగవానుని జూడలేదు. దానికి దివ్యజ్ఞానదృష్టి కావలెను.

అవ॥ దానికి నిదర్శనమేమి? అట్లు చూచినవా రెవరైన నుండిరా? ఈ ప్రశ్నల కు ఉత్తరము చెప్పుచున్నారు.

యద్విశ్వరూపదర్శనసమయే పార్థాయ దత్తవా
న్భగవాన్।
దివ్యం చక్షు స్తస్మా ద దృశ్యతా యుజ్యతే నృహరౌ॥
198

ప్ర : విశ్వరూపదర్శనసమయే=(కురుక్షేత్రయుద్ధప్రారంభములో నర్జునుని ధనుస్సు జారిక్రిందఁబడఁగా తా నింక యుద్ధము చేయ నన్నప్పుడు) శ్రీకృష్ణుఁ డాయనకు తనవిశ్వరూపమును జూపుసమయమందు, పార్థాయ= అర్జునునకు, యద్ దివ్యం, చక్షుః= ఏదివ్యమైన దృష్టిని, భగవాన్= భగవంతుఁడైన శ్రీకృష్ణుఁడు, దత్తవాన్= ఇచ్చినవాఁడాయెనో, (తద్= ఆదివ్యచక్షుస్సు, అస్మాకం నాస్తి= మనకు లేదు.) తస్మాద్= అందువలన, నృహరౌ = కనఁబడుమనుష్యుఁడుగా అవతరించినసూక్ష్మ విష్ణువునందు, అదృశ్యతా= కనఁబడకుండుట, యుజ్యతే= తగియున్నది.

తా॥ కురుక్షేత్రమున పాండవకౌరవ యుద్ధములో యుద్ధము చేయుటకు వచ్చిన యర్జునుఁడు ధనుస్సు నేలపై జారిపడగా తాను యుద్ధము చేయ నని శోకమోహావివశుఁడై కూర్చుండెను, అప్పు డర్జునునకు ఆత్మప్రబోధము కల్గించుటకు మానవరూపము లోనున్న శ్రీకృష్ణుఁడే ఈశ్వరుఁడగుటచే తనవిశ్వరూపమును జూపింపఁదలఁచి దానిని మానవనేత్రములు చూడసమర్థములు కావు గనుక అర్జునకు ముందుగా దివ్యదృష్టిని ప్రసాదించి, పిమ్మట తనవిశ్వరూపప్రదర్శనము గావించెను. అప్పు డర్జునుఁడు శ్రీకృష్ణువిచిన్యరూపమైన విశ్వరూపమును జూడఁగల్గెను. కావున దివ్యదృష్టి కలవారే యా శ్రీకృష్ణునియైశ్వర్యమగు విశ్వరూపమును జూడఁగలరు. కావునఁ దక్కినవారికన్నుల కాదివ్యరూపము కనఁబడదనుట(తగియే యున్నది) న్యాయము. అట్టివిశ్వరూపమునే దివ్య

దృష్టితోడనే సంధిసమయములో ధృతరాష్ట్రుఁడు, భీష్ముఁడు మొదలైనవారును, మన్నుఁదిన్నాడని గోపబాలుగు, యశోదతోఁ జెప్పినప్పు డాయన నోరు తెఱచి నప్పుడు యశోదయును జూడఁగల్గిరి. కావున మానవాకారముననున్న శ్రీకృష్ణుఁడు, విశ్వరూపుఁడు, విశ్వేశ్వరుఁ డని ధ్రువపడినది. ఈవిషయమున సందేహమున కింకఁ దావు లేదు.

అవ॥ సగుణనిర్గుణభావైక్యమును ధ్రువపఱచుచు మఱొక యుదాహరణ మిచ్చుచున్నారు.

సాక్షా ద్యథైకదేశే వర్తుల ముపలభ్యతే రవే ర్బిమ్బమ్।
విశ్వం ప్రకాశయతి తత్సర్వైః సర్వత్ర దృశ్యతే
తద్వత్ ॥ 199

యద్యపి సాకారో ఽయం తథైకదేశీ విభాతి యదునాథః।
సర్వగతః సర్వాత్మా తథా ప్యయం సచ్చిదానన్దః ॥ 200

ప్ర : యథా = ఏవిధముగా, రవేః బిమ్బమ్ = సూర్యబింబము, సాక్షాత్ = ప్రత్యక్షముగా, ఏకదేశే = ఒకస్థలమునందే, వర్తులమ్ = గుండ్రముగా, ఉపలభ్యతే = పొందఁబడుచున్నది (చూడఁబడుచున్నది) తత్ = ఆసూర్యబింబము, విశ్వం = ప్రపంచమునంతను, ప్రకాశయతి = వెలిఁగించుచున్నది, తత్ = ఆసూర్యబింబము, సర్వైః = ప్రాణులందఱిచేతను, సర్వత్ర = అన్నిచోటులందును, యుగపత్ = ఏకకాలమందే చూడఁబడుచున్నది. తథా = ఆరవిబింబమువలెనే, అయం యదునాథః = యాదవాధీశుఁడగు ఈశ్రీకృష్ణుఁడు, సాకారః = రూపము (శరీరము) కలవాఁడుగా నున్నప్పటికిని, ఏకదేశీ = ఒకచోటనే యున్నవాఁడుగాను, విభాతియద్యపి = పైకి కనిపించుచున్నప్పటికిని, (అయం = ఈకృష్ణుఁడు) సర్వగతః = అన్నిటిని వ్యాపించి సూక్ష్మముగా నున్నవాఁడు, సర్వాత్మా = అన్నిటికి నాత్మయైనవాఁడు, తథాఽపి = అట్లు సగుణరూపముతో నున్న ఈశ్వరుఁ డైనప్పటికిని, అయం = ఇతఁడు, సచ్చిదానన్దః = నిర్గుణసచ్చిదానందస్వరూపుఁ డగుపరబ్రహ్మము.

(ప్ర. 30)

తా॥ ఏకదేశి, పరిచ్ఛిన్నుఁడుగాఁ గనఁబడువాఁడు సర్వవ్యాపి, సర్వులచే నెట్లు గ్రహింపఁబడఁగలఁడో లోకానుభవము గల దృష్టాంతముతో చూపుచున్నారు. సూర్యబింబమే మన కాకాశమున నొకచిన్నవస్తువుగాఁ గనఁబడుచున్నది. కాని యాయనప్రకాశము జగమంతట వ్యాపించి అదియే మనయనుభవమునకుఁ దెచ్చుచున్నది. జగమంతయు ఏకకాలమందే ఆయనను జూచుచున్నది. అట్లే సగుణరూపమున యదువంశనాథుఁడైన శ్రీకృష్ణుఁడు, జనుల కొకచోట చిన్నశరీరముతో నున్నట్లు గన్పట్టినను ఆయన పరమేశ్వరుఁడుగా సర్వవ్యాపిగా నున్నాఁడు. సర్వులకు నిర్గుణమైన యాత్మగాఁ గూడ నున్నాఁడు. కావున సచ్చిదానందస్వరూపపరబ్రహ్మము నాయనయే. ఇట్లు సగుణనిర్గుణైక్యతత్త్వమును జాగ్రత్తగా నెఱుంగవలయును. ఇది ఆత్మబోధవిశేషాంశము.

అవ॥ ఈయన సర్వగతత్వము లేకసర్వవ్యాపకత్వమును నిరూపించు చున్నారు.

**ఏకో భగవాన్ రేమే యుగప ద్గోపీ ష్వనేకాసు।**
**అథవా విదేహజనకశ్రుతదేవభూదేవయో ర్హరి ర్యుగపత్॥**
201

ప్ర : ఏకః భగవాన్ = ఒక్కఁడైన భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు, యుగపద్ = ఒకేసారి, ఒకేసమయమున, అనేకాసు, గోపీషు = అనేకులైన గోపికల(తో) గృహములందు అనేకసాకారశ్రీకృష్ణమూర్తులతో, రేమే = క్రీడించెను. అథవా = మఱియును, విదేహజనకశ్రుతదేవభూదేవయోః = విదేహదేశపురాజైన బహుళాశ్వుఁ డను పేరుగల జనకుని గృహమందును, శ్రుతదేవుఁ డనుపేరుగల బ్రాహ్మణుని గృహమందునుకూడ, యుగపద్ = ఒకేకాలమునందు, హరిః = శ్రీమన్నారాయణుఁడు (ఉండెను) దర్శన మిచ్చెను.

తా। సామాన్య మనుష్యుఁ డొకచోటనున్నవాఁడు మఱొకచోటఁ గనిపింపఁడు. ఒకేకాలమున పలుచోట్ల గన్పట్టినాఁడన్న, సాయిబాబ తలఁచిన చోట్ల నెల్ల గన్పట్టఁగలఁడు. సత్యసంకల్పుఁడనుట సర్వవ్యాపియన్నమాట. శ్రీకృష్ణుని చరిత్రములో నాఘటనలనిట్లు ప్రదర్శించుచున్నారు. ఆయన శ్రీకృష్ణాకారశరీరములనేకములను సృజించి వానితో నొకేకాలమున రాసక్రీడలో నొక్కొక్క గోపికకు నొక్కొక్క కృష్ణుఁడై వారితోఁ గ్రీడించెను. యమునానది యొడ్డున బృందావనములో నాయన రాసమండలము నాడెను. అంతకుముందు స్త్రీలను అనేకకృష్ణులుగా మాఱి విహరించినట్లు భాగవతపురాణము చెప్పుచున్నది. ఆ పురాణమే దశమస్కంధమందు శ్రీకృష్ణుఁ డొకేసమయమున విదేహనాథుఁడైన బహులాశ్వుఁడను రాజు జనకుని యింటియందును శ్రుతదేవుఁడను బ్రాహ్మణుని యింటియందును దర్శన మిచ్చినట్లున్నది. (భాగవతము 10-2-1177 నుండి 1202) దీనివలన నాయన యక్కడ ఉన్నాఁడు. ఇక్కడ లేఁడు అని చెప్పుటకు వీలు లేదు.

సూర్యుఁడు ఆకాశమునఁ బరిచ్ఛిన్నమూర్తిగాఁ గనఁబడినను ఆయన కిరణములు జగమునం దంతట వ్యాపించి యున్నవి. [అంతరాళమందు వానియునికి కనఁబడకున్నను నేదైన నొకవస్తువుంచినపుడు అది యాకిరణముల కాంతిని మనకుఁ జూపును]. టెలివిజను, రేడియో మొదలగు సాధనములు ప్రసారస్థలముల నుండి పంపు ఎలెక్ట్రోమాగ్నెటిక్ తరంగములు కంటికిఁ గనఁబడు రూపము లేనివై యాకసమం దంతట నిండియున్నవి. అవి ఉన్న చోవరి యింద్రియములకును దోపవు. కాని వానిని గ్రహించు సాధనము మెక్కడ నుంచినను నవి యక్కడ సరూపతరంగములకల్పించి యారూపమును వానికార్యమగు శబ్దాదులను బ్రత్యక్షముఁ జేయుచున్నవి. అవి ప్రారంభస్థానములో నేకదేశీయము లట్లున్నను

ఇంద్రియగోచరములు కాకుండ సర్వవ్యాపకములై యున్నవి గదా!]

శ్రీకృష్ణుఁడు గోపికలతోడనే కాక తాను నరకాసురవధానంతరము పదునాఱువేల రాజకన్యలను బదునాఱువేల రూపములతో వివాహమై వారితో నెల్లప్పుడు కలిసి విహరించుచు సంసారములు చేసినట్లు భాగవతము చెప్పుచున్నది. ఇవి భగవల్లీలలు. శ్రీకృష్ణుఁడు సర్వయోగములకు ఈశ్వరుఁడు. అది యొక పరమేశ్వరునకే కాక వాని యనుగ్రహమున తపస్సంపన్నులగు మహర్షులు, సౌభరి మొదలగువారుకూడ అట్టిమహిమాన్వితచర్యలను జూపియున్నారు. సత్యలోకములోని ఉపాసకులకుకూడ జగత్ సృష్టిలయములను విడిచి, యట్టిమహిమలు కల్గవచ్చునని బ్రహ్మసూత్రములలో నాల్గవయధ్యాయములో వర్ణింపఁబడినది.

అవ॥ ఇట్టి యోగీశ్వర మహిమలనే శ్రీకృష్ణపరమాత్మవి మఱికొన్ని చెప్పుచున్నారు.

**అథవా కృష్ణాకారం స్వచమూం దుర్యోధనో ఒపశ్యత్।**
**తస్మా ద్వ్యాపక ఆత్మా భగవా న్హరి రీశ్వరః కృష్ణః ॥**
**202**

ప్ర : అథవా = మఱియు, దుర్యోధనః = దుర్యోధనుఁడు, స్వచమూం = తనసైన్యమును, కృష్ణాకారం = దానిలోని సర్వసైనికులు కృష్ణాకారులుగామన్నట్లు అపశ్యత్ = చూచెను. (దీనివలన ఆశ్రీకృష్ణుఁడు చమూగతుఁ డని స్పష్టము) తస్మాత్ = కావున, కృష్ణః = జనులనేత్రములకు మానవమాత్రుఁడుగాఁ గనఁబడు శ్రీకృష్ణుఁడు, వ్యాపకః = సర్వమును వ్యాపించినవాఁడగు, భగవాన్ హరిః = భగవానుఁడగు విష్ణుమూర్తియే, ఈశ్వరః = సర్వేశ్వరుఁడే, ఆత్మా = సర్వులప నాత్మరూపమున నున్నవాఁడే.

తా॥ మఱొక యుదాహరణ మిచ్చుచున్నారు. దుర్యోధనుఁ డొకప్పుడు తనసైన్యములోని ప్రతిసైనికుఁడును శ్రీకృష్ణుని రూపములో నున్నట్లు చూచెను. అనఁగా [illegible]మాగతుఁడు, శ్రీకృష్ణుఁడు. అందువలన సామాన్యజనులకు మానవమాత్రుఁడుగాఁ గన్పట్టిన శ్రీకృష్ణుఁడు సర్వవ్యాపకుఁడైన విష్ణువే, ఈశ్వరుఁడే. సర్వులకు నాత్మయైన నిర్గుణస్వరూపుఁడే.

అవ॥ ఆయనకు రాగద్వేషములు లేవు. సర్వజీవులకు వారి వారి కర్మములకుఁ దగిన ఫలము లిచ్చుచున్నాఁడు అని భగవత్తత్త్వమును నిరూపించుచున్నారు.

**వక్షసి యదా జఘాన శ్రీవత్సః శ్రీపతేః స కిం ద్వేష్యః।**
**భక్తానా మసురాణా మన్యేషాం వా ఫలం సదృశమ్ ॥**
**203**

ప్ర : యదా = ఎప్పుడు, శ్రీవత్సః = భక్తుఁడగు శ్రీవత్సనాముఁడు, శ్రీపతేః = లక్ష్మీపతియొక్క, వక్షసి = ఉరమందు, జఘాన = తన్నెనో (తదా = అప్పుడు), సః = ఆతన్నినవాఁడు, కిం ద్వేష్యః = ద్వేషింపఁబడెనా యేమి? (భగవానుఁ డాయనను బహూకరించెను గాని ద్వేషింపలేదు.) ఆయన, భక్తానాం = భక్తులకుగాని, అన్యేషాం, అసురాణాం వా = భక్తులుకాని రాక్షసులకుగాని, సదృశం = వారికర్మానురూపమగు, ఫలం = ఫలమును, (యచ్ఛతి = ఇచ్చును).

తా॥ శ్రీకృష్ణభగవానునకు రాగద్వేషములు లేవు. ఎవరి కర్మములకుఁ దగినఫలములు వారి కిచ్చును. శ్రీవత్సుఁడను భక్తుఁ డాయనను వక్షమునఁ దన్ని కొట్టెను. కాని యాయన యతనిని ద్వేషింప లేదు. ఆపదలలో భక్తులు తన్నుఁ గొల్చినపుడు పరమేశ్వరుఁడు వారికోర్కెలను వారికర్మానురూపఫలముగనే తీర్చును. గాని వారిపై రాగముకొలఁదిమాత్రముగాదు. ఆపదలోఁ దన్ను బ్రార్థించిన ద్రౌపది కాయన యక్షయవస్త్రము

లిచ్చెను. ఆమె మానము కాపాడెను. బీదవాఁడైన కుచేలున కైశ్వర్యమిచ్చెను. దుర్గుణులైన రాక్షసులనాయన వారిచేష్టా ఫలముగానే తానే దండించెను. శిశుపాలకంసాదులాయనను శత్రుభావముతోఁ జూచినను. వారిని దానికి సంహరించి వారి పూర్వకర్మఫలముగనే వారికి శాపము క్తి నొసంగెను. ప్రహ్లాదుఁడు రాక్షసబాలుఁడైనను వానియనన్యభక్తికిఁ దగినంతగా కాపాడెను. ఇట్టి యుత్తరీలకుఁ గూడ వారివారికర్మననుసరించి వారికి ఫలము లిచ్చుచుండెను. ఎవరియందును రాగద్వేషములేక జగము లను నిష్పక్షపాతబుద్ధితో పాలించు భగవంతుడు శ్రీకృష్ణుఁడు. ఈ శ్రీకృష్ణచర్యలన్నిటిలో ఈయుదాసీనత్వము, ద్వంద్వాతీతత్వము, నిర్లేపత్వము జగన్మోహనత్వము మొదలగు సర్వేశ్వరలక్షణ ములే ప్రకాశితములు. విమర్శనావివేకసూక్ష్మ మిదియు.

అవ॥ ఆయనకు శత్రువులు మిత్రులు లేరు. ఆయన సర్వజ్ఞుఁడు. మానవులందరికి తెలియనిదని యనుచున్నారు.

తస్మాన్న కోఽపి శత్రుర్నో మిత్రం నాప్యుదాసీనః।
నృహరిః సన్మార్గస్థః సఫలః శాఖీవ యదునాథః ॥ 204

ప్ర॥ తస్మాత్ = కనుక, హరేః = పరమేశ్వరుఁడగు విష్ణునకు, కః అపి = ఎవఁడును న శత్రుః = శత్రువనుకాఁడు. నో మిత్రం = మిత్రుఁడును కాఁడు. న అపి ఉదాసీనః = శత్రువునుగాక మిత్రమునుగాక, తటస్థముగా నుండువాఁడున్ను లేఁడు. నృహరిః = మనుష్యునిగా అవతరించిన విష్ణువగు, యదునాథః = శ్రీకృష్ణుఁడు, సన్మార్గస్థః = మనుష్యులు వెళ్ళు మంచిమార్గములో (ధర్మప్రవర్తనమార్గములో) నున్న, సఫలః = పండ్లతో నిండియున్న, శాఖీ ఇవ = చెట్టువలె. అస్తి = ఉన్నాఁడు.

తా॥ అందువలన, ఆయన జ్ఞానదయాసముద్రుఁడై, అందరిని సమభావముతో రక్షించు భగవద్రూపాచరణమునకే యదువంశ మున శ్రీకృష్ణుఁడుగా నా పరమేశ్వరుఁ డవతరించినాఁడు. ఆయ

నక్షు శత్రులుకాని మిత్రులుకాని తటస్థులుకాని యెవ్వరును లేరు. అందఱు జీవులను సమత్వబుద్ధితో న్యాయముగాఁ బరిపాలించు జగన్నాథుఁ డతఁడు. ఆయన మనుష్యులు వెళ్లు మంచి బాటలో పండ్లతో నిండిన యొక పెద్దవృక్షమువంటివాఁడు. అందఱును వారుపేరను భేదము లేకుండ, ఫలవృక్షము పండ్లతో నిండి తన క్రిందకు వచ్చినవారికి నీడను గోసికొన్నవారికి పండ్లనుగూడ నక్కుండ నిచ్చును. అవి యనుభవించువారియెడ రాగద్వేషములు వృక్షమునకు లేవు. అట్లే శ్రీహరియగు శ్రీకృష్ణు నాశ్రయించి వాంఛితార్థము పొందవచ్చు, సన్మార్గధర్మవర్తనులగు జనులు.

ధ్రువ॥ ఆయనను ద్వేషించిన శత్రువులైనను ముక్తిని బొందినారని చెప్పుచున్నారు.

లోహశలాకానివహైః స్పర్శాశ్మని భిద్యమానేఽపి।
స్వర్ణత్వమేతి లోహం, ద్వేషాదపి విద్విషాం తథా
ప్రాప్తిః॥ 205

ప్ర : లోహశలాకానివహైః = ఇనుపకడ్డీలు సుత్తెలు మొదలైనవాని సమూహముచేత, స్పర్శాశ్మని = స్పర్శవేధి (పరుసవేది యనఁబడు నొక రాయి వంటి మూలికావిశేషమును ఇనుము వచ్చి దానిని తాఁకినచో నది బంగారముగా మాఱు నందురు), భిద్యమానేఽపి = ముక్కలుగాఁ గొట్టఁబడుచున్నదైనప్పటికిని, లోహం = ఆయినుపకడ్డీలు (సుత్తి), స్వర్ణత్వం = బంగారపుకడ్డీలు (సుత్తి) గా మాఱి బంగారుతనమును. ఏతి = పొందును. తథా = అదేవిధముగా ద్వేషాత్ అపి = (ఆయనపై) ద్వేషమువలనఁగూడ, విద్విషాం = శత్రువులకు, (సుగతేః = అభ్యుదయముయొక్క) ప్రాప్తిః = లాభము (భవతి = కలుగును).

తా॥ పరుసవేదిని ముక్కలు చేయుటకుఁ బూనుకొన్న ఇనుపకడ్డీలు సుత్తులు సైతము దాని తోడి స్పర్శమువలన బంగారముగా మాఱును. అట్లే శ్రీకృష్ణుని ద్వేషించిన కంసుఁ , శిశు

పాలుఁడు మొదలైన గాథశత్రువులు సైతము విష్ణుస్పర్శచే సుగతిని చెందినారు. ఇఁక భక్తులవిషయము చెప్పవలసిన పనియే లేదు.

అవ॥ ఇచటనొకయాక్షేపణలేవఁదీయుచున్నారు.

**నను ఆత్మనః సకాశా దుత్పన్నా జీవసన్తతి శ్చేయమ్।**
**జగతః ప్రియతర ఆత్మా త త్ప్రకృతే నైవ సంభవతి॥**
**206**

ప్ర : నను= మఱి, ఆత్మనః సకాశాత్ = ఆత్మనుండి (పరమాత్మనుండి,) ఇయం= ఈ, జీవసన్తతిః చ = ప్రాణిసమూహముకూడ, ఉత్పన్నా= పుట్టినది. జగతః= విషయజగత్తునకంటె, ఆత్మా = జనకపదార్థమగునాత్మయే, ప్రియతరః= ఎక్కువయిష్టమైనవాఁడు, (కావలయు) (కాని), ప్రకృతే(కృష్ణే) = ప్రస్తుతము మనము విచారించుచున్న పరమాత్మ యనఁబడు కృష్ణునియందు, న, సంభవతిఏవ= కుదురనే కుదురదు.

తా॥ పరమాత్మనుండియే ఈసర్వజీవులు సృష్టియైనారని, ఆత్మకన్న ప్రియమైన వస్తువు ఇంకొకటి ఈజీవులకు లేదని శ్రుతు లనేకవిధములుగాఁ జెప్పుచున్నవి. పరమేశ్వరుఁ డచింత్యమైనశక్తి గలవాఁడు. అందఱకు నాత్మ యైనవాఁడు. కావున జీవునకుఁ బ్రపంచములో నందఱికన్న మిక్కిలి ప్రియతముఁడు ఆత్మయే కావలెను. కాని ఈకృష్ణుఁడు మనవంటిమనుష్యశరీరము కలవాఁడే. పరమేశ్వరునివలె ఈజీవసమూహమంతటిని నెక్కడ సృజించినాఁడు? అందఱకు నెట్లాత్మవలెఁ బ్రియుమైనాఁడు? అట్టి వేమియును లేని యీశ్రీకృష్ణమానవుఁడు పరమాత్మకాఁడు అని ఆక్షేపణ.

అవ॥ పైయాక్షేపమునకు నుత్తరముగా ఆయనపరమేశ్వరత్వమును నాయనజీవితవిశేషములతో, నిరూపించి చెప్పుచున్నారు.

వత్సాపహరణావసరే పృథగ్వయోరూపవాసనాభూషాన్।
హరి రజమోహం కర్తుం సవత్సగోపాన్ వినిర్మమే
స్వస్మాత్॥ 207

ప్ర : హరిః = శ్రీకృష్ణుడు, (చిన్నగోపాలబాలుఁడై తోడిగోపబాలురఁ గూడికొని, లేగదూడల నడవికిఁ దోలుకొనిపోయి వానిని మేపుచుండఁగా (తండ్రులు పెద్దఆవులను మేపుచుండఁగా వీరు లేగదూడలను గాసిరి.) ఆచిన్నికృష్ణుని పరీక్షించుటకై బ్రహ్మదేవుఁడు తక్కినగోపబాలురను, దూడలను దీసికొనిపోయి యొకకొండగుహలో దాఁచెను. ఇది భాగవతగాథ.) వత్సాపహరణావసరే = సృష్టికర్తయగు బ్రహ్మ, లేగదూడలను, గోపబాలురను హరిదగ్గఱనుండి హరించి దాఁచిన సమయమందు, అజమోహం = బ్రహ్మదేవునకు మోహమును, కర్తుం = కల్గించుటకు, పృథగ్వయోరూపవాసనాభూషాన్, పృథక్ = వేఱువేఱుగానున్న, వయః = వయస్సులును, రూప = రూపములును, వాసనా = పూర్వసంస్కారరూపములైన ఇష్టానిష్టములు, మనః ప్రవృత్తికారణములును, (అలవాట్లు మొదలైనవి,) భూషాన్ = సొమ్ములు, వేషములు మొదలైనవియుగల, సవత్సగోపాన్ = వారివారిలేఁగదూడలతో కూడియున్న ఆయాగోపబాలురను, స్వస్మాత్ = తనశరీరమునుండియే, వినిర్మమే = (నిర్మించెను) సృజించెను.

తా॥ శ్రీకృష్ణునిసర్వాత్మత్వమును, ఈశ్వరలక్షణమహిమలును, వర్ణించుచున్నారు. శ్రీకృష్ణుఁడు ఐదుసంవత్సరముల బాలుఁడై యున్నప్పుడు తెల్లవారుజాముననే లేచి, తోడిగోపబాలురఁ గూడుకొని తమఆవుదూడలను మేపుటకై దగ్గఱవనములకుఁ దోలుకొనిపోయి విహరించుచుండెను. ఈయన నిజముగాఁ బరమేశ్వరుఁ డగునా? కాఁడా? పరీక్షింతమని తలఁచి బ్రహ్మదేవుఁడు బలరామకృష్ణులకు దూరముగా నాబాలురు లేగలు పోవుటచూచి, వాని నన్నింటిని ఒకకొండగుహలో దాఁచెను. ఇది శ్రీకృష్ణుఁడెఱిఁగి, తాను వారినందఱను తిరిగి తీసికొనివచ్చుశక్తి కలిగియు

న్నను, దన యీశ్వరత్వమహిమను బ్రహ్మదేవున కెఱిఁగించుట కుఁ, దానే సత్యసంకల్పమాత్రమున ఆదాచబడిన బాలుర లేఁగల రూపములవేర్వేరువ్యక్తులుగా తననుండియే పుట్టించెను. ప్రాఁతలేగలు బాలురు నెంతెంత వయస్సులో నుండిరో ఏయే ప్రత్యేకరూపములు, భూషణములు, వస్త్రములు, అలవాట్లు, కోరికలు, తెలివితేటలు, విద్యాబుద్ధులు కలిగియుండిరో సరిగా నారూపములు వయస్సులు నన్నియు నట్లే యుండునట్లు వీరు వేఱను భావము కల్గకుండునట్లు తానే యారూపముల నప్పుడే సృజించెను. ఇంతకన్న నాశ్చర్యకరమైన విషయ మేమున్నది? ఐదుసంవత్సరముల సామాన్యబాలుఁ డీవిధముగా ఈశ్వరునివలె మాఱుసృష్టి క్షణములోఁ జేయఁగలఁడా? ఇట్టు ఆత్మయగు శ్రీకృష్ణునుండి జీవసృష్టి జరుగుట లోకవిదిత మయ్యె.

అవ॥ ఈసంఘటనను, శ్రుతిచెప్పినట్లు యున్నదని చూపుచున్నారు.

అగ్నే ర్యథా స్ఫులిఙ్గాః క్షుద్రా స్తు వ్యుచ్చరన్తీతి।
శ్రుత్యర్థం దర్శయితుం స్వతనో రతనో త్స
జీవసన్దోహమ్॥ 208

ప్ర : యథా=ఏవిధముగా, అగ్నేః= అగ్నినుండి, క్షుద్రాః=మిక్కిలి చిన్నవైన, స్ఫులింగాః= నిప్పురవ్వలు, వ్యుచ్చరన్తి=బయల్వెడలుచున్నవో, ఇతి= అని, శ్రుత్యర్థం = అబృహదారణ్యకశ్రుతిలోఁ జెప్పినవిషయమును, దర్శయితుం = చూపించుటకొఱకు, సః = అశ్రీకృష్ణబాలుఁడు, స్వతనోః= తనశరీరమునుండి, జీవసందోహమ్= అగోపబాలగోవత్సరూపజీవసంఘమును, అతనోత్=సృష్టించెను.

తా॥ బృహదారణ్యకశ్రుతి:- "యథా ఽఽగ్నేః క్షుద్రా విస్ఫులిఙ్గా వ్యుచ్చర న్త్యేవ మే వాస్మా దాత్మనః సర్వే ప్రాణాః సర్వే లోకాః సర్వే దేవాః సర్వాణి భూతాని వ్యుచ్చరన్తి" (బృ

2-1-20) "ఏవిధముగా మండుచున్న పెద్ద (యగ్ని) మంట నుండి మిక్కిలి చిన్నవగు నిస్ఫురవ్వలు (అన్నివైపులను) వెడలుచున్నవో, అట్లే యీయాత్మనుండి సమస్తమైన యింద్రియములు, సమస్తమైన లోకములు, సర్వదేవతలు, సమస్తమైన ప్రాణులు బయల్వెడలుచున్నవి''. అని బృహదారణ్యకశ్రుతివచనము. ఈశ్రుతివాక్యములోనిసత్యమును న్యాయానుసారము, తన ఈశ్వరత్వలక్షణమును ప్రకటించుటకో యన్నట్లు ఆచిన్నిబాలుఁడైన కృష్ణుఁడు తనశరీరమునుండియే అప్పటికప్పుడు, బ్రహ్మాదాచికటువంటివారే యన్నట్లు వేరువేరుగా గోపబాలురను, లేగదూడలను సృజించెను. ఈప్రత్యక్షసృష్టిసర్వము శ్రీకృష్ణసంభవము. కావున మానవరూప శ్రీకృష్ణుఁడు, బ్రహ్మాదులను సృష్టించు అవ్యక్త పరమేశ్వరలక్షణుఁడే సుమా అని నిర్ణయరూపసమాధానము.

అవ॥ ఈగోపబాలురు వారితల్లిదండ్రులకును గోవత్సములు వాని తల్లి గోవులకు ఆత్మవలె మిక్కిలిప్రీతిపాత్రము లగుటను జూపుచున్నారు.

యమునాతీరనికుఞ్జే కదాచిదపి వత్సకాంశ్చ చారయతి।
కృష్ణే తథా ఽఽర్యగోపేషు చ పరగోష్ఠేషు చారయత్స్వారాత్॥ 209

వత్సాన్నిరీక్ష్య దూరా ద్గావః స్నేహేన సంభ్రాన్తాః
తదభిముఖం ధావన్త్యః ప్రయయు ర్గోపైశ్చ దుర్వారాః॥ 210

ప్రస్రవభరేణ భూయః స్రుతస్తనాః ప్రాప్య పూర్వవద్వత్సాన్।
పృథురసనయా లిహన్త్య స్తర్ణకవత్యోఽప్యపాయయన్ ప్రముదా॥ 211

గోపా అపి నిజబాలా ఞ్జగృహు ర్మూర్ధాన మాఘ్రాయ।
ఇత్థ మలౌకికలాభ స్తేషాం తత్ర క్షణం వవృధే॥ 212

ప్ర : అపి= మఱియు, కదాచిత్= (పైనచెప్పినదిజరిగినపిదప) ఒక ప్పుడు, కృష్ణే = బాలకృష్ణుఁడు, యమునాతీరనికుంజే = యమునానదిగట్టున పొదలతో నిండిన యాస్థలమందు, వత్సకాన్, చ= ఆవుదూడలను, చారయతి (సతి)= నడిపించుచుఁ గాయుచున్నవాఁ డగుచుండఁగా, తథా= అదేవిధముగా, ఆర్యగోపేషు, చ = పూజింపఁదగి పెద్దవారైన గొల్లవారుకూడ, ఆరాత్= దూరముగా, వరగోష్ఠేషు= పచ్చగడ్డి బాగుగా పెరిఁగి గోవులు మేయఁదగిన ప్రాంతములందు, (గాః = ఆవులను), చారయత్సు = నడిపించుచుఁ గాయుచు న్నవా రగుచుండఁగా గావః= ఆతల్లియావులు, దూరాత్= దూరముగా, వత్సాన్ =పాలువిడిచిన తమదూడలను, నిరీక్ష్య = చూచి, స్నేహేన = తాముకన్న దూడలమీఁది ప్రేమచేత, సమ్భ్రాన్తాః= రేకెత్తినయుత్సాహము గలవై, తదభి ముఖం = ఆలేగలకెదురుగా (వానినిగలిసికొనుటకై) ధావన్త్యః = పరుగిడు చుండఁగా, గోపైః చ= తమ్ముఁగాయు గొల్లవారిచేతఁగూడ, దుర్వారాః= ఆప బడఁజాలనివై, ప్రయయుః = (దూడలగూర్చి) త్వరగా వెళ్ళినవి. ప్రస్రవ భరేణ= పొంగి, పొర్లి, పారు పాలబరువుచేత, భూయః= మిక్కిలిగా, స్రుత స్తనాః= పాలు గారుచున్న పొదుగులుగల, తర్ణకవత్యఃఅపి = అప్పుడేపుట్టిన లేఁగలు గలవయ్యు, ఆయావులు, పూర్వవత్= వెనుకటివలె, వత్సాన్=పాలు విడిచినదూడలనే, ప్రాప్య= పొంది, (వానిదగ్గఱకు వెళ్ళి, కలిసికొని,) పృథు రసనయా= పెద్దవైన తమనాలుక(ల)చేత, లిహన్త్యః (వానిని) నాకుచున్నవై, ప్రముదా = మిక్కిలిసంతోషముచేత, ప్రపాయయన్ = ఆదూడలకు పాలిచ్చి త్రాగించినవి. గోపాః అపి = గొల్లవారుకూడ, నిజబాలాన్ = కృష్ణునితో నున్న తమకుమారులను, మూర్ధానం = వారితల(ల)ను, ఆఘ్రాయ = మూ ర్కొని, [వాసనచూచి,] జగృహుః = [వారిని మిక్కిలిప్రేమచే] కౌఁగిలించు కొనిరి. ఇత్థం= ఈవిధముగా, తేషాం= వారికి, వానికి, తత్ర = అక్కడ, క్షణం= క్షణముసేపు, అలౌకికలాభః = ఈలోకమునకు సంబంధింపని పర మానందము వవృధే= వర్ధిల్లెను.

తా॥ బ్రహ్మదేవుఁడు గోపబాలకవత్సములను దాఁచియుంచిన దినములందు, బాలకృష్ణుఁడు, తానే యాయా బాలకవత్సముల రూపములను దాల్చి, సరిగా పూర్వమువారివలెనే, ఎవ్వరికీ నను మానము కల్గకుండు నట్లు, సంచరించుచుండఁ గొంతకాలము గతించెను. ఒకనాఁ డాయన తా నట్లుసృష్టించిన యాగోపబాలురతో (అవి నరూపములే) పొదలతో నిండిన యమునాతీరప్రాంతమందు తానుసృష్టించిన ఆవుదూడలను గాయుచుండెను. వారికిఁ గొంచెము దూరముగా, వారితండ్రులు,పచ్చగడ్డిబాగుగా దట్టముగా పెరిఁగిన ప్రాంతమందు, గోమాతలను గాయుచుండిరి. ఆయావులు దూరముగా గడ్డిని మేయుచున్న, పాలు విడిచిన తమ తఱపిదూడలను (అవి శ్రీకృష్ణనిరూపములు)జూచినవి. వెంటనే వానికిఁ ఆపెరిఁగిన తమ దూడలపై వర్ణింపరానిప్రేమ పొంగి పొర్లి పాఱినది. వానికై పరువెత్తసాగినవి. దారిలో కాపరి గొల్లవా రెంతవారించుచున్నను ఆఁగక, ఆతల్లియావులు తమబిడ్డలకుఁ బాలీయవలె నను నిండు మనంబుతో తమపొదుగులు పాలతో నిండి పొర్లి పాఱుచుండఁగా కొన్ని యప్పుడేపుట్టిన లేఁగలకు (తర్ణకము) ఏంతగా, వదలివేసి, మఱివింతగా పాలువిడిచి కొంచెముపెరిఁగి యిప్పుడు కృష్ణునిదగ్గఱ మేయుచున్న దూడలదిక్కునకు క్షణ మెడబాసి యుండఁజాల మన్నట్లు వేగముగాఁ బరువెత్తుకొని వచ్చినవి. తమప్రేమచేష్టలుగా ఆయావులు పెద్దవైన తమనాలుకలతో ఆతఱపిదూడలను నాకుచు మిక్కిలిసంతోషముతో వానికి పాలిచ్చినవి. పెద్దగొల్లవారికికూడ తమపిల్లలపై నట్టిప్రేమయే పొంగి పొర్లగా వా రాపిల్లలను గౌఁగిటఁ జేర్చి తలలను మూర్కొనిరి. ఇట్టి యలౌకికప్రేమ గోవులకు, గోపాలకులకు తమతమపిల్లలపై గలిగి యనుభూతమై వ్యక్తమయ్యెను. దీనికి కారణము శ్రీకృష్ణుఁడే ఆరూపముల ధరించి యుండుట. అనఁగా ఆగోపబాలురు, ఆవత్సములు శ్రీకృష్ణస్వభా

వాత్మకము లైనవి. కావున ప్రాణులకు తమయాత్మకంటె ప్రియతమమైన దింకొకటి లేదని తెలమైనది. ఈసంఘటనము శ్రీకృష్ణుఁడు సర్వాత్ముం డని బోధించుచున్నది.

దీనిని విపులముగా శ్రీపోతనమహాకవి శ్రీమదాంధ్రభాగవతమున చక్కగా నత్యద్భుతముగా వర్ణించినారు. ఇదిగో ఆభాగవతకథావర్ణనము. కృష్ణుఁడు గోపబాలురతోఁ జల్ది లారగించుచుండఁగా దూడలు గడ్డి మేయుచు దూరము పోయెను. దానికిఁ గలవరపడు గోపబాలురను చల్దులఁ దినుచుండుఁడు నేను దూడలఁ దెచ్చెద నని కృష్ణుఁడు వెళ్లెను. బ్రహ్మ యావత్సముల దాఁచెను కొంత వెదకి దూడలఁ గానక వెనుకకుఁ దిరిగి గోపబాలురకొఱకు రాఁగా వీరిని గూడ బ్రహ్మ దాఁచుటచేత వీరును గన్పడరైరి. అప్పుడు కృష్ణుఁ డిది బ్రహ్మ మాయఁగా నెఱిఁగి తాను వానిని తిరిగిఁ దే సమర్థుం డయ్యెను.

క॥ గోపాలసుతులు లేరని గోపికలకుఁ జెప్పనేల గోపాలకులున్ గోపికలు నలర బాలురక్రేపులరూపముల నేఁజరించెద ననుచున్ భా 10-1-511

మ॥ కరముల్ పాదములున్ శిరంబు లవలగ్నంబుల్ ముఖంబుల్ భుజాంతరముల్ ముక్కులు గన్నులున్ శ్రవణముల్ దంతాదులున్ దండకాంబరస్రగ్వేణువిషాణభూషణవయోభాషాగుణాఖ్యాన నూత్నరతల్ వీడ్వడకుండఁ దాల్చె విభుఁ డావత్సార్భకాకారముల్॥ 512

క॥ రూపంబు లెల్ల నగు బహురూపకుఁ డిటు బాలవత్సరూపంబులతో నేపారు టేమి చోద్యము రూపింపఁగ నతని కితరరూపము గలదే?

క॥ మరలుపు మనియెడు కర్తయు, మరలించు కుమారకులును, మరలెడు క్రేపుల్, పరికింపఁ దానయై హరి మరలం జనె లీలతోడ మందకు నధిపా,

వ॥ ఇట్లు బాలవత్సరూపంబుల విహరించుచు మందకు వచ్చి వారివారి దొడ్ల నయ్యైవత్సంబుల ముందఱకందువల నిలిపి తత్తద్బాలరూపంబుల నందజగృహంబులం బ్రవేశించి వేణునాదంబులు సేసిన –

చ॥ కొడుకులవేణునాదములు గొబ్బున వీనులకుం బ్రియంబులై ముఁవడ లేచి యెత్తికొని మూర్కొని తల్లులు గౌఁగిలించుచుం జడిగొనఁ జేష

వచ్చి తమచన్నులయందు సుధాసమంబులై వెడలెడు పాలు విందుకొనువేడుక నిచ్చిరి తత్సుతాళికిన్॥

ఆకుమారకులైన దాతేండ్లవారు పాలువిడిచి చాలకాలమైనది. ఐనను ఈ క్రొత్తబాలురను జూడఁగనే వారికి మరల పాలురాఁగా త్రాగించినారు.

వ॥ మఱియుఁ దల్లు లుల్లంబులం బెల్లుగ వెల్లిగొనిన వేడుకలం, దమనందనులకు నలుంగు లిడి, మజ్జనంబులు గావించి, గంధంబు లలంది, తొడవులు తొడిగి, నిటలఫలకంబుల రక్షాతిలకంబులు పెట్టి, సకలపదార్థసంపన్నంబులైన యన్నంబు లొసంగి సన్నములుగాని మన్ననలు చేసిరి.

క॥ ఏతల్లుల కేబాలకు, లేతెఱఁగున దిరిగి ప్రీతి నెసగింతురు మున్నా తల్లుల కాబాలకు, లాతెఱఁగునఁ బ్రీతిఁ జేసి రవనీనాథా! 518

ఉ॥ పాయనివేడ్కతో నువికిపట్టులకుం జని గోవు లెల్ల వంటా యని చీరి హుమ్మనుచుఁ బైకొని మూర్కొని పంచితిల్లి పెల్లై యతివేగమై పొదుగులం దెరలేక స్రవించుచున్న పాలాయెడ నాకుచున్ మరుదులై యొసఁగెన్ నిజవత్సకోటికిన్. 520

క॥ వ్రేతలకును గోవులకును, మాతృత్వము చాల గలిగె మఱి మాధవుపై, మాతలని హరియు, నిర్మల, కౌతూహల మొప్పఁదిరిగెఁ గడు వాల్కమునన్. 521

ఆ॥ ఘోషజనుల కెల్ల గుఱ్ఱలపై వేడ్క పూఁటపూఁట కెలమి బొటకరించె నిచ్చ క్రొత్త యగుచు నీరజాక్షునిమీఁద వేడ్క దమకుఁ బొల్చి వెంసినట్లు. 522

ఈమాయాగోపబాలవత్సములమీఁద నందఱికిఁ బొల్చి యెన్నఁడు చూడని మమత వెల్లివిరిసినది.

వ॥ ఇట్లు కృష్ణుండు బాలవత్సరూపంబులు దాల్చి తన్నుఁ దాన రక్షించుకొనుచు మందవనంబుల వసంతమహామంబున నొక్క యేఁడు క్రీడించె, నాయేఁటికి నైదారు దినంబులు కొదువపడియుండ నందొక్కనాఁడు బలభద్రుండును దానును వనంబునకుం జని మందచేరువ లేఁగల మేప నతిదూరంబునం గోవర్ధనశైలశిఖరంబున మేపంబులు గ్రాసంబులు గొనుచున్న గోవు లాలేఁగలం గని॥ 523

ఇంతవఱకు గోపకులు గోవులు ఇండ్లదగ్గఱ లేరు. ఒక్కొక్కప్పుడు మేత సమీపమున లేనప్పుడు వానిని దూరప్రాంతములకు గోపాలురు తోలుకొనిపోవుట యలవాటే. ఇప్పుడు వారు నవి యీమాయాగోవత్సముల గోపకుమారులఁ గనిరి.

చ॥ ముదమున హుంకరించును మూపులపై మెడ లెత్తి చాచుచున్ బదములు నాల్గు రెండయిన బాగుగఁ గూడఁగఁబెట్టి దాఁటుచున్ వదనములన్ విశాలతరవాలములన్ వడి నెత్తి పాటి యామొదవులు సన్నులం గుడిచె మూఁతుల గ్రుంగెడి భంగి నాకుచున్. 524

వ॥ అంత నాగోపకులు గోవుల వారింప నలవిగాక దిగ్గన నలకతోడి సిగ్గు లగ్గలంబుగ దుర్గమమార్గంబున వానివెంట నంటి వచ్చి లేఁగల మేపుచున్న కొడుకులం గని 525

ఉ॥ అయ్యలఁ గంటి మంచు బులకాంకురముల్ వెలయంగఁ గుఱ్ఱలం జయ్యన డాసి యెత్తికొని సంతసమందుచుఁ గౌఁగిలించి తారయ్యెడ నౌదలల్ మనము లారఁగ మూర్కొని ముద్దుసేయుచున్ దయ్య మెఱుంగు గోపకులు దద్దయు నుబ్బిరి నిబ్బరంబుగన్.

ఈగోవులు తమదూడలకుఁ బాలిచ్చుట మానినవి. అవి తర్ణకములు కావు. వాని కిప్పుడు వీనిని జూచుటతోడనే పాలు చేపుకు వచ్చి ప్రవహించినవి. గోపకులకుఁ గూడ తమ యీకుమారులయందలిప్రేమ తొల్లిఁటి ప్రేమను మించినది. ఈయలౌకికసంఘటన వర్ణించు నీశ్లోకములకు పోతనకవీంద్రుని రసభరితలలిత సహేతుకవ్యాఖ్యను మించినవ్యాఖ్య మఱే ముండును?

అవ॥ తనయాత్మయే (పరమాత్మయే) జీవునకు ప్రియతముఁ డగుటచే శ్రీకృష్ణుఁడు సర్వాత్మస్వరూపుఁ డనుట విశదీకరింపఁబడుచున్నది.

గోపా వత్సా శ్చాన్యే పూర్వం కృష్ణాత్మకా హ్యభవన్।
తే నాత్మనః ప్రియత్వం దర్శిత మేతేషు కృష్ణేన ॥ 213

ప్ర : గోపాః = గోపబాలురును, వత్సాః చ = ఆవుతఱపిదూడలను, పూర్వం = వెనుక, అన్యేహి = ఇతరులు ఇతరములేకదా! (తండ్రులకు, తల్లి

గోపులకు వారు వేఱుగా నుండిరి. ఇప్పుడు కృష్ణుఁ డారూపములు గైకొనఁగా వారు) కృష్ణాత్మకాః = కృష్ణుడే స్వరూపముగా గలవారు, అభవన్ = అయిరి. తేన = దానిచేత (తండ్రులు, గోవులు గోపబాలురయెడల, వత్సములయెడల అకాలికప్రేమచూపించిన పైకథచేత) కృష్ణేన = శ్రీకృష్ణునిచేత, ఏతేషు = గోవుల యందు, గోపకులయందు, ఆత్మనః = ఆత్మయొక్క (అనఁగా ఆత్మయగు కృష్ణ సంభవులైన గోపబాలుర, దూడలయందు) ప్రియత్వం = ప్రేమాస్పదత్వము, దర్శితమ్ = చూపబడినది.

తా॥ శ్రీకృష్ణుఁడు సర్వులకు అత్యంతప్రేమాస్పదమగు ఆత్మస్వరూపుఁడు, మొదట గోపకులకు వారియావులకు వారి సొంతబాలురు దూడలు అన్యులు, అన్యములు నై గౌణాత్మగా నుండెను. కాని శ్రీకృష్ణుఁడే ఆరూపములను దాల్చి గోపబాలురు, దూడలుగా వచ్చినప్పుడు, ఈబాలురు దూడలు, తమతండ్రులకు, గోవులకు ముఖ్యాత్మలై అత్యంతప్రేమపాత్రులు పాత్రము లైనవి. కావున ఆత్మయే అత్యంతప్రియతమ మని శ్రీకృష్ణునిచే ప్రదర్శితమయ్యెను గదా!

అవ॥ దీనివలన శ్రుతివాక్యము సత్య మని నిరూపింపఁబడిన దను చున్నారు.

ప్రేయః పుత్రా ద్విత్తా త్ప్రేయో ఽన్యస్మాచ్చ
సర్వస్మాత్ ।
అన్తరతర య దా త్మేత్యుపనిషదః సత్యతా ఽభిహితా॥
214

ప్ర : అన్తరతరః = అన్నిటికన్న లోపలనున్నదియగు యదాత్మా = ఏ ఆత్మకలఁడో, (సః = ఆయన) పుత్రాత్ = పుత్రునికన్నను, విత్తాత్ = ధనమున కన్నను, అన్యస్మాత్ = ఇతరమైన, సర్వస్మాత్ = సర్వమునకంటెను, ప్రేయః = ఇష్టతర మైనవాఁడు, ఇతి = అనిచెప్పు, ఉపనిషదః = ఉపనిషత్తుయొక్క, సత్యతా = సత్యత్వము (పైకథచేత) అభిహితా = చెప్పఁబడినది.

([illegible])

తా॥ బృహదారణ్యకశ్రుతి (4-2-5) యాజ్ఞవల్క్యమైత్రేయీసంవాదములో యాజ్ఞవల్క్యుఁడు తనభార్యయగు మైత్రేయికి ఆత్ముఁడు, భర్తకన్న పుత్రునికన్న, ధనధాన్యాదిసంపదలకన్న, గృహక్షేత్రాదులకన్న, సర్వమునకన్న ప్రియతముఁ డని, యాయనను దెలిసికొన్న నిత్యానందము లభించు నని చెప్పినాఁడు. ఆయాత్మ అన్నిటికన్న లోపలనున్న ప్రత్యగాత్మయగు పరమాత్మయే. అదే శ్రీకృష్ణుఁడు. ఆయన సర్వులకుఁ బ్రియతముఁ డని చూపుటవలన, నాశ్రుతి సత్యమైన దని నిరూపింపఁబడినది.

అవ॥ సర్వసముఁడు పరమాత్మ. కాని శ్రీకృష్ణునియందు (విషమ) అసమానప్రవర్తనము, అపరమాత్మత్వము గలదని యాక్షేపణ లేవఁదీయఁబడుచున్నది.

నను చోచ్చావచభూతేష్వాత్మా సమ ఏవ వర్తతే ఽథ హరిః ।
దుర్యోధనే ఽర్జునే వా తరతమభావం కథం ను గతవాన్ సః ॥ 215

ప్ర: నను,చ=మఱి యింకను, ఉచ్చావచభూతేషు = ఎక్కువతక్కువలుగల జీవులయందు, ఆత్మా=ఆత్మ, సమ ఏవ=ఏకవిధముగనే, వర్తతే=ప్రవర్తించును. అథ=సరే (అంగీకారము) (కాని) సః హరిః=ఆశ్రీకృష్ణుఁడు, దుర్యోధనే = దుర్యోధనునియందును, అర్జునేవా = అర్జునునియందును, తరతమభావం=తారతమ్యమును, భేదభావమును, కథం = ఎట్లు, గతవాన్ను= పొందెనో తెలియఁ గోరిక. [ఇరువురు సమానముగా యుద్ధసహాయ మర్థింపఁగా నర్జునపక్షమున నేల చేరెను? అని భావము.]

తా॥ మఱి పరమాత్మ సర్వజీవులయెడ సమానముగా ప్రవర్తించునుగదా? ఆయన అట్లు ప్రవర్తింపక, విరుద్ధముగా దుర్యోధనార్జునుల విషయములో నేల అర్జునపక్షపాతము వహిం

చెను? వహించినాఁడు కావున, ఈకృష్ణుఁడు పరమాత్మ కాఁడు. అని పూర్వపక్షము (ఆక్షేపణ).

అవ॥ పైయాక్షేపణకు సమాధానము చెప్పుచున్నారు.

**బధిరాన్ధపఙ్గుమూకా దీర్ఘాః ఖర్వా సరూపాశ్చ।**
**సర్వే విధినా దృష్టాః సవత్సగోపా శ్చతుర్భుజా స్తేన॥ 216**

**భూతసమత్వం నృహరేః సమో హి మశకేన నాగేన।**
**లోకైః సమ స్త్రిభి ర్వేత్యుపనిషదా భాషితం సాక్షాత్॥ 217**

ప్ర: తేన, విధినా = శ్రీకృష్ణుని బరీక్షించుటకు వచ్చిన యాచతుర్ముఖ బ్రహ్మచేత (భాగవతము దశమస్కంధము (10-1-538) బధిరాన్ధపఙ్గు మూకాః = చెవిటి, గ్రుడ్డి, కుంటి, మూగివారును, దీర్ఘాః = పొడుగైనవారును, ఖర్వాః = పొట్టివారును, సరూపాః = (మంచి)రూపము గలవారును, సర్వే = సమస్తమైన, సవత్సగోపాః = దూడలతో నున్న గోపబాలురు, చతుర్భుజాః = నాలుగుబాహువులుగల విష్ణుమూర్తులుగా, దృష్టాః = చూడఁబడిరి.

హి = ఎందువల్ల ననఁగా మశకేన = దోమతోడను, నాగేన = ఏనుఁగుతోడను (వీనిశరీరములం దల్పాధికత్వభేద మున్నను) త్రిభిః, లోకైః వా = మూఁడులోకములతోడనుగూడ (విరాడ్రూపునిశరీరముతోడను) సమః = ఏకాత్మరూపస్థితిచేత ఆపరమాత్మ తుల్యుఁడు ఇతి = అని, నృహరేః = మానవరూపముననున్న హరియగు శ్రీకృష్ణునియొక్క భూతసమత్వమ్ = భూతములందు ఏకాత్మరూపతుల్యత్వము సాక్షాత్ = సాక్షాత్తుగా, ప్రత్యక్షముగా, ఉపనిషదా = ఉపనిషత్తుల (బృ. 1-3-22) చేత, భాషితమ్ = చెప్పఁబడినది.

తా॥ బృహదారణ్యకోపనిషత్తు (1-3-22) "య ద్వేవ సమః ప్లుషిణా, సమో మశకేన, సమో నాగేన, సమ ఏభి స్త్రిభి ర్లోకైః, సమో ఽనేన సర్వేణ। "తస్మాదేవ సామ" ఈప్రాణము

(పరమాత్మ) పరబ్రహ్మము సర్వమందుండునది. తేనెటీఁగ యందు చెదపురుగునందు, దోమయందు, ఏనుగునందు, ముల్లోకములు శరీరముగాగల విరాట్పురుషునందు, ఈసమస్తమైన హిరణ్యగర్భునందు, ఇట్లు స్వల్పాధిక రూపములైన అన్నిశరీరములందు, అణువునందు బృహత్తునందును రూపరహితముగా తుల్యముగా ఉన్నందున కూడ 'సామ'యని పిలువఁబడును. అని బృహదారణ్యకోపనిషత్తు స్వయముగా నన్నిటియందు వ్యాపించియున్న మానవరూపహారియగు శ్రీకృష్ణపరమాత్మయొక్క సర్వసమత్వమును చెప్పినది. దీనిని నిరూపించు ప్రబలప్రమాణము. శ్రీకృష్ణుని బరీక్షించుటకు వచ్చిన బ్రహ్మదేవుఁడుగూడ అక్కడనున్న గోవత్స గోపబాలురను జూచినప్పుడు అందులోఁ జెవిటివారు, గ్రుడ్డివారు, కుంటివారు, మూగివారు, పొడుగువారు, పొట్టివారు అనిరూపాదిభేదములుగల నర్వులను ఆభేదములు రవ్వంతయు లేని నాల్గుభుజములుగల విష్ణురూపులుగానె చూచెను. కావున సర్వజీవులును శ్రీకృష్ణపరమాత్మయే. ఈభేదము లన్నియు మాయాకల్పితములే. (నిజముగా లేనివి) చూచువానిబట్టి వచ్చునవి. కుంటి, గ్రుడ్డి మొదలైన శరీరభేదములు ఆయాజీవులు పూర్వజన్మములలో చేసిన పాపాదికర్మముల ననుసరించి ఫలములుగా వచ్చినవే. అందువలన దుర్యోధనార్జునుల యందు పరమేశ్వరుఁడు భేదము చూపినట్లు కనఁబడుటమాత్రమేగాని, శ్రీకృష్ణపరమేశ్వరుఁడు వారియెడల నిష్పక్షపాతబుద్ధితో లేదా, సమభావముతోనే ప్రవర్తించినాఁడు. దృష్టప్రవర్తనాభేదములకు కారణము, దుర్యోధనార్జునులు చేసికొన్న పాపపుణ్యకర్మముల ఫలములు. ఇది యథార్థస్థితి. శ్రుతిస్మృత్యాదిసమ్మతము.

అవ॥ ఇక్కడ మఱొక యాక్షేపణ చేయఁబడుచున్నది.

**ఆత్మా తావ దభోక్తా తథైవ నను వాసుదేవ శ్చేత్।**
**నానాకైతవయత్నైః పరరమణీభిః కథం రమతే ॥ 218**

ప్ర : నను=మఱి, ఆత్మా=పరమాత్మ, అభోక్తాతావత్=భోక్త కాఁడు గదా! (నను = మఱి అనిపూర్వపక్షారంభము) వాసుదేవః = శ్రీకృష్ణుఁడు, తథైవచేత్=ఆపరమాత్మప్రకారుఁడు అనఁగా అభోక్తయే యగునేని, (సః = ఆయన) నానాకైతవయత్నైః=అనేకమాయోపాయములచేత, పరరమణీభిః = పరులభార్యలగు సుందరులతో, కథం=ఎట్లు రమతే=క్రీడించును? (క్రీడింపఁ గూడదుగదా యనిఆక్షేపణము)

తా॥ ఆత్మ, సుఖదుఃఖాదుల ననుభవించుభోక్త గాఁ డనుట సర్వసమ్మతముగదా! శ్రీకృష్ణుఁడు అట్టియాత్మరూపుఁ డైనచో నాయన కర్తృత్వభోక్తృత్వములు లేనివాఁడు కావలెనుగదా. అట్లుగాక, శ్రీకృష్ణుఁడు తనజీవితమందు అనేకమాయోపాయములచేత అందగత్తెలైన గోపాలురభార్యలతో, పరసుందరులతో భోక్తగా రమించుట ప్రసిద్ధలోకగాథ. ఇది విరుద్ధము కాదా? కావున నాయన నిష్క్రియాత్మ యెట్లగును? కాఁడని యాక్షేపణ. ఆంధ్రభాగవతములో పరీక్షిత్తుకూడ నిట్లే శంకించి శుకమహర్షి నడిగెను.

మత్తకోకిల :
ధర్మకర్తయు, ధర్మభర్తయు ధర్మమూర్తియు నైన స
త్కర్ముఁ డీశుఁడు ధర్మశిక్షయు ధర్మరక్షయుఁ జేయఁగా
నర్మిలిన్ ధరమీఁదఁ బుట్టి పరాంగనాజనసంగమే
ధర్మమంచుఁ దలంచి చేసె నుదాత్తమానస చెప్పుమా !

ఆం. భాగ. 10-1-1105

అవ॥ దీనికి రాబోవు శ్లోకములలో సమాధానము చెప్పుచున్నారు.

సుందర మభినవరూపం కృష్ణం దృష్ట్వా విమోహితా గోప్యః।
త మభిలషన్త్యో మనసా కామా ద్విరహవ్యథాం ప్రాపుః॥ 219

ప్ర : అభినవరూపం = నవనవోన్మేషయౌవనములోనున్నవాఁడును, సుందరం= అందమైనవాఁడును, అగు, కృష్ణం= శ్రీకృష్ణుని, గోప్యః=గోపకాంతలు, దృష్ట్వా = చూచి, విమోహితాః = మిక్కిలివ్యామోహమునొందినవారై, తం= (ఆశ్రీకృష్ణుని) అతనిని, కామాత్= కామమువలన, మనసా= మనసార, అభిలషన్త్యః= (భర్తగాఁ) గోరుచున్నవారై, (ఆయనను జూడరేనప్పుడు), విరహవ్యథాం= విరహబాధను, ప్రాపుః= పొందిరి.

తా॥ శ్రీకృష్ణుఁడు జగన్మోహనాకారుఁడు. నవనవోన్మేషయౌవనమం దున్నవాఁడు. అత్యంతసర్వాంగసుందరుఁడు. అతనిని జూచి గోపికలు మోహావేశములో మునిగిరి. అతని పొందును మనసార వాంఛించి యతనికొఱకు మహావిరహబాధఁ బడిరి. ముముక్షువులైన (వారు) స్త్రీలు భగవద్భక్తిపరవశులైరనియు, కామాతురలగు సామాన్యస్త్రీజనము మన్మథమన్మథుఁడగు శ్రీకృష్ణపరపురుషసంగమును కోరి రనియు తాత్పర్యము.

అవ॥ వారిగాఢవాంఛాఫలితముగా

గచ్ఛన్త్య స్తిష్ఠన్త్యో గృహకృత్యపరాశ్చ భుఞ్జానాః।
కృష్ణం వినాఽన్యవిషయం సమక్షమపి జాతు నావిన్దన్॥ 220

ప్ర : (వారు) గచ్ఛన్త్యః= నడచుచున్నవారైనను, తిష్ఠన్త్యః = ఒకచోటనిలువఁబడిన వారైనను, గృహకృత్యపరాఃచ= ఇంటిపనులు చేయుటయందిష్టముకలవారైననుకూడ, భుంజానాః = తినుచున్నవారైనను, కృష్ణం వినా = కృష్ణునివిడిచి, సమక్షంఅపి = దగ్గఱ-నెదుట నున్నదైనను, అన్యవిషయం =

మతోకవస్తువును, జాతు న అవిన్దన్ = ఒకప్పుడును ఎంతమాత్రమును పొంద లేకపోయిరి. (అన్వయమునుగుర్తింపఁజాలివారైరి).

తా॥ వారు కృష్ణు నెంత యెక్కువగా మక్కువగా ప్రేమించినా రనఁగా వారు నడచుచున్నను, నిలువఁబడినను, ఇంటిపనులు చేయుచున్నను, చివఱకు భుజించుచున్నఁగూడ తమదగ్గఱగా నెదుటనున్న వస్తువును సైతము ఒకప్పుడుకూడ వారు దానినిగా చూడలేకుండిరి. ఆవస్తువు లన్నియు కృష్ణస్వరూపములుగనే కన్పట్టినవి. వారికి జగమంతయు శ్రీకృష్ణమయమే. వా రాయనయం దంత తన్మయు లైరి.

అవ॥ ఆకారణముగా నేమి జరిగె ననఁగా

దుఃసహవిరహభ్రాన్త్యా స్వపతీ న్దదృశు స్తరూ న్నరాంశ్చ పశూన్।

హరి రయ మితి సుప్రీతాః సరభస మాలిఙ్గయాఞ్చక్రుః॥ 221

ప్ర : (ఆగోపికలు,) దుఃసహవిరహభ్రాన్త్యా = ఓరువరేని ఎడఁబాటు (విరహము) వలనిభ్రాంతిచేత, అయం = ఇతఁడు, లేక ఇది, హరిః = శ్రీకృష్ణుఁడే, ఇతి = అని, నరాన్ = నరులగు(ను),స్వపతీన్ = తమభర్తలను, తరూన్ = చెట్లను, పశూన్చ = పశువులనుగూడ, (శ్రీకృష్ణునిగనే), దదృశుః = చూచిరి. (తేన = దానిచేత) సుప్రీతాః = మహాసంతోషమును జెందినవారై, (తాన్ = వారిని, వానిని) సరభసం = మిక్కిలివేగిరపాటుతో, ఆలింగయాఞ్చక్రుః = కౌఁగిలించుకొనిరి.

తా॥ వారు కొంచెము సేపైనను కృష్ణు నెడబాటు నోర్వలేరైరి. జగమంతయు వారికిఁ గృష్ణమయముగనే కన్పించెను. 17వ ప్రకరణములోని 183 శ్లోకార్థసారము సర్వజంతువు(ప్రాణు)లందు భగవద్భావదర్శనము, హరిదాసవర్యలక్షణ మన్నది ఈగోపిక

లంము వ్యక్త మగుచున్నది. "ఇతఁడే ఈకృష్ణుఁడనియే వారు తమ భర్తలను జూచి. ఎవరని లేక ఏది చూచినను దానియందు హరి భావమే వారిది. మనుష్యుని జూచి, ఇతఁడు శ్రీహరియే అనియు, పశువును జూచియు, ఇది శ్రీహరియేయనియు, చెట్టును జూచియు, ఇదియు శ్రీహరియే యనియు నిట్లు శ్రీకృష్ణదర్శనయోగారూఢమన స్కులై సంచరించిరి. స్త్రీస్వభావముకొలఁది హరిసర్వము నాలింగ నము (కౌగిలింత) మొనర్చుకొనుచు పరమానందభరిత లైరి. ఉపస్థేంద్రియకామోద్రేకులకు, వృక్షాదులనుహృదయమునకుహ త్తుకొనుట ఆనందమీయదుగదా. ద్వైతమగుటచే, మోహబ్రాం తిరూపమైన సగుణేశ్వరుఁడగు కృష్ణునియందు స్థూలభక్తిగా నారం భమై సూక్ష్మత నందుచున్న మధ్యమస్థితి యిది. భక్తిరసాస్వాద మం విదోకబ్రాంతిరూపసంచారీభావవిశేష మని కొందరన్వయింప వచ్చును గాని ఈభావముస్థిరమగుటచే స్థాయిభావముగనే యన్వ యించుట వివేకము. తల్లి బిడ్డను గౌగిలించుకొన్నట్లు ఈగోపికల ప్రేమాలింగనము ఏకత్వభావసూచకము. బుద్ధియోగార్హాభక్తలక్ష ణములు కొన్ని గీతలందు శ్రీకృష్ణోక్తములు :-

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ॥ గీ10_9

వికారరూపములగు సృష్టిస్థితిలయక్రియారూపఫలభోగలక్షణములు గల ఈసర్వజగత్తునకు ప్రవర్తకమైన వాసుదేవపరబ్రహ్మమగు నాయందు చిత్తముగలవారు మచ్చిత్తులు. అట్టినాయందే ఉప సంహరింపఁబడిన నేత్రకర్ణఘ్రాణాదిసర్వేంద్రియములుగలవారు, లేదా, మద్గతజీవనులు, మద్గతప్రాణులు. ఇట్టినాభక్తులు, జ్ఞానబల వీర్యాదిధర్మవిశిష్టమగు నాతత్త్వమునే నిత్యము ఒకరికొకరు విశద పఱచుకొనుచు, అనుభవమునకు, దెచ్చుకొనుచు, పరితోషమును

బొందుచున్నారు. అంతేయకాదు. ప్రియ (భర్త) సంగమమందు వలె, వారు నాసన్నిధియందు రతినిగూడ ననుభవించుచున్నారు.

అవ॥ బాహ్యవిషయప్రపంచమంతయు దంతటమాత్రమే గాక, త యందును గృష్ణమయతను బొడగల్గి తామే కృష్ణుల మని కూడ ప్రవర్తింపఁ దొడగిరి. ఆగోపకాంతలు,

కాఽపి చ కృష్ణాయన్తీ కస్యాశ్చిత్పూతనాయన్త్యాః।
అపిబత్స్తన మితి సాక్షాద్వ్యాసో నారాయణః ప్రాహ॥
222

ప్ర : కాఅపిచ = మఱియు వొకస్త్రీ, కృష్ణాయన్తీ = కృష్ణుఁడుగా (పాత్ర) ఆచరించునదై, పూతనాయన్త్యాః = పూతనగా భావింపఁబడిన, కస్యాశ్చిత్ = వేఱొకస్త్రీయొక్క, స్తనమ్ = చనుబాలను, అపిబత్ = త్రాగెను, ఇతి = అని, సాక్షాత్నారాయణః = ప్రత్యక్షముగా నారాయణుఁడే, (నారాయణుని అవతారమే అని చెప్పఁబడు,) వ్యాసః = వ్యాసమహర్షి, ప్రాహ = చెప్పెను. (రచించెను.)

తా॥ శ్రీహరియందు వారితన్మయత్వ మెంత పెరిఁగెనదనగా వారు కృష్ణలీలలను ఆచరింప మొదలిడిరి. 175వ శ్లోకములో జెప్పినట్లు శ్రీహరియే వీరిహృదయములం దావిష్టుఁడైనాడు. కావున నే అందొకతె తాను కృష్ణుఁడ నని చెప్పి. పూతన యని మఱొకదానిస్తనమును పానము చేసెను. ఈవిషయము నేను కల్పించి చెప్పినది కాదుసుమా, సాక్షాత్తుగా శ్రీమన్నారాయణునియవతారమే యని భావింపఁబడు వేదవ్యాసమహర్షియే తనభాగవతగ్రంథమునఁ జెప్పెనని శంకరాచార్యులవారనుచున్నారు. వ్యాసభాగవతమును శ్రుతివలెఁ బ్రమాణ మని సూచన. [కంసునిపంపున శిశువగు కృష్ణుని సంహరింప పూతన యనురక్కసి సుందరవేష

మున వచ్చి పసిబాలునకుఁ బాలిచ్చునెపముతో ఆచిన్నికృష్ణుని నోటఁ దనవిషలిప్తస్తనముంచఁగా, పాలతోఁ బాటు అతఁ డామె ప్రాణములను గూడ పీల్చి చంపినగాథ ఇక్కడ సూచింపఁబడి నది.] ఇది జ్ఞానలక్షణమైన సూక్ష్మభక్తి చెప్పగా నున్నది. గోపికా త్మ్యాహంభావను లయమై నేను కృష్ణుఁడనే అను జ్ఞానోదయ మై నదని సూచన. శ్రీకృష్ణుఁడు విశ్వరూపుఁడైన విశ్వేశ్వరుఁ డని యనుభవపూర్వకప్రకటన మిది కానోపు. [ఇట్లే తక్కినలీలలును ఆకాంతలు నటించిరి. ఆంధ్రభాగవతములో 10-1-1022 నుండి 1028 వఱకు ఇవి వర్ణింపఁబడినవి.]

అవ॥ ఆగోపికలు హరితత్త్వ మెఱింగినట్టియు పతిదైవభావముగలట్టి యు, ధర్మపత్నులగుపతివ్రత లని నిరూపించుచున్నారు,

**తస్మా న్నిజనిజదయితా న్కృష్ణాకారా న్వ్రజస్త్రియో వీక్ష్య।**
**స్వపరనృపతిపత్నీనా మన్తర్యామీ హరిః సాక్షాత్॥ 223**

ప్ర : తస్మాత్= అందువలన, వ్రజస్త్రియః = వ్రేపల్లెలో వసించు గొల్లభామలు, నిజనిజదయితాన్= తమతమభర్తలను, కృష్ణాకారాన్=కృష్ణుని మూర్తులనుగనే, దైవరూపులనుగనే, వీక్ష్య = చూచి, (వారిని ఈశ్వరుఁనిగా కొఁగిలించుకొనిరి). హరిః= శ్రీకృష్ణుఁడుగా నవతరించిన శ్రీవిష్ణువే, సాక్షాత్ = సాక్షాత్తుగా (ప్రత్యక్షముగా) స్వపరనృపతిపత్నీనాం = తనకృష్ణరూపనర శరీరములోను, పరనరశరీరములలోను, భర్తలశరీరములలోను, భార్యలశరీర ములలోను, అనఁగా సర్వస్త్రీపురుషజనములో, లేదా స్వపరనృపతిపత్నీనాం; స్వ= హరి, స్వపర= హరిపరులు, అనఁగా హరియే పొందఁదగిన ఉత్కృష్ట తమమైనగతి (జీవితము సార్థక మొనర్చుకొనుటకు లక్ష్యము,) యని మనసార నమ్మి మనోబుద్ధులను హరియందే యుంచుశీలముగలవారు, హరిపరులు: స్వపర నృపతిపత్నీనాం = (పైచెప్పినట్టి) హరిపరులలోపలను, సామాన్యనరులలో పలను, పతులలోపలను, సతులలోపలను, అనఁగా, హరిపరులైనను, కాకున్నను,

సర్వస్త్రీపురుషజనములలోపల; లేదా, స్వే=ఆత్మయందు, పర= తదితరమైన అనఁగా ఆరోపితానాత్మసామాన్యవిశేషరూపములైన, నృ,పతి,పత్నీనాం=వరుల లోపలను, భర్తలలోపలను, భార్యలలోపలను, అంతర్యామీ=లోలోపలనుండి (వీరి) బుద్ధులను, ప్రవర్తనమును నియమించు శక్తిసంపన్నుఁడు, సాక్షాత్ = సాక్షాత్తుఁగా, స్వరూపముచేత, హరిః= శ్రీహరియే.

తా॥ జగమంతయుఁ గృష్ణమయముగాఁ జూచిన యాగొల్ల పల్లెలోనిగొల్లభామలు తమతమభర్తలను కృష్ణులనుగాఁ నెఱింగిరి. భర్తలందు దైవ (రూప) భావములను జూడఁగలిగిన ధర్మపత్నీరూప పరమపతివ్రత లాఁ తేపల్లెవనితలు. ఆభావముతోఁ దమతమభర్తలనే కౌఁగిలించుకొని క్రీడించిరని యన్వయము. వారు వ్యభిచారిణులు గారు. కావున అదిహేతువుగా శ్రీకృష్ణునకు మూఢు లంటఁగట్టు పరాంగనాసంగమదోషమును లేదు. ఇట్లు శ్రీకృష్ణనరరూపమున నున్న శ్రీహరి, సర్వస్త్రీపురుషజనులందు అంతర్యామియై యుండుటచే, సర్వశరీరములు ఆయనవిరాడ్రూపమున భాగములగుటచే ఆ శ్రీహరివిశ్వరూపుఁడు, విశ్వేశ్వరుఁడు నగును. అనఁగా ఆహరి కన్యమైన వస్తువేలేదనిభావము. ఆయనకన్యములేనప్పుడు, పరాంగనలే లేరని అభిప్రాయము. పరాంగనలే లేనప్పుడు 218 శ్లోకా క్షేపణయగు, పరరమణులతోఁడ వాసుదేవరమణములేనే లేదని, అక్షేపమే పొసఁగదని ప్రత్యుత్తరరూపనిర్ణయము. సర్వత్ర వసించుదేవుఁడగు వాసుదేవునందు, పరరమణులతోఁడ రమణ మనునది మాయామూఢులు భ్రాంతచిత్తులై యారోపించు వృథా నింద. ఈయారోపమువలన వాసుదేవపరమాత్మ కెట్టిదోషమును సంభవింపదని, వివేకసూక్ష్మత.

పోని మ్మొకవేళ భాగవతములో ఆగోపికలు స్పష్టముగాఁ గృష్ణునితోఁడనే క్రీడించినారన్నను గృష్ణుఁడు వారలకు సామాన్య పరపురుషుఁ డనఁజెల్లదు. ఏలన నతఁడు తన, ఇతరుల, రాజుల

భార్యలందుఁగూడ నంతర్యామిరూపమున, ఆత్మగానున్నవాఁడే కాన కృష్ణునితో రమించిరన్న సర్వాంతర్యామితో భావనారూపముననే యోగారూఢులై రమించిరని, తాత్పర్యార్థము. ఇది వానిదివ్యలీల. ఇదే భాగవతములో శుకమహర్షి, వెనుక పరీక్షిన్మహారాజువేసినప్రశ్నకు, నుత్తరముగాఁ జెప్పెను.

మ॥ ఘనులై యెవ్వని పాదపంకజపరాగధ్యానసుప్రాప్తయో
గనిరూఢత్వముచే మునీంద్రులు మహాకర్మంబులం బాసి బం
ధనిరోధంబులులేక యిచ్ఛలవిడిన్ దర్పింతు రాదివ్యశో
భనుఁ డెట్లుండిన నుండెఁగాక కలవే బంధబు లుర్వీశ్వరా!
ఆం. భాగ. 10-1-1110 ప.

ఆ॥ గోపజనములందు, గోపికలందును,
సకలజంతులందు, సంచరించు
నామహాత్మునకుఁ, బరాంగన లెవ్వరు?
సర్వమయుఁడు లీలసలిపెఁగాక! 1111 ప.

అవ॥ ఈయుత్తరమే -ఈశ్వరునివిశృంఖలత్వము, ఆయనకుఁ బరులు లేరని, ఆయనవైభవము యొకలీలామాత్ర మని చెప్పుచున్నారు. సంసారిజీవుల ప్రాకృతసూత్రములు, ధర్మములు, నాయనకుఁ బర్తింపవు. ఆయన సర్వాతీతుఁడు, సర్వజగద్విలక్షణుఁడు. రాగద్వేషములులేని, కర్మసంగములేని, దివ్యజన్మకర్మములుగల లీలామానుషశరీరుఁడు.

పరమార్థతో విచారే గుడతన్మధురత్వదృష్టాన్తాత్।
నశ్వరమపి నరదేహం పరమాత్మాకారతాం యాతి॥ 224

కిం పున రన శక్తే ర్లీలావపు రీశ్వరస్యేహ।
కర్మ ణ్యలౌకికాని స్వమాయయా విదధతో నృహరేః॥
225

ప్ర. (శ్రీకృష్ణుఁడు పరమేశ్వరావతారమైనను ఆయన శరీరము నశ్వరమైన నరశరీరమే కదా! యనిన్) పరమార్థతః = పరమార్థమగు బ్రహ్మదృష్టితో, విచారే (కృతే) = విచారించినయెడల, గుడతన్మధురత్వదృష్టాన్తాత్ = బెల్లము, దానితీపిగుణమున నైక్యము సిద్ధించిన యుపమానమును బట్టి, నరదేహం = (దృష్టాంతములో తీపివంటి) మనుష్యశరీరము, నశ్వరం అపి = శాశ్వతము కాక, నష్టమగునదేయైనను, పరమాత్మాకారతాం = (దృష్టాంతములో బెల్లమువంటి) తనమూలకారణమగు పరమాత్మభావమును, యాతి = పొందును. (సర్వము బ్రహ్మమే, ఆత్మయే) (ఈశరీరమాధారముగా,) అలౌకికాని = లోకములో నెచ్చటను లేని, [ఈలోకమునకు సంబంధింపని. అత్యద్భుతములైన.] కర్మాణి = పనులను, స్వమాయయా = తనమాయాశక్తిచేత, విదధతః = ప్రవర్తించుచున్నవాఁడగు, అనన్తశక్తేః = అంతములేని శక్తి కలవాఁడును, నృహరేః = నరహరియైన [శ్రీకృష్ణుఁడు], ఈశ్వరస్య = ఈశ్వరునియొక్క, లీలావపుః = లీలగా ధరించిన శరీరము, ఇహ = ఇక్కడ, ఈశ్వరతాం యాతి = ఈశ్వరత్వమును పొందినదని, కింపునః = వేరే చెప్పనేల?.

తా॥ పరమార్థతత్త్వము విమర్శించినచో వస్తువునకును దానిగుణమునకును భేదము లేదు. రెండు నొకటియే. బెల్లమును దానిగుణమగు తీపియు విడఁదీయఁదగిన రెండువేఱువస్తువులు కావు ఒకేవస్తువు. నరదేహము స్వభావముచే శాశ్వతముకానిదైనను ఉపాస్యపరమేశ్వరాకారమును బొందినదిగా ఉపాసకులు భావింపనగును. లేదా, కర్మఫలముగా నరదేహ మీశ్వరప్రదత్త మగుటచే నది ఈశ్వరముద్ర గలది. మఱియు ఈశ్వరుని (విరాడ్రూపుని) సమష్టిస్థూలశరీరములో ఏకదేశ మగుటచేతను, సామాన్యనరదేహము ఈశ్వరత్వసహితమైనదే యగునుగదా! సామాన్యనరదేహవిషయ మిట్లుండ, దానివలె కర్మాధీనత లేకయే, కారణుఁడును, సర్వశక్తిమంతుఁడు నగు ఈశ్వరుఁడైన శ్రీహరి తనసత్యసంకల్పముచేతనే దివ్యముగా నిర్మించుకొన్న కార్యరూప శ్రీకృష్ణశరీరమునకు ఈశ్వరత్వమహత్త్వ(వ్యవహార)మున్న

దని వేరే చెప్పనేల? ఈ కార్యకారణములగు కృష్ణశరీరపరమేశ్వరునకు ఐక్యము (అభేదము) సర్వమతసమ్మతము. కావున శ్రీకృష్ణ శరీరము దివ్యమైనది, జీవశరీరమువలె ప్రాకృత మైనదిగాదు. ఇది శ్రీకృష్ణావతారలీలారహస్యము. ఈవిషయమున గీతాప్రమాణవాక్యము ఒకడు. "జన్మ కర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః। త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సో ఽర్జున." గీ4-9 ఓయర్జునా! ఈశ్వరుడనగు నాయొక్క మాయామయమైన జన్మమును, సాధుపరిత్రాణాదికర్మమును (దివ్యములు) అప్రాకృతములని నేను జెప్పినట్లుగా వానికలరూపు (మిథ్యలని) నెవడు డెలుంగునో, వాడు ఈదేహమును విడిచి (మరణానంతరము) మరల పుట్టడు. నన్నె జెందును. సంసారబంధమునుండి విడివడును.

అవ॥ పసిబాలుడైన కృష్ణుడు సైత మెట్లు తనవిశ్వేశ్వరత్వమును జాటెనో చూపుచున్నారు.

మృద్భక్షణేన కుపితాం వికసితవదనాం స్వమాతరం వక్త్రే।
విశ్వ మదర్శయ దఖిలం కింపున రథ విశ్వరూపో ఽసౌ॥
226

ప్ర॥ : (సః = శ్రీకృష్ణుడు), మృద్భక్షణేన = తాను మన్ను దిన్నాడని (తల్లితో బలరాముడు నితరబాలురు చెప్పగా నాకారణముగా.) కుపితాం = తనమీద గోపించిన, దియు (ఐనన,) వికసితవదనాం = తనమీది ప్రేమచేత [illegible]ముగము గల దియునగు, స్వమాతరం = తనతల్లియగు యశోదకు, వక్త్రే [illegible] రబద్ధములు చెప్పుచున్నారమ్మా, నేను మన్ను దినలేదు, ఇదుగో నా [illegible]డుమని) తెఱచినతననోటియందు, అఖిలం = సమస్తమైన, విశ్వం = [illegible]మును, అదర్శయత్ = చూపించెను. అథ = ఇదంతయు (ఈసమగ్ర [illegible]ము,) అసౌ = ఈశ్రీకృష్ణుడు, విశ్వరూపః = విశ్వమే రూపముగా [illegible] అని, కిం, పునః (వక్తుమ్) = వేరేనిర్దేశింపనేల?

తా॥ పసి బాలుఁడగాఁ గృష్ణుఁ డున్నప్పు డాయన మన్నుఁ దినెనని బలరాముఁడును తోటిపిల్లలు యశోదకుఁ జెప్పిరి. ఆమె కాయనపై వెంటనే కోపము వచ్చెను. అయినప్పటికిని ప్రేమమూర్తియగు నామాతృశ్రీ వికసితవదనారవిందయై నవ్వు నణఁచుకొనుచు కొడుకును దండింప దగ్గఱకు వచ్చెను. అది చూచి భయమును నటించుచు నాచిన్నికృష్ణుఁడు "లేదమ్మా! వారు నాపై నీకుఁ గొండెములు చెప్పుచున్నారు. ఇదిగో! నానోరు చూడు" మని యతఁడు నోరు దెఱచెను. అందు మన్నువాసనగాని, మఱి కలు మొదలైనవేవియు లేవు సరిగదా, ఆచిన్ననోటియందే బ్రహ్మాండమగు విశ్వమంతయు, ఆమె ఆత్మైశ్వర్యముతో జూచెను. కావున "శ్రీకృష్ణుఁడు సర్వవ్యాపియగు విశ్వేశ్వరుఁడైనవాఁడు". అని నిర్ణయించుట కింతకంటె మఱేమి కావలయును?

క॥ ఆలలితాంగి గనుంగొనె బాలునిముఖమందు జలధిపర్వతవనభూగోళశిఖితరణిశశిదిక్పాలాదికరండమైన బ్రహ్మాండంబున్.

ఆం. భాగ. 10-1-341

నోటియందే విశ్వమంతయుఁ జూపినయాశ్వరునకుఁ దనశరీరమే విశ్వమని ధృతరాష్ట్రాదులకు రాయబారసమయమునను యుద్ధారంభమున నర్జునకుఁ జూపుటలో నాశ్చర్యమేమున్నది! ఈశ్వరుని లీలలు అజ్ఞుఁడగు మనుష్యుఁడు న గా నూహించి యర్థము చేసికొనగలఁడా? వర్ణింపఁగలఁడా? అట్టి శ్రీకృష్ణునిపై మూఢులు చోరజారాదినిందలు మోపుటవలన వారు పాపముపాలగుటతప్ప, ఆరోపములవలన శ్రీకృష్ణపరమేశ్వరపరబ్రహ్మాత్రేయముల కెట్టిలోటు రాదని ఆత్మప్రబుద్ధు లెఱింగి మఱువరాని విషయము. ఇదియు ఆత్మబోధవిశేషాంశమే.

# 19. ఆనుగ్రహిక ప్రకరణమ్ (ఆనుగ్రహిక ప్రకరణము)

అవ॥ గడచిన ప్రకరణమున నిర్గుణము, సగుణముల యైక్యము నిశ్చితమైనది. ఒకటి సిద్ధసాధ్యమగు పారమార్థికము. రెండవది, సగుణము మొదటిదానికంగరూపసాధనమగు వ్యావహారికము. మూడవశ్లోకములోఁ దెల్పినట్లు కేవలాత్మస్వరూపుఁడును జగదీశ్వరుఁడునగు శ్రీకృష్ణపరిపూర్ణతత్త్వ మెఱుంగుటకు సాధనమగు అధ్యాత్మశాస్త్రసారములగు హరిచింతనకీర్తనాభ్యాసరూప మీ ప్రకరణ ప్రకారము. దాని కీశ్వరానుగ్రహమే కారణము. ఆ శ్రీకృష్ణానుగ్రహ మెవరి కెట్లు లభించినది వివరించున దీయానుగ్రహిక ప్రకరణము.

మ॥ తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్, చింతనం బనునీ
తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి సజ్జనుఁడై యుండుట
భద్రమంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా।

శా॥ కామోత్కంఠత గోపికల్, భయమునన్ గంసుండు, వైరక్రియా
సామగ్రిన్, శిశుపాలముఖ్యనృపతుల్, సంబంధులై వృష్ణులున్, ప్రేమన్ మీ
రలు, భక్తి నేము, నిదె చక్రిం గంటి మెట్లైన నుద్దామధ్యానగరిష్ఠులైన హరిఁ
జెందన్ వచ్చు ధాత్రీశ్వరా!

అసమగ్రమైన ఈద్వైతసాధనభక్తివలన క్రమముగా, ఆత్మజ్ఞానమువచ్చునని, సమగ్రమైన జ్ఞానమువలననే జీవన్ముక్తియని మఱువరాదు.

విషవిషమస్తనయుగలం పాయయితుం పూతనా గృహం
ప్రాప్తా।
తస్యాః పృథుభాగ్యాయా ఆసీత్కృష్ణార్పణో దేహః॥
227

ప్ర : పూతనా= పూతన యనుపేరు గలరాక్షసి, (శిశువైన కృష్ణునకు,)
విషవిషమస్తనయుగలం= ప్రాణాపాయకరమగు విషముగల తనచన్నులఁ జ

టను, పాయయితుం= పాలు త్రాగవిచ్చునది, (ఆతడున్న యశోదయొక్క,) గృహం= ఇల్లు, ప్రాప్తా= పొందెను. పృథుభాగ్యాయాః = గొప్పయదృష్ట ముగల, తస్యాః= ఆమెయొక్క దేహః= శరీరము, కృష్ణార్పణః = కృష్ణున కర్పింపఁబడినదిగా, ఆసీత్= ఆయెను.

తా॥ పూతన యను రాక్షసి, శిశువైన కృష్ణుని, జంపుటకుఁ గంసుపనుపున, అందమైన స్త్రీవేషముతో, తనరెండుచన్నులను విషముతో నింపుకొని, యశోదయింటికి వచ్చెను. యశోద వారిం చుచున్నను వినక, ఆమె కృష్ణు నెత్తికొని ప్రాణము తీయుటకు ముందు తనచన్నులలో నొకదానిని, అతనినోటిలో నుంచెను. అతఁడు పాలతోకూడ నామె ప్రాణములను సైతము పీల్చెను. ఆమె దానితో మరణించెను. ఆమెచేసినయుత్కటపాపఫలము ఆమెమరణము. అంతియేగాని కృష్ణభగవానున కామెయెడ ద్వేష ము లేదు, కృష్ణుఁడు ఈశ్వరుఁడు గాన ఏయపాయము లేక ప్రకా శించెను. ఈవిధముగా వైరబుద్ధితో వచ్చిన యామెశరీరము కృష్ణున కర్పణమయ్యెను. అది గొప్పయదృష్టమేకదా! దానితో ఆమె రాక్షసజన్మము పోయి, పూర్వపుణ్యఫలముగా, ఆకృష్ణే శ్వరదత్తముగనే ఉత్తమగతికిఁ బోయినది అంతియేగాని కృష్ణుని జంపయత్నించినందులకు ఆమెకు ఉత్తమగతిని ఆమెపై త్యాగము కొలది ఈయలేదు. ఇట్టిదుష్టశిక్షణాదివిషయమున గీతాప్రమాణ వాక్యము. శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృ తామ్॥ ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥ గీ. 4-8 ప్రతియుగమందును మాయతో నన్ను నేను సృజించుకొనుట (హరియగునేను అవతరించుటకు) కుఁ ప్రయోజనములు మూఁడు. అని (1) సన్మార్గప్రవర్తకులను పరిరక్షించుటయు (2) పాపకారు లగు జీవులను నశింపఁజేయుటయును (3) వేదోక్తప్రవృత్తినివృత్తి

రూపమగు ధర్మమును లెస్సగా స్థాపించుటయు, భక్తిప్రపత్తులతో ఈవిధక్రియాకలాపవర్ణనము ముక్తిని జేర్చుసాయమగు శ్రీహరికీర్తనాభ్యాసమగు నని పూతనాదిసంహార శ్లోకతాత్పర్యము. మఱియు, శ్రీభగవానుఁ డిట్లు వివరించినాఁడు. "యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్'' గీ 4-11 ఏ యేజనులు ఏ ప్రకారముగా ఏప్రయోజనము నర్థించి నన్ను ప్రార్థించుచున్నారో వారు మోక్షార్థులుఁగారు గనుక వారిని ఆప్రకారముగా ఆప్రయోజనముల నిచ్చి యనుగ్రహించుచున్నాను. అనఁగా ఫలార్థులకు ఫలప్రదానముతోడను, అఫలార్థులగు ముముక్షువులగువారికి ఆత్మజ్ఞానప్రదానముతోడను, అట్లే జ్ఞానులును సంన్యాసులును ముముక్షువులగువారికి మోక్షప్రదానముతోడను, అట్లే ఆర్తులగు భక్తులకు వారియార్తిని హరించుటతోడను, ఈవిధముగా ఎవరెట్లు నన్నాశ్రయించి, యర్థించుచున్నారో, వారి నట్లే నేను అనుగ్రహించుచున్నా నని భావము. అంతియేగాని నేను రాగద్వేషనిమిత్తముగా గాని, మోహనిమిత్తముగా గాని, ఎవనిని అనుగ్రహించుట లేదని శ్రీకృష్ణభగవానుని కంఠోక్తి.

అవ॥ సంకీర్తనార్హము శ్రీకృష్ణుఁడు రాగద్వేషరహితుఁడును, సర్వశక్తిమంతుఁడును, అపరాజితుఁడును, నిత్యజయశీలుఁడునగు ఈశ్వరుఁడని నిరూపించు శ్రీకృష్ణవిజయమానుషాద్భుతములైన బాల్యాదిక్రీడలు మొదలైనవి వర్ణింపఁబడుచున్నవి. ఇవన్నియు విపులముగా భాగవతమున వర్ణింపఁబడినవి. లోకప్రసిద్ధములగుటచే అవి యచట సంగ్రహముగా మాత్రమే చెప్పఁబడుచున్నవి. ఈశ్లోకములో బాలకృష్ణుఁడు శకటాసురతృణావర్తులఁ జంపినకథ సూచింపఁబడినది.

అనయ త్పృథుతరశకటం నిజనికటం వా కృతాపరాధమపి ।
శకటాశ్లేషవిశేషా దపధీ ద్బాల్యే ఽసురం కృష్ణః ॥ 228

ప్ర : బాల్యే = శిశుప్రాయమునందు, కృష్ణః = శ్రీకృష్ణుఁడు, పృథుతర శకటం = మిక్కిలి పెద్దదైన బండిరూపములో నున్న శకటాసురుని, కృతాపరాధం అపి = ఘోరనేరము చేసినవాఁడైననుగూడ, నిజనికటం = తననిలయమైన వైకుంఠమును, అనయత్ = చేర్చెను, వా = మఱియు, తన్ను సుడిగాలిరూపములో చంపవచ్చిన తృణావర్తు(డను పేరుగల) అసురం = రాక్షసుని, కంఠాశ్లేషవిశేషాత్ = బలముగా మెడనుబట్టుకొని నొక్కివేయుటవలన, అవధీత్ = చంపెను.

తా॥ తల్లి యశోద చిన్నికృష్ణునకుఁ బాలిచ్చి పండుకొనఁ బెట్టి వెళ్ళినది కంసుపంపున నొకరాక్షసుఁడు వచ్చి చిన్నికృష్ణుని జంపుటకై యొకపెద్దశకటము ఆకారములో చేరువగా నుండెను. దానిపైన సంభారములు మిక్కిలి బరువుగా నుంచఁబడెను. బాలుఁడు దోగాడుచు బండిక్రిందకు వెళ్ళి దానిని విఱుగఁదన్ని కూల్పగా రాక్షసుడును జచ్చెను. ఈశ్వరుని జంపవచ్చిన [illegible]ను మహాపాపమునకు ఫలము ఈశ్వరుఁ డిచ్చినది [illegible] ఈశ్వరునకు వానియెడల ద్వేషము లేదు. వాని రాక్షసత్వము [illegible] మరణముతోఁ బోయె. వాని పూర్వజన్మ పుణ్యవిశేషఫలముగా వానికి ఆకృష్ణభగవానుఁడే వైకుంఠవాసము ననుగ్రహించెను. దీని వలన శ్రీకృష్ణుఁడు భగవంతుఁ డనియు, జీవులయెడ నెట్టి రాగద్వేషములు లేక వారువారార్జించిన పుణ్యపాపములకు ఉచితఫల మొసంగు శక్తిమంతుఁ డని తెలియంగ నగును. కావున బుద్ధిమంతులకు, (శ్రేయః ప్రేయములు) మోక్షముగాని, పుణ్యలోకములైశ్వర్యాదులుగాని పొందుటకు, శ్రీకృష్ణుఁడే శరణ్యుఁ డని కృష్ణభక్తి కర్తవ్య మని గుణపాఠము. అట్లే తృణావర్తుఁడను మఱొకరాక్షసుఁడు సుడిగాలి రూపములో వచ్చి శిశువైన కృష్ణుని దన్ను కొనిపోయెను. ఆ శిశువు రాక్షసుని కంఠమును గట్టిగాఁ గౌఁగిలించుకొని తన శరీరభారముచే నతనిని అవలీలగా వధించెను. అతఁడు

కూడ రాక్షసత్వమునువీడి, పరమేశ్వరానుగ్రహమున తనపూర్వ జన్మసుకృతఫలముగా సుగతికిఁ బోయెను.

అవ॥ ఈశ్లోకములో బాలుఁడైన శ్రీకృష్ణుఁడు మద్దిచెట్లను గూల్చి వాని శాపవిముక్తులఁ జేయుట వర్ణించుచున్నారు.

**యమలార్జునౌ తరూ ఉన్మూల్యోలూఖలగత శ్చిరం ఖిన్నౌ ।**
**రిఙ్గన్నఙ్గణభూమౌ స్వమాలయం ప్రాపయ న్నృహరిః ॥ 229**

ప్ర : నృహరిః = మనుష్యుఁడుగా అవతారమెత్తిన విష్ణువైన, బాల కృష్ణుఁడు ఉలూఖలగతః = రోటిని బొందినవాఁడై (గోపికలు మొరపెట్టు కొన్న కృష్ణునిదుడుకుచేష్టలకు శిక్షగా తల్లి యశోద యతనిని ఇల్లువదలి బయ టకుపోకుండ ముందున్న పెద్దరోలు వాని నడుమునకు త్రాటితోఁ గట్టివేసెను) అంగణభూమౌ=(ఇంటిముందు) వాకిలియందు రింగన్ = (రోటినీడ్చుకొని) జరుగుచు; చిరం = చిరకాలముగా, ఖిన్నౌ = మునిశాపకారణముగా మిక్కిలి దుఃఖస్థితిలోనున్నవారైన, యమలార్జునౌ = రెండు తెల్లమద్ది, తరూ = చెట్లను, ఉన్మూల్య=పెకలించివైచి, (శాపవిముక్తులైన వాఁరిని) స్వమాలయం = వారి స్వస్థానమును, ప్రాపయత్=పొందించెను.

తా॥ కుబేరునికొమరులగు నలకూబరమణిగ్రీవులు తమ గర్వాంధతకు నారదమహర్షి యిచ్చినశాపవశమున వ్రేపల్లెలో రెండుమద్దిచెట్లై చిరకాలము ఖిన్నులై పడియుండిరి. శ్రీ కృష్ణుని దుడుకుచేష్టలను గొల్లభామలు చెప్పఁగా తల్లి యశోద యతనిని శిక్షించుటకై యింటనే పడియుండు ననుతలంపుతో వానిని బరువైన ఱోటికిఁ గట్టివేసెను. చిన్ని బాలుఁడైన కృష్ణుఁ డా పెద్దఱోటి నీడ్చుకొనుచు పోయి యా తెల్లమద్దిచెట్లమధ్యము నుండి లాగఁగా నాచెట్లు పెకలి పడిపోయెను. దానితో వారి శాపము తీఱి నిజరూపములతో నాయనను బొగడి స్వస్థలమునకు

వెళ్ళిరి. ఇట్లు శ్రీకృష్ణుఁడు వారిననుగ్రహించెను. శిశువు లెవ్వరును జేయలేని యూయపూర్వకృతములు చేసిన ఆయన సామాన్యశిశువు కాఁడనియు పరమేశ్వరావతారమనియు చూపును.

అవ॥ ఇందు శ్రీకృష్ణుఁడు కేశియనురాక్షసుని, కాకాసురుని, బకాసురుని జంపి వారి కెట్లు సుగతి నిచ్చినది చెప్పుచున్నారు.

**నిత్యం త్రిదశద్వేషీ యేన చ మృత్యో ర్వశీకృతః కేశీ।**
**కాకః కోఽపి వరాకో బకో ఽప్యశోకం గతో లోకమ్ ॥**
**230**

ప్ర : నిత్యం = ఎల్లప్పుడును, త్రిదశద్వేషీ = దేవతలను ద్వేషించువాఁడగు, కేశీ = కేశియనుపేరుగల రాక్షసుఁడును, కఃఅపి = ఒకానొకఁడగు కాకః(చ) = కాకుఁడను పేరుగల రాక్షసుఁడును, వరాకః = నీచుఁడగు, బకః = బకుఁడనుపేరుగల రాక్షసుఁడును, యేన = ఏకృష్ణునిచేత, మృత్యోః = మృత్యువునకు, వశీకృతః = వశముచేయబడెనో (అనఁగా చంపబడెనో) (తేనైవ = ఆకృష్ణునిచేతనే) అశోకం = దుఃఖరహితమైనదైన, లోకంఅపి = లోకము గూడ గతః = పొందినవాఁడాయెను.

తా॥ ఎల్లప్పుడును దేవతలను ద్వేషించువాఁడగు కేశియను రాక్షసుఁడు గుఱ్ఱమురూపముతోఁ గృష్ణు నెదిరించి చచ్చెను. అట్లే బకుఁడను రాక్షసుఁడు కృష్ణుని మ్రింగ యత్నించి విఫలుఁడై యాయనచే జంపఁబడెను. ఇట్లే కాకాసురుఁడును మడిసెను. వీరిట్లు పరమేశ్వరుని జంపుశత్రుత్వము వహించుటచే, హరి చేతిలో వీరే చచ్చిరి. కాని హరికి వీరిపై నట్టిద్వేషము లేదు. వారివారి పూర్వపుణ్యవిశేషఫలముగనే ఆహరియే వారికి ఆనంద నిలయమగు వైకుంఠమును బ్రసాదించెను. శ్రీహరి రాగద్వేషములేని పరమేశ్వరుఁడు.

అవ॥ ఇఁక అఘాసురుని అనఘునిగా జేసినవృత్తాంతము.

గోగోపీగోపానాం నికర మహిం పీడయ న్త మతివేగాత్ ।
అనఘ మఘాసుర మకరో త్పృథుతర మురగేశ్వరం
భగవాన్ ॥ 231

ప్ర : గోగోపీగోపానాం = ఆవులు, గోపికలు, గోపకులయొక్క, నికరం = సమూహమును, అతివేగాత్ = మిక్కిలివేగముగా, పీడయ న్తమ్ = పీడించుచున్నవాఁడును, ఉరగేశ్వరం = పాములకు రాజైనవాఁడును, పృథుతరం = చాలపెద్దవాఁడైన, అహిం = పామును (అనగాఁ గొండచిలువ యాకారములోనున్న, అఘాసురం = అఘుఁడను పేరుగల రాక్షసుని భగవాన్ = భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు అనఘం = పాపము లేనివానిగా, (అప్పుఁడు పాపికానివానిగా) అకరోత్ = చేసెను.

తా॥ బకాసురునితమ్ముఁడు అఘాసురుఁ డనువాఁడు, అన్నను జంపిన పగవలన, ఉరగనాథుఁడైన పెద్దకొండచిలువ ఆకారములో నడ్డముగా నిలిచి మిక్కిలివేగముగా గోగోపగోపీజన సంఘమును మ్రింగెను. అది చూచి శ్రీకృష్ణుఁడు దానిని వధించి ఆపుణ్యాత్ములగు వారలను రక్షించుటయే కాక అఘాసురునకుఁ గూడ పుణ్యలోక మొసఁగి అనఘునిగా వానిని అనుగ్రహించెను.

అవ॥ గోగోపగోపీసాధుసంఘమును కార్చిచ్చునుండి శ్రీకృష్ణుఁ డెట్లు పరిరక్షించినది ఇందు వర్ణింపఁబడినది.

పీత్వా ఽరణ్యహుతాశన మసహ్యత త్తేజసో హేతోః ।
దగ్ధా న్ముగ్ధా నఖిలా న్జుగోప గోపా న్కృపాసిన్ధుః॥ 232

ప్ర : కృపాసిన్ధుః = దయాసముద్రుఁడైన బాలకృష్ణుఁడు, అరణ్యహుతాశనమ్ = అరణ్యములోని కార్చిచ్చును, పీత్వా = త్రాగివేసి, అసహ్యత త్తేజసః = సహింపరాని దానివేడిమి, హేతోః = కారణముగా, దగ్ధాన్ = కాల్పఁబడిన, ముగ్ధాన్ = అమాయకులైన, అఖిలాన్ గోపాన్ = సమస్తమైన గొల్లవారిని, జుగోప = రక్షించెను.

తా॥ అరణ్యములో నడచేయి సన్మార్గవర్తులగు గోగోప గోపీసంఘములను పెద్దకార్చిచ్చు చుట్టుముట్టి దహింపఁబూనఁగా, నాయనాయికులు మొరలిడఁగా, నా చిన్నకృష్ణుఁ డా దవానలమును తానే మ్రింగివేసి వారిని రక్షించెను. ఇది సామాన్యమానవులు చేయగలపనియా? శ్రీకృష్ణుఁడు సర్వశక్తిమంతుఁడగు ఈశ్వరుఁడని సూచింపదా?

అవ॥ ఇంద్రుఁడు ఘోరమైన పిడుగులరాళ్ళవాన కురిపింపగా శ్రీకృష్ణుని యాపద్రక్షకత్వముచే ఈశ్వరత్వప్రదర్శనము,

పాతుం గోకుల మాకుల మశనితటిద్వర్షైః కృష్ణః ।
అసహాయ ఏకహస్తే గోవర్ధన ముద్దధా రోచ్చైః ॥ 233

ప్ర: అశనితటిద్వర్షైః అశని = పిడుగులు, తటిత్ = మెఱుములు వీనితోఁ గూడిన, వర్షైః = వర్షములచేత, ఆకులం = గగ్గోలుపడిన, గోకులం = గోగోపగోపీసంఘముగల గొల్లపల్లెను పాతుం = రక్షించుటకు, కృష్ణః = బాలకృష్ణుఁడు, అసహాయః = మఱేసహాయము లేనివాఁడయ్యు, ఏకహస్తే = ఒంటి చేతియందే, గోవర్ధనం = గోవర్ధనపర్వతమును, ఉచ్చైః = ఎత్తుగా ఉద్దధార = ఎత్తిపట్టెను.

తా॥ దేవేంద్రుఁడు వ్రేపల్లెవారిపై కోపముతో వారిని బాధింపఁ దనసప్తమేఘములఁ బండి పిడుగులు, మెఱుపులు, ఉఱుములు మొదలైన వానితో విపరీతమైన వర్షము కురిపింపఁగా, బాలకృష్ణుఁడు, ఆదీనజనజంతువులను రక్షించుటకు, పరసహాయము నపేక్షింపక ఒంటిచేతితో బరువైన గోవర్ధనపర్వతమును ఎత్తుగా గొడుగువలె నెత్తిపట్టెను. వానిని దానిక్రింద రమ్మని, బాధలేకుండఁ జేసెను. అప్పుడు కృష్ణుఁ డన్నమాట

శా॥ బాలుం డీతఁడు; కొండ దొడ్డది; మహాభారంబు సైరింప జాలండో యని దీనిక్రింద నిలువన్ శంకింపఁగాఁ బోల

శైలాంభోనిధిజంతుసంయుతధరాచక్రంబు పైఁబడ్డ నా
కే లల్లాడదు బంధులార! నిలుఁడీ క్రిందం బ్రమోదంబునన్.
(భా౹ 10-1-919)

ఇట్లేడుదినములు మోసి వారల రక్షించెను. ఇది అత్యాశ్చర్యమగు భగవత్కృత్యము కాదా!

అవ॥ శ్రీకృష్ణుఁడు, కంసునివస్త్రము లుదుకు రజకుఁ డపరాధియైనను ఎట్లనుగ్రహించెనో వర్ణించుచున్నారు.

**వాసోలోభాకలితం ధావ ద్రజకం శిలాతలే హత్వా ।**
**విస్మృత్య తదపరాధం వికుణ్ఠవాసో ఒర్పిత స్తస్మై ॥**
**234**

ప్ర : వాసోలోభాకలితం = వస్త్రములలోభముచేత గర్వించుచున్నవాఁడగు, శిలాతలే = ధావత్, రజకమె = బాతిబండమీఁద(గుడ్డలు)ఉదుకుచున్న(లేదా కొండ మీఁద పరుగెత్తుచున్న చాకలిని) హత్వా = చంపి తదపరాధం = ఆచాకలివాని నేరమును, విస్మృత్య = మఱచిపోయి, తస్మై = అతనికి, వికుణ్ఠవాసః = వైకుంఠ ములో నివసించుభాగ్యము (శ్రీకృష్ణేన = శ్రీకృష్ణునిచే) అర్పితః = ఈయఁ బడెను.

తా॥ శ్రీకృష్ణుఁడు, తనకు వస్త్రము లిమ్మని యాచింపగా కంసుని రజకుఁడు వస్త్రములమీఁది లోభముచేత నతనిని నిందించి ఈయుట మానెను. దానికి వానిని జంపి అతని నేరము నంతటితో మఱచి యతనికి వైకుంఠములో నివసించు భాగ్య మిచ్చి అనుగ్ర హించెను.

అవ॥ శ్రీకృష్ణుఁడు కుబ్జ ననుగ్రహించిన విధము వేరొండు.

**త్రేధా వక్రశరీరా మతిలమ్బోష్ఠీం స్థలద్వపుర్వచనామ్।**
**ప్రసక్చన్దనపరితోషా త్కుబ్జా మృజ్వాననా మకరోత్ ॥**
**235**

ప్ర : శ్రీకృష్ణుఁడు, స్రక్చన్దనపరితోషాత్ = పూలమాలలు, గంధము (పరమభక్తితో) తనకిచ్చుట చేత గల్గినసంతోషమువలన, త్రేధావక్రశరీరాం = మూఁడువిధములైన వంకరలుగల శరీరముగలదియు, అతిలమ్బోష్ఠీం = మిక్కిలిగా వ్రేలాడు పెదవులుగలదియు, స్ఖలద్వపుర్వచనాం = చలించుచున్న శరీరమును మాటలును గలదియునగు, కుబ్జాం = కుబ్జను (మరుగుజ్జగుటచేత కుబ్జయని పిలువఁబడుచున్నదానిని) ఋజ్వాననామ్ = వక్రతలులేని సరళసుందరముఖము గలదానినిగా, ఆకరోత్ = చేసెను.

తా॥ కంసునకు గంధము, పూలలు నిచ్చుటకై, మూఁడు వంకరలుగల శరీరముతో మిక్కిలిగా వ్రేలాడు పెదవులు తొట్రుపడు శరీరము మాటలు గల కుబ్జ వెళ్లుచు నెదురుపడఁగా కృష్ణుఁడవి తన కిమ్మనఁగా నామె ప్రేమతో భక్తితో నిచ్చినది. దాని కాయన మిక్కిలి సంతసించి యామె శరీరముఖవక్రత్వములు తొలఁగించి, యామెను మనోహరసుందరిగాఁ జేసి యనుగ్రహించెను.

అవ॥ మానవులనేగాక జంతువులనుగూడ శ్రీపరమేశ్వరుఁడు ఉచితముగా ననుగ్రహించిన విధ మొకింత వర్ణింపఁబడుచున్నది.

**నిహతః పపాత హరిణా హరిచరణాగ్రేణ**
**కువలయాపీడః ॥**
**తుఙ్గోన్మత్తమతఙ్గ పతఙ్గవ ద్దీపక స్యాగ్రే ॥ 236**

ప్ర : (కంసునిమావటివానిచే ప్రేరేపింపబడినదై) తుంగోన్మత్తమతంగః = ఎత్తై మదించి పిచ్చెక్కిన ఏనుగు, కువలయాపీడః = కువలయాపీడమను పేరుగలది హరిణా = శ్రీకృష్ణునిచేత, హరిచరణాగ్రేణ = శ్రీకృష్ణునికాలిగోటిచే (కొట్టఁబడినదై) నిహతః = చంపఁబడి, దీపకస్య = మండుదీపము యొక్క అగ్రే = కొనజ్వాలయందు (దానిని తాకి చచ్చినదైన) పతంగవత్ = శలభమువలె పపాత = పడెను.

తా॥ కంసుఁడు తనమావటివానిని ఎత్తై మదించిన కువలయాపీడ మను తనయేనుగును శ్రీకృష్ణునిపై ప్రయోగించి వానిని చంపుమని నియోగించెను. వాఁడు దాని నాయనపై పురిగొల్పఁగా నది విజృంభించి యాయనను దాఁకఁగా, నాయన శేలికగాఁ దన కాలిగోటితో దానిని గొట్టఁగా నది, మండుదీపమును దాఁకి చచ్చి పడిన శలభముఁబలె, శ్రీకృష్ణుని ముందు చచ్చి పడెను. ఆయనచేఁ జచ్చి దాని పూర్వజన్మసుకృతముచే సుగతిని బొందెను. శ్రీకృష్ణునియనంతశక్తిమత్త్వము, జీవులకు, కర్మానుసారఫలప్రదాతృత్వము, రాగద్వేషరాహిత్యము ఈసంఘటనయందు ప్రద్యోతకములు.

అవ॥ ఇక ముష్టికచాణూరుల ననుగ్రహించుట వర్ణించుచున్నారు.

**యుద్ధమిషాత్సహ రఙ్గే శ్రీరఙ్గేణాఙ్గసఙ్గమం ప్రాప్య।**
**ముష్టికచాణూరాఖ్యౌ యయతు ర్నిఃశ్రేయసం సపది॥** **237**

ప్ర : ముష్టికచాణూరాఖ్యౌ = ముష్టికుఁడు, చాణూరుఁడు అను పేరులుగల యిద్దఱుమల్లురు, యుద్ధమిషాత్ = మల్లయుద్ధము అనునెపముతో, సహ = కూడి, రంగే = మల్లయుద్ధరంగమందు, శ్రీరంగేణ = శ్రీకృష్ణునితో, అంగసంగమం = (దేహసంస్పర్శమును), ప్రాప్య = పొంది, సపది = వెంటనే, నిశ్శ్రేయసం = మోక్షమును, యయతుః = పొందిరి.

తా॥ కంసునిచే రామకృష్ణులవధకొఱకు నియోగింపఁబడిన ముష్టికచాణూరులను నిర్వురుమల్లురు శ్రీకృష్ణునితో బలరామునితో మల్లయుద్ధము చేసిరి. దానిలో వారివారిశరీరములు పరస్పరము కలిసి పెనుగులాడినవి. అందు శ్రీహరి యవతారములగు బలరామ కృష్ణులచేఁ జంపఁబడి వెంటనే మోక్షమును పొందిరి. అనంతుఁడు విష్ణువునాలవభాగమనఁబడుటచే, నాయన యవతార

మగు బలరామునిచే జంపఁబడిన ముష్టికుఁడును శ్రీహరిచేఁ జంపఁబడినట్లు చెప్పఁబడినది.

అవ॥ కంసవధ, యతని ననుగ్రహించుట వర్ణింపఁబడుచున్నది.

దేహకృతా దపరాధా ద్వైకుణ్ఠోత్కణ్ఠితాన్తరాత్మానమ్।
యదువరకులావతంసః కంసం విధ్వంసయామాస॥ 238

ప్ర : యదువరకులావతంసః = యదువుయొక్క శ్రేష్ఠమైన కులమునకు భూషణమైన శ్రీకృష్ణుఁడు, వైకుణ్ఠోత్కణ్ఠితాన్తరాత్మానం = వైకుంఠుఁడగు విష్ణుని లేకవైకుంఠలోకమును, బొందవలె నని మిక్కిలి తహతహపడుఅంతఃకరణము గలవాఁడగు, కంసం = కంసుని, దేహకృతాత్ = కంసునిదేహముచేఁ జేయఁబడిన, అపరాధాత్ = నేరమువలన, విధ్వంసయామాస = నాశనముచేసెను. (అపరాధియైన దేహమును జంపి జీవసంప్రార్థితమైన వైకుంఠపదవి నొసంగెను.)

తా॥ కంసుఁడు దేవకియష్టమగర్భము తన్ను సంహరించు నని ఆకాశవాణిచే విన్నదిమొదలు, భయమువలన నతని మనస్సెప్పుడును శ్రీకృష్ణునందు లగ్న మాయెను. అతనిదేహము శ్రీహరిని జంపవలె నని చేసిన నేరము ఫలితముగా శ్రీహరి దానిని సంహరించి, కంసునిచే మనసార ప్రార్థింపబడిన తనధామ మగు వైకుంఠము వాని కొసఁగెను. కంసునియుత్కంఠ వైకుంఠశబ్దము చే॥) విష్ణుప్రాప్తి లేక వైకుంఠలోకప్రాప్తిని గుఱించి యని రెండువిధముల సమర్థింపఁదగును శ్రీకృష్ణుఁ డిట్లు కరడుగట్టిన శత్రువగు కంసునకుఁగూడ వైకుంఠ మొసఁగిఅనుగ్రహించెను.

అవ॥ ఇందు శిశుపాలునకు సాయుజ్యమోక్ష మబ్బినవిధము వర్ణితము.

హరిసన్దర్శనయోగా త్ప్రథురణతీర్థే నిమజ్జతే తస్మై।
భగవా న్ప్ర ప్రాదా ద్యః సద్య శ్చైద్యాయ
సాయుజ్యమ్॥ 239

ప్ర : హరిసన్దర్శనయోగాత్= శ్రీకృష్ణునిసందర్శనభాగ్యము కలుగుట చేత, పృథురణతీరే = గొప్పదైన యుద్ధమనెడి తీర్థమునందు, నిమజ్జతే= మునుఁగునటువంటి, తస్మై= ఆ, చైద్యాయ = చేదిదేశపురాజైన శిశుపాలునకు, భగవాన్ను= భగవానుఁడేయగు, యః= ఏప్రసిద్ధుఁడగుశ్రీకృష్ణుఁడో, (సః= అతఁడు,) సాయుజ్యం= ఈశ్వరునిదేహేంద్రియములతోఁడ సమానాభిమానత్వము (సాయుజ్యము), సద్యః= అక్షణమందే, ప్రాదాత్= ఇచ్చెను.

తా॥ శిశుపాలుఁడు శ్రీకృష్ణునందు పుట్టినదాది బద్ధవైరము కలవాఁడు. అందువలన నాయన కనఁబడినంతనే యుద్ధమునకు దిగువాఁడు. పరమేశ్వరుఁ డతనిని చివఱయుద్ధమునఁ జంపి యత నికి సాయుజ్యరూపమోక్ష మిచ్చెను. ఈవిషమై గీతలందు శ్రీకృష్ణ భగవానుని ప్రమాణవచనము.

శ్లో॥ అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కలేబరమ్।
యః ప్రయాతి, స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥
గీ 8-5

తనమరణకాలమందు, ఎవఁడైనను, విష్ణువగు పరమేశ్వరుఁడైన నన్నుమాత్రమే తలంచుచు, తనభౌతికశరీరమును విడిచిపోవునో, అతఁడు నావైష్ణవతత్త్వమైన విష్ణుభావమును పొందును. ఈవిష్ణు భావము నతఁడు పొందునా, పొందఁడా యనువిషయమందు ఎట్టి సంశయమును లేదు. ఇది సత్యవచనముల కెల్ల సత్యమైన వచనము. (అనఁగా తిరుగులేనిది) ఇదియే సాయుజ్య మనిలోకప్రసిద్ధము.

విశిష్టాద్వైతులు నాలుగువిధముల మోక్షమును జెప్పిరి. సాలోక్యము- పరమేశ్వరునిలోకమం దుండుట. సామీప్యము- ఆయనకు సమీపమున నుండుట. సారూప్యము- పరమేశ్వరుని వంటిరూపమును బొందుట. సాయుజ్యము- ఆయనసన్నిధానము నఁ బ్రముఖుఁడై యుండుట. కొంద ఱాయనలో లీన మగుట అనఁగా, ఆయనదేహేంద్రియాభిమానత్వముతో నుండుట

సాయుజ్యమందురు. ఈనాల్గును మిథ్యారూపవ్యావహారికము లగుటచే ఇవి క్రమముక్తి హేతువులని, తాను బ్రహ్మ మనెడినిశ్చయరూపానుభూతివలననే శాశ్వతముక్తి యని ఉపనిషచ్ఛ్రుతి పాదితాద్వైతసిద్ధాంతము.

అవ॥ నారాయణుని యితరావతారములలో నాయనచేతఁ జచ్చినవారివిషయ మిటఁ జెప్పుచున్నారు.

**మీనాదిభి రవతారై ర్నిహతాః సురవిద్విషో బహవః।**
**నీతా స్తే నిజరూపమ్ తత్ర చ మోక్షస్య కా వార్తా॥ 240**

ప్ర : సురవిద్విషః = దేవతలను ద్వేషించినవారగు, బహవః = పలువురురాక్షసులు, రాజులు, మీనాదిభిః = మత్స్యము మొదలైన, అవతారైః = శ్రీవిష్ణుమూర్తియొక్క యవతారములచేత, నిహతాః = చంపఁబడిరి. తే = వారు, నిజరూపం = తమతమపూర్వకర్మఫలరూపములను, నీతాః = పొందింపఁబడిరి. తత్రచ = (అక్కడ) ఆచంపఁబడినవారివిషయమందు, మోక్షస్య = ముఖ్యముక్తికిసంబంధించిన, వార్తా = లోకవార్త, కా = ఏమి? అనగా లేదని భావము.

తా॥ దేవతలను విద్వేషించుచు రాక్షసులు అనేకవిధములుగా వారిని బాధించుచుండఁగా విష్ణువు అనేకానవతారములు మీనావతారము వరాహావతారము మొదలైన వెత్తి, రాక్షసులను జంపి దేవతలను గాపాడెను ఆచంపఁబడిన లోకకంటకులైన రాక్షసస్వభావు లందఱు సామాన్యముగా దమతమపూర్వకర్మఫలరూపమగు జన్మాంతరములనే పొందిరి. శాపవిముక్తులుమాత్ర మైరి. ముఖ్యమైన ముక్తిని లేక పునర్జన్మరాహిత్యమును బొందలేరు.

భాగవతాదిగ్రంథములందు విష్ణుముఖ్యావతారములు పదియని చెప్పఁబడినవి. అవి

శ్లో॥ మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః।
రామో రామశ్చ రామశ్చ(కృష్ణశ్చ)బౌద్ధః కల్కి రేవ చ॥

మత్స్య, కూర్మ, వరాహ, నృసింహ, వామన, పరశురామ, దశరథరామ, బలరామ (కృష్ణ అనుట సమంజసము కావచ్చును), బుద్ధ, కల్కి అనునవి పదిఅవతారములు. కల్కి అవతారము కలియుగాంతమున వచ్చును. వీనితో భాగవతమున 21 అవతారములు చేర్కొనంబడినవి. ఇవికాక వేఱువిధములైన యవతారములను బురాణములు చెప్పినవి. ధర్మమునకు గ్లాని సంభవించి నప్పుడెల్ల తానవతరించి దుష్టులశిక్షించి, శిష్టుల రక్షించి ధర్మమును సంస్థాపించె దనని శ్రీకృష్ణుడు భగవద్గీతలలో చెప్పినాడు. (భ.గీ.) కావున నితరావతారములుగూడ నుండవచ్చును.

అవ॥ శ్రీకృష్ణానుగ్రహపాత్రులై చంపఁబడిన వారు సాధారణముగా తిరిగి జన్మమునుపొంద రని చెప్పుచున్నారు.

**యే యదునన్దననిహతా స్తే తు న భూయః పునర్భవం**
**ప్రాపుః।**
**తస్మా దవతారాణా మన్తర్యామీ ప్రవర్తకః కృష్ణః॥ 241**

ప్ర : యే = ఎవరు, యదునన్దననిహతాః = శ్రీకృష్ణునిచేఁ జంపఁబడిరో, తే-తు = వారుమాత్రము, భూయః = తిరిగి, పునర్భవం = మఱల పుట్టుట, న, ప్రాపుః = పొందలేదు. తస్మాత్ = అందువలన, కృష్ణః = కృష్ణుఁడు, అవతారాణాం = ఈఅవతారములనన్నింటినిగూడ, ప్రవర్తకః = ప్రవర్తింపఁ జేసినవాఁడును, అంతర్యామీ = లోపలనుండినియమించిన యేకైకేశ్వరుఁడు.

**తా॥** కాని ఏవిధముగానైనను శ్రీకృష్ణునిచేతఁ జంపఁబడిన వారందఱు తిరిగి సంసారరూపమైన మఱొక జన్మము నెత్తలేరు. పునరావృత్తిలేని శాశ్వతమోక్షమును బొందిరి అందువలన నీయవతారము చాలముఖ్యమై ప్రఖ్యాతమైనది. ఈకృష్ణుఁడే తక్కినయవతారములలోనుండి వానిని ప్రవర్తింపఁజేసినవాఁడు. ఈశ్రీకృష్ణుడే పరిపూర్ణ పురుషుఁడును, పరిపూర్ణావతారమును. అవతా

రములలో కొన్ని ఆవేశావతారములు, కొన్ని అంశావతారములు, కొన్ని పూర్ణావతారములు. 'శ్రీకృష్ణుడు పరిపూర్ణావతారము.' అని శాస్త్రపురాణేతిహాసములనిర్ణయము.

అవ॥ ఈశ్లోకములో శ్రీకృష్ణపరతత్త్వమును వర్ణించుచున్నారు. నిత్య, జ్ఞానానందవస్తువు బ్రహ్మము, పారమార్థికసత్యము, నిర్గుణము, నిరాకారమ్ము నిష్కలము, నిరంజనము; నేతినేతివిధముగానేలక్ష్యస్వరూపముగానే తెలియదగినది. ఐనను దానికున్న అచిన్త్యమైన మాయాశక్తివలన పరమేశ్వరుడు, జీవకోటి, అనేకబ్రహ్మాండములుగా భాసించును. ఆనిర్గుణుడశరీరియైనప్పటికిని, సర్వశక్తిమత్వ, సర్వవ్యాపకత్వ సర్వజ్ఞత్వ సర్వవేత్తృత్వాద్యనేకకల్యాణగుణసంపన్నుడై కరుణసముద్రుడై, భక్తులకోర్కెల ననుసరించి, వారిననుగ్రహించుట కొఱకు అవతారములను, వివిధరూపములనుదాల్చును.

బ్రహ్మణ్డాని బహూని పఙ్కజభవాన్ ప్రత్యణ్డ
మత్యద్భుతాన్।
గోపా న్వత్సయుతా నదర్శయ దజం విష్ణూ నశేషాంశ్చ
యః।
శమ్భు ర్యచ్చరణోదకం స్వశిరసా ధత్తే చ
మూర్తిత్రయాత్
కృష్ణో వై పృథ గస్తి కో ఽ ప్యవికృతః సచ్చిన్మయో
నీలిమా॥ 242

ప్ర : యః = ఏశ్రీకృష్ణుడు, బహూని = అసంఖ్యాకములైన, బ్రహ్మణ్డాని = బ్రహ్మాండములను, అనగా గోళాకారములోనున్న పెక్కువిశ్వములను, ప్రత్యణ్డం = ప్రతిబ్రహ్మాండమునకు సంబంధించిన, అత్యద్భుతాన్ = మిక్కిలి యాశ్చర్యకరులైనవారిని, అశేషాన్ = అనేకులగు, పంకజభవాన్ = పద్మములందు, బుట్టినబ్రహ్మలగు సృష్టికర్తలను, విష్ణూన్ చ = విష్ణుమూర్తులగులోకరక్షకులను, యచ్చరణోదకం,చ = ఏహరిపాదమునుండివెలువడుచున్న యేగంగాప్రవాహోదకమును, శంభుః = శివుడు, స్వశిరసా = తనశిరస్సునందు, ధత్తే = ధరించెనో,

(తద్ = ఆయుదకమును), అజం = తన్ను బరీక్షింపమఱలచూడవచ్చిన (పూర్వము గోపవత్సములగుహాయందుదాఁచినచతుర్ముఖుఁడు.) బ్రహ్మకు, (ఆయనగర్వమును బోగొట్టుటకు), అదర్శయత్ = చూపెనో, సః = ఆచూపినవాఁడు, కః అపి = ఒకానొకఁడగు, అవికృతః = ఏవికారములు (మార్పులు) లేకయేకాకారుఁడై, నిత్యుఁడైన సచ్చిన్మయోనీలిమా = సచ్చిదానందస్వరూపమేయై నీలకాంతిగాఁగనఁబడు, కృష్ణః = శ్రీకృష్ణపరమాత్మ, మూర్తిత్రయాత్ = సృష్టిస్థితిలయకారకులగు బ్రహ్మవిష్ణుమహేశ్వరత్రయముకంటె పృథక్ = వేరైనవాఁడై (మూర్తిత్రయాతీతుఁడై), అస్తి నె = ఉన్నాఁడుసుమా.

తా॥ బ్రహ్మదేవుఁడు శ్రీకృష్ణుని పరీక్షించుటకు వానికిఁ దెలియకుండ వానిదగ్గఱ తృప్తితోనున్న గోపాలబాలురను, గోవత్సములను ఒకకొండగుహాయందు దాఁచెను. అప్పుడు ఆప్రాంత బ్రహ్మకు శ్రీకృష్ణుఁడు తాను తనమాయాశక్తిచే క్రొత్తగా గల్పించినవగు అనేకబ్రహ్మాండములను, ఒక్కొక్కబ్రహ్మాండమునందు ఆబ్రహ్మవలె (కంటె) అద్భుతశక్తులుగల ఒక్కొక్కబ్రహ్మను, లోకరక్షకవిష్ణువును, విష్ణుపాదోద్భవయగు గంగాప్రవాహమును శిరమున దాల్చి లోకసంహారకుఁడగు శివుని, గోపాల, గోపబాల గో, గోవత్సములను చూపించెను. ఆసృష్టికర్తబ్రహ్మ, విస్మయమంది పశ్చాత్తప్తుఁడై శ్రీకృష్ణవిశ్వేశ్వరుని మనసార పరమాత్మయగు పురుషోత్తమునిగా మిక్కిలి స్తుతించెను. కావున వీనికన్నిటికి నతీత, మధ్యస్థానము, సదావికారరహితము ఏకరూపమైన సచ్చిదానందస్వరూపపరబ్రహ్మమే సగుణములో నీలతేజోమూర్తిగాఁ బ్రకటమైన సర్వేశ్వరుఁడగు శ్రీకృష్ణస్వామి. ఈ సగుణనిర్గుణైక్యజ్ఞానము; ముక్తిసాధనము.

అవ॥ శ్రీకృష్ణునిమహత్త్వమును కీర్తించుచున్నారు.

కృపాపాత్రం యస్య త్రిపురరిపు రమ్భోజవసతిః
సుతా జహ్నోః పూతా చరణనఖనిర్ణేజనజలమ్।
ప్రదానం వా యస్య త్రిభువనపతిత్వం విభురపి
నిదానం సో ఽస్మాకం జయతి కులదేవో యదుపతిః॥
243

ప్ర : త్రిపురరిపుః = త్రిపురములకు శత్రువైన శంభుఁడు, అమ్భోజవసతిః = పద్మనివాసుఁడైన బ్రహ్మ, యస్య = ఎవనియొక్క, కృపాపాత్రమ్ = కరుణకు పాత్రులైరో, పూతా = పవిత్రురాలైన, జహ్నోః సుతా = జహ్నుమహర్షి కూతురైన గంగాదేవి, యస్య = (ఎవనియొక్క), చరణనఖనిర్ణేజనజలమ్ = పాదములగోళ్ళను కడుగుజలమో, త్రిభువనపతిత్వమ్ = మూఁడులోకములకధిపతితనము, యస్య = ఎవనియొక్క, ప్రదానమ్ = అనుగ్రహముతో నిచ్చిన, దానమో, (యః = ఎవఁడు), (విశ్వమునకు) నిదానమ్ = ఆదికారణమో, (విభుః అపి = సర్వవ్యాపకుఁడైనను, అస్మాకం = మాయతులకు, కులదేవః = కులాగతమైన దేవుఁడగు, యదుపతిః = యదువంశనాథుఁడైన శ్రీకృష్ణుఁడో, సః = ఆయన, జయతి = జయించుచున్నాఁడు సర్వోత్తముడు.

తా॥ జగత్సృష్టిసంహారకర్తలగు బ్రహ్మయు, శివుఁడును ఏవిష్ణునియొక్క దయకుఁ బాత్రము లైరో, యెవరి కాలిగోళ్ళను గడుగుటచే జలము పవిత్రమైన గంగానదిఆయెనో, తన్నుగావలెనని గొల్చినవారికి ముల్లోకాధిపత్యము నెవఁ డిచ్చు దాతయో, ఎవఁడు సకలవిశ్వమునకు ఆదికారణ మైనవాఁడో, అతఁడే సర్వవ్యాపకుఁడయ్యును శ్రీకృష్ణుఁడుగా వచ్చి మాసంన్యాసులకు కులదైవమాయెనో, ఆయన జయించుచున్నాఁడు అనఁగా అట్టిశోభామూర్తికి సర్వాతిశాయికి, దానితోఁ బోల్చుకొన్నప్పుడు తక్కువవాఁడనగు నేను (గ్రంథకర్తయగు శంకరుఁడను) నా ప్రణామాంజలులు సమర్పించుచున్నాను, అని భావార్థము.

(ప్ర. 36)

మాయాహస్తే ఒర్పయిత్వా భరణకృతికృతే
మోహమూలోద్భవం మామ్
మాతః కృష్ణాభిధానే చిరసమయ ముదా
సీనభావం గతా ఒసి।
కారుణ్యైకాధివాసే సకృదపి వదనం
నేక్షసే త్వం మదీయమ్
తత్సర్వజ్ఞే న కర్తుం ప్రభవతి భవతీ
కిం ను మూలస్య శాన్తిమ్॥ 244

ప్ర : కృష్ణాభిధానే= కృష్ణుఁ డను పేరుగల, (హే) మాతః=ఓతల్లీ! మోహమూలోద్భవం = (మోహము) అవిద్యయే మూలకారణముగాఁ బుట్టిన, మాం= నన్ను, భరణకృతికృతే = పోషణకార్యము నిర్వహించుటకొఱకు; మాయాహస్తే= మాయాదేవి చేతులయందు, అర్పయిత్వా=సమర్పించి, ఉంచి, చిరసమయం = చిరకాలము, ఉదాసీనభావం = ఉపేక్షాభావమును, గతాఅపి= పొందినదాన వైతివి; (హే) కారుణ్య+ఏక+అధివాసే = దయకు ఒకేనివాస మైన ఓతల్లీ, త్వం = నీవు, మదీయం = నాదైన, వదనం = ముఖమును, సకృత్అపి= ఒకమారైనను, న, ఈక్షసే=చూడకున్నావు; తత్=అందువలన, [హే] సర్వజ్ఞే = సర్వముతెలిసిన ఓతల్లీ, మూలస్య = [నాసంసారమోహము నకు] కారణమగు అవిద్యను, శాంతింకర్తుమ్ = [శాంతింప] నశింపఁజేయుటకు, భవతీ = పూజ్యురాలవునీవు, న ప్రభవతి, కిం ను = సమర్థురాలవుకావా యేమి?

తా॥ పరమేశ్వరుఁడే యందఱకు తల్లి, తండ్రి సర్వము నగును. అందులో మిక్కిలి సహజ ప్రేమనిధియు ఆప్రేమను వర్షించునదియు తల్లి గనుక ఆశ్రీకృష్ణునే, తల్లిగా భావించి, గ్రంథకర్త ప్రార్థించుచున్నారు, లోకశిక్షార్థము. ఓకృష్ణుఁ డను పేరుగల తల్లీ! అజ్ఞానమువలన మోహముతోఁ బుట్టిన నన్ను, మాయాదేవి చేతులలో నుంచి, నన్ను, పోషించి పెంచుమంటివి. నన్ను వదలి వెళ్ళి

దూరముగా నుంటివి. చిరకాలము నాయందుపేక్షాభావము వహించి, నన్ను గుఱించి యేమియుఁ బట్టించుకొనకుంటివి. సమస్తమైన దయకు నీవొక్కతవే నివాసము. అయినను ఒక్కమాత్రనను నా మొగమే చూడక పోతివి. నీవు సర్వజ్ఞురాలవుకూడ. అందుచేత నా యాహీనదీనావస్థ నీకు తెలియదనుటకు వీలు లేదు. నామూలాజ్ఞానమును దొలఁగించి, నన్ను కృతార్థుని చేయుటకు నీకు శక్తి లేదని నేననుకొనవలెనా? ఓపూజ్యురాలా, నిన్నుఁ బ్రార్థించుచున్నాను. ఇప్పుడైనను నాయందు దయ చూపుము. నన్నేలుము నీయనుగ్రహమున్నచో నన్ను నిన్నే చేయఁగలవు. యుక్తిమాతవు, శక్తిమాతవు, ముక్తిమాతవు నాకు నీవే. నీకంటెఁ బరం బెఱుంగను. జాగేలతల్లీ! లే! రమ్మా రక్షింపుము. 'మాతృదేవో భవ' తల్లియే దైవముగాఁగలవాఁడవుకమ్మన్న సూక్త్యర్థసూచన మిది.

అవ॥ "పితృదేవో భవ" అన్న వేదసూక్తిప్రకారము గ్రంథకర్త ప్రారించుచున్నారు.

**ఉదాసీనః స్తబ్ధః సతత మగుణః సఙ్గరహితో**
**భవాం స్తాతః కాఽతః పర మిహ భవే జ్జీవనగతిః।**
**అకస్మా దస్మాకం యది న కురుతే స్నేహ మథ త**
**ద్వసస్వ స్వీయాన్త ర్విమలజఠరే ఽస్మిన్ పునరపి॥**

**245**

ప్ర : [హే] తాతః = ఓపరమాత్మయగుతండ్రీ! భవాన్ = తమరు, సతతం = ఎల్లప్పుడును, ఉదాసీనః = రాగద్వేషములు లేకుండుటచే [ఉదాసీనుఁడవు] పుత్రునిపక్షమైనను వహింపని తటస్థ సాక్షిస్వభావుఁడవును, స్తబ్ధః = సర్వవ్యాపివగుటచే నిశ్చలరూపస్థావరుఁడవు, అగుణః = నిర్గుణుఁడవు, సంగరహితః = కర్తృత్వాద్యభిమానరూపమగుఆసక్తి [ప్రీతి] [సంగమము] లేని

వాఁడవు. [ఏమియును బట్టించుకొనినవాఁడవు], అకస్మాత్ = హఠాత్తుగా[ఇప్పుడుమాయందు], స్నేహం = ప్రేమను, న,కురుతే యది = చేయవేని, అతః పరం = దీనితరువాత, ఇహ = [ఇక్కడ] ఈలోకములో, జీవనగతిః = జీవించుపద్ధతి [మాజీవయాత్ర], కా [భవతి]=ఏమగును? తద్ =అందువలన, అథ= ఇప్పుడైనను, అస్మిన్= ఈ, స్వీయాన్తర్విమలజఠరే =నీదేయయినట్టియు, ఏమాలిన్యము లేనట్టియు, నాహృదయమందు, పునఃఅపి = తిరిగి మఱొకసారి, వసస్వ = నివసింపుమయ్యా! [ఇక్కడ పరమాత్మలక్షణములుగాఁ జెప్పిన మొదటిచరణమును మఱొకవిధముగా ప్రార్థించుభక్తుని గుణములుగనే అన్వయింపవచ్చును. "నేను సోమరిని, చేఁతకానివాఁడను, ఎల్లప్పుడునుసద్గుణహీనుఁడను, దేనిని పట్టించుకొనువాఁడను కాను ఏవ్రతనిష్ఠ లేనివాఁడను" అని.]

తా॥ ఓతండ్రీ! నీ వెప్పుడును స్వభావముచేత ను పేక్షాపరుఁడవు ఏమియును జేయవు. నిష్క్రియుఁడవు. నిర్గుణుఁడవు, ఏదియును బట్టించుకొనవు అయినప్పటికిని హఠాత్తుగా ఇప్పుడైనను మాయందు నీవు తండ్రివై దయఁ జూపుట మానినచో ఇఁక ముందు మే మిక్కడ జీవించు టెట్లు! కావున ఇఁక నిప్పుడైనను నాయీవిమలహృదయమునందు తిరిగి నివసింపుము, తండ్రీ, దీనదయాళూ! రెండవయన్వయములో- "నే నెప్పుడును సోమరిని, చేఁతకానివాఁడను,గుణహీనుఁడను,దేనిని అంటించుకొనివాఁడను, పట్టించుకొనువాఁడను గాను. సువ్రతనిష్ఠ యెఱుఁగను. ఇట్లు నేను యోగ్యలక్షణము లేని మూర్ఖుఁడ నైనప్పటికిని నీవు నాకు తండ్రివి. కొడు కెంత దుర్మార్గుఁడైనను, తండ్రి కొడుకు నెడల సహనము, వాత్సల్యము చూపునుగదా! కావున నా మొఱాలకించి యిప్పుడైనను హఠాత్తుగా, నీవు నాయందు ప్రేమ చూపి రక్షింపనిచో నిఁకముందు ఈలోకములో నాగతియేమి? నేను జీవించుట యెట్లు? నీవు విమలుఁడవు, సర్వవిశ్వము నీవిమలజఠరమం దున్నది. నేనును నీలో నొకమూల నున్నాను. పశ్చాత్తాపముతో నా

యీహృదయ మిప్పుడు శుభ్రమైనది. కావున నాహృదయపద్మమందే నీవు నిశ్చలముగా, వసించి నన్నుద్ధరింపుము ప్రభూ! నా వైరాగ్యాత్మబోధభక్తిత్రయమును పరిపక్వమొనర్చి, సంసారోపరమనుగు మోక్ష మిమ్ము ఓ పితృదైవమా!

అవ॥ రాక్షసరాజులు కర్మబంధనాతీతులైరా? యనుసందేహమును గ్రంథకర్త వెలిబుచ్చుచున్నారు. ఇది సందేహరూపమేగాని విజ్ఞయముకాదు.

**లోకాధీశే త్వ యీశే కి యాతి భవభవా వేదనా**
**స్వాశ్రితానాం**
**సఙ్కోచః పఙ్కజానాం కి మిహ సముదితే మణ్డలే**
**చణ్డరశ్మేః।**
**భోగః పూర్వార్జితానాం భవతి భువి నృణాం కర్మణాం**
**చేదవశ్యమ్**
**తన్మే దృష్టై ర్నపుష్టై ర్నను దనుజనృపై రూర్జితం**
**నిర్జితం తే॥ 246**

ప్ర : లోకాధీశే= లోకముల కన్నిఁటికి నధినాథుఁడవగు, త్వయి= నీవు, ఈశే [సతి]= పాలకుఁడవై యుండఁగా, స్వాశ్రితానాం = నిన్నాశ్రయించిన భక్తులకు, భవభవా= సంసారమువలనఁ బుట్టిన, వేదనా= బాధ, కిం ఇతి= [ఎందువలన?] దేనిఫలము? చణ్డరశ్మేః = ఉగ్రకాంతిగల సూర్యుని యొక్క, మణ్డలే= (మండలము,) బింబము, సముదితే=దాగుగా ఉదయించినది కాఁగా, పఙ్కజానాం= బురదలోఁబుట్టిన పద్మములకు, సఙ్కోచః= ముకుళించుట, ఇహకిం = లోకములోనేమున్నది లేదుగదా (కాని), ఇహ = నీయాశ్రితులయందు, కిం = ఎందువలననో: (కలదు), నృణాం = మనుష్యులయొక్క, పూర్వార్జితానాం = వెనుకఁ జేయఁబడిన, కర్మణాం = పనుల యొక్క, భోగం= ఫల మనుభవించుట భువి = భూమియందు, అవశ్యం= తప్పకుండ, భవతి చేత్= కల్గునన్నచో, తే= నీయొక్క, ఊర్జితం= గట్టిబలమైనదైన, తత్ (సూత్రమ్)= ఆనిబంధనము, మే= [నర]జాతిచేతను తామ

సగుణముచేతను, నాసంబంధులగు దృష్టైః=(విచారింపఁబడిన,) తెలియఁబడినవారగు, నృపుష్టైః= నరజాతియందు బలశాలురునగు, దనుజనృపైః=రాక్షసాంశగల రాజులచేత, [శిశుపాలజరాసంధాదులచేత] నిర్జితం,నను= జయింపఁబడినదాయేమి?

తా॥ లోకాధినాథుఁడవైన నీవు మమ్ము పాలించువాఁడవు. మేము నిన్ను ఆశ్రయించిన వారము. అట్టి నీవుండఁగా మాకీసంసారదుఃఖబాధ ఇంకను దొలఁగక, అనుభూత యగుచుండుట కేమి కారణమో తెలియకున్నది. ప్రచండకిరణుఁడైన సూర్యుఁడు చక్కఁగా ఉదయించి ప్రకాశించుచుండఁగా, ఆయన మిత్రములైన పద్మములకు సంకుచించుటుండదే లోకములో. కాని యీవిషయములో సూర్యునంటివాఁడవగు నీవు ప్రకాశించుచున్నను, బురదలోఁ బుట్టిన మాహృదయపంకజము సంకోచించుచునే యున్నదే. ఈశగుద్ధానుభవము లేలకో గదా, స్వామీ! ఈసంచారీభావములవలన, చిత్తమాలిన్యము (బురద) పో లేదని తాత్పర్యము (ధ్వని) వెనుక చేసిన కర్మములఫలము తప్పక భూమియందు నరులు అనుభవించి తీరవలె నన్నది, ఓ ఈశ్వరా! నీయాశ్రితశాసనముగదా! తమోమలినచిత్తుఁడనగు నావంటి నరులకుటచే, నావారై, లోకప్రసిద్ధులై, నరులందు శారీరకబలాఢ్యులై రాక్షసాంశసంభూతులైన రాజులచేత. పైపేర్కొన్న నీయాశ్రితశాసనము కూడ (నిర్జితము, జయింపబడినది) భంగము కాఁబడినదా యేమి? అని నాసందేహము. అసఁగా నీయాశ్రితశాసనము, నిర్జితమైన దనలేను, కాలే దనలేను. ఆదనుజనృపులను నీ వట్లనుగ్రహించుటయే మాయీసందేహహేతువు. ఏది యెట్లైనను, ఒకటి మాత్రము నిశ్చయము. నీయనుగ్రహపాత్రుఁడైనవాఁడు చెడఁడు. కావున మాయాశాజ్యోతివి నీవే. సర్వథా సర్వశరణ్యుఁడవీవు, దేవా!

అవ॥ తనముక్తిలేమికి, తల్లి, దండ్రి, ఈశ్వరులయొక్క దయాస్వభావమందు లోపముండఁజాలదు గాన, ఆయయోగ్యత సాధకుఁడైన తనయందే యుండవలయు నను చక్కని వివేకోదయము గల్గి, తనయంతఃకరణచాతకపక్షిని ప్రబోధించు (మేల్కొల్పు)చున్నారు. తన మనస్సును మేల్కొల్పుచున్నారు. ఉద్బోధించుచున్నారు.

నిత్యానన్దసుధానిధే రధిగతః సన్నీలమేఘః సతా
మౌత్కణ్ఠ్యప్రబలప్రభఞ్జనభరై రాకర్షితో వర్షతి।
విజ్ఞానామృత మద్భుతం నిజవచోధారాభి రారా దిదం
చేతశ్చాతక! చేన్న వాఞ్ఛసి తృషాక్రాన్తో ఽపి సుప్తో
ఽసి కిం? ॥ 247

ప్ర : నిత్యానందసుధానిధేః = నిత్యానందమను అమృతసముద్రమునుండి (యేర్పడినదైన) సన్నీలమేఘం = సత్యస్వరూపమైన నల్లనిమబ్బు (శ్రీకృష్ణుఁడు) సతాం = సత్పురుషులగుభక్తులయొక్క, ఔత్కణ్ఠ్యప్రబలప్రభంజనభరైః = మిక్కిలి ఆసక్తియనెడు అధికబలము గలిగిన గాలులయొత్తిడుల చేత, ఆకర్షితః = ఆకర్షింపఁబడి, దగ్గఱకులాగఁబడి, అద్భుతం = ఆశ్చర్యకరమైన, విజ్ఞానామృతం = విశిష్టమైన ఆత్మజ్ఞానము అనుఅమృతమును, నిజవచోధారాభిః = తనవాక్కు లనెడధారలచేత, ఆరాత్ = దగ్గఱగా, వర్షతి = వర్షించుచున్నది (హే)చేతశ్చాతక = (ఓ) మన స్సనెడుచాతకపక్షీ! తృషాక్రాన్తః అపి = దప్పికచేత (ఆక్రమింపబడిన) గొంతుకయెండిపోవుచున్నప్పటికిని, ఇదం = ఈప్రబోధసుధావర్షజలమును, న వాంచసిచేత్ = కోరకుండ నున్నదానవగుచో (నీవు) సుప్తః అసికిమ్ = నిద్రపోవుచున్నావా యేమి?

తా॥ ఓమన స్సనెడు చాతకపక్షీ! సద్రూపుఁడగు శ్రీకృష్ణుఁ డనెడు నీలమేఘము (పరబ్రహ్మస్వరూపమైన) నిత్యానందమను అమృతసముద్రమునుండి యేర్పడి విశాలాకాశమందు

గంభీరముగా నున్నది. తన్ను పొందవలె నని తహతహలాడు సత్పురుషులయొక్క తీవ్రవాంఛలనెడి పెద్దగాలులబలముచేత, ఆకర్షింపబడి వారిదగ్గఱకు వచ్చినది. ఆ శ్రీకృష్ణనీలమేఘము తన వాగ్ధారలరూపమున ఆత్మజ్ఞానామృతమును వర్షించుచున్నది. ఓ మనస్సనెడిచాతకపక్షీ! నీవా గొంతుక యెండిపోయినంత దప్పికతో బాధపడుచున్నావు. అయినను జ్ఞానామృతవర్షధారలను త్రాగకున్నావేమి? ఇది కడుచిత్రముగా నున్నదే. నీవు నిద్రనుండి మేల్కొనలేదా? నిన్ను నిద్ర వదల లేదా? అతి దుర్లభమగు ఈ మహావకాశమును జాఱవిడుచుకొను తామసము నీ కేల? లెమ్ము; మేల్కొని, జ్ఞానామృతవర్షధారలం ద్రాగుమని దివ్యప్రబోధము. గ్రంథకర్త తనమనస్సును చాతకపక్షీగా రూపించినాఁడు. (రూపకాలంకారము) చాతకపక్షి శుద్ధవర్షధారలను మాత్రమే త్రాగి జీవించునే గాని ఆవర్షజల మితరముతోఁ గలసినను, నద్యాదిజలములను త్రాగదని ప్రసిద్ధి. సచ్చిదానందబ్రహ్మమే యొకసుధాసాగరము. దానినుండి యవతరించిన నల్లని మేఘము; పరమేశ్వరుఁడగు నీలరూపియైన శ్రీకృష్ణుఁడు. ఆయనవాగ్ధారలు, భగవద్గీతలు. అవి యద్వైతవిజ్ఞానామృతమును వర్షించు ధారాపరంపరలు. అవి త్రాగి అనఁగా వానిసారమగు ఆత్మజ్ఞానము నను భవించి కృతకృత్యవు కమ్మని మనస్సు నుద్బోధించుచున్నాఁడు కావున సంసారమోక్షప్రాప్తికి శ్రీకృష్ణగీతామృతపానము నిరపాయనిశ్చితోత్తమసాధన మని ప్రబోధసారము. ఈజ్ఞానమువలననే ముక్తి. ఇతరముచే గాదనియు సూచితము.

అవ॥ చంచలస్వభావముగల మనస్సును, వివేకముతో వ్యవహరింపుమని యింకను హెచ్చరించుచున్నాఁడు. జితేంద్రియము కాని మనస్సునకు ఈశ్వరాశ్రయము దుర్లభముగదా! జ్ఞానప్రాప్తియు బహుదుర్లభము.

చేతశ్చఞ్చలతాం విహాయ పురతః సన్ధాయ కోటిద్వయమ్
తత్రైకత్ర నిధేహి సర్వవిషయా నన్యత్ర చ శ్రీపతిమ్।
విశ్రాన్తి ర్హిత మప్యహో క్వ ను తయో ర్మధ్యే
తదాలోచ్యతామ్
యుక్త్యా వాఽనుభవేన యత్ర పరమానన్దశ్చ
తత్సేవ్యతామ్॥ 248

ప్ర : (హే) చేతః = ఓమనస్సా, చఞ్చలతాం = నీకుసహజమైన చాంచల్యమును, విహాయ = విడిచి, పురతః = నీకెదుట, కోటిద్వయం = రెండు పక్షములను, సన్ధాయ = ఉంచి, తత్ర = అక్కడ (వానిలో) సర్వవిషయాన్ = నీకేమేమికావలెనని కోరుచున్నావో కోరఁగలవో ఆవిషయము లన్నింటిని, ఏకత్ర = ఒకప్రక్కను, శ్రీపతిం = లక్ష్మీనాథుఁడైన శ్రీకృష్ణుని, అన్యత్ర = మఱొకప్రక్కన నిధేహి = ఉంచుము. తయోఃమధ్యే = ఆరెంటిమధ్యమందు, అహో = ఔరా, క్వ = ఎక్కడ, విశ్రాన్తిః = పరిపూర్ణమైన శాంతి (కోరిక మిగిలియున్నంతవఱకు శాంతియుండదు), హితం అపి ను = నీమేలుకూడ నిజముగా (లభ్యతే = పొందఁబడుచున్నదో) తద్ = అది, ఆలోచ్యతాం = ఆలోచింపవలసినది, యత్ర = ఎక్కడ, యుక్త్యా = తర్కముచేతను, వా = మఱియు, అనుభవేన = నీఅనుభవమువలన, పరమానన్దఃచ = శ్రేష్ఠమైన నిత్యానందము (మఱల దుఃఖపువాసనకూడ ఉండఁగూడదు; వెనుక చెప్పినశాంతి, మేలులతో కూడ) అస్తి = కలదో, తద్ సేవ్యతామ్ = దానిని సేవింపవలసినది.

తా॥ ఓమనస్సా! నీచంచలత్వమును విడుము. సరిగా నాలోచింపుము. నీకేది మేలో ఏది కీడో నిదానముగా నీతార్కిక బుద్ధిని, నీజీవితానుభవములను ఆధారముగా తూఁచి నిర్ణయించి మఱిప్రవర్తింపుము. ఇదిగో! నీకిప్పుడున్న విచారణీయాంశము; విషయసేవ సుఖమా? ఈశ్వరాశ్రయము సుఖమా? ఒకవైపున నీకేవేవి సుఖ మిచ్చు ననుకొందువో వాని నన్నిటిని, ఆసర్వ

విషయములన్ను ఉంచుము. రెండవవైపున శ్రియఃపతి యగు శ్రీకృష్ణునుంచుము. ఆరెంటిలో దేనివలన నీకేది సంపూర్ణశాంతి నిచ్చునో మేలుచేయునో చక్కగా నాలోచింపుము. భంగము కానిశాంతి కావలెను. తర్కముచేత, అనుభవముచేత విచారించి నిర్ణయింపుము. దేనివలన నీకు పరమానందము, నిత్యానందము, మరల (దుఃఖవాసనకూడ ఉండరాదు.) లభించునో దానినే సేవింపుము.

అవ॥ అదేపక్షమునందు కలదో చెప్పుచున్నారు.

పుత్రాన్పౌత్ర మథ స్త్రియో ఽన్యయువతీ ర్విత్తా
న్యథో ఽన్యద్ధనమ్
భోజ్యాదిష్వపి తారతమ్యవశతో నాలం సముత్కణ్ఠయా।
నైతాదృ గ్యదునాయకే సముదితే చేతస్యన న్తే విభౌ
సాన్ద్రానన్దసుధార్ణవే విహరతి స్వైరం యతో నిర్భయమ్॥
249

ప్ర: (మనుష్యులు) సముత్కణ్ఠయా = గొప్పఆశతో, పుత్రాన్ = కొడుకులను, పౌత్రం = కొడుకులకుకొడుకు (ల) ను, అథ = పిదప. స్త్రియః = భార్యలను, అన్యయువతీః = ఇతరయువతులను, (తనభార్యకన్న ఇతరసుందరులను), విత్తాని = ధనములను, అథ = మఱియు, అన్యత్ ధనం = ఇతరమైన సంపద (ఇవి లెక్కలేనన్ని యున్నవి. క్షేత్రారామములు, వస్తువాహనములు, మిద్దెలు, మేడలు మొదలైనవి) భోజ్యాదిషుఅపి = భోజన పదార్థములందుఁగూడ, (శ్రేష్ఠాని = శ్రేష్ఠము లైనవి) (వాఞ్ఛన్తి = కోరుచున్నాడు) తారతమ్యవశతః = ఇందులో నన్నిటిలో హెచ్చుతగ్గు లుండుట వలన, న,అలం = చాలును అనుమాట లేదు. (తృప్తిలేదు. అందువలన శాంతి లేదు. ప్రయత్నము, సిద్ధ్యసిద్ధులు, బాధలు ఉన్నందున తనకు మేలు కలుగదు.) (ఇక రెండవ పక్షము) న,ఏతాదృక్ = ఇట్టిది కానిది (రెండవ పక్షము). అనన్తే = అంతము లేనివాఁడును, నిత్యుఁడు, విభౌ = సర్వవ్యాపకుఁ

డును సాన్ద్రానన్దసుధార్ణవే = దట్టమైన, ఘనమైన ఆనందసముద్రుడు నగు, యదునాయకే = శ్రీకృష్ణుడు, చేతసి = మనస్సునందు, సముదితే = చక్కగా ఉదయించిన (తెలియఁబడిన) వాఁడగుచుండగా, (జీవుఁడు, భక్తుఁడు, లేక ఆశ్రితుఁడు) యతః (తతః) = ఆకారణమువలన స్వైరం = స్వేచ్ఛగా, నిరంకుశముగా, నిరాటంకముగా, నిర్భయం = నిర్భయముగాను విహరతి = విహరించును.

తా॥ ఇక్కడ పైశ్లోకములోఁ జెప్పిన రెండుపక్షముల మంచిచెడ్డలను చర్చించుచున్నారు. మొదటిపక్షమందు మనుష్యుఁడు కోరు బాహ్యవిషయములకు మితి లేదు. లెక్క లేదు. తాత్కాలికసుఖాభాసమేగాని, నిత్యతృప్తి లేదు. అతఁడు పుత్రులను, పౌత్రులను, భార్యలను, ధనమును, ఇతరవిధములైన యనేక సంపదలను, వస్తువాహనములు గృహక్షేత్రారామములు మొదలైనవి కోరికోరి, వానికై పాపపుబుద్ధులు, పనులు చేయును. పరసుందరులను, సంపదలను కూడ కోరును. ఇవన్నియు తారతమ్యములు కలవి. ఒకటి వచ్చినపిదప నంతకన్న మంచిది రావలె నని కోరును. అందువలన ఇఁక చాలును అనుబుద్ధియే పుట్టదు. అందువలనఁ దృప్తిగాని, శాంతిగాని లభింపదు. పైగా నివి సాధించుటకు విశేషశ్రమ పడవలెను. వచ్చిన వానికి నష్టము, నాశము కూడ కల్గును. అందువలన సుఖముకన్న శ్రమ, బాధ పెరిఁగి, తనకు మేలు కల్గదు. ఇఁక రెండవపక్షము ఆలోచింపఁదగినది. శ్రీకృష్ణపరమాత్మ పొందు. ఆయన సర్వవ్యాపి, నిత్యుఁడు, నిత్యానందస్వరూపుఁడు. హృదయమునందు ఆయన వెలసినచో, ఆయన తెలిసినచో, నింక కోరఁదగినదే యుండదు. తానాయనయే యగును. ఆప్తకాముఁ డగును. అందువలన నకాముఁడు నగును. మనుష్యుఁ డితరులను బూజించి నప్పుడు, గౌరవించి

సప్పుడు, తా నాస్థితికి రావలెనని తాత్పర్యము. శ్రీకృష్ణునందు పరమభక్తికి పర్యవసానము తానే శ్రీకృష్ణుఁడ నని యెఱుంగుట ఇప్పుడు పరమభక్తితో పరమేశ్వరతత్త్వము నెఱింగినజ్ఞాని సచ్చిదానందబ్రహ్మస్వరూపముగల పరమేశ్వరుఁ డగును. ఇది తెలిసినవానికి నింకఁబొందనలసిన దుండదు. అతఁడు శ్రీకృష్ణ సాంద్రానందామృతసముద్రమందు నిర్భయముగా స్వేచ్ఛగా విహరించును. జీవేశ్వరులకు, [ఆత్మబ్రహ్మములకు] ఏకత్వమును అనుభవించుటచే నిర్భయుఁ డగును. ఇదిసూక్ష్మభక్తిఫలవిశేషము.

అవ॥ బాహ్యవిషయములను గోరువారిని, పైపరమభక్తుని, బోల్చి చెప్పు చున్నారు,

**కామ్యోపాసనయా ఽర్థయ న్త్యనుదినం కిఞ్చిత్ఫలం స్వేప్సితమ్**
**కిఞ్చి త్స్వర్గ మథాపవర్గ మపరై ర్యోగాదియజ్ఞాదిభిః ।**
**అస్మాకం యదునన్దనాఙ్ఘ్రియుగలధ్యానావధానార్థినామ్**
**కిం లోకేన దమేన కిం నృపతినా స్వర్గాపవర్గైశ్చ కిమ్ ॥**
**250**

ప్ర : (కొందఱు) కామ్యోపాసనయా=తాము కోరినదానిప్రాప్తికి చెప్పఁబడిన ఉపాసనచేత, అనుదినం = ప్రతిదినమును, స్వేప్సితం = తమకిష్టమైనదగు, కిఞ్చిత్ఫలం = ఏదోస్వల్పఫలమును, అర్థయన్తి = సంపాదింపఁ బ్రార్థించు చున్నారు. అపరైః=ఇతరులచేత, యోగాదియజ్ఞాదిభిః = యోగములు యజ్ఞములు మొదలైన వైదికకర్మములచేత, కిఞ్చిత్ = స్వల్పమైన స్వల్పకాల ముండెడు అనిత్యమైన) స్వర్గమో అథ = లేక, అపవర్గము = మోక్షమో, (ఇష్యతే=కోరఁబడుచున్నది) కాని యదునన్దనాంఘ్రియుగలధ్యానావధానార్థినాం, యదునన్దన=యదువులకానందరాశియగు శ్రీకృష్ణునియొక్క, అంఘ్రియుగల= రెండుపాదములను, ధ్యాన=ధ్యానించుటయందు అవధాన = సంస్థితిని, శ్రద్ధను అర్థినాం=కోరువటువంటి, అస్మాకం=మాకు, లోకేన కిం = ఈలోకముతో

నేమి ప్రయోజన మున్నది? (లేదని భావము.) దమేన కిం = ఇంద్రియనిగ్రహమువలన లాభమేమున్నది? (లేదు) నృపతినా = రాజులతోఁగాని, స్వర్గాపవర్గైశ్చ=స్వర్గముతోగాని సారూప్యాది మోక్షముతో (గూడ) గాని, కిం = ఏమిలాభము? (లేదని భావము.)

తా॥ ప్రపంచములోనిజనులు భిన్నభిన్నములగు విషయ భోగములందు పెద్దపెద్దకోర్కెలతో నున్నారు. వానికిఁ దగిన యుపాసనము నవలంబించి, ప్రతిదినమును వానినను ష్ఠించుచున్నారు. చివఱకు వారుకోరినఫలములను పొందవచ్చును. కాని అవి యల్పసుఖదములు, వెంటనే నశించునవి. (అనిత్యములు)అందు వలన నత్యల్పములు. కొందఱు, యజ్ఞయాగాదులవలన యోగాదుల వలన స్వర్గమో సారూప్యాదిమోక్షమో పొందఁ గోరుచున్నారు అవియు అనిత్యములు, స్వల్పసంతోషకరములు మాత్రమే యని యనుభవమే చెప్పుచున్నది. కావున మాకు పైవానితో పనిలేదు. మాకు శ్రీకృష్ణుని దర్శించుట, వానిపాదపద్మములను శ్రద్ధతో నిరంతరము ధ్యానించుట చాలును. దీనివలననే మాకు అమితానందము కల్గును. మాకు రాజులు మొదలగువారిని సేవించుట వలన, నీలోకములో వచ్చు పెద్దపెద్ద పనఁబడు పదవులుగాని, ధనధాన్యాదివస్తులాభముగాని చివఱకు స్వర్గసుఖము, సాలోక్యాది మోక్షముగాని అవసరము లేదు. వానిని పొందినయానందముకన్న పరమేశ్వరసేవయే మాకు మహానందకరము. ఇది నిర్మలభగవద్భక్తినిరూఢులయొక్క మనస్తత్త్వము, తృప్తిభరితము.

అవ॥ శ్రీకృష్ణుఁ డాశ్రితవత్సలుఁ డని చెప్పుచున్నారు.

ఆశ్రితమాత్రం పురుషం స్వాభిముఖం కర్షతి శ్రీశః।
లోహమపి చుమ్బకాశ్మా సంముఖమాత్రం జడం యద్వత్॥ 251

ప్ర : చుమ్బకాశ్మా = సూదంటుఱాయి, జడంఅపి = ప్రాణములేక కదలని వైనప్పటికి, లోహం = ఇనుపముక్కను, సంముఖమాత్రం = ఎదురుగా (దగ్గఱలో) నున్నంతమాత్రమున, యద్వత్ = ఏవిధముగా, స్వాభిముఖం = తనవైపునకు, కర్షతి = ఆకర్షించునో, (తద్వత్ = అట్లే), శ్రీశః = లక్ష్మీపతియైన కృష్ణుఁడు, ఆశ్రితమాత్రం = ఆశ్రయించుటమాత్రము చేసిన, పురుషం = పురుషుని, స్వాభిముఖం = ఆత్మయైనతనవైపునకు, కర్షతి = ఆకర్షించుచున్నాఁడు.

తా॥ ప్రాణములేని ఇనుపముక్కను సైతము, తనకెదురుగా నున్నచో సూదంటుఱాయి, దానిని తనవైపునకు ఆకర్షించుకొనును. అట్లే శ్రీకృష్ణుఁడుకూడ తనయెడల కొంచె మాసక్తి చూపించి యాశ్రయించినంత మాత్రమున, ఎవనినైనను తనవైపుగా దగ్గఱకు రాఁబ్రేరేపించును (ఆకర్షించును), శ్రీకృష్ణుఁడు భక్తవత్సలుఁడు. ఆత్మజ్ఞానానందప్రదుఁడు. ఆశ్రితభక్తరక్షణవిషయమై గీతలందు శ్రీకృష్ణభగవానుని ప్రతిజ్ఞావచనము.

శ్లో॥ "కౌంతేయ, ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥ గీ 9-31

ఓఅర్జునా! పరమార్థసత్యమును వినుము. నానిశ్చితమైన ప్రతిజ్ఞను లోకములకు చాటిచెప్పుము. నాయందు సమర్పింపఁబడినచిత్తము (అంతరాత్మ)గల నాభక్తుఁడు ఏకాలమందును నశింపఁడు. (త్వరలో నిత్యశాంతిని బొందు నని తాత్పర్యము).

అవ॥ శ్రీకృష్ణుఁడు తన్నాశ్రయించినవాఁడెట్టివాఁడైనను, ఉత్తమమధ్యమాధమభేదదృష్టిలేక రక్షించు ననుచున్నారు.

అయ ముత్తమో ఒయ మధమో జాత్యా రూపేణ
సంపదా వయసా।
శ్లాఘ్యో ఒశ్లాఘ్యో వేత్థం న వేత్తి భగవా
ననుగ్రహావసరే॥ 252

ప్ర : భగవాన్ = భగవానుఁడైన శ్రీకృష్ణుఁడు, అనుగ్రహావసరే = భక్తులను అనుగ్రహించువిషయములో, జాత్యా = పుట్టుక (జాతి) చేఁతగాని, రూపేణ = రూపముచేఁతగాని, సంపదా = ధనముచేఁతగాని, వయసా = వయస్సుచేతగాని, అయం = ఈయన, ఉత్తమః = ఉత్తముఁడు, అయం = ఈయన, అధమః తక్కువవాఁడు, శ్లాఘ్యః = ఈయన మెచ్చుకొనఁదగినవాడు, అశ్లాఘ్యః = ఈయన గర్హింపఁదగినవాడు, అనిగాని, ఇత్థం = ఈవిధముగా, న వేత్తి = చూడఁడు.

తా॥ శ్రీకృష్ణుఁడు తనభక్తుల ననుగ్రహించు విషయములో, ఈయాశ్రితభక్తుఁడు పుట్టుక (జాతి) వలనగాని, రూపము, సంపద,వయస్సులవలన గాని ఈ మొదలగు లౌకిక భేదముల తలంపులతో, ఇతఁడు ఉత్తముఁడు ఈయన అధముఁడు, ఈయన మెచ్చుకొనఁదగినవాఁడు ఈయన క్షుద్రుఁడు, అనియిట్లు ఈభేదదృష్టితోఁ జూడఁడు. భక్తులందఱిని సమబుద్ధితో ననుగ్రహించును.

అవ॥ మఱి దేనినిబట్టి వానియనుగ్రహము ప్రసరించు నన్నచో, జాబు.

**అన్తఃస్థభావభోక్తా తతో ఽన్తరాత్మా, మహామేఘః।**
**ఖదిర శ్చమ్పక ఇతి వా ప్రవర్షణే కిం విచారయతి॥ 253**

ప్ర : తతః = అందువలన, (సమబుద్ధియగుటవలన), అన్తరాత్మా = లోలోపలనుండు ఆత్మయగు శ్రీకృష్ణుఁడు (భక్తజనుల) అన్తఃస్థభావభోక్తా = భక్తులయంతఃకరణమందలిభక్తిభావశుద్ధిని బాగుగా గ్రహించి పాలించువాఁడు. మహామేఘః = గొప్పమేఘము, ప్రవర్షణే = బాగుగా వర్షించునప్పుడు, ఖదిరః ఇతివా = ఇదిచండ్రచెట్టనికాని, చమ్పకః ఇతివా = ఇదిసంపెంగచెట్టనికాని, విచారయతి కిం = ఆలోచించి వర్షించునా యేమి? (అట్లు చేయదు.)

తా॥ గొప్పమేఘము బాగుగా వర్షించునప్పుడు ఇది చేవగలఖదిరము (కలపనిచ్చుచెట్టు) ఇది లలితమైన సంపెంగ (పూలచెట్టు) అనెడిభేదము లేకయే అన్నిరకములవృక్షములపై సమాన

ముగా వర్షించును. అట్లే అనుగ్రహవేళ శ్రీకృష్ణపరమాత్మయు భక్తుల జాతిరూపాదిభేదములను జూడడు. ఆయన సర్వజ్ఞుడు గనుక అందఱిమనోభావములను, భక్తిలక్షణములను, దానితీవ్రతను నెఱుంగును. ఈభక్తిభావానుగుణముగా ఈశ్వరానుగ్రహము భక్తులపై ప్రసరించును. కావున నిరపాయముగు భక్తిమార్గము యొక్క లక్ష్యము ఈశ్వరప్రాప్తి. వైరాగ్యజ్ఞానభక్తిత్రయము పరిపక్వమగుచున్న దశ యిది.

అవ॥ కాని యాయన పరమభక్తులుమాత్రమే పరమానన్దమును బొందుట యని యనుచున్నారు. కావున బుద్ధిమంతు లాయన నారాధించుట నేర్చుకొనవలెను.

యద్యపి సర్వత్ర సమో యద్యపి నృహరి స్తథా
ఒప్యేతే।
భక్తాః పరమానన్దే రమన్తి సదయావలోకేన॥ 254

ప్ర : నృహరిః = నరరూపహరియగు శ్రీకృష్ణుడు, యద్యపిసర్వత్ర (అస్తి) = అంతట ఉండినను, యద్యపి, సమః = అందఱియెడల సముడే యైనను [భేదబుద్ధిలేకున్నను] తథాఅపి = అది అట్లే యైనను, ఏతేభక్తాః = ఆయనను భజించు ఈభక్తులు [మాత్రమే], సదయావలోకేన = ఆయనకరుణాకటాక్షముచేత, పరమానన్దే = ఉత్తమానందమందు, రమన్తి = క్రీడించుచున్నారు. సదా ఆనందించుచున్నారు.

తా॥ శ్రీకృష్ణపరమాత్మ అందఱియందు నన్నిచోట్ల నున్నను, అందఱియెడల సమానుడే యైనను, బిన్నాధికారులందఱును సమానముగా లాభమును బొందలేరు. ఆయనగాఢభక్తులుమాత్రమే, ఆయనకరుణాకటాక్షమువలన బరమానంద మనుభవింపగలరు కావున బుద్ధిమంతులాయనను గాఢముగాభజించి, ఆయనపరమకృపకు బాత్రులగుటకు సర్వవిధముల యత్నింపవలయు పరమానందానుభూతిని గోరుమరేని. ఫలము యత్నానుకూలముగదా!

అవ॥ శ్రీకృష్ణుని కరుణాకటాక్షప్రభావము వర్ణించుచున్నారు.

సుతరా మనన్యశరణాః క్షీరాద్యాహారమన్తరా యద్వత్।
కేవలయా స్నేహదృశా కచ్ఛపతనయాః ప్రజీవన్తి॥ 255

ప్ర : యద్వత్ = ఏవిధముగా, కచ్ఛపతనయాః = తాబేటిపిల్లలు, సుతరాం = బొత్తిగా, అనన్యశరణాః = వేఱుపోషకులెవరు లేనివయ్యును, క్షీరాద్యాహారమ్ అన్తరా = పాలు మొదలైనవి ఏయాహారము లేకున్నను, కేవలయా = కేవలము, స్నేహదృశా = తల్లిప్రేమగలచూపులచేతనే, ప్రజీవన్తి = ఆహారము కల్గినవానివలె చక్కఁగా జీవించుచున్నవో, [అట్లే కృష్ణభక్తులును, శ్రీకృష్ణకరుణాకటాక్షముచేతనే యితరాపేక్ష లేకయే సర్వసౌఖ్యములు పొందఁగలరు.]

తా॥ తక్కినజంతువులు, పక్షులవలె తాబేలు తనపిల్లలకు ఆహారము సంపాదించి పెట్టదని, పాలీయదని, ఇతరసహాయము లేకున్నను ఆపిల్లలు తల్లిప్రేమంపుచూపువలననే సర్వాంగపుష్టిని పొంది పెరుఁగు నని పౌరాణికు లందురు. అట్లే శ్రీకృష్ణభక్తులును, పూర్తిగా ఆయననే శరణుఁ చెందినచో, ఆయన తత్కటాక్షమాత్రముననే వారికి సర్వార్థము లొసంగి ఆనందింపఁజేయుచు రక్షించును. కావున అట్టియనన్యభగవద్భక్తియే ప్రధానము.

అవ॥ ఈశ్వరభక్తియున్న సర్వము సమకూరు ననుట కుదాహరణము లిచ్చుచున్నారు.

యద్యపి గగనం శూన్యం తథాఽపి జలదామృతాంశురూపేణ।
చాతకచకోరనామ్నో ర్దృఢభావా త్పూరయ త్యాశామ్॥ 256

ప్ర : గగనం= ఆకాశము, యద్యపి శూన్యం = ఇతరమేమియు లేవిదైనను, తథాఅపి= అట్లైనను, జలద+అమృతాంశురూపేణ =మేఘ, చంద్ర రూపములతో, చాతకచకోరనామ్నః = చాతకము, చకోరము అనురెండుపక్షుల యొక్క, దృఢభావాత్ = గట్టివిశ్వాసము, భక్తిభావమువలన, ఆశాం = వాని కోర్కెలను, పూరయతి= పూర్తిచేయుచున్నది (ఇచ్చుచున్నది.)

తా॥ సర్వవ్యాపియగు ఆకాశము శూన్యరూపము. అందితరమేమియును స్వభావసిద్ధముగా లేదు. అట్లే శ్రీకృష్ణుఁడును పురాణప్రసిద్ధములగు చాతకములు వర్షధారలకొఱకును, చకోర పక్షులు చంద్రకిరణాహారముకొఱకును సజీవదృఢవిశ్వాసముతో ఆయాకాశమునే నిరంతర మాశ్రయించుచున్నవి. ఇతరము నపేక్షించవు. ఆశతో వచ్చి యాకాశములోనిల్చును. అప్పుడు ఆకాశమునుండి నీలమేఘములు వర్షించుజలధారలను చాతకపక్షులు త్రాగి తృప్తిపడును. అట్లే చంద్రుఁడు ఆకాశమందు ప్రకాశించుచుండఁగా వానివెన్నెలరూపామృతకిరణములను చకోరపక్షులారగించి పుష్టిని తుష్టిని బొందును. ఆపక్షులకు ఆయాకాశ మందెంతటి గట్టినమ్మకము అట్లే నిరాకారుఁడు, సర్వవ్యాపి, సర్వశక్తిమంతుఁడగు సర్వేశ్వరునియందు దృఢతరవిశ్వాసముతో ఏకభక్తితో, మనుజులు శ్రీకృష్ణు నర్చించి ధ్యానించి శరణుసొచ్చినచోఁ దగినరూపములో వచ్చి యాయన వారికోర్కెలఁ దప్పక తీర్చును. అందువలన అట్టిభగవద్భక్తి ప్రధానముగా నిత్యానందమందవచ్చు. సర్వులకు సర్వదా ఆశాజ్యోతి శ్రీకృష్ణభగవానుఁడు. ఆశ్రితవత్సలుఁడు,

అవ॥ పైదృష్టాంత మిక్కడ శ్రీకృష్ణపరముగా వివరించి ముగించుచున్నారు.

**తద్వ ద్భజతాం పుంసాం దృగ్వాఙ్మనసా మగోచరో ఒపి**
**కృపయా ఫలత్యకస్మా త్సతాత్యానన్దామృతేన విపులేన॥ 257**

ప్ర : తద్వత్= అదే విధముగా, హరిః= శ్రీమహావిష్ణువు, భజతా =తన్ను గొల్చువారగు, (వ్రజతాం=శరణుచొచ్చు), పుంసాం= పురుషులకు, దృగ్వాఙ్మనసాం = వారికన్నులకు, వాక్కులకు, మనస్సులకు। అగోచరఃఅపి= [కనబడని] విషయముకాని వాడైనను, కృపయా=ఆయన [కృప] దయచేత, విపులేన=విస్తారమైన, ఆనన్దామృతేన=ఆనందమనెడి అమృతముతో, అకస్మాత్ =హఠాత్తుగా, తెలియ జేయకయే, ఫలతి= వారికోర్కెలను దీర్చుచున్నాడు.

తా॥ అట్లే. (ఆగగనమువలె శ్రీకృష్ణుడు) శ్రీహరి, తనను అనన్యభక్తి ప్రపత్తులతో శరణు సొచ్చి సేవించుభక్తులకుం గనబడక పోవచ్చును వారివాక్కులకు మనస్సునకు నందకపో వచ్చు. ఐనను వారికి దెలియకుండనే, దయతో, వారికి విస్తార మైన యానందామృత మొసంగి కృతార్థులను చేయును. వారికిజ్ఞాన మిచ్చి అవిద్యానివృత్తిం జేసి పునరావృత్తిరహితమోక్ష మిచ్చు ను వారును సచ్చిదానందులు, సర్వశక్తిమంతులు, సర్వజ్ఞులు నిత్య శుద్ధబుద్ధముక్తస్వభావులు నగుదురు. ఇట్లు వైరాగ్యాత్మబోధ భక్తిత్రయము పరిపక్వము సమగ్రము నై సాయుజ్యముక్తి సాధన మైనదని నిరూపితము. ఉపక్రమింపబడిన శ్రీకృష్ణపరబ్రహ్మతి త్త్వము సగుణనిర్గుణ [illegible] ద్వైతపరమార్థత ఇట్లుపసం హృతము,కావుననే ఈగ్రంథము శ్రీకృష్ణానందలహరిగా నున్నదన్న ప్రతీతి గడించినది. ఓజనులారా! ప్రబోధసుధాకరహారెనిష్ణాత్మమ యులు కండు. తరింపుడని కావ్యోపదేశము - ఓం తత్ సత్ శ్రీకృష్ణపరబ్రహ్మార్పణ మస్తు.

ఇతి శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యవిరచితః ప్రబోధసుధాకరః
సమాప్తః॥

ఇట్లు శ్రీమచ్ఛంకరభగవత్పాదులచేఁ బ్రణీతంబైన (విరచితంబైన)
ప్రబోధసుధాకరము సమాప్తము.

శ్లో॥ నారాయణసమారంభాం శంకరాచార్యమధ్యమామ్।
విమలానందపర్యంతాం వందే గురుపరంపరామ్॥

శ్లో॥ యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం తు యద్భవేత్।
తత్సర్వం క్షమ్యతాం దేవ సీతారామ నమోఽస్తు తే॥

ఇతి శమ్.



# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 4 | 3 | (ఆది | (ఆది | 84 | 7 | ఆని | కాని |
| 7 | 15 | మిథ్మ | మిథ్య | | 22 | పెరుసు | పెరుగు |
| 8 | 7 | అరము | అర్థము | 86 | 3, 22 | హామో,రి | వామ్యో,ర్థి |
| 11 | 11 | ములును | ములగు | 100 | 24 | సు శ్చి | స్యే చ్ఛ |
| 14 | 1 | పంధ | బంధ | 102,3 | 5,3 | వ్యర | వ్యక |
| 17 | 24 | సన్న్యాస | సంన్యాస | 107 | 1, 3, 9 | స, క్తా, తా | వ, క్తా, ధా |
| 19.24 | 10,15 | | | | 21 | దశ | (దశ |
| 159 | 14 | యన్నిఁటి | యన్నిటి | 110 | 5, 16 | గ, యా | గు. య |
| 175 | 12 | | యన్నింటి | 113 | 4, 11 | (ర పన | ఱ, న |
| 20 | 9 | ప్రీ | శ్రీ | 117 | 6 | సృషి | సృష్టి |
| 21 | 11 | ఆస | అస | 118 | 14 | పశ్వ | పశ్య |
| 26 | 5 | యాతానా | యాతనా | 120 | 15 | మొవల | మొదల |
| 30 | 11 | సితి | స్థితి | 122 | 8 | త్మత్త్వ | త్మతల్వో |
| | 16 | చే న | చేసిన | 125 | 20 | ప్రత్వేక | ప్రత్యేక |
| 31 | 22 | స్థ | స్త | 129 | 16 | శుభే | శుభే |
| 40 | 5 | న తు | నహేతు | 137 | 3 | అజ్ఞాన | అజ్ఞాన |
| | 12 | శంకు | శంక | 138 | 24 | సూల,స్యా | స్థూల,స్యా |
| 51 | 15 | శ్రేషా్య | శ్రేష్ఠ్య | 140 | 7 | త్సంగా | త్సంఘా |
| 59 | 1 | గృహాసు | గృహస్థు | 144 | 4 | దేనిని | ఏనిని |
| 60 | 1 | దింట | దింపుట | 145 | 6 | ని,దు | రిని, దు |
| 60 63 | 15 | స్వార | స్వార్థ | | 7 | మేత్వ | తమే |
| 60 | 20 | వ్యర,ధా | వ్యర్థ, థా | | 20,22 | నిటి, నిర్వ | సిటి, నిర్వి |
| 75 | 9 | | | 148 | 6, 7 | మార,(తార | మార్గ,(తార్థ |
| 61 | 2 | రాజలు | రాజులు | | 13 | నిపుణ | నిపుణ |
| 69 | 2 | ఆత | ఆత్మ | 150 | 9, 17 | తం, పెక | త్థం, దొక |
| 77 | 23 | తువు | హేతువు | 153 | 3 | గీ.1-32 | గీ.13-2 |

